


అహం 🌹🙏

ఈ గ్రంథం సాధకుల సర్వసందేహ నివృత్తి ద్వారా గ్రంథి విచ్ఛేదం కలిగించి ఆత్మసంస్థితి కలిగిస్తుంది. దీనిని సంపూర్ణ భగవాన్ శ్రీ రమణ వాంగ్మయం అని చెప్పవచ్చు.

# నీ సహజస్థితిలో ఉండు

## భగవాన్ శ్రీ రమణమహర్షి బోధనలు

సంపాదకుడు: డేవిడ్ గాడ్మన్
అనువాదం: పింగళి సూర్యసుందరం

శ్రీ రమణాశ్రమము
తిరువణ్ణామలై - 606 603

# ముందుమాట

భగవాన్ శ్రీ రమణమహర్షి అరుణాచలానికి విజయం చేయటం చరిత్రాత్మకమైన, మహనీయమైన సంఘటన. ఇది 1896 లో జరిగింది.

నిరుపమానులైన వారి బోధన అత్యధిక భాగం మౌనం ద్వారానే జరిగింది - సంభాషణకన్నా అదే ఎంతో పాటవం కలిగియుండేది. అంతేకాక, మహర్షి తమ వద్దకు వచ్చిన సాధకుల ప్రశ్నలకు కూడ సమాధానాలిచ్చేవారు. అసంఖ్యాకులు వారిని ఎన్నో ప్రశ్నలడిగే వారు. కరుణతో వాటికన్నింటికీ ఓపికగా శ్రీ భగవాన్ సమాధానాలిచ్చేవారు. వారి అనుగ్రహం ఈ విధంగా కూడ వ్యక్తమయ్యేది.

మహర్షిని సాధకులు అడిగిన ప్రశ్నలూ, వారిచ్చిన సమాధానాలూ అనేక విషయాలను స్పృశించేవి. వీటినన్నిటినీ ఒక విషయక్రమంలో కూర్చి ఇంగ్లీషులో డేవిడ్ గాడ్మన్ "Be as you are" అనే పేరుతో ఒక సంకలనాన్ని ప్రచురించారు. ఆత్మ, ఆత్మవిచారం, గురువు, ధ్యానం, శరణాగతి, సమాధి- ఇత్యాది అనేక విషయాల గురించి శ్రీ భగవాన్ ప్రవచనాలు ఒక చోట దొరుకుతాయి ఈ పుస్తకంలో.

దీనికి తెలుగు అనువాదాన్ని శ్రీ భగవాన్ అరుణాచల ఆగమన శతవర్షమైన ఈ సంవత్సరం (1996)లో, ప్రచురింప గలుగుతున్నందుకు మేము సంతోషిస్తున్నాము. తెలుగు పాఠకులకు ఈ పుస్తకం ఉపకరిస్తుందని విశ్వసిస్తున్నాము.

వి.ఎస్. రమణన్
ప్రెసిడెంట్
శ్రీ రమణాశ్రమం

విజయదశమి
21-10-1996.

ఓం నమో భగవతే శ్రీ రమణాయ

# అనువాదకుని నివేదన

భగవాన్ శ్రీ రమణమహర్షి బోధనలని ఒక చోట విషయక్రమంలో కూర్చిన ఈ గ్రంథాన్ని అనువదించటానికి నాకు అనుమతినివ్వటమే కాక, పుస్తక ప్రచురణ భాధ్యతని కూడ స్వీకరించిన శ్రీ రమణాశ్రమ అధ్యక్షులకు కృతజ్ఞుణ్ణి.

ఈ సత్కార్యాన్ని చేసే అవకాశాన్నీ, శక్తినీ నాకనుగ్రహించిన భగవాన్ శ్రీ రమణులకు శతసహస్ర వందనములు. ఆ కరుణామూర్తి పాదపంకజములకు భక్తితో ఈ గ్రంథాన్ని సమర్పిస్తున్నాను.

పి. యస్. సుందరం

# ఉపోద్ఘాతం

(ఇంగ్లీషు పుస్తకంలో)

1896లో పదహారు సంవత్సరాల యువకుడు ఏదో లోపలి ప్రేరణ వల్ల తన యింటిని విడిచి, దక్షిణ భారత పుణ్యస్థలాలలో ఒకటైన అరుణాచలానికి, ఎవ్వరి కీ చెప్పకుండా వెళ్లిపోయాడు. అక్కడికి చేరగానే తన వద్దనున్న కొద్దిపాటి పైకాన్ని,

ఇతర వస్తువులనీ విసర్జించి వేశాడు. ఈ ప్రయాణానికి కొంతకాలం ముందు, అతనికి తన నిజతత్త్వం- రూపరహితమైన, సర్వవ్యాప్తమైన చైతన్యమే నన్న ఎరుక కలిగింది. ఆ ఎరుకలోనే అరుణాచలం చేరిన తరువాత లీనమైపోయాడు. ఆ నిమగ్నమవటం ఎంత తీవ్రమైనదంటే, తన దేహాన్ని పురుగులు తొలిచివేస్తున్నా కూడ స్మారకం లేకపోయింది అతనికి. అట్లాగే తన చుట్టూ ఉన్న ప్రపంచం గురించిన ఎరుక కూడ లేకపోయేది. ఆ విస్మృతి వల్ల ఎప్పుడో గాని ఏ ఆహారమూ తీసుకునేవాడు కాడు. శరీరం జీర్ణించి పోయింది. వేలిగోళ్లూ, తలమీది కేశాలూ బాగా వికృతంగా పెరిగిపోయాయి. ఈ స్థితిలో రెండు, మూడు సంవత్సరాలు గడిచాయి. ఆ పిదప అతను భౌతిక తలం మీదకి నెమ్మదిగా తిరిగి రావటం మొదలుపెట్టాడు. ఈ భౌతిక పరివర్తనం కలిగినా, తాను చైతన్యస్వరూపుడనే నన్న ఎరుక అతనికి జీవితాంతం వరకూ నిలిచే ఉంది. దీనినే హైందవులు ఆత్మసాక్షాత్కారమంటారు. అంటే, విశ్వంలో అఖండమూ, సర్వవ్యాప్తమూనైన చైతన్యం తప్ప వేరేమీ లేదనీ ఆ చైతన్యాన్నే అభివ్యక్త రూపంలోనైనా, అనభివ్యక్త రూపంలోనైనా అనుభవిస్తామనీ స్వానుభవం వల్ల గ్రహించటమన్నమాట. చైతన్యానికి అభివ్యక్త రూపం, విశ్వం. అనభివ్యక్త రూపం - కేవల ఉనికి.

సాధారణంగా, ఇటువంటి జ్ఞానం ఎంతో నిష్ఠతో చేసిన ఆధ్యాత్మిక అభ్యాసాలవల్ల గానీ లభించదు. కాని ఈ యువకునికి అప్రయత్నంగా ఏ వాంఛాలేకుండా సంప్రాప్తించింది. ఆ యువకుని పేరు వెంకట్రామన్. మధురలో పినతండ్రి గారింట్లో ఉండగా అతనికొకనాడు మృత్యుభయం విపరీతంగా కలిగింది. తాను నిజంగానే చనిపోయినట్టు నటించగా, అతనికి తన నిజస్వరూపం స్పష్టంగా తెలియవచ్చింది. దానికీ తన మనస్సుకీ, తన వ్యక్తిత్వానికీ ఏమీ సంబంధం లేదని గ్రహింపు కలిగింది. ఇటువంటి అనుభూతులే ఇతరులకి కూడ కలిగినట్టు చెప్పుకుంటారు; కాని అవి తాత్కాలికమైనవే! వెంకట్రామన్ విషయంలో మాత్రమా అనుభూతి నిత్యమైనది, తిరుగులేనిదీను. అప్పటినుండి, తానొక ప్రత్యేకమైన వ్యక్తిని అనే భావం పోయింది. తిరిగి రాలేదు.

ఈ అనుభవం గురించి వెంకట్రామన్ ఎవ్వరికీ చెప్పలేదు. ఆరువారాలు గడిచాయి. మామూలు విద్యార్థి వలెనే మసలుకొనేవాడు. కాని ఈ నటన దుర్భరమై, కుటుంబాన్ని విడిచి అరుణాచల పుణ్యస్థలానికి వెళ్ళిపోయాడు. అరుణాచలాన్ని ఎంచుకోవటానికి కారణం లేకపోలేదు. అతడెప్పుడూ అరుణాచలమూ, భగవంతుడూ ఒకటే నన్న భావంతో ఉండేవాడు. ఆ అరుణాచల మెక్కడో దేవలోకంలో కాక, ఈ భూతలమ్మీదే ఉన్నదని తెలియగానే ఆశ్చర్య చకితుడయాడు. హైందవులు ఆ పర్వతాన్ని శివరూపంగా ఆరాధిస్తారు. ఆ తరువాత ఎప్పుడో, తనకి ఆత్మసాక్షాత్కారాన్ని కలిగించింది ఆ పర్వతపు ఆధ్యాత్మిక శక్తేనని వారు చెప్పుకున్నారు. ఆ పర్వతమంటే ఎంతో ప్రీతి వారికి, 1896లో అక్కడికి చేరినప్పటినుండి 1950లో దేహంచాలించే వరకూ ఆ కొండకి చేరువగా ఉండేవారు. ఎప్పుడూ, ఒక్కనాడు కూడ, కొండకి రెండు మైళ్ల కంటే ఎక్కువ దూరంలో గడపలేదు! వారా పర్వతాన్ని ఆశ్రయించిన కొన్ని సంవత్సరాల తరువాత వారి ఆధ్యాత్మికత బయటకి ఒక జ్యోతి వలె ప్రసరింపజొచ్చింది. ఆ జ్యోతికి ఆకర్షితులై కొందరు ఆయన చుట్టూ చేరారు. ఆయన అధికాంశం మౌనంగానే ఉండేవారు. కాని బోధనలని కూడ మొదలుపెట్టారు. ఆయన పవిత్రతను చూచి ముగ్ధుడై వారి తొలి అనుచరులలో ఒకరు ఆయనకి భగవాన్ శ్రీ రమణ మహర్షి అని నామకరణం చేశారు. ఈ పేరు అందరికీ నచ్చింది. జగత్ప్రసిద్ధమైంది.

ఆయన ఆ రోజులలో ఎక్కువగా మాట్లాడేవారు కాదు. అందువల్ల వారి బోధనలు విశిష్టమైన రీతిలో కొనసాగేవి. వారు మాట్లాడకపోయినా, మౌనంగానే ఏదో ఒక శక్తిని వెదజల్లేవారు. అది అనుచరుల మనస్సులను నిశ్చలమొనర్చేది, ఒక్కొక్కసారి వారి వలెనే అనుచరులు కూడ సమాధి స్థితిని అనుభవించేవారు. తరువాతి రోజులలో వారు మాటలద్వారా బోధించినా, వారి మౌనబోధన గ్రహింప గలిగిన వారికి, లభ్యమవుతూనే ఉండేది. ఆ మౌనమే తన బోధనలకు ప్రత్యక్షమైన, సాంద్రమైన రూపమని శ్రీ రమణులు అనేవారు. ఆ మౌనాన్ని అర్థం చేసికోలేని వారి కోసమే తాను మాటల ద్వారా బోధన సల్పుతాననే వారు. దీనిని బట్టి వారు మౌనానికెంత ప్రాధాన్యమిచ్చే వారో తెలుస్తుంది.

రోజులు గడిచిన కొద్దీ వారింకా విఖ్యాతులయారు. వారి చుట్టూ ఒక ఆశ్రమం వెలిసింది. వేనవేలు మంది వారి దర్శనానికి వచ్చేవారు. భారత దేశమంతటిలో పరమ పవిత్రమైన, ఆరాధ్యులైన ఋషిగా ప్రసిద్ధులయినారు. వారి సమక్షంలో లభించే శాంతికి ఆకర్షితులైన వారు కోకొల్లలు! కొందరు, సాధకులకిచ్చే బోధనలకోసం వచ్చేవారు. ఇంకా కొందరు, తమ సమస్యలను వారికి నివేదించుకోవటానికే వచ్చేవారు. ఏ కారణం చేత వారి దగ్గరకు వచ్చినా అందరూ వారి నిరాడంబరతకీ, వినమ్రతకీ మంత్రముగ్ధులయేవారు. ఆయన అందరికీ ఎల్లవేళలా అందుబాటులో ఉండేవారు. నల

గురితో బాటే ఆయన కూడ ఒక హాలులో కూర్చునే వారు. పడుకొనే వారు. వారి ఆస్తి అంతా కౌపీనం, కమండలం, చేతికట్ట - అంతే! తనని ఎందరో భగవంతునిగా ఆరాధించినా తననొక ప్రత్యేకమైన వ్యక్తిగా పరిగణించటాన్ని ఒప్పుకునే వారు కారు. ఆశ్రమంలో ఇతరులతో సరిసమానంగా పంచుకోలేని దాన్ని ఎప్పుడూ స్వీకరించే వారు కారు. నలుగురూ చేసే పనులలో పాలుపంచుకునేవారు. ఉదయాన మూడుగంటలకే మేల్కొని ఆశ్రమవాసులకి వంట ఏర్పాటుకి సంబంధించిన పనులలో నిమగ్నమయే వారు. వారి సమతాభావం అపూర్వం. వారి దర్శనార్థం ఎవరువచ్చినా అందరికీ ఒకే విధమైన మర్యాదా, ఆదరణా దొరికేవి. ఆ వచ్చేవారు, ప్రముఖులైనా, పామరులైనా, ఆఖరికి జంతువులైనా సరే! వారి ఉదారవైఖరి ఆశ్రమంలోని వృక్షాల పట్ల కూడ వ్యక్తమయేది. మొక్కల పువ్వులని గాని ఆకులనుగాని త్రుంచటం మంచిది కాదనేవారు. ఏ చెట్టు నుండైనా కాయనో, పండునో కోయవలసి వస్తే, ఆ చెట్టుకి సాధ్యమైనంత తక్కువ బాధ కలిగేట్టు చూడాలనేవారు.

1925 నుండి 1950 వరకూ ఆశ్రమానికి కేంద్రం శ్రీరమణుల గది. వారు అక్కడే పరుండేవారు, అక్కడే కొలువుతీర్చేవారు. తమ ఆధ్యాత్మిక శక్తిని వెదజల్లుతూ ఒక మూల కూర్చునేవారు. దానితోబాటు ఎక్కడెక్కడ నుంచో వచ్చిన వారి ప్రశ్నలకి సమాధానాలు కూడ ఇస్తూండేవారు. ఎప్పుడోగాని ఆ సమాధానాలని వ్రాసి యిచ్చేవారు కారు. అందువల్ల ఆ సమాధానాలన్నీ నోటి మాటలుగానే మిగిలిపోయాయి. కాని వారి జీవితకాలంలోనే అప్పటి వివరాలు వ్రాసి పెట్టి యుంచారు కొందరు. వారి బోధనలకు సంబంధించిన మూల రచనలివే.

వారి బోధనలు, 'సంస్థితమైన దల్లా చైతన్యమే" నన్న ప్రత్యక్షజ్ఞానం నుంచి సాధికారంగా వెలువడినవే! అందువల్ల వారు ఏమి చెప్పినా ఈ విషయాన్ని గుర్తుంచుకోవాలనీ, నిజస్వరూపాన్ని ఎరుగాలనీ అనేవారు. వారు బోధించిన ఆ మహోన్నత స్థాయిని ఎక్కువ మంది అర్థం చేసుకోలేక పోయేవారు. అందువల్ల పరిమిత * జ్ఞానం కలవారికి సుబోధక మయేట్టువారు తమ బోధనలను మలచేవారు. ఈ కారణంగా, వారి బోధనలలో వివిధస్థాయిలను గమనిస్తాం. మాటలలో చెప్పగలిగినంత వరకూ "ఉన్నదల్లా చైతన్యమే" నని చెప్పేవారాయన. ఈ విషయం అంతుపట్టని వాళ్ళకి, ఆ సత్యాన్ని కనుమరుగు చేస్తున్నది మనస్సు కల్పించే పరిమితులేననీ, ఆ భావాలను తొలగించుకుంటే, సత్యం విదితమవుతుందనీ చెప్పేవారు. చాలా మందికి పరిమిత దృక్పథం అలవాటైపోవటం వల్ల శ్రీ రమణుల అత్యున్నతస్థాయి బోధనలు కేవలం సైద్ధాంతికంగానే తోచేవి. ఈ సత్యాన్ని గ్రహించాలంటే దీర్ఘకాలపు ఆధ్యాత్మిక అభ్యాసాలని కొనసాగించాలనే భావనని తొలగించుకోమనేవారు ఆయన. శ్రీరమణులు అటువంటి వారి కోసం, ఒక కొత్త పద్ధతిని చెప్పేవారు. తమపై అవధానాన్ని కలిగించుకొమ్మనే వారు. దీనికి ఆత్మవిచారమన్న పేరు పెట్టారు వారు. ఈ అభ్యాసం గురించి తరచూ, గట్టిగా చెప్పేవారు శ్రీ రమణులు. అందువల్ల, వారి బోధనలో ఇది ప్రధానమైన అంశమని చాలా మంది అనుకోవటం కూడ కద్దు. అయినా, దీనితో సంతృప్తి చెందక ఇతర మార్గాలగురించీ, ఏవేవో సిద్ధాంతాల గురించీ వారిని ఎందరో అడుగుతూండేవారు. అటువంటి వారికి శ్రీ రమణులు ఉచితరీతిని సమాధానాలిచ్చేవారు. అటువంటి సమయాలలో, తాత్కాలికంగా తమ కేవల దృక్పథాన్ని ప్రక్కకుపెట్టే వారు. తమ పృచ్ఛకుల అపోహలను అంగీకరిస్తున్నట్టు పైకి కనబడినా, ఈ విధంగానైనా తమ అసలైన బోధనవైపు వాళ్లు మళ్లుతారేమోననే వారి ఉద్దేశ్యం. వివిధ దృక్పథాలను ఒప్పుకుంటున్నట్టు వారి బోధనలు కనబడటం వల్ల, ఆ బోధనలలో పరస్పర వైరుధ్యం చోటు చేసుకున్నట్లు కనబడుతుంది. వ్యక్తిగతమైన ఆత్మ అంటూ లేదని ఒకరితో చెప్పేవారు. మరొకరితో, వ్యక్తిగతమైన ఆత్మ ఎట్లాపనిచేస్తుందో, కర్మని ఎట్లా పేర్చుకుంటుందో, మళ్ళీ ఎట్లా పునర్జన్మ నొందుతుందో చెప్పేవారు! వారి వారి దృక్పథాలనుంచి ఎవరికి వారికే ఈ రెండూ నిజమేననిపించే అవకాశముంది. కాని, ఈ రెంటిలో మొదటిదే శ్రీ రమణుల బోధనని నిజంగా వెల్లడి చేస్తుంది. వారు పరస్పర విరుద్ధాలైన మాటలనెన్నింటిని చెప్పినా వారికొకే ఒక ప్రమాణం: "ఉన్నదల్లా ఒకే ఒక చైతన్యం" అన్నదే. ఏ వాక్యమైనా ఈ భావం నుంచి కొంచెం అటూ ఇటూ జరిగితే, ఆ మేరకు ఆ వాక్యం సత్యం నుంచి కొంచెం జరిగిందనే అనుకోవచ్చు.

దీనిని దృష్టిలో ఉంచుకొని నేను ఈ పుస్తకంలో అనుసరించిన క్రమమిది: మొదట వారి పరమోన్నతమైన బోధనలనూ, చివరిచివరికి అప్రధానమైన విషయాల గురించి వారు చెప్పిన వాటినీ ఏర్పర్చాను. దీనికి ఒకే ఒక మినహాయింపు, వారు మౌనబోధన గురించి చెప్పినది. నిజానికి అది ముందే రావాలి, కాని మధ్యలో పెట్టాను.

నేను ఈ పద్ధతినవలంబించటానికి కారణాలు రెండు: మొదటిది, పాఠకునకు ఆయా విషయాల ప్రాధాన్యం తెలుస్తుంది. రెండవది, ఇది శ్రీరమణులకేఆమోదయోగ్యమైన బోధనాసరళి. తమ వద్దకు వచ్చిన వారికి శ్రీరమణులు తను

పరమోన్నతమైన బోధనలనే చెప్పిచూచేవారు, దానిని అంగీకరింపలేని స్థితిలో ఉన్నవాళ్ళకోసం, తామే దిగి వచ్చి, బోధనను పలుచన చేసేవారు.

ఇక్కడ వారి బోధనలను ప్రశ్నోత్తరాల రూపంలో ఇచ్చాను. వీటిలో శ్రీరమణుల అభిప్రాయాలు తెలుస్తాయి. ఒక్కొక్క అధ్యాయంలో ఒక్కొక్క విషయం ప్రస్తావింపబడింది. ప్రతి ప్రశ్నోత్తరాలను చాలా చోట్ల నుండి సేకరించాను. ఇవన్నీ ఒకే ఒక సంభాషణకి చెందినవా అనిపిస్తాయి. నిజానికి, దీర్ఘమైన సంభాషణలేవీ లేవు. ఈ విధంగా ఏర్పాటు చేయకపోతే, శ్రీరమణులకి ఏ విషయం గురించైనా గల అభిప్రాయాలన్నీ ఒక చోటుకి చేర్చే మార్గం కనబడలేదు.

తమ జవాబులను తమిళం, తెలుగు, లేక మళయాళ భాషలలో ఇచ్చేవారు. ఆ రోజులలో వీటినెవ్వరూ టేప్ రికార్డర్ మీద రికార్డు చేయలేదు. కొందరు దుభాషులు మాత్రం త్వరత్వరగా ఇంగ్లీషులో వ్రాసుకునేవారు. వాళ్లకీ ఇంగ్లీషు అంత ధారాళంగా రాదు. వారి భాష సరళంగా ఉండదు. ప్రచురితమైన వాటిని కొంత పరిష్కరించాను, భావానికి ఏ దెబ్బాతగలకుండా కొన్ని ప్రశ్నోత్తరాలను కుదించాను.

ఒకటవ భాగము :-

# ఆత్మ

సంస్థితమైనదల్లా ఒకే ఒక సత్యం - అందులోనే ఈ లోకాలన్నీ స్థిరంగా ఉన్నాయి. ఈ లోకాలన్నీ దాని సొత్తే. దానినుండే ఈ లోకాలన్నీ ఉద్భవించాయి. ఈ లోకాల ఉనికి దాని కోసమే. అట్టి ఆ పరమసత్యాన్ని, ఆత్మని, హృదయంలో నిల్పుకొందుముగాక!

## 1.ఆత్మస్వరూపము

శ్రీ రమణుల ఉపదేశాలసారమూ, వారు తరచూ ప్రబోధించేదీ యిది: అన్నిటా అంతర్లీనమైన సత్యమొక్కటే ఉన్నది. అది అందరికీ ప్రత్యక్షంగా అనుభవ సిద్ధమే. సంస్థితమైన వాటన్నిటికీ అదే మూలం, అదే సారం. అదే వాటి స్వరూపం. దానికి వారు ఎన్నో పేర్లు పెట్టారు. ఒక్కొక్క పేరు ఆ అవిభాజ్యమైన సత్యానికొక్క లక్షణాన్ని సూచించేది. వారు సాధారణంగా వాడిన పర్యాయపదాలూ, వాటి భావమూ యివి:

1. ఆత్మ: వారు తరచూ వాడిన పదమిది. అసలైన ఆత్మ, అంటే అసలైన నేను, వ్యక్తిగతం కాదు. అది సర్వసమృద్ధమైన ఎరుక. అది పైకి గోచరించే వ్యక్తిగత అనుభవం కాదు. దానికీ, వ్యక్తిగత అహానికీ తేడా ఉన్నది. నిజానికి, ఈ అహానికి ఉనికి లేనే లేదు. దీనిని మనస్సు కల్పిస్తుంది. ఆత్మని అనుభవసిద్ధం చేసుకోనీయదు. ఆత్మ ఎప్పుడూ సంస్థితమే. ఎప్పుడూ అనుభవ సిద్ధమే. కాని ఎన్నో అవరోధాలను కల్పించే మానసిక వాసనలు అణగినప్పుడే ఆ అనుభవం ప్రత్యక్షంగా తెలియవస్తుంది. నిత్యమూ, నిరంతరంగా ఆ ఆత్మని ఎరిగి ఉండటమే. ఆత్మ సాక్షాత్కారమంటే.. ఆంధ్రాజ్

2. సత్ - చిత్ - ఆనందం: ఇదొక సంస్కృత పదం. దీనినే ఉనికి - చైతన్యం - ఆనందం, అనవచ్చు. ఆత్మ అనేది విశుద్ధ స్థితి. 'నేనున్నా'ననే ఎరుక. అయితే, ఆ ఎరుకలో, "నేనిది", "నేనది" అన్న భావముండదనే వారు శ్రీ రమణులు. ఆత్మలో కర్తగాని కర్మగాని ఉండవు. అది కేవలం ఎరుకే. ఈ ఎరుక చైతన్యవంతమవటం వల్ల దానినే చైతన్యమని కూడ అంటారు. ఈ చైతన్యాన్ని ప్రత్యక్షంగా అనుభవించటమే నిరవధికమైన సంతోషం. అందువల్ల దానిని ఆనందమని కూడ అంటారనే వారు శ్రీ రమణులు. అంటే - ఉనికి, చైతన్యం, ఆనందం - వేరువేరుగా కాక ఆత్మకి ఒకే ఒక లక్షణంగా అనుభవసిద్ధమవుతాయి. చేమ, పారదర్శకత్వము, ద్రవరూపమూ నీటికి లక్షణాలు. వీటిని నీటినుండి విడదీయలేము. అట్లాగే ఆత్మకి ఆ మూడు లక్షణాలూ, అవిభాజ్యమైనవి.

3. భగవంతుడు: ఈ విశ్వమంతా ఆత్మ యొక్క శక్తి వల్లనే నిలబడుతోందనే వారు శ్రీ రమణులు. ఆస్తికులు ఈ శక్తిని సాధారణంగా భగవంతునికి ఆపాదిస్తారు. కనుక, శ్రీ రమణులు ఆత్మకి భగవంతుడనే పర్యాయపదాన్ని వాడేవారు. అట్లాగే తాత్వికులు ఉపయోగించే పదం "బ్రహ్మమ" నీ, భగవంతుని నామాలలో ఒకటైన "శివ" అనే దాన్ని కూడ

ఉపయోగించేవారు. శ్రీ రమణుల దృష్టిలో భగవంతుడు సాకారుడుకాడు, విశ్వంభరుడైన నిరాకారుడు. ఆయన విశ్వాన్ని సృష్టించలేదు. కాని, ఆయనకి గల శక్తికి విశ్వం ఒక బాహ్యరూపం మాత్రమే. ఆయనని విశ్వం నుండి విడదీయలేము. కాని, విశ్వం యొక్క ఉనికి గాని లేమిగాని ఆయనని ప్రభావితం చేయదు.

4. హృదయం: ఆత్మ గురించి చెప్పేటప్పుడు శ్రీ రమణులు హృదయమనే సంస్కృత పదాన్ని ఉపయోగించేవారు. ఈ పదానికి అసలైన అర్థం "ఇది కేంద్ర" మని. ఈ మాటని వాడినప్పుడు ఈ కేంద్రానికి గాని, ఆత్మకిగాని, ఒక నిర్ణీతమైన స్థానముందని వారెప్పుడూ సూచించే వారు కారు. వారు సూచించిందల్లా, అభివ్యక్తమైన వాటన్నిటికీ మూలం ఆ కేంద్రమనే.

5. జ్ఞానం: ఆత్మానుభవాన్నే ఒక్కొక్కసారి జ్ఞానమంటారు. అంటే, ఆత్మ నెరిగిన వ్యక్తి అంటూ ఎవరో ఉన్నారని అర్థం కాదు. ఆ ఆత్మజ్ఞానం కలిగిన స్థితిలో పరిమితమైన వ్యక్తి అంటూ ఎవ్వరూ ఉండరు. అసలు ఆత్మకి భిన్నంగా ఏదీ లేదు, ఎరుగ వలసినదీ లేదు. జ్ఞాన మొక అనుభవనీయమైన పదార్థం కాదు. అంతేకాక, తెలుసుకొనే వానికి భిన్నమైన స్థితి కూడ కాదు. ప్రమేయం, పదార్థం అంతర్ధానమై పోయిన స్థితి అది. అటువంటి స్థితిలో సంస్థితమైన వాడు, జ్ఞాని.

6. తురీయ, తుర్యాతీత: సాపేక్ష చైతన్యానికి మూడు స్థితులున్నాయని హిందూ తత్త్వం చెప్తుంది - జాగృత, స్వప్న, సుషుప్తులు. పైకి కనబడే ఈ మూడు తాత్కాలిక స్థితులకూ మూలాధారం ఒకే ఒక సత్యం, ఆత్మే నంటారు శ్రీ రమణులు. అందువల్ల ఒక్కొక్కసారి, వారు ఆత్మని తురీయ స్థితి, అంటే నాల్గవ స్థితి అనేవారు. అప్పుడప్పుడు, "తుర్యాతీత స్థితి", అంటే “నాల్గవ స్థితికి అతీతమైనది" అనే పదాన్ని వాడే వారు. ఇట్లా అనటంలో వారి ఉద్దేశమిది: నిజానికి నాలుగు స్థితులు లేవనీ, ఉన్నదల్లా సత్యమైన ఒకే ఒక స్థితి అనీ, అది అన్నిటికీ అతీతమనీను.

7. ఇతర పదాలు: ఆత్మకి వేరే మూడు పదాలు గమనార్హం. ఆత్మే వ్యక్తికి నిజమైన స్వస్థితి అనేవారు శ్రీ రమణులు. ఈ కారణంగా వారు “సహజస్థితి" అనీ, “స్వరూపమ”నీ అనేవారు. సహజస్థితి అంటే సహజంగా ఉండే స్థితి, స్వరూపమంటే. అసలైన రూపం లేక తత్త్వమని అర్థం. ఒక్కొక్కసారి వారు “మౌన” మనే పదాన్ని కూడ ఉపయోగించేవారు. అంటే ఆత్మ నిశ్శబ్దంగా, ఆలోచనా రహితంగా, నిరుపహతికమైన శాంతిలో ఉండేదని భావం.

ప్రశ్న: సత్యమంటే ఏమిటి?

జవాబు: పేర్లతోనూ, రూపాలతోనూ నిమిత్తం లేకుండా, వాటి వెనుక, ఎప్పుడూ ఉండేదే సత్యమంటే, అన్ని పరిమితుల వెనుకా ఉండేది, కాని అది అనంతం. దానికి బంధం లేదు. అన్ని అసత్యాల వెనుకా ఉండేది ఆ సత్యమే. సంస్థితమైనదే సత్యం. దాని స్వరూపమే అది. అది వాక్కుకి అతీతం. "ఉనికి, లేమి” వంటి వర్ణనలకు అతీతం.

అజ్ఞానమూ, అన్నిటి ఎరుకా ధ్వంసమైన తరువాత మిగిలే చైతన్యమే సత్యమంటే అదే ఆత్మ. ఆ బ్రహ్మస్వరూపంలో, అంటే అపరిమితమైన ఆత్మజ్ఞానంలో, ఏ మాత్రమూ అవిద్యలేదు. స్వచ్ఛంగా ప్రకాశిస్తూ, దుఃఖంగాని, దేహంగాని లేకుండా, ప్రపంచపు లేమీ, ఉనికీ ఎరిగినప్పుడూ కూడ ఉండే సత్యమే నీ నిజస్వరూపం. చిదానందాన్ని విరజిమ్ముతూ, లోపలా బయటా సమానంగా ప్రకాశించే ఎరుకే, ఆనందమయమైన మౌలికమైన సత్యం. మౌనం దాని స్వరూపం. అసలైన, అవరోధంలేని జ్ఞానమదే నంటారు జ్ఞానులు.

జ్ఞానమే వైరాగ్యం, జ్ఞానమే స్వచ్ఛత, జ్ఞానమే భగవంతుని పొందు. ఆత్మని విస్మరింపని జ్ఞానమే అమరత్వం. జ్ఞానమే సకలమూను. ఈ విషయాన్ని గుర్తుంచుకో.

ప్ర: ఎరుక అంటే ఏమిటి? దానిని సంపాదించుకోవటమెట్లా? పెంచుకోవట మెట్లా?

జ: నువ్వే ఎరుక అంటే. నీకు మరొక పేరు ఎరుక. నీవే ఎరుకవు కనుక దానిని సంపాదించుకోవలసిన అవసరంగాని, పెంచుకోవలసిన అవసరంగాని లేదు. ఇతర విషయాల గురించి, అంటే అనాత్మమైన వాటి ఎరుకను విడవాలి. చెయ్యవలసిందంతా అదే. వాటి గురించి ఎరుక విడనాడితే మిగిలేది స్వచ్ఛమైన ఎరుకే - అదే ఆత్మ అంటే.

ప్ర: ఆత్మే ఎరుక అయితే, ఇప్పుడా ఎరుక నాకెందుకు లేదు?

జ. అసలు ద్వయీ భావం లేనే లేదు. నీ ప్రస్తుత జ్ఞానం అహంకారం వల్ల కలిగింది - అది సాపేక్షం మాత్రమే. సాపేక్షజ్ఞానానికి కార్యకారణాలుండాలి. కాని ఆత్మజ్ఞానం కేవలస్థితి - దానికి ఏమీ అక్కర్లేదు. స్మృతికూడా అట్లాగే సాపేక్షం. జ్ఞాపకముంచుకోవటానికి ఒక విషయం కావాలి, జ్ఞాపకముంచుకొనే వాడు కావాలి. ద్వయీభావం లేనప్పుడు ఎవరు దేనిని జ్ఞాపకముంచుకోవాలి? ఆత్మ ఎప్పుడూ ఉంటూనే ఉంది. ప్రతి వారికీ ఆత్మని తెలుసుకోవాలని ఉంటుంది. తన గురించి తాను తెలుసుకోవటానికి ఎవరి సహాయం కావాలి? ఆత్మ ఏదో కొత్త పదార్థం వలె అందరూ చూడాను కుంటారు. కాని అది శాశ్వతము, ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. అదేదో మెరిసి పోయే కాంతివలెనో, మరేదో గానో చూడాలని కోరుతారు. అది ఎట్లా సాధ్యం? అది వెలుగూ కాదు, చీకటీ కాదు. అది అదే దానిని నిర్వచించలేం. "అదే నేను, నేనదే" ఇదే అన్నిటికన్నా శ్రేష్ఠమైన నిర్వచనం. శ్రుతులు ఆత్మ అంగుష్ఠమాత్రమనీ, కేశాంతమనీ, విద్యుత్ కణమనీ, సూక్ష్మాతి సూక్ష్మమైన దాని కంటె సూక్ష్మమనీ వర్ణిస్తాయి. ఇవేవీ నిజం కాదు. అది సంస్థితమవటమే! అది వాస్తవానికీ, అవాస్తవానికీ భిన్నం. అది జ్ఞానం. కాని అవిద్యకీ జ్ఞానానికీ భిన్నం. దానిని నిర్వచించటమెట్లా? సంస్థితమవటమే అది!

ప్ర: ఎవరికైనా ఆత్మసాక్షాత్కారమయితే అతను చూచేది ఏమిటి?

జ: చూడటమంటూ ఏమీ లేదు. చూడటమంటే సంస్థితమవటమే. ఆత్మసాక్షాత్కారం పొందటమంటే కొత్తగా దేనినో చూడటం కాదు. దూరంగా ఉన్న గమ్యాన్ని చేరుకోవటమూకాదు. ఎల్లవేళలా నీ నిజస్థితిలో సంస్థితమవటమే. అసత్యాన్ని సత్యమను కోవటం విడనాడటమే నువ్వు చేయవలసింది. ఈ అభ్యాసాన్ని మనం వదులు కోవాలి. అప్పుడు ఆత్మని, ఆత్మగా గుర్తిస్తాం. ఇంత స్పష్టంగా, సువిదితమైన ఆత్మకోసం అన్వేషించానేమిటా అని నీ గురించి నీవే ఒక దశలో అనుకుంటావు. కాబట్టి ఈ ప్రశ్నకి ఏమని జవాబివ్వగలం? ఆ స్థితి దృశ్యానికీ, ద్రష్టకీ అతీతం. చూచేవాడు గాని, చూడబడేదిగాని ఏమీ ఉండవు. ఇప్పుడు అన్నింటినీ చూస్తూన్న ద్రష్ట ఉండడు, ఉండేదల్లా ఆత్మ ఒక్కటే.

ప్ర: ప్రత్యక్షానుభావంగా దీని నెట్లా తెలుసుకోవటం?

జ: ఆత్మ విషయంలో తెలిసికోవటం గురించి పలికామంటే, ఇద్దరుండాలనమాట - ఒకటి, ఆత్మని తెలుసుకునే నేను రెండవది తెలియబడే నేను. ఇవి కాక, తెలుసుకోవటమనే కార్యం కూడ ఉండాలి. సాక్షాత్కారం అని మనమనే స్థితి కేవలం తానుగా ఉండటమే. దేనినీ తెలుసుకోవటం గాని, ఏదైనా అవటంగాని కాదు. ఎవరిగురించైనా సాక్షాత్కారం పొందాడని అంటే, అతడు నిత్యుడనమాటే. ఆ స్థితిని వర్ణించలేము. ఆ స్థితే అతడనమాట. అయితే ఒకటి, మనం సాక్షాత్కారమనే మాటని యధాలాపంగా అంటాం, అంతకంటే మంచి పదం లేక. ఎల్లవేళలా ఏది సంస్థితమైన సత్యమో దానిని సాధించటమేమిటి? ఎట్లా?

ప్ర: మీరు ఒక్కొక్కసారి 'మౌనమే ఆత్మ' అంటారు. ఎందుచేత?

జ: ఆత్మలో సంస్థితమైన వారు భావాలు లేని సౌందర్యంలో ఉంటారు. వారు భావించవలసిందేమీ లేదు. అంటిపెట్టుకొని ఉండవలసిందల్లా మౌనానుభవాన్నే ఆ పరిస్థితిలో తానుగా ఉండటం తప్ప వేరే సాధించ వలసిందేమీ ఉండదు.

ప్ర: మౌనమంటే ఏమిటి?

జ: వాక్కుకీ, భావానికీ అతీతమైన స్థితే మౌనమంటే. ఉన్నదల్లా మౌనమే. మౌనాన్ని మాటలలో వర్ణించట మెట్లా? అహంకారం ఏ మాత్రమూ ఉదయించని స్థితే స్వరూపమంటారు ఋషులు. అదే మౌనం. ఆ మౌనమైన ఆత్మే

భగవంతుడు. ఆత్మే జీవుడంటే, ఈ విశ్వమంతా ఆత్మే. ఇతర పరిజ్ఞానమంతా చాలా అల్పం. మౌనానుభూతే అసలైన, పరిపూర్ణమైన జ్ఞానం. పైకి కనబడే తేడాలన్నీ నిజంకావనీ, అవన్నీ ఆత్మపై పడే ముద్రలేననీ గ్రహించు. ఆత్మే అసలైన జ్ఞానం.

ప్ర: జీవరాశులూ, వాటికి ప్రాణంపోసేవీ, విభిన్నంగా అనేకంగా కనబడుతూన్నప్పుడు, ఒకే ఒక ఆత్మ ఉన్నదని ఎట్లా అనగలం?

జ: "నేను ఈ దేహాన్ని" అనే భావాన్ని అంగీకరిస్తే, ఆత్మలు అనేకం. ఈ భావం మాయమైపోయే స్థితిలో ఉండేదే ఆత్మ. ఆ స్థితిలో వేరే వస్తుజాలమంటూ ఏమీ లేదు. ఈ కారణం వల్ల ఆత్మ ఒక్కటేనని అంటాం.

ఆత్మ యొక్క సహజస్థితిలో దేహమే లేదు. మనస్సులేకుండా దేహం లేదు. ఆ మనస్సు మోహం వల్ల ప్రభావితమవుతుంది. చైతన్య నిలయమైన ఆత్మని దేహి (అంటే దేహాన్ని ధరించేది) అనటం తప్పు.

దేహం లేకుండా లోకం లేదు. మనస్సు లేకుండా దేహంలేదు. చైతన్యం లేకుండా మనస్సు లేదు. సత్యం లేకుండా చైతన్యమెప్పుడూ ఉండదు.

తనలోకి తాను వెళ్లి ఆత్మను గ్రహించిన వానికి - ఆత్మ తప్ప వేరే తెలుసు కోవలసిందేమీ లేదు. ఎందుచేత? ఈ దేహాన్ని "నేను"గా గుర్తించే అహం నశించటం వల్ల. అతడు (జ్ఞాని) రూపరహితమైన చైతన్యమే.

జ్ఞానికి (ఆత్మసాక్షాత్కారం పొందినవానికి) తాను తప్ప ఆత్మ వేరేమీ కాదనీ, తన దేహంగాని, మరి ఏ ఇతర పదార్థమైనా లేదనీ, తెలుసు. అటువంటి వానికి దేహమున్నా, లేకపోయినా ఒకటే.

సాక్షాత్కారం గురించి మాట్లాడటమే అనుచితం. సాక్షాత్కారమంటూ పొందవల సిందే ముంది అసలు? సత్యమెప్పుడూ ఒకే విధంగా ఉంటుంది. మనం దేనినీ కొత్తగా సృష్టించటం లేదు. అంతకు పూర్వం లేని దానినేమీ సాధించటం లేదు. దీనికొక ఉపమానాన్ని శాస్త్రాలు ఇస్తాయి - మనం నూతిని తవ్వి ఒక పెద్ద గోతిని కల్పిస్తాం. ఆ గోతిలోగాని, నూతిలో గాని ఉన్న ఖాళీ స్థలాన్ని మనం సృష్టించలేదు. ఆ ఖాళీ స్థలాన్ని కప్పివేసిన మట్టిని మాత్రమే మనం తీసివేశాం. ఆ జాగా ముందూ ఉంది. ఇప్పుడూ ఉంది. ఆ విధంగానే, ఎంతో కాలంగా మనలో ఉన్న సంస్కారాలని విసర్జించాలి. అవన్నీ పోయాక ఆత్మ ఒక్కటే ప్రకాశిస్తుంది.

ప్ర: కాని దీనిని చేయటమెట్లా? విముక్తి పొందట మెట్లా?

జ: మన నైజమే విముక్తి. మనమదే. మనం విముక్తి చెందాలని కోరుకోవటమే ఈ బంధాల నుండి విమోచనం మన నైజమని తెల్పుతుంది. అది కొత్తగా సాధించవలసినది కాదు. చేయవలసిందల్లా ఒక్కటే మనం బంధితులమన్న భావాన్ని విడనాడటం. అది జరిగితే ఏ కోరికా, ఏ భావమూ ఉండదు. విముక్తి చెందాలన్న కోరిక ఉన్నంత కాలం, నీవు బంధితుడవనే గ్రహించు.

ప్ర: ఆత్మ సాక్షాత్కారం పొందినవారికి మెలకువ, స్వప్నం, సుషుప్తి అనే మూడు అవస్థలూ ఉండవంటారు. నిజమేనా?

జ. ఆ మూడూ ఉండవని ఎట్లా అంటున్నావు? "నేను కలకన్నాను. నేను గాఢ నిద్రపోయాను. నేను మేల్కొని ఉన్నాను" అని నువ్వన్నప్పుడే, ఆ మూడు స్థితులలోనూ నువ్వు ఉన్నట్టేనని ఒప్పుకోవాలి. అంటే, ఎల్లప్పుడూ నువ్వున్నావనే స్పష్టమౌతోంది. ఇప్పుడున్నట్లుంటే నువ్వు జాగ్రత్ అవస్థలో ఉన్నట్టు, స్వప్నావస్థలో ఇది మరుగున పడుతుంది, అట్లాగే సుషుప్తిలో స్వప్నావస్థ మాయమవుతుంది. నువ్వు అప్పుడూ ఉన్నావు, ఇప్పుడూ ఉన్నావు, ఎప్పుడూ ఉంటావు. ఆ మూడు అవస్థలూ వస్తూంటాయి, పోతూంటాయి - కాని నువ్వు మాత్రం ఎప్పుడూ ఉంటావు. ఇదొక సినిమా వంటిది. తెర ఎప్పుడూ ఉంటూనే ఉంది. కాని దాని మీద ఎన్నో రకాల బొమ్మలు వస్తూంటాయి. పోతూంటాయి. తెరకి ఏదీ

అంటుకోదు. తెర తెరగానే ఉంటుందెప్పుడూ. అట్లాగే ఆ మూడు స్థితులలోనూ నువ్వు ఆత్మగానే ఉంటావు. ఈ విషయం తెలిస్తే ఆ మూడు అవస్థలూ నిన్నేమీ ఇబ్బంది పెట్టవు - తెరకి చిత్రాలు అంటుకోనట్టు! తెరమీద ఒక్కొక్కసారి పెద్ద పెద్ద కెరటాలతో మహాసముద్రం కనబడుతుంది- అది పోతుంది. ఇంకోసారి చుట్టూరేగిపోతున్న మంట కనబడుతుంది. అదీ పోతుంది. రెండుసార్లూ తెర అక్కడే ఉంది. నీటివల్ల తెర తడిసిపోయిందా? మంటవల్ల తెర కాలిపోయిందా? తెరని ఏదీ ఏమీ చేయలేదు. అట్లాగే, మెలకువగా ఉన్నప్పుడుగాని, స్వప్నంలో ఉన్నప్పుడుగాని, సుషుప్తిలో ఉన్నప్పుడుగాని జరిగేవాటికి వేటికీ నీ మీద ప్రభావముండదు - నువ్వు నీ ఆత్మగానే ఉంటావు!

ప్ర: అంటే, ఆ మూడు అవస్థలూ ఉన్నా, మనుష్యులపై వాటి ప్రభావముండ దంటారా?

జ: అవును. ఈ అవస్థలన్నీ వస్తూంటాయి, పోతూంటాయి. ఇవేవీ ఆత్మకి పట్టవు -దానికి ఒకే ఒక అవస్థ ఉంటుంది.

ప్ర: అంటే, అటువంటి వ్యక్తి ఈ ప్రపంచంలో ఉన్నా, ఒక సాక్షిగా మాత్రమే ఉంటాడనా అర్థం?

జ: అవును. దీనికే "పంచదశి" లో విద్యారణ్యులు ఒక ఉపమానమిస్తారు - నాటకశాలలో రంగస్థలం మీద పెట్టిన దీపాన్ని. నాటకం జరుగుతూన్నంత సేపూ ఆ దీపం ఏ విచక్షణా లేకుండా అన్ని పాత్రధారులనీ కనబడేట్టు చేస్తుంది. - వాళ్లు రాజులైనా, సేవకులైనా, నర్తకులైనా ప్రేక్షకులైనా సరే. ఆ దీపం నాటక ప్రదర్శనకి ముందూ ఉంటుంది. ప్రదర్శన జరుగుతున్నప్పుడూ ఉంటుంది, నాటకం ముగిసిన తర్వాత కూడా ఉంటుంది. ఆ విధంగానే, లోపలికాంతి, అంటే ఆత్మ, అహానికీ, బుద్ధికీ, స్మృతికీ, మనస్సుకీ వెలుగునిస్తుంది. దానికి మాత్రం పెరుగదలా, క్షీణించటమూ అంటూ ఏమీ లేదు. గాఢ నిద్రలో, ఇతర అవస్థలలో అహం ఉన్నట్టు అనిపించకపోయినా, ఆత్మమాత్రం ఏ గుణమూ లేకుండా, ప్రకాశిస్తూనే ఉంటుంది ఎల్లప్పుడూ, అసలు, ఆత్మ సాక్షి అనే భావం, మనస్సులో ఉన్నదే. అది ఆత్మ గురించిన కేవలసత్యం కాదు. సాక్షీభూత మనటానికి, పదార్థాలతో సంబంధముంటుంది. ఆ సాక్షీ, పదార్థమూ మనస్సుచే కల్పింప బడినవే!.

ప్ర: చైతన్యానికి గల ఆ మూడు స్థితులూ తురియ ఆవస్థకి ఏ విధంగా తక్కువ? ఈ మూడు అవస్థలకూ, ఆ నాల్గవ దానికీ సంబంధ మేమిటి?

జ: ఉన్నదల్లా ఒకే ఒక అవస్థ- అది చైతన్యస్థితి, లేక ఎరుక, లేక ఉనికి. ఆ మూడు అవస్థలూ - మెలకువ, స్వప్నం, సుషుప్తి- సత్యం కానేకావు. సత్య మెప్పుడూ ఉంటుంది. అన్ని అవస్థలలోనూ ఉండే ఆ "నేను", ఆ ఉనికే, సత్యమసలు. మిగిలిన మూడూ వాస్తవాలు కావు. అందువల్ల వాటి కెంత సత్యముందో చెప్పటం కష్టం. స్థూలంగా, ఇట్లా చెప్పవచ్చు.

ఉనికి, లేక చైతన్య మొక్కటే సత్యం. చైతన్యానికి మెలకువని జోడించిన స్థితిని జాగ్రదావస్థ అంటాం. అట్లాగే చైతన్యానికి నిద్రని జోడించిన స్థితిని సుషుప్తి అంటాం. చైతన్యానికి కలని జోడించిన స్థితిని స్వప్నావస్థ అంటాం. అన్ని చిత్రాలూ వస్తూపోతూ ఉండే తెర, చైతన్యం. ఆ తెర సత్యం. చిత్రాలు దానిపై కదలాడే నీడలు. ఎంతో కాలంగా అలవాటయిపోయిన కారణంగా, ఈ మూడు అవస్థలనీ నిజమని భావించి ఎరుకని లేక చైతన్య స్థితిని నాల్గవ అవస్థ అంటాం. నాల్గవ అవస్థ అంటూ ఏమీ లేదు - ఉన్నదల్లా ఒకే ఒక అవస్థ.

నిజానికి స్వప్నావస్థకీ, జాగ్రదవస్థకీ తేడా ఏమీ లేదు - ఎటొచ్చీ స్వప్నావస్థ తక్కువది, జాగ్రదావస్థ పెద్దది. రెండూ మనస్సుకి ఫలితాలే. జాగ్రదవస్థ ఎక్కువ కాలముంటుంది కాబట్టి, అదే మన నిజస్థితి అని ఊహించుకుంటాం. అసలు మన నిజస్థితి 'తురియ" అవస్థ నాల్గవది. అది ఎప్పుడూ ఉంటుంది. దానికి మిగిలిన మూడు అవస్థల గురించి తెలియదు. ఆ మూడింటినీ అవస్థలంటూంటాం కాబట్టి, నాల్గవ దానిని కూడ తురియావస్థ అంటాం. అది ఒక అవస్థ కానే కాదు. అది ఆత్మ యొక్క నిజస్థితి, సహజస్థితి. ఇది గ్రహిస్తే 'తురియ' నాల్గవ స్థితి కాదని తెలుస్తుంది. దానిని మిగిలిన మూడింటికీ జోడిస్తే నాల్గవది అవుతుంది. అది తురియాతీత స్థితి.

ప్ర: ఈ మూడు అవస్థలూ ఆత్మ అనే అసలైన తెరమీదకి ఎందుకు వస్తూ పోతూంటాయి?

జ. ఈ ప్రశ్నని వేసేదెవరు? ఈ అవస్థలూ వస్తూపోతూ ఉంటాయని ఆత్మ అంటోందా. ఇవి వస్తూ పోతూ ఉన్నాయనేది ద్రష్టే ద్రష్టా, దృశ్యమూ కలిస్తే మనస్సవుతుంది. మనస్సంటూ ఏదైనా ఉన్నదేమో గమనించు. మనస్సు ఆత్మలో లీనమైనప్పుడు ద్రష్టాలేడు, దృశ్యమూ లేదు. కాబట్టి నీ ప్రశ్నకి సరైన సమాధానమిది: "అని రానూ రావు. పోనూ పోవు." ఎల్లప్పుడూ ఉండేదల్లా ఆత్మ ఒక్కటే. ఆ మూడు అవస్థలూ చింతన లేకపోవటం వల్ల ఏర్పడేవే. చింతన వాటిని అంతమొందిస్తుంది. ఎంత విడమరచి చెప్పినా ఆత్మ సాక్షాత్కారమయ్యే వరకూ సత్యం తేట తెల్లం కాదు. అది జరిగిన తర్వాత- అంతకాలమూ స్పష్టంగా, ఎల్లవేళలా ఉండే దానిని ఎట్లా చూడలేకపోయానా అని ఆశ్చర్యం కలుగుతుంది.

ప్ర: మనస్సుకీ ఆత్మకీ భేదమేమిటి?

జ: ఏమీ లేదు. అంతర్ముఖమైన మనస్సు, ఆత్మ. బహిర్ముఖమైతే అదే అహమవుతుంది, ప్రపంచమవుతుంది. ప్రత్తి రకరకాల బట్టగా తయారైనప్పుడు వేరు వేరు పేర్లు పెడ్తాం. కాని బట్టలన్నీ ప్రత్తే నగలన్నీ బంగారమే. సత్యం - ఏకం. నామాలూ, రూపాలూ - అనేకం. అయితే, ఆత్మకి భిన్నంగా మనస్సు ఉండదు. అంటే దానికి స్వయం ప్రతిపత్తి లేదనమాట. ఆత్మ, మనస్సులేకుండా ఉంటుంది. కాని ఆత్మ లేకుండా మనస్సెప్పుడూ ఉండలేదు.

ప్ర: బ్రహ్మాన్ని సచ్చిదానంద మంటారు కదా. అంటే అర్థమేమిటి?

జ: అవును. నిజమే. సంస్థితమైనది- సత్. దానినే బ్రహ్మమంటారు. సత్ యొక్క కాంతి చిత్. దాని స్వరూపం ఆనందం. ఇవి సత్కి భిన్నం కావు. మూడింటినీ కలిపి సచ్చిదానందమంటారు.

ప్ర: ఆత్మే సత్, చిత్. అటువంటప్పుడు ఆత్మకీ సత్ - అసత్లకీ, చేతనా చేతన ములైన వాటికీ భేదముందని ఎట్లా అంటారు?

జ. ఆత్మ సత్తే, అన్ని దానిలో ఉన్నాయి. ఆత్మకి సంబంధించినంత వరకూ

ద్వయీభావానికి తావు లేదు- అంటే అది సత్యమా, అసత్యమా అని. అందువల్లే

ఆత్మ సత్ అసత్లకి భిన్నమంటారు. ఆ విధంగానే ఆత్మ చైతన్యం. అందువల్ల

ఆత్మ ఎరుగ వలసిందిగాని, ఎరుక కలిగించ వలసింది గాని ఏమీ లేదు. ఆ కారణంగా ఆత్మ చేతనాచేతనములైన వాటికి భిన్నమంటారు. పరమమైనది సత్ చిత్ ఆనందం. అంటే అది అసత్ కాదు, అచిత్ కాదు. అనానందం కాదు. మనం దృశ్యమానమైన ప్రపంచంలో ఉండటం వల్ల ఆత్మని సత్ చిత్ ఆనందమంటాం.

ప్ర: మన సహజస్థితి ఆనందమంటారు. ఏ విధంగా?

జ: పరిపూర్ణానందం - బ్రహ్మం. పరిపూర్ణశాంతి, ఆత్మ, సంస్థితమైనదంతా అదే, ఆ చైతన్యమే. ఆనందం ఆ ఆత్మ యొక్క స్వరూపం. పరిపూర్ణమైన ఆనందమే కాని ఆత్మ మరేమీ కాదు. ఉండేదల్లా ఆ ఆనందమన బడేదే.

ఆ సత్యాన్ని తెలుసుకొని, ఆత్మలో ఉంటూ, ఆనందాన్ని నిత్యమూ ఆస్వాదించు.

ఎవరైనా తన ఆనందం బయటి కారణాల వల్ల గాని, సంపద వల్లగాని కలుగు తోందనుకుంటే, అతని సంతోషం, సంపద ఎక్కువైన కొద్దీ ఎక్కువవుతూ, సంపద తగ్గిన కొద్దీ తగ్గిపోతూండాలి కదా. కాబట్టి ఏ సంపదా లేకపోతే అతని సంతోషమూ శూన్యమైపోతుంది. కాని, మనిషి అనుభవమేమిటి? ఇట్లాగే ఉంటుందా?

గాఢ నిద్రలో మనిషికి ఏ సంపదా ఉండదు. అతని దేహమే ఉండదు. అయినా అసంతుష్టిగా ఉండడు. పైగా ఎంతో సంతోషంగా ఉంటాడు. మంచి నిద్రకావాలని అందరికీ ఉంటుంది కదా. అంటే, సంతోషమనేది మనిషి లోపలే సహజంగా ఉంది, అది బయటి పరిస్థితుల మీద ఆధారపడి లేదు.

అకళంకమైన ఆనందకోశం తెరచుకోవాలంటే, ఆత్మాసాక్షాత్కారం చేసుకోవాలి.

ప్ర: హృదయం చైతన్యస్థావరమనీ, ఆత్మతో సమానమనీ శ్రీ భగవాన్ సెలవిచ్చారు. అసలు హృదయమంటే ఏమిటి?

జ: భగవంతుడు, ఆత్మ, హృదయం, చైతన్యస్థావరం - ఏ పేరు పెట్టినా అన్నీ ఒక్కటే. గ్రహించవలసిన విషయమిది- హృదయమే మనిషి అంతరాంతరం, అదే కేంద్రం. అది లేకపోతే, ఇంకేదీ లేదు. హృదయం భౌతికం కాదు. 'హృత్-అయం' - హృదయం. అంటే "ఇది కేంద్ర" మని అర్థం. అక్కడ నుంచే అన్ని భావాలూ ఉదయిస్తాయి, దాని మీదే ఆధారపడుతాయి, అందులోనే లయమైపోతాయి. మనస్సు భావాల సమూహం. భావాలే ప్రపంచానికి రూపాన్నిస్తాయి. అన్నిటికీ కేంద్రం హృదయమే. బ్రహ్మంనుండే జీవులన్నీ ఉద్భవిస్తాయని ఉపనిషత్తులు చెప్తాయి. అదే హృదయం. బ్రహ్మమే హృదయం.

ప్ర: హృదయాన్ని గ్రహించటమెట్లా?

జ. ఆత్మని అనుభవించకుండా ఒక్క నిమిషమైనా ఎవ్వరికీ ఉండదు. తన ఉనికికి ఆత్మ భిన్నమని ఎవ్వరూ అనరు. అతడే ఆత్మ. ఆత్మే హృదయం,

అన్నీ ఉదయించే కేంద్రమే హృదయం. ప్రపంచాన్ని, దేహాన్ని, ఇతరమైన వాటినీ గమనిస్తాం కనుక వీటన్నిటికీ ఒక కేంద్రముందంటాం. నువ్వే హృదయంలో సంస్థితమైతే అది కేంద్రంగాని, పరిధికాని కానే కాదని తెలుస్తుంది. అది తప్ప వేరే ఏదీ లేదు.

సత్ అయిన చైతన్యం, హృదయం. సత్ని తప్ప వేరే అసత్ అయిన వాటిని ఎరుగబోని చైతన్యం అది, అదే హృదయం. ఆ చైతన్యానికే ఆత్మ యొక్క సత్యం ఎరుక. ఆ చైతన్యానికి ఏ వ్యాపకమూ ఉండదు. ఎప్పుడూ ఆత్మకే అంకితమై ఉండే ఆ చైతన్యమే శుద్ధ జ్ఞాన కాంతి.

## 2.ఆత్మజ్ఞానము-ఆత్మవిస్మృతి

శ్రీ రమణులు, ఆధ్మాత్మిక సాధకులు మూడు వర్గాల వారంటూండేవారు. మొదటి వర్గం వారు, బాగాపురోగమించినవారు. ఆత్మయొక్క నిజతత్వాన్ని చెప్పగానే వీరు ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతారు. రెండవ వర్గం వారికి, దాని గురించి కొంచెం మననం చేసుకున్న తరువాత గాని ఆత్మజ్ఞానం దృఢం కాదు. ఇక మూడవవర్గం వారు ఇంకొంచెం దురదృష్టవంతులు వాళ్లు ఎన్నో సంవత్సరాలు సాధన చేస్తేనే గాని ఆత్మసాక్షాత్కారాన్ని పొందలేరు. దీనికే శ్రీరమణులు నిప్పురాజుకొనే పదార్థాల ఉపమానాన్నిస్తారు. మందుగుండు ఒక్క రవ్వతో నిప్పు అంటుకుంటుంది. బొగ్గు నిప్పు అంటుకోవటానికి కొంతసేపు పట్టుతుంది. ఇక తడిసిన బొగ్గైతే అది ఆరాలి, ఎంతో సేపు సెగ చూపితేనే గాని రాజుకోదు.

శ్రీరమణులు మొదటి రెండు వర్గాల వారికీ ఆత్మ ఒక్కటే ఉండేదనీ, మన గురించి మనకు గల తప్పుడు భావాలని విసర్జిస్తే ఆత్మని ప్రత్యక్షంగా అనుభవించవచ్చని చెప్పేవారు. ఈ తప్పు అవగాహనలని వారు సామూహికంగా, "అనాత్మ" అనేవారు. ఇవన్నీ కేవలం కల్పితమైన తప్పు భావాలు. ఇవి ఆత్మని అనుభవసిద్ధం చేసుకోనీయకుండా తెర వేసేస్తాయి. ఆత్మ, భౌతిక దేహానికీ, మనస్సుకీ పరిమితమైనదన్నది ఈ తప్పు భావాలలో ముఖ్యమైనది. తాను ఒక వ్యక్తిననీ, ఒక దేహాన్ని ఆక్రమించుకున్న వానిననీ ఊహించటం మానివేసిన వెంటనే, అన్ని తప్పు అభిప్రాయాలూ కూలిపోయి, ఆత్మ జ్ఞానం శాశ్వతంగా కలుగుతుంది. ఈ స్థాయి బోధనలో అభ్యాసం గురించిగాని, కృషి గురించిగాని ప్రసక్తి లేదు. తెలుసుకో

వల సిందల్లా ఒక్కటే. ఆత్మ అనేది సాధించవలసిన లక్ష్యమంటూ ఏమీ కాదు. పరిమితులని విధించే అనాత్మ భావాలని విడనాడి, ఎరుక సంస్థితమవటమే!

ప్ర: నాకు ఆత్మసాక్షాత్కార మెట్లా కలుగుతుంది?

జ: సాక్షాత్కారమనేది కొత్తగా సాధించ వలసిందేమీ కాదు. చేయవలసిందల్లా, "నాకు సాక్షాత్కారం కలుగలేదు" అనే భావాన్ని వదిలించుకోవటమే. ప్రశాంతత, శాంతం అదే సాక్షాత్కారమంటే. ఆత్మలేని క్షణమంటూ ఏదీ లేదు. సాక్షాత్కారం కాలేదన్న సంకోచంగాని, భావంగాని ఉన్నంతకాలం, ఆ భావాన్ని వదిలించుకునే ప్రయత్నం చేస్తూనే ఉండాలి. ఆత్మా, ఆత్మకానివీ - ఒకటే అనుకోవటం వల్లనే ఈ భావాలు కలుగుతాయి. అనాత్మమైనది మాయమైతే, మిగిలేది ఆత్మే! ఖాళీగా కావాలంటే అక్కడున్న వస్తువుల నన్నిటినీ తీసివేయాలి. ఖాళీ జాగాని, బయటనుంచి, ఎక్కడనుంచో తీసుకురాము కదా!

ప్ర: ఆత్మసాక్షాత్కారం వాసనక్షయం వల్లగాని సంభవం కాదు కదా. ఆ వాసనలన్నీ పూర్తిగా నాశనమైన స్థితిని నేనెట్లా పొందగలను?

జ: నీ సహజ స్థితిలో నీవుంటే, వాటంతటవే నాశనమవుతాయి.

ప్ర: నేను ఆత్మనెట్లా అందుకోగలను?

జ. ఆత్మ నందుకోవటమంటూ ఏమీ లేదు. ఆత్మని చేరుకోవటమంటే ఆత్మ ఇప్పుడు, ఇక్కడలేనట్లూ, దానిని సంపాదించ వలసిన అవసరమున్నట్లు అర్థం. కొత్తగా సంపాదించిన దేదైనా పోతుంది. అందువల్ల అది అనిత్యమన మాట. శాశ్వతం కాని దాని కోసం ప్రాకులాడటం వృథా. అందువల్లే ఆత్మని సంపాదించటమంటూ ఏమీ లేదన్నాను. నువ్వే ఆత్మవి. నువ్వు ఎప్పుడూ అదే. అసలు సంగతేమిటంటే, నీ ఆనందమయస్థితి గురించి నీకు తెలియదు. ఆనంద నిలయమైన ఆత్మని నీ నుంచి అవిద్య ఒక తెరవలె కప్పివేస్తుంది. చేసే కృషి అంతా ఈ దురవగాహనని, ఈ అవిద్య అనే తెరని తొలగించటానికే, తప్పు అవగాహనంటే, ఈ దేహానికీ, మనస్సుకీ - ఆత్మతో తాదాత్మ్యం కల్పించటం. ఈ తప్పు తాదాత్మ్యం పోవాలి - అప్పుడు మిగిలేదల్లా ఆత్మే..

కాబట్టి సాక్షాత్కారం అందరికీని. సాధకులలో భేదాన్ని పాటించదు ఆ సాక్షాత్కారం. అసలు ఈ సందేహమే, "నేను సాక్షాత్కారాన్ని పొందగలనా". "నేను సాక్షాత్కారాన్ని పొందలేదు" అనే భావాలే ఆత్మసాక్షాత్కారానికి అవరోధాలు. ఈ ఆటంకాలనుంచి కూడా విముక్తుడవు కావాలి. pap

ప్ర: ముక్తి చెందటానికి ఎంత కాలం పడుతుంది?

జ: ముక్తి అనేది భవష్యత్తులో ఎప్పుడో పొందేది కాదు. అది ఎప్పుడూ ఉంటూనే ఉంది - ఇప్పుడూ, ఇక్కడాను.

ప్ర: నిజమే. కాని నాకా అనుభవం కావటం లేదు?

జ: ఆ అనుభవం కూడా ఇప్పుడే, ఇక్కడే ఉంది. నీ ఆత్మని నువ్వు కాదనలేవు కదా.

ప్ర: అంటే ఉండటం, సంతోషం కాదన్న మాట?

జ. ఉండటమన్నా, సంతోషమన్నా ఒకటే. ముక్తి అనే పదం రెచ్చగొట్టుతుంది. అసలు దాని కోసం అన్వేషించట మెందుకు? తాను బందీననుకొని, విముక్తికోసం ప్రయత్నిస్తాడు మనిషి, వాస్తవమేమిటంటే, బంధమంటూ ఏమీ లేదు. ఉన్నదల్లా విముక్తే. దానికేదో పేరుపెట్టి దానిని వెతుక్కోవట మెందుకు?

ప్ర: నిజమేనేమో - కాని మాకాజ్ఞానం లేదు.

జ: ఆ అజ్ఞానాన్ని తొలగించు. చేయవలసిందల్లా అదే. ముక్తికి సంబంధించిన ప్రశ్నలన్నీ అప్రస్తుతం. ముక్తి అంటే 'బంధం నుంచి విడుదల'. అంటే ఇప్పుడు బంధంలో ఉన్నట్టర్థం. బంధమూ లేదు, ముక్తీ లేదు.

ప్ర: సాక్షాత్కారం గురించి చెప్తూ పాశ్చాత్యులు విశ్వ చైతన్యం మెరపులాగ తమకి తెలియవచ్చిందంటూంటారు. వాళ్లకి కలిగే సాక్షాత్కారమెటు వంటిది?

జ: మెరుపువలె వచ్చి, మెరుపు వలెనే మాయమైంది! అది ఉంటే అంతమూ ఉండాలి. ఎప్పుడూ ఉండే చైతన్యాన్ని సాక్షాత్కారింప చేసుకుంటేనే అది శాశ్వతంగా ఉంటుంది. అసలు చైతన్యం మనతో ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. "నేనున్నా న"ని అందరికీ తెలుసు. తన ఉనికిని ఎవ్వరూ కాదనలేరు కదా. సుషుప్తిలో ఉన్న వానికి ఎరుక ఉండదు, కాని మెలకువ రాగానే ఆ ఎరుక కలుగుతుంది. మనిషి ఒకడే మరి. నిద్రపోయిన వానికీ, ఇప్పుడు మేల్కొన్న వానికీ తేడా ఏమీ లేదు. నిద్రలో తనకి శరీరమున్నట్టే అతనికి తెలియదు - అంటే శరీరస్పృహ లేదన్న మాట. మేల్కొని ఉన్నప్పుడు మాత్రం అతనికి శరీరస్పృహ ఉందనమాట. దేహం గురించిన ఈ ఎరుక పైకి రావటమే ఈ భేదానికి కారణం. చైతన్యంలో మాత్రమే మార్పులేదు.

శరీరమూ, శరీరం గురించిన ఎరుకా ఒకేసారి లేస్తాయి, ఇంకిపోతాయి. దీని అర్థమిది - సుషుప్తిలో పరిమితులు లేవు. మెలకువగా ఉన్నప్పుడున్నాయి. ఈ పరిమితులే బంధమంటే; "ఈ శరీరమే నేను" అన్న భావమే పొరపాటంతా. "నేను" గురించిన ఈ తప్పు అభిప్రాయం పోవాలి. అసలైన "నేను" ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. ఇప్పుడు, ఇక్కడ ఉంది. అది కొత్తగా వస్తూపోతూ ఉండదు. అట్లాగే సంస్థితమైనది ఎప్పుడూ ఉండాలి. కొత్తగా వచ్చేది మాత్రం మాయమవుతూ ఉంటుంది. సుషుప్తినీ మెలకువనీ పోల్చి చూచుకో, ఒక అవస్థలో శరీరధ్యాస ఉంటుంది, కాని ఇంకొక దానిలో ఉండదు. శరీరమే పోతుంది. చైతన్యం ముందే ఉంది. శరీరం పోయినా ఉంటుంది. 'నేనున్నా'ని అనని వారెవ్వరూ లేరు. "ఈ శరీరమే నేననే తప్పు భావమే దీనంతటికీ మూలం. ఈ మిథ్యా జ్ఞానం పోవాలి. అదే సాక్షాత్కారమంటే, సాక్షాత్కారమంటే దేనినో కొత్తగా పొందటం కాదు - ఒక కొత్త శక్తిని సంపాదించటమూ కాదు. పై పొరని తీసివేయటమే.

అంతిమ సత్యమెంతో సాధారణమైనది. ఆ స్వచ్ఛమైన స్థితిలో ఉండటమే అది. చెప్పవలసిందంతా ఇంతే!

ప్ర: మెలకువగా ఉన్నప్పుడు కంటె, సుషుప్తిలో శుద్ధ చైతన్యానికి దగ్గరగా ఉంటామా?

జ: సుషుప్తి, స్వప్నం, మెలకువ - ఇవన్నీ ఆత్మపై ఏర్పడే తాత్కాలిక స్థితులు. ఆత్మ మాత్రం నిశ్చలంగా ఉంటుంది. ఆత్మ కేవలం ఎరుకే. ఆత్మనుంచి ఎవరైనా, Aఅది సాధ్యమైతేనే, ఈ ప్రశ్న ఉదయిస్తుంది.

ప్ర: అయినా, సుషుప్తిలో మెలకువలో కంటె శుద్ధ చైతన్యానికి ఇంకా చేరువగా ఉంటామంటారే?

జ: “సుషుప్తిలో, మెలకువలో కంటే నాకునేను దగ్గరగా ఉంటానా?" అని అడిగినట్టే er ఉంది ఈ ప్రశ్న.

ఆత్మే శుద్ధ చైతన్యం. ఎవ్వరూ ఆత్మకి దూరం కాలేరు. ద్వయీభావముంటేనే ఈ ప్రశ్న ఉదయిస్తుంది. శుద్ధ చైతన్య స్థితిలో ద్వంద్వమంటూ ఏమీ లేదు. నిద్రపోయినా, కలకనినా, మేల్కొన్నా- ఒక్క మనిషే మెలకువ స్థితే ఎంతో అందంగానూ ఆసక్తి దాయకంగానూ ఉందను కుంటారు. అటువంటి అనుభూతి ఏమీ లేకపోవటం వల్ల సుషుప్తి అవస్థ ఏమీ ఆసక్తి దాయకంగా ఉండదంటారు. ఇక్కడ ఆగి, ముందుకుపోయే ముందు, ఒక విషయాన్ని స్పష్టం చేసుకుందాం. సుషుప్తి అవస్థలో నీవున్నావని ఒప్పుకుంటావా లేదా?

ప్ర: ఒప్పుకుంటాను.

జ: ఇప్పుడు మేల్కొని ఉన్నదీ నీవే కదా.

ప్ర: అవును.

జ: అంటే, సుషుప్తీ, మెలకువా అవిచ్ఛినంగా కొనసాగుతున్నట్టే కదా. ఆ అవిచ్ఛిన్నత ఏమిటి? ఆ స్థితి, స్వచ్ఛమైన ఉనికే. అయినా, రెండు స్థితులకీ భేదముంది. ఆ భేదమేమిటి? శరీరమూ, ప్రపంచమూ, వస్తుజాలమూ మెలకువలో ఉంటాయి. కాని సుషుప్తిలో మాయమవుతాయి.

ప్ర: కాని, సుషుప్తిలో నాకు ఎరుకే ఉండదే?

జ. నిజమే - శరీరమూ, ప్రపంచమూ తెలియవు. కాని, "సుషుప్తిలో నాకు ఎరుకే ఉండదు" అని నువ్వు అన్నావంటే, సుషుప్తి అవస్థలో కూడ నువ్వున్నావన్నమాటే కదా. ఆ మాటలని ఇప్పుడనేది ఎవరు? మెలకువగా ఉన్న మనిషి, నిద్రపోయే వాడనలేడు కదా. అంటే "ఈ శరీరమే ఆత్మ" అని అనే మనిషికి అటువంటి ధ్యాస నిద్రలో లేదన్నమాట.

నువ్వు దేహంతో తాదాత్మ్యం చెందుతావు కాబట్టి నీ చుట్టూ ఉన్న ప్రపంచాన్ని చూసి, మెలకువగా ఉండే అవస్థ ఎంతో అందంగానూ, ఆసక్తి దాయకమైన వాటితోనూ నిండి ఉన్నదంటావు. సుషుప్తిలో నీవంటూ ఒక వ్యక్తిగా లేవు. ఇవేవీ లేవు అందువల్లనే అది నిరాసక్తంగా ఉంటుంది. కాని వాస్తవమేమిటి? ఈ మూడు అవస్థలూ అవిచ్ఛిన్నంగా ఉంటాయి. కాని వ్యక్తికీ, వస్తుజాలానికీ మాత్రం అవిచ్ఛిన్నత ఉండదు.

ప్ర: అవును.

జ: అవిచ్ఛిన్నంగా ఉండేదీ నిలిచేది, శాశ్వతమైనది. అట్లా అవిచ్ఛిన్నంగా ఉండనిది- తాత్కాలికమైనది.

ప్ర: అవును.

జ: కాబట్టి, ఉనికి శాశ్వతము, శరీరమూ, ప్రపంచమూ కావు. అవి చైతన్యమనే తెరపైన 60 వస్తూ పోతూ ఉంటాయి. ఆ ఉనికే - ఆ చైతన్యమే- శాశ్వతం, అచలం.

ప్ర: అయినా, సాపేక్షంగా చూస్తే, మెలకువకంటె, సుషుప్తి అవస్థ శుద్ధ చైతన్యాని కింకొంచెం చేరువ కదా?

జ: అవును. ఈ విధంగా చూస్తే సుషుప్తి నుంచి మెలకువలోకి వచ్చేప్పుడు, “నేను” అనే భావముదయించాలి. మనస్సు రంగంలోకి దిగాలి. అప్పుడు భావాలు వస్తాయి, శరీర వ్యాపకాలు ప్రారంభమవుతాయి. ఇవన్ని కలిసి ఇప్పుడే, మనం మేల్కొన్నామంటాం. ఈ సమ్మేళనం లేకపోవటమే సుషుప్తి లక్షణం. అందువల్ల సుషుప్తి అవస్థ మెలకువ కంటే శుద్ధ చైతన్యానికి చేరువగా ఉంటుంది. ఆ కారణంగా ఎప్పుడూ సుషుప్తి అవస్థలోనే ఉండాలని కోరుకోకూడదు. అసలు అది అసాధ్యం. ఇతర స్థితులూ వస్తూండాలి. రెండవ కారణమిది: దానికీ, జ్ఞాని అనుభవించే ఆనందానికీ తేడా ఉంది. అతని ఆనందం శాశ్వతం, దేనితోనూ మారుతూండదు. అంతే కాక, సుషుప్తి అవస్థని ఎరుకగా గుర్తించరు. జ్ఞానికి ఎప్పుడూ ఎరుక ఉంటూనే ఉంటుంది. అంటే, సుషుప్తి అవస్థకీ, జ్ఞాని సంస్థితమైన దానికీ భేదముంది. సుషుప్తిలో భావాలుండవు. అవి వ్యక్తిపై కలిగించే ప్రభావమూ ఉండదు. ఆ స్థితిని తన సంకల్పంతో ఎవ్వరూ మార్చలేరు, అది అసాధ్యం కాబట్టి. అది శుద్ధ చతన్యానికి ఇంకొంచెం చేరువే అయినా, ఆత్మ సాక్షాత్కారానికై చేసే యత్నాలలో మాత్రం ఒకటి కాలేదు.

ప్ర: బ్రహ్మ జ్ఞానం పొందటం నాబోటి సామాన్యుడికి అసాధ్యం కదా?

జ: దానిని సంపాదించటం వల్ల సంతోషాన్ని పొందటానికి- బ్రహ్మజ్ఞానమనేది ఏదో సంపాదించ వలసిందేమీ కాదు. విడిచి పెట్టవలసిందల్లా, అజ్ఞానాన్నే. 'సాక్షాత్కరింప చేసుకోవాలి' అని నువ్వు అనుకునే ఆత్మ నిజానికి నువ్వే. నీకు అజ్ఞానముందనుకొని దుఖిస్తున్నావు. నీకొక కథ చెప్తాను, నీ విషయం కూడ అట్లాగే ఉందని గ్రహిస్తావు - పదిమంది మూర్ఖులు ఒక నదిని దాటారు. అవలి ఒడ్డుకు చేరింతర్వాత, అందరూ వచ్చారో లేదో నని చూసుకుందామనుకున్నారు. ఒకడు లెక్క పెట్టటం మొదలుపెట్టాడు. తనని మాత్రం లెక్కపెట్టుకోకుండా, "నాకు తొమ్మండుగురే కనబడుతున్నారు. పదో వాడు తప్పిపోయాడు వాడు ఎవడై ఉంటాడు?" అన్నాడు, మరొకడు, "నువ్వు సరిగ్గా లెక్క పెట్టావా" అని అడుగుతూ తాను కూడ లెక్క పెట్టాడు. ఇతను కూడ తనని లెక్క పెట్టుకోకుండా, "మనం తొమ్మండుగురమే ఉన్నాం" అన్నాడు. మిగిలిన వాళ్లు దీనిసే ఒప్పుకొని "తప్పిపోయిన వాడెవడై యుంటాడని" వాళ్లలో వాళ్లే అనుకున్నారు. ఎంత ప్రయత్నించినా తప్పిపోయాడని వాళ్లనుకున్నవాడు దొరకలేదు. ఎంతో ఆప్యాయత ఉన్న మూర్ఖుడు, ఎవడైతేనేం, వాడు నదిలో మునిగి పోయాడంటూ ఏడవటం మొదలుపెట్టాడు. మిగిలిన వాళ్లూ అలాడే చేశారు. నది ఒడ్డున కూర్చొని ఏడుస్తున్న వీళ్లని చూచి, ఆ దారినే పోతున్న వాడొకడు ఎంతో సానుభూతితో సంగతేమిటని విచారించాడు. వాళ్లు విషయాన్ని చెప్పి, ఎన్ని సార్లు లెక్క పెట్టినా తొమ్మండుగురమే ఉన్నామని అతనితో అన్నారు. ఆ కథవిని, ఎదురుగా పదిమందీ కనబడుతూండటం చూసి ఆ కొత్త మనిషి జరిగిందేమిటో గ్రహించాడు. వాళ్లంతా నదిని దాటారని వాళ్లకి తెలిసి రావాలని, అతను వాళ్లతో, "నేను ఒక్కొక్కడికి ఒక దెబ్బ వేస్తూంటాను, మీరు మాత్రం ఎవరికి వారే వరుసగా లెక్క పెట్టుకోండి ఒకటి, రెండు, మూడు... అట్లా. దీని వల్ల అందరూ లెక్కలోకి వస్తారు. ఒక్కొక్కళ్లూ ఒక్కసారే లెక్కలోకి వస్తారు కూడా. అప్పుడు తప్పిపోయిన పదోవాడు దొరుకుతాడన్నాడు". ఇది విని “తప్పిపోయిన” తమ స్నేహితుడు దొరుకుతాడని సంబరపడుతూ ఆ బాటసారి చెప్పిన పద్ధతికి వాళ్లంతా ఒప్పుకున్నారు.

బాటసారి ఒక్కొక్కళ్లకి ఒక్కొక్క దెబ్బ వేస్తుంటే, ఆఖరి వాడు "పది" అన్నాడు దెబ్బ తగలగానే, వాళ్లు ఆశ్చర్యపోతూ ఒకరి ముఖాల్ని ఒకరు చూసుకున్నారు. 'మనం పదిమందీ ఉన్నామే' అని అందరూ ఒక్కసారిగా అన్నారు. వాళ్లు, తమ దుఖాన్ని పోగొట్టినందుకు బాటసారికి కృతజ్ఞత తెల్పుకున్నారు. అదీ కథ. పదవవాడిని ఎక్కడ్నుంచి తెచ్చారు? అసలు అతను తప్పిపోయాడా? తమతో బాటే ఉన్నాడని తెలుసుకొని వాళ్లు కొత్తగా ఏదైనా గ్రహించారా? వాళ్ల దుఖానికి కారణం ఎవడూ తప్పిపోవటం కాదు, వాళ్ల అజ్ఞానం. తమలో ఒకడు తప్పిపోయాడని వాళ్లు ఊహించు కోవటం!

నీ విషయమూ అంతే, నువ్వు విచారంతో, దుఖంతో ఉండాల్సిన కారణమేమీ లేనేలేదు. నీవు అనంతుడివి. కాని, నువ్వే పరిమితులను విధించుకుని, పరిమితుడనని ఏడుస్తున్నావు. ఎక్కడా లేని ఆ పరిమితులను దాటాలంటూ ఏ ఆధ్యాత్మిక సాధననో మొదలు పెడ్తావు. వాటిని దాటటానికి అవి ఎట్లా ఉపయోగ పడతాయి?

కాబట్టి, నువ్వు అనంతమైన శుద్ధ రూపానివి, ఆత్మవి అని తెలుసుకోముందు. నేను చెప్పేది ఇదే. నీకు ఆత్మ గురించి తెలియక పోవటమంటూ ఏమీ లేదు. నీ అజ్ఞానం కేవలం కల్పితమైన అజ్ఞానం. ఆ కథలో పది మంది మూర్ఖులకూ "తప్పిపోయిన" పదవ వాని గురించి ఉన్న అజ్ఞానం వంటిదే ఇదీను. ఆ అజ్ఞానమే వాళ్ల దుఖానికి కారణం.

సరియైన జ్ఞానం నీ కొక కొత్త జీవినివ్వదని తెలుసుకో - నీ అజ్ఞానన్ని మాత్రమే అది తొలగిస్తుంది. నీ తత్త్వానికి సంతోషాన్ని కొత్తగా చేర్చదు, నీ అసలు తత్త్వమదేనని తెలయజేస్తుంది. అదే నిత్యము, అదే అవ్యయమూ! నీ దుఖాన్ని వదిలించుకోవటానికి ఒకే ఒక మార్గం నీ ఆత్మని తెలుసుకోవటం, ఆత్మగానే ఉండటం!

ప్ర: శ్రీ భగవాన్ ఎన్నిసార్లు మాకు బోధించినా, మేము అర్థం చేసుకోలేకుండా ఉన్నాం.

జ: అంతటా వ్యాపించి ఉన్న ఆత్మని తెలుసుకోలేమంటారు మీరు. నేనేం చేయగలను? చిన్న పిల్ల కూడ "నేనున్నాను. నేనిది చేస్తాను. ఇది నాది' అంటూంటుంది. ఈ "నేను" అనేది ఎప్పుడూ ఉంటూనే ఉందని అందరికీ అర్థమవుతూనే ఉంది. ఆ "నేను" అనేది ఉన్నప్పుడే నీవు దేహానివన్న భావముంటుంది. వాడు వెంకన్న అనీ, వీడు రామన్న అనీ తెలుస్తుంది. ఎప్పుడూ కనబడేది ఆత్మేనని తెలుసుకోవటానికి వేరే దీపంతో వెతకాలా? ఆత్మస్వరూపం తెలియదనటం "నేనెవరో నాకు తెలియ" దనటం వంటిది. ఆత్మ స్వరూపం నీకన్నా వేరుకాదు, అదే నీలో ఉన్న ఆత్మ.

ప్ర: కాని ఆ స్థితిని అందుకోవటమెట్లా?

జ. చేరుకోవలసిన గమ్యమంటూ ఏమీ లేదు. సాధించవలసిందీ ఏమీ లేదు. నువ్వే ఆత్మవి. నువ్వెప్పుడూ ఉంటూనే ఉన్నావు. అది ఎప్పుడూ సంస్థితమయ్యే ఉంటుందని అనటం కన్నా. ఆత్మ గురించి వేరే చెప్పవలసిందేమీ లేదు. భగవత్సాక్షాత్కారమన్నా, ఆత్మ సాక్షాత్కారమన్నా వేరే ఏమీ కాదు. నువ్వు నీవుగా నీ ఆత్మగా, ఉండటమన మాట. నువ్వే ఆత్మవి, కాని ఆ ఆత్మని ఎట్లా అందుకోవాలని అడుగుతున్నావు. రమణాశ్రమంలో ఉంటూ, రమణాశ్రమాన్ని చేరుకోవటానికి మర్గాలేమిటి? వాటిలో అన్నిటి కన్నా మంచిదేమిటి అని అడిగినట్టే ఇదీను. నువ్వు చెయ్యవలసిందల్లా ఇదే - "ఈ శరీరమే నేను" అనే భావాన్ని, ఆత్మ కాని ఇతర బాహ్య విషయాల గురించి ఆలోచనలని, విడనాడటమే.

ప్ర: "నేను" అనే ఈ అహంకారమేమిటి? దానికీ ఆత్మకీ సంబంధమేమిటి?

జ: 'నేను' అనే ఈ అహంకారం వస్తూపోతూ ఉంటుంది. అది తాత్కాలికం. అసలైన ఆత్మ శాశ్వతం. నిజానికి, నువ్వు ఆత్మవే. కాని ఈ అహంకారాన్నే "నేన"ని తప్పుగా అర్థం చేసుకొని, దానితో తాదాత్మ్యం చెందుతావు.

ప్ర: ఈ తప్పు ఎట్లా సంభవిస్తుంది?

జ: అసలు ఆ తప్పు వచ్చిందేమో చూచుకో.

ప్ర: అంటే, నేను అనే అహంకారాన్ని ఆత్మలో విలీనం చేసుకోవాలన మాటా?

జ. ఈ అహంకారమసలు లేనే లేదు.

ప్ర: మరి, ఇంత బాధని కలిగిస్తుందెందు చేత?

జ: ఎవరికీ బాధ? ఆ బాధని కూడా నీవే ఊహించుకుంటున్నావు. సుఖమూ, దుఖమూ కూడా అహంకారానికే.

ప్ర: ప్రపంచమంతా, ఈ అజ్ఞానంలో ఎందుకు మునిగిపోయి ఉంది?

జ. నీ సంగతి నువ్వు చూసుకో, ప్రపంచం సంగతి ప్రపంచానికే వదిలిపెట్టు. నీ ఆత్మని తెలుసుకో, నువ్వు దేహాని వైనప్పుడే ప్రపంచమూ ఉంటుంది. నువ్వు ఆత్మవే అయినప్పుడు, ఉండేదల్లా ఆత్మే.

ప్ర: సరే, వ్యక్తికి అది వర్తిస్తుందేమో - కాని ఇతరుల మాటేమిటి?

జ: మొదట ఆ పని చేయి, తర్వాత ఆ ప్రశ్న ఉదయిస్తుందేమో చూడు.

ప్ర: అవిద్య ఉన్నదా?

జ. ఎవరికి?

ప్ర: నేను అనే అహంకారానికి,

జ: అవును అహంకారానికి ఉంది. అహంకారాన్ని తొలగిస్తే మిగిలేదల్లా ఆత్మే . అవిద్యకల ఆ అహంకారముండదు. వాస్తవంలో అవిద్య అంటూ ఏమీ లేదు. అవిద్య అంటూ ఏమీ లేదని నిరూపించటమే అన్ని శాస్త్రాల లక్ష్యమూను.

ప్ర: అహంకార మెట్లా ఉదయించింది?

జ: అహంకారమంటూ ఏమీ లేదు. అది ఉన్నట్లయితే రెండు "నేను" లున్నాయని ఒప్పుకోవాల్సి వస్తుంది. అహంకారం లేకుండా అవిద్య ఎట్లా ఉండగలదు? అసలు ఎక్కడా లేని అవిద్య గురించి నీవు ఆలోచిస్తే అది లేనట్టే తెలుస్తుంది. అది మాయమై పోయిందని నీవే అంటావు.

అవిద్య అహంకారానికి సంబంధించినది. ఆ అహంకారం గురించి తలచు కొంటూ ఎందుకు బాధ పడుతావు? ఇంతకూ, అవిద్య అంటే ఏమిటి? అవిద్య అంటే లేనిదన మాట. అయినా, ప్రాపంచిక జీవితం కోసం అవిద్య అంటూ ఒకటి ఉందని ప్రతిపాదించవలసి వస్తుంది. అవిద్య కేవలం మన అజ్ఞానమే తప్ప ఇంకేమీ కాదు. అంటే ఆత్మ గురించి మరపు - అజ్ఞాన మన మాట. సూర్యుడున్నప్పుడు చీకటి ఉండగలదా? అట్లాగే స్వయం ప్రకాశమైన ఆత్మ సమక్షంలో అవిద్య ఉండగలదా? నువ్వు ఆత్మవేనని తెలుసుకుంటే, ఇక అంధకారంగాని, అవిద్యగాని, శోకంగాని ఉండనే ఉండవు. దుఖాన్నీ, బాధనీ అనుభవిచేది మనస్సే. అంధకారం రానూరాదు - పోనూ పోదు. సూర్యుణ్ణి చూడు, అంధకారం లేనేలేదు. అట్లాగే, ఆత్మని గమనించు, అప్పుడు అవిద్య అంటూ ఏమీ లేదని తెలుస్తుంది.

ప్ర: అవాస్తవ మెట్లా వచ్చింది? సత్యంనుంచి అసత్యం ఉద్భవించగలదా?

జ: ఉద్భవించిందేమో గమనించు, ఇంకో కోణం నుంచి చూస్తే అసత్యమంటూ ఏమీ లేదు. ఉండేదల్లా ఆత్మ ఒక్కటే. ఈ ప్రపంచాన్నీ, మిగిలిన వాటినీ నీవు గ్రహించటానికి మూలకారణం. అహంకారం. దాని మూలమేదో కనుక్కోవటానికి ప్రయత్నిస్తే అది లేదనీ, నువ్వు చూసే ఈ సృష్టి కూడ లేదనీ తెలుస్తుంది.

ప్ర: ఆత్మ గురించి తెలుసుకోవట మంత కష్ట తరమవటం భగవంతుని కఠినమైన లీలేనా?

జ: ఆత్మజ్ఞానమంటే ఆత్మగా ఉండటమే. ఆత్మగా ఉనికే. అంటే నీ ఉనికే. ఎవ్వరూ తన ఉనికిని కాదనలేరు కదా. కళ్లని స్వయంగా చూచుకో లేకపోయినా, తనకి కళ్లు లేవని ఎవ్వరూ అనలేరు కదా. అద్దం ముందు నిలబడి నీ కళ్లని వేరుగా చూస్తావు - అట్లాగే, ఆత్మకూడా వేరే దానిగా భావించాలను కుంటావు. ఉన్నచిక్కంతా ఇదే. ఎప్పుడూ ఈ వేరే విధంగా భావించుకోవటానికి అల వాటు పడిపోవటం వల్లే నీ గురించిన జ్ఞానాన్ని పోగొట్టు కున్నావు. ఆత్మని అట్లా భేదభావంతో ఊహించలేం. ఆత్మని తెలుసుకోవలసిందెవరు? జడ పదార్థమైన శరీరం తెలుసుకో గలదా? ఎప్పుడూ నీ గురించి చెప్పుకుంటావు, ఆలోచిస్తావు. కాని ప్రశ్నించినప్పుడు ఆ "నేను" ఎవరో తెలియదంటావు. నువ్వే ఆత్మవి. అయినా, ఆత్మని తెలుసుకోవటమెట్లా అని అడుగుతావు. ఇందులో భగవంతుని లీలగాని, దానిలో కాఠిన్యంగాని ఎక్కడ నుంచి వచ్చాయి? ఈ ఆత్మని మనుష్యులు గుర్తుంచక పోవటం వల్లనే శాస్త్రాలు మాయగురించీ, లీల గురించీ చెప్తాయి.

ప్ర: నా ఆత్మజ్ఞానం ఇతరులకి సహాయపడుతుందా?

జ: తప్పకుండాను. అన్నిటికన్నా గొప్ప సహాయమదే అవుతుంది. అయినా, సహాయం చేయటానికి ఇతరులంటూ ఎవరైనా ఉంటేగా, ఆత్మసాక్షాత్కారం పొందిన వ్యక్తి ఆత్మని తప్ప దేనినీ చూడడు. రకరకాల నగలలో ఉన్న బంగారమెంత అని అంచనావేసే కంసాలి, వాటిలోని బంగారాన్ని తప్పదేనినీ పట్టించుకోనట్టే ఇదీను. నువ్వు శరీరంతో తాదాత్మ్యం చెందినప్పుడే ఇతర నామరూపాలుంటాయి. కాని దేహానికి అతీతమైన తరువాత అవి కూడ, దేహమంటే నీకు గల స్పృహ వలె, మాయమవుతాయి.

ప్ర: చెట్లూ, చేమలూ విషయంలో కూడ అంతేనా?

జ: ఆత్మకి భిన్నంగా ఉన్నాయా అని అసలు? కనుక్కో. నువ్వు వాటిని చూస్తున్నానను కుంటావు. ఆ భావం ఆత్మ నుంచి లేస్తుంది. అదెక్కడ నుంచి లేస్తుందో కనుక్కో ఆలోచనలు ఇంక ఉదయించవు. మిగిలేదల్లా ఆత్మే.

ప్ర: మీరు చెప్పేదాన్ని మేధతో గ్రహించ గలుగుతున్నాను. కాని అవి అట్లాగే ఉన్నాయి.

జ: నిజమే, అది సినిమా వంటిది. తెరమీద కాంతి పడుతోంది దాని మీద నీడలు అటూఇటూ పరుగెత్తుతూంటే చూచే వారికి ఏదో నాటకమాడుతున్నట్లుంటుంది. ఆ నాటకంలోనే ప్రేక్షకులని కూడ తెరమీద నాటకమాడే వారిలో భాగంగా చూపిస్తే, చూచేవాళ్లూ, చూడబడేదీ తెరమీదే ఉంటాయి. నీకు దీనిని వర్తించుకో, నువ్వు తెరవి. ఆత్మ అహంకారాన్ని సృష్టించింది. అహంకారానికి గల భావాలు ప్రపంచంలాగ ప్రదర్శింపబడుతాయి- నువ్వు చెప్పిన చెట్లూ చేమలూ వీటిలోనివే. ఇవన్నీ ఆత్మ తప్ప వేరేమీ కావు. నువ్వు ఆత్మని చూస్తే - అన్నీ, ప్రతిచోటా, ఎప్పుడూ అదే నని తెలుస్తుంది. ఆత్మకి తప్ప వేరేదేనికీ ఉనికి లేదు.

ప్ర: అవును. కాని నాకింకా బుద్ధితోనే అర్థమవుతోంది. మీ జవాబులు ఎంతో సాదాగా అందంగా, ఒప్పించేవిగా ఉన్నాయి.

జ: "నేను సాక్షాత్కారం చెందలేదు" అనే భావంకూడా ఒక ప్రతిబంధమే, ఉన్నదల్లా ఆత్మ ఒక్కటే. మన సహజస్థితే ముక్తి, స్వేచ్ఛ మనకెప్పుడూ ఉంది. కాని మనం బంధితుల మని ఊహించుకొని, ఆ బంధాన్నుంచి విముక్తి చెందటానికి విశ్వప్రయత్నం చేస్తూంటాం. ఆ స్థితి చేరుకున్న తరువాతనే ఇది అర్థమవుతుంది. ఎప్పుడూ ఉంటున్న స్థితినే చేరుకోవటానికి అంత అవస్థ ఎందుకు పడ్డామా అని మనకే ఆశ్చర్యం కలుగుతుంది. ఈ విషయం స్పష్టమవటానికి ఒక ఉదాహరణ చెప్తాను. ఈ గదిలో ఒకడు నిద్రపోతాడు. తాను ప్రపంచయాత్ర చేస్తున్నట్లు కలవస్తుంది అతనికి - కొండలూ, కోనలూ, అడవులూ, గ్రామాలూ, ఎడారులూ, సముద్రాలూ, ఖండాలూదాటి ఎన్నో సంవత్సరాలు కష్టపడి ప్రయాణం చేసి తిరిగి ఈ దేశానికి వస్తాడు. తిరువణ్ణామలై చేరి ఈ ఆశ్రమంలో అడుగుపెట్టి, ఈ గదిలో ప్రవేశిస్తాడు. ఆ క్షణాన అతనికి మెలకువ వచ్చి చూసుకుంటే, తానెక్కడికీ వెళ్లలేదనీ, ఒక్క అంగుళం కూడా కదలకుండా అక్కడే పడుకొని ఉన్నాననీ గ్రహిస్తాడు. ఇదీ సరిగ్గా అటువంటిదే. "స్వేచ్ఛాయుతంగా ఉన్నా, బంధితుల మనే భావం మనకెందుకుంటుంది"? అని అడిగితే, నేను ఇచ్చే సమాధానమిది: "ఈ గదిలో పడుకొని ఉండగా ప్రపంచయాత్ర చేసినట్టు, కొండలూ, లోయలూ, అడవులూ, సముద్రాలూ దాటినట్టు ఎందుకూహించుకొన్నాడు? ఇదంతా మనస్సే, మాయే" అని

ప్ర: ఆత్మసాక్షాత్కారం కాని వానికి ఉన్న ఒకేఒక సత్యం గురించి, అజ్ఞానమెట్లా కలుగుతుంది?

జ. అజ్ఞాని మనస్సునే చూస్తాడు. అది ఆత్మనుంచి ఉదయించే శుద్ధ చైతన్యానికి ప్రతిబింబం మాత్రమే. ఆత్మ గురించి అతనికి తెలియదు. ఎందుచేత? అతని మనస్సెప్పుడూ బయటకే పరుగెత్తుతూండటం వల్ల, తన మూలాన్ని తెలుసుకోకపోవటం వల్ల.

ప్ర: ఆత్మనుంచి ఉద్భవించే అనంతమూ, అవిభక్తమూ అయిన శుద్ధ చైతన్యపు జ్యోతి అజ్ఞానికి ఎందుకు సాక్షాత్కరించపదు?

జ: కుండలోని నీరు ఎంతో పెద్దదైన సూర్యుణ్ణి ఆ కుండ పరిధులలోనే ప్రతి బింబిస్తుంది. అట్లాగే, హృదయం నుంచి వచ్చే విశ్వవ్యాప్తమూ, అనంతమూనైన ఆ చైతన్యపు కాంతిని మనిషి మనస్సులోని వాసనలు ప్రతిబింబించటానికి ఒక మాధ్యమ మవుతాయి. ఈ ప్రతిబింబం యొక్క రూపాన్నే మనస్సంటారు. ఆ ప్రతిబింబాన్నే చూచి అజ్ఞాని తాను పరిమితుడననీ, జీవుడ్ననీ, వ్యక్తిననీ భ్రమపడుతాడు.

ప్ర: ఆత్మసాక్షాత్కారాన్ని పొందటానికి ఆటంకాలు ఏమిటి?

జ. మనస్సు యొక్క వాసనలు.

ప్ర: ఈ వాసనలని తప్పించుకోవటమెట్లా?

జ: ఆత్మని తెలుసుకోవటం వల్ల.

ప్ర: ఇదొక విషవలయం లాగ ఉంది?

జ: ఇట్లాంటి సమస్యలని సృష్టించేది అహంకారమే- అదే అవరోధాలనీ, ఈ పరస్పర వైరుధ్యాలనీ చిక్కులనీ తెచ్చి పెట్టుతుంది. ఈ ప్రశ్నలని లేవనెత్తే దెవరో కనుక్కో - అప్పుడు ఆత్మ తెలుస్తుంది.

ప్ర: ఈ మానసిక బంధం అట్లా విడవకుండా పట్టుకుంటుందెందుకు?

"నేను సత్యాని కన్నా వేరు" అనే దురాలోచన లేపటమే ఈ బంధం యొక్క స్వరూపం. సత్యానికి భిన్నంగా ఎవ్వరూ ఉండలేరు కాబట్టి, ఈ ఆలోచన తల ఎత్తినప్పుడల్లా దీనిని తిరస్కరించు.

ప్ర: నేను ఆత్మనని నా కెల్లవేళలా గుర్తుండదు ఎందు చేత?

జ: ఆత్మ యొక్క పరిపూర్ణత్వాన్ని జ్ఞాపకముంచుకోవటమూ, మరచిపోవటమూ గురించి అందరూ మాట్లాడుతారు. జ్ఞాపక ముంచుకోవటమూ, లేకపోవటమూ - భావాలకి సంబంధించినవే. ఆలోచన ఉన్నంత కాలమూ అవి అట్లా మారుతూ ఉంటాయి. కాని సత్యం వీటికతీతమైనది. జ్ఞాపకముండటం, లేకపోవటం దేనిమీదనైనా ఆధారపడే ఉంటాయి. అది ఆత్మకి భిన్నమవాలి లేకపోతే జ్ఞాపకముండక పోవటమంటూ సంభవించదు. ఈ జ్ఞాపకముండటమూ, లేక పోవటమూ వ్యక్తిగత అహంకారం మీద ఆధారపడి ఉంటాయి. దీని కోసం వెతకటం ప్రారంభిస్తే అది దొరకదు అది వాస్తవం కాదు కాబట్టి, ఈ వ్యక్తి గతమైన "నేను" అనేదే మాయ, అవిద్య, అజ్ఞానమూను. ఇటువంటి అజ్ఞానం లేదని తెలుసుకోవటమే అన్ని ఆధ్యాత్మిక బోధనల ప్రయోజనమూను. ఎరుక గురించి తెలియక పోవటమే అజ్ఞానమంటే. ఎరుకే జ్ఞానమంటే. అది శాశ్వతము, సహజము. అజ్ఞానం అసహజం, అసత్యం.

ప్ర: ఈ సత్యాన్ని విన్న తరువాత కూడ మనిషి సంతృప్తితో ఊరుకోడెందుకని?

జ: సంస్కారాలు మాసిపోలేదు కాబట్టి. ఆ సంస్కారాలు పూర్తిగా పోయేవరకూ సందేహాలు, గందరగోళమూ ఉంటూనే ఉంటాయి. కృషి అంతా ఈ సందేహాలనీ, గందరగోళాన్ని నాశనం చేసుకోవటానికే. అది జరగాలంటే వాటి మూలాన్నే పెకలించివేయాలి. ఆ వేళ్లు, సంస్కారాలు. గురు ఉపదేశాన్ని అనుసరించి చేసే అభ్యాసం వల్ల అవిపోతాయి. గురువు, మార్గాన్ని చూపి విడిచిపెడ్తాడు. అజ్ఞానమంటూ ఏమీ లేదని సాధకుడే గ్రహించటానికి వీలుగా, సత్యం గురించి వినటం మొదటి మెట్టు. అవగాహన దృఢం కాకపోతే దీని గురించి మననం చేసుకోవాలి. నిదిధ్యాసమూ చేసుకోవాలి. ఈ రెండూ సంస్కారాల బీజాలని మాడ్చి వేసి, అవి ఎందుకూ పనికి రాకుండా చేస్తాయి.

సత్యం గురించి ఒక్కసారి వినగానే జ్ఞానోదయమవుతుంది అసా మాన్యులైన కొందరికి. వీళ్లు ఎంతో సాధన చేసిన వారన మాట. సాధనలో ఇంకా ప్రారంభదశలోనే ఉన్నవారికి ఇంకా ఎక్కువ కాలం పట్టుతుంది.

ప్ర: అసలు అవిద్య ఎట్లా ఉదయించింది?

జ. అవిద్య ఉదయించనేలేదు. దానికి నిజమైన అస్తిత్వం లేనేలేదు. ఉన్నదల్లా జ్ఞానమే.

ప్ర: అయితే నాకెందుకు గ్రహింపు కలుగదు?

జ. సంస్కారాల వల్ల. అయినా, గ్రహింపు కాని వాడెవడో, గ్రహింపుకాని దేమిటో అన్వేషించు. అప్పుడు తెలుస్తుంది. అవిద్య అంటూ ఏమీ లేదని.

ప్ర: అంటే, ఒక గమ్యాన్ని పెట్టుకొని మొదలుపెట్టటం తప్పనమాట.

జ: చేరుకోవలసిన గమ్యమంటూ ఒకటి ఉంటే, అది శాశ్వతం కానేరదు. గమ్యమనేది ఉండే ఉండాలి. మనం గమ్యాన్ని అహంకారంతో చేరబోతాం. కాని అహంకారం కంటె ముందే గమ్యముంది! గమ్యంలో ఉన్నదేదో మన పుట్టుక కన్నా ముందే ఉంది. అంటే, మన అహంకారం కంటే ముందేనన మాట. మనమున్నాం కాబట్టే అహంకారం కూడ ఉన్నట్లనిపిస్తుంది.

ఆత్మనే అహంకారంగా మనం భావిస్తే, అహంకారమే అవుతాం. మనస్సుగా భావిస్తే మనస్సవుతాం. దేహంగా భావిస్తే దేహమవుతాం. భావమే ఇన్ని రకాల పొరలనూ ఏర్పరుస్తుంది. నీటిపైని నీడ కదులుతున్నట్లనిపిస్తుంది. ఆ నీడని కదలకుండా ఎవరైనా చేయగలరా? అది కదలకుండా ఉంటే, నీకు కనబడేది నీరుకాదు, కాంతి మాత్రమే. అట్లాగే అహంకారాన్ని, అది చేసే పనులనీ లెక్క పెట్టకు, దాని వెనుకనున్న కాంతినే గమనించు. అహంకారమంటే, "నేను" అనే భావమే, నిజమైన "నేను" ఆత్మే!

ప్ర: కేవలం భావాలని విడిచిపెట్టటం మాత్రమే అయితే, అది సాక్షాత్కారానికి ఒక్క మెట్టు మాత్రమే కాదా?

జ: సాక్షాత్కారం ఎప్పుడూ ఉండనే ఉంది. ఏ భావమూ లేని స్థితే నిజమైన స్థితి. సాక్షాత్కారం పొందట మంటూ ఏ కార్యమూ లేదు. ఆత్మని గ్రహింపని వారెవరైనా ఉంటారా అసలు? తన ఉనికిని ఎవరైనా కాదంటారా? సాక్షాత్కారం గురించి మాట్లాడామంటే - రెండు "నేను" లున్నాయిని భావిస్తున్నామన మాట. ఒకటి గ్రహించేది - రెండవది గ్రహింపబడేది. అంటే, సాక్షాత్కరింపబడని దానిని సాక్షాత్కరింప చేసుకోవాలని ప్రయత్నిస్తున్నామన మాట. మనమంటూ ఉన్నామని ఒప్పుకున్నాక ఆత్మ గురించి తెలియక పోవటమేమిటి?

ప్ర: భావాల వల్ల, మనస్సు వల్ల...

జ. అదే అసలు సంగతి. మన ఆనందాన్ని మరుగుపరచేది మనస్సే. మనమంటూ ఉన్నట్టు మనకెట్లా తెలుస్తుంది? "చుట్టూ ఉన్న ప్రపంచం వల్ల" అని అన్నావనుకో, "అయితే, గాఢ నిద్రలో నువ్వున్నట్టు, ఎట్లా తెలుసు నీకు?"

ప్ర: మనస్సుని వదిలించు కోవటమెట్లా?

జ: తనని తాను చంపుకోవాలని కోరేది మనస్సా? తనని తాను నాశనం చేసుకోలేదు మనస్సు. కాబట్టి నువ్వు చేయవలసిందేమిటి? ఈ మనస్సు యొక్క నిజస్వరూపం తెలుసుకోవటం. ఆత్మని అన్వేషిస్తే మనస్సు మాయమవుతుంది. ఆత్మలో సంస్థితమైనప్పుడు, మనస్సు గురించి పట్టించుకో నక్కరలేదు.

ప్ర: ముక్తీ, సాక్షాత్కారమూ ఒక్కటేనా?

జ: ముక్తిమనసహజలక్షణం. మనకి అది మారు పేరు. ముక్తి కావాలని మనమను కోవటం, హాస్యాస్పదం. చెట్టు నీడలో ఉన్న మనిషి కావాలని నీడనుంచి బయటకి వచ్చి, ఎండ వేడిని అనుభవించి, విశ్వ ప్రయత్నం చేసి మళ్ళీ నీడలోకి రాగానే సంతోషంతో, "అమ్మయ్య, ఇప్పటికైనా నీడని చేరుకున్నానను." అన్నట్టే ఇదీను. మనమంతా ఇదే చేస్తున్నాం సరిగ్గా. సత్యానికీ, మనకీ భేదముందని ఊహించుకొని, ఆ భేద భావాన్ని కల్పించుకుంటాం. ఆ తరువాత ఎంతో సాధన చేస్తాం ఆ భేదభావాన్ని వదిలించుకోవటానికి. ఆ సత్యంతో ఏకమవటానికీను. ఈ భేదభావాన్ని కల్పించుకోవట మెందుకూ. దానిని నాశనం చేసుకోవట మెందుకూ?

ప్ర: ఈ జ్ఞానం గురుకృప వల్లనే సాధ్యం, ఆనందం గురువుయొక్క పాదధూళి వల్లనే సంభవమని శ్రీ మద్భాగవతంలో చదివాను. నేను ఆ అనుగ్రహాన్ని అర్థిస్తున్నాను.

జ: నీ అంతరాత్మ కంటే వేరే ఆనందమేమిటి? నువ్వు నీ అంతరాత్మకన్నా వేరేమీ కాదు - అదే ఆనంద కూడాను. "నేను మనస్సునో, దేహాన్నో" అనుకుంటున్నావు ఇప్పుడు. ఆ రెండూ మారుతూ ఉంటాయి. అవి అనిత్యం కూడాను. కాని మార్పులేని, నిత్యానివి నీవు. నువ్వు తెలుసుకోవలసిందదే.

ప్ర: అంతా అంధకారం, నేను అజ్ఞానిని!

జ: ఆ అజ్ఞానం పోవాల. అంతేకాదు, "నేను అజ్ఞానిని" అని అనేదెవరు? ఆ అజ్ఞానానికి సాక్షి అయిఉంటాడు. నువ్వు అదే. "నాకు తెలియదని నాకు తెలుసు" నన్నాడు సొక్రెటీస్. అది అజ్ఞానమెట్లా అవుతుంది? అది జ్ఞానం.

ప్ర: అయితే, నేను వెల్లూరులో ఉన్నప్పుడు సంతోషం లేకుండానూ, మీ సమక్షంలో సంతోషంగానూ ఉంటాను. ఎందువల్ల?

జ: ఈ ప్రదేశంలో ఉండేది ఆనందమా? ఇక్కడ నుంచి వెళ్ళినప్పుడు సంతోషం లేదంటావు. అంటే, ఈ ప్రశాంతత శాశ్వతం కాదన మాట. అసంతుష్టితో కలసి ఉంటుందనమాట. ఆ అసంతుష్టి వేరొకచోట కనబడుతుందనమాట. ఆనందం కొన్ని ప్రదేశాలలో, కొన్ని వేళలలో మాత్రమే అనుభవించలేవు. నీకేమైనా ఉపయోగించాలంటే, అది నిత్యమూ ఉండాలి. నిత్యమూ ఉండేది, నీ ఆత్మే నువ్వు ఆత్మగానే ఉండు. అదే ఆనందం. నువ్వ ఎప్పుడూ అదే!

ఆత్మ ఎప్పుడూ విదితమే. సువిదితమైన దానిని వెతకనవసరంలేదు. నీ ఉనికిని కాదనలేవు కదా. ఆ ఉనికే చైతన్యం. అదే ఆత్మ. నువ్వంటూ లేకపోతే, ఈ ప్రశ్నలని వేయలేవు. కాబట్టి నువ్వున్నట్టు ఒప్పుకోవాలి. ఆ ఉనికే ఆత్మ. అది ఎప్పుడూ సాక్షాత్కారమే. సాక్షాత్కారం పొందటానికి చేసే ప్రయత్నం - నువ్వు ఇప్పుడు చేస్తున్న పొరపాటుని గ్రహించటానికి ఉపయోగపడుతుంది. "నేను నా ఆత్మను గ్రహించలేదు" అనే భావమే ఆ పొరపాటు. కొత్తగా సాక్షాత్కారం పొందవలసిందేమీ లేదు. ఆత్మే వెల్లడి అవుతుంది.

ప్ర: అది కొన్ని సంవత్సరాలు పట్టుతుందేమో!

జ: సంవత్సరాలెందుకు? "కాలం" గురించిన భావం నీ మనస్సులోనే ఉంది. అది ఆత్మలో లేదు. ఆత్మకి కాలమంటూ ఏమీ లేదు. అహంకారముదయించిన తరువాతే, కాలమనే భావం వస్తుంది. కాని కాలానికీ, దేశానికీ అతీతమైన ఆత్మవినీవు. ఈ రెండూ లేక పోయినా, నువ్వున్నావు.

తర్వాతెప్పుడో సాక్షాత్కారం పొందటమన్నదే నిజమైతే, ఇప్పుడు నీకు సాక్షాత్కారం లేదనమాటే. సాక్షాత్కారం ఇప్పుడు లేనట్టే భావిలో కూడా ఏ క్షణాన్నైనా సంభవించవచ్చు కదా! కాలానికి అంతులేకపోవటం వల్ల. అటువంటి సాక్షాత్కారం అనిత్యం. అసత్యం కూడాను. సాక్షాత్కారం అనిత్యమనుకోవటం తప్పు. అది నిత్యసత్యమైన స్థితి. దానికి మార్పంటూ ఏమీ లేదు.

ప్ర: కాలక్రమేణా నాకిది అర్థమవుతుందేమో!

జ: ఇప్పుడు నువ్వు అందులోనే ఉన్నావు. కాలం, దేశం ఆత్మని ఏ విధంగానూ ప్రభావితం చెయ్యవు. అట్లాగే నీ చుట్టూ నువ్వు చూచేవన్నీ నీలోనే ఉన్నాయి. ఈ విషయాన్ని స్పష్టం చేయటానికి ఒక కథ ఉంది. చెప్తావిను. ఒకామె మెడకి చాలా ఖరీదైన హారముంది. తన మెడకి ఉన్న హారాన్ని మరచిపోయి, ఆవిడ అది పోయిందనుకుంది. ఎంతో ఆందోళనతో ఇల్లంతా ఆ హారం కోసం వెతికింది. ఎక్కడా కనబడలేదు. పొరుగువారినీ, స్నేహితులనీ కూడా అడిగింది. ఎవరికి వారు తమకి తెలియదనేశారు. చివరికి ఒక స్నేహితుడు ఆమెతో, మెడని తడుముకు చూసుకుంటే హారమక్కడే ఉన్నట్టు తెలుస్తుందని చెప్పాడు. ఆ విధంగా, ఆమె హారం తన మెడలోనే ఉన్నట్టు తెలుసుకొని, ఎంతో సంతోషించింది. తర్వాత ఆమె నెవరో అడిగారు, హారం దొరికిందా అని. "దొరికింది" అని చెప్పి, పోగొట్టుకున్న నగని తిరిగి పొందినట్టే ఆమె ఇంకా భావించుకుంది. అసలు ఆమె నగని పోగొట్టుకుందా? ఆ నగ ఆమె మెడకే ఎప్పుడూ ఉంది. కాని ఆమె భావాలు

గమనించు పోగొట్టుకున్న నగ మళ్లీ దొరికినట్టే ఆమె ఇంకా సంతోషిస్తోంది. మన విషయమూ అంతే - ఆత్మ నెప్పుడో సాక్షాత్కారించు కుంటామని ఊహించుకుంటాం. కాని నిజానికి మనం ఆత్మ తప్ప మరేమీ కాదు!

ప్ర: ఆ స్థితిని చేరుకోవటానికి నేను చేయదగిన దేదో ఉండాలి.

జ: ఏదో గమ్యముంది, దానిని చేరటానికి ఒక మార్గముంది అనే భావమే తప్పు. ఆ గమ్యం, ఆ ప్రశాంతత - ఎప్పుడూ మనమే. చేయవలసిందల్లా, ఆ ప్రశాంతత మనం కాదన్నవాన్ని వదిలించుకోవటమే.

ప్ర. దానికి, గురువు మార్గదర్శకత్వం కావాలని అన్ని గ్రంథాలూ చెప్తాయి.

జ. నేను ఇప్పుడు చెప్పినదానినే గురువు చెప్తాడు. నీకు లేనిదానిని ఏమీ అతడు ఇవ్వడు. తనకి లేనిదానిని సంపాదించటం ఎవ్వరికీ సాధ్యంకాదు. ఒక వేళ సంపాదించినా, అది వచ్చిన దారినే పోతుంది - వచ్చిందేదో వెళ్లాలికదా! ఒక్కటే సదా సంస్థితమై ఉంటుంది. నీకు లేని దానిని కొత్తగా గురువు ఇవ్వలేడు. అవసరమైన దల్లా, ఆత్మ సాక్షాత్కారం కాలేదన్న భావాన్ని తొలగించుకోవటమే. మన మెప్పుడూ, ఆత్మే. ఎటొచ్చీ, మన మా విషయాన్ని గ్రహించం.

"ఆత్మ ఎక్కడుంది" అని వెతుక్కుంటూ తిరుగుతాం. జ్ఞాన దృష్టి వచ్చే వరకూ అట్లాగే తిరుగుతాం. అప్పుడు, "ఈ ఆత్మ నాలోనే ఉందంటాం. మనమా దృష్టిని అందుకోవాలి. ఆ తరువాత ఏ బంధాలూ ఉండవు - ప్రపంచంలో తిరుగుతూ, అందిరిలోనూ కలిసిపోయినా సరే! కాళ్లకి చెప్పులు వేసుకున్న తరువాత రాళ్లమీదా, ముళ్లమీదా నడిచినా ఏ బాధ ఉండదు. ఏ భయమూ, చింతాలేకుండా కొండలు అడ్డువచ్చినా నడచిపోతావు. అట్లాగే, జ్ఞానదృష్టి కలిగిన వారికి అన్నీ సహజంగా కనబడుతాయి. ఆత్మకి భిన్నంగా ఏముందసలు?

ప్ర: ప్రాపంచిక దృష్టి అణగిపోయిన తరువాతే ఆ సహజస్థితి రావచ్చు. ఇది అణగి పోయే దెట్లా?

జ. మనస్సు అణగితే, ప్రపంచమూ అణగిపోతుంది. అంతటికీ మూలకారణం మనస్సే. అది అణగితే, సహజస్థితి ప్రకటితమవుతుంది. ఆత్మ ఎప్పుడూ "అహం, అహం" అంటూనే ఉంటుంది. అది స్వయం ప్రకాశం. అది ఇక్కడే ఉంది. ఇదంతా అదే. మనం దానిలోనే ఉన్నాం. అందులోనే ఉంటూ దానికోసం వెతకటం దేనికి? "దృష్టిని జ్ఞానంలో నిమగ్నం చేస్తే, ప్రపంచమంతా బ్రహ్మంగా గోచరిస్తుందని" మన పూర్వీకులు ఎప్పుడో చెప్పారు!

## 3.జ్ఞాని

ఆత్మసాక్షాత్కార స్థితిని గురించీ, జ్ఞాని యొక్క స్వీయానుభవం గురించీ, అతని ప్రాపంచిక అనుభవం గురించీ తెలుసుకోవాలని తీరని ఉత్సుకత శ్రీ రమణుని దర్శించిన వారికుండేది. ఈ స్థితి గురించి సాధారణంగా ఉండే విచిత్రమైన అపోహల ను ఆ ప్రశ్నలు వెల్లడి చేసేవి. అధికభాగం ప్రశ్నలు ఈ క్రింది అంశాల చుట్టూ తిరిగేవి.

1. వ్యక్తిగతమైన చైతన్యం గురించి ఎరుక లేకుండా జ్ఞాని ఎట్లా మసలగలడు?

2. (శ్రీ రమణులు తరచూ అన్నట్టుగా) జ్ఞాని తానేమీ చేయనని ఎట్లా అనగలడు? ఒక వంక ఆయన కలాపాలను ఇతరులు చూస్తున్నప్పుడు?

3. ప్రపంచాన్ని జ్ఞాని చూస్తాడా? ఎట్లా చూస్తాడు?

4. శుద్ధ చైతన్యపు ఎరుక గల జ్ఞాని - జాగృత - స్వప్న - సుషుప్తి, అవస్థలలో కలిగే పి శారీరక మానసిక చైతన్యపు మార్పులకి ఎట్లా ప్రతిస్పందిస్తాడు?

ఈ ప్రశ్నలన్నిటి వెనుకా ఒక అపోహ ఉండేది. అది ఆత్మ అనే స్థితిని అనుభవించే వ్యక్తి (అంటే, జ్ఞాని) అంటూ ఎవరో ఉన్నారని. ఈ భావం సరియైనది కాదు. జ్ఞాని యొక్క అనుభూతిని అర్థం చేసుకోవటానికి అజ్ఞానులు కల్పించిన భావమే ఇది.

జ్ఞాని అంటే జ్ఞానం (సత్యం) ఎరిగిన వాని అర్థం. ఈ పదాన్ని వాడటం కూడ ఒక తప్పు అవగాహనని సూచిస్తుంది. ప్రపంచంలోని వారందరూ సత్యాన్ని అన్వేషిస్తున్నారనో, సత్యాన్ని ఎరిగిన వారనో - అజ్ఞాని ఊహించుకుంటాడు. కాని ఆత్మ గురించిన యదార్థమేమంటే, జ్ఞానులూ లేరు అజ్ఞానులూ లేరు. ఉన్నదల్లా జ్ఞానమే.

శ్రీ రమణులు ఈ విషయాన్ని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ అనేక సార్లు చెప్పేవారు. కాని ఈ మాటల అంతరార్థమేమిటో ఆయన పృచ్ఛకులలో కొంతమందికే అవగాహన అయేది. అందువల్ల, శ్రీ రమణులు శ్రోతల అపోహల కనుగుణంగా తమ మాటలను మలచేవారు. తమ శ్రోతల దృష్టిలో జ్ఞానీ, అజ్ఞానీ, వేరు వేరు అనే భావమున్నదని గుర్తుంచుకొనేవారు. ఈ భావాన్ని ఖండించకుండా, తాను జ్ఞానిననే పాత్రని ధరిస్తూ, ఆ స్థితిలో ఉండటమంటే ఏమిటో వాళ్లకి చెప్పేవారు. ఈ అధ్యాయంలోని సంభాషణలు అటువంటివి.

ప్ర: అయితే, బద్ధుడికీ విముక్తుడికీ, తేడా ఏమిటి?

జ: తాను హృదయంలో ఉన్నానని మరచిపోయి, సామాన్యుడు తన బుద్ధితోనే జీవిస్తాడు.

జ్ఞానసిద్ధుడు, అంటే జ్ఞాని, హృదయంలో ఉంటాడు. తాను తిరుగుతూ, అందరితోనూ అన్నిటితోనూ సంపర్కం పెట్టుకున్నా కూడా, తాను చూచేది తాను గ్రహించిన హృదయం కన్నా ఆత్మ కన్నా. భిన్నంకాని బ్రహ్మమే అని ఎరిగి ఉంటాడు.

ప్ర: సామాన్యుని మాటేమిటి?

జ. ఇప్పుడే చెప్పాను కదా - అతను అన్నీ తనకి బయట ఉన్నట్టు చూస్తాడు. అతను ప్రపంచం నుంచి వేరు. అతను తనలోని సత్యానికి దూరం. తనకీ లోకానికీ ఆధారమైన సత్యానికి దూరం. తన ఉనికి యొక్క పరమసత్యాన్ని సాక్షాత్కరింప చేసుకున్నవాడు, తన వెనుకా, ప్రపంచం వెనుకా ఒకే ఒక సత్యముందని గ్రహిస్తాడు. అన్నీ పైకి అనిత్యమైనా, మార్పులు చెందుతున్నా ఒకే ఒక ఆత్మ వాటన్నిటి వెనుకా శాశ్వతంగా, మార్పు చెందకుండా అన్నింటిలో, అందరిలో ఉన్నదనే ఎరుక కలిగి ఉంటాడు.

ప్ర: జ్ఞానికి అనుభవసిద్ధమైన శుద్ధచైతన్యానికీ, "నేను" అనే ప్రాధమిక అనుభవానికి తేడా ఏమిటి?

జ. శుద్ధ చైతన్యమే హృదయం - నిజానికి నువ్వు అదే. ఆ హృదయం నుంచే “నేను” అనే ప్రాధమిక అనుభవం ఉదయిస్తుంది. దాని స్వరూపం, శుద్ధసత్త్వం రజస్సు, తమస్సు అంటని ఆ శద్ధసత్త్వ స్వరూపంలోనే, ఉంటుంది జ్ఞానికి "నేను" అనేది.

ప్ర: అంటే జ్ఞానిలో అహంకారం శుద్ధరూపంలో ఉండటం వల్ల వాస్తవంగా తోస్తుంది. అంతేనా?

జ: ఏ రూపంలో ఉన్నా. జ్ఞానిలో ఉన్నా. అజ్ఞానిలో ఉన్నా, అహంకారమే ఒక అనుభవం. జాగ్రదవస్థా. ఈ ప్రపంచమూ వాస్తవమని అజ్ఞాని భ్రమ పడుతాడు. అందువల్ల అహంకారమే సత్యమనిపిస్తుందతనికి. జ్ఞాని మామూలు మనిషివలె వ్యవహరించటం చూసి జ్ఞానికి కూడ వ్యక్తిత్వాన్ని ఆపాదించాలనుకుంటాడు.

ప్ర: అయితే జ్ఞానిలో "అహంవృత్తి" ("నేను' అనే వ్యక్తిత్వ భావం) ఎట్లా పని చేస్తుంది?

జ. అది అతనిలో పనిచేయనే చేయదు. జ్ఞాని నిజతత్త్వం హృదయమే. అతను రూపరహితమైన శుద్ధ చైతన్యమే. దీనినే ఉపనిషత్తులు ప్రజ్ఞాన మంటాయి. ప్రజ్ఞాన మంటే బ్రహ్మమే. కేవలమదే. ప్రజ్ఞానం కాక వేరే బ్రహ్మం లేదు.

ప్ర: జ్ఞానికి సంకల్పాలుంటాయా?

జ: సామాన్యునికి ప్రధానంగా ఉండేవి తమస్సు- రజస్సూను. అందువల్లనే అతనికి ఎన్నో అహంకారయుతమైన కోరికలూ, బలహీనతలూ ఉంటాయి. కాని, జ్ఞాని మనస్సు శుద్ధసత్యం, దానికి రూపం లేదు. అది విజ్ఞానమయ కోశంలో వ్యవహరి స్తుంది అసలు, జ్ఞాని దీని ద్వారానే ప్రపంచంతో సంబంధమేర్పరచు కుంటాడు. అందువల్ల అతని కోరికలు కూడ పరిశద్ధంగానే ఉంటాయి.

ప్ర: "జ్ఞాని దృష్టిలో ప్రపంచమెట్లా ఉంటుందా" అని అర్థం చేసుకోవటాకి ప్రయత్నిస్తున్నాను నేను. ఆత్మ సాక్షాత్కారం అయిన తరువాత ప్రపంచం కనబడుతుందా?

జ: ప్రపంచం గురించీ, ఆత్మసాక్షాత్కారమయిన తరువాత ఏమి జరుగుతుందో ననీ, నీకెందుకు చింత? మొదలుగా ఆత్మని గ్రహించు. ప్రపంచం కనబడితేనేం, కనబడకపోతేనేం? గాఢ నిద్రలో నీకు ప్రపంచ ధ్యాసే ఉండదు. అది నీ సాధనకేవిధంగా ఉపయోగపడుతోంది? అట్లాగే, ఇప్పుడు ప్రపంచం కనబడటం వల్ల నీకు పోయిందేమిటి? ప్రపంచాన్ని చూచినా, చూడకపోయినా, జ్ఞానికి గాని అజ్ఞానికిగాని ఏమీ కాదు. ఇద్దరూ ప్రపంచాన్ని చూస్తారు కాని వారి దృక్పథాలే వేరు.

ప్ర: జ్ఞానీ, అజ్ఞానీ కూడ ప్రపంచాన్ని ఒకే విధంగా చూస్తే వారిద్దరిలో వ్యత్యాసమేమిటి మరి?

జ. ప్రపంచాన్ని చూస్తున్నా, అన్నిటికీ ఆధారమైన ఆత్మనే గమనిస్తాడు జ్ఞాని. అజ్ఞాని ప్రపంచాన్ని చూస్తున్నా చూడకపోయినా, తన నిజస్వరూపం గురించి, అంటే ఆత్మ గురించి, ఏమీ ఎరుగడు.

సినిమాలో కదిలే బొమ్మల సంగతి చూడు. సినిమా ప్రారంభించే ముందు నీ కళ్ల ఎదుట ఉండేది తెరమాత్రమే. ఆ తెరమీదే సినిమానంతా చూస్తావు. ఆ బొమ్మలు నిజమనే అనిపిస్తాయి, అన్ని విధాలా. కాని వెళ్లి వాటిని పట్టుకోవాలని ప్రయత్నిస్తే నీ చేతికి చిక్కేదేమిటి? బొమ్మలు ఆడే తెరే కదా, సినిమా అయిపోయింతరువాత, బొమ్మలు పోయింతరువాత, మిగిలేదేమిటి? తెరే మళ్లీను. ఆత్మ విషయంలోనూ అంతే. ఉండే దొక్కటే. బొమ్మలు వస్తూంటాయి, పోతూంటాయి. నువ్వు ఆత్మనే ఆశ్రయిస్తే ఆ బొమ్మల రాక వల్ల మోసపోవు. బొమ్మలు వచ్చినా రాకపోయినా నీకేమీ ఫరవాలేదు. ఆత్మని మరచి, అజ్ఞాని ప్రపంచమంతా వాస్తవ మనుకుంటాడు. తెరని మరచి బొమ్మలనే అతను చూచినట్టూ, తెరలేకుండా అవి ఉన్నట్టూను! తెరలేకుండా బొమ్మలులేవని తెలుసుకుంటే, చూచేవాడు లేకపోతే చూడబడేది అంటూ ఏమీ ఉండదని తెలుసుకుంటే. ఎవ్వరూ భ్రమ చెందరు. జ్ఞానికి - బొమ్మలూ తెరా కూడా ఆత్మేనని తెలుసు. బొమ్మలున్నప్పుడు ఆత్మ రూపం వ్యక్తమవుతుంది. అవి లేనప్పుడు అవ్యక్త రూపమవుతుంది. ఆత్మ ఏ రూపంలో ఉన్నా జ్ఞానికి ఫరవాలేదు. అతడెప్పుడూ ఆత్మే. కాని జ్ఞాని చెలాకీగా ఉండటం చూచి, అజ్ఞాని అయోమయంలో పడతాడు.

ప్ర: శ్రీ భగవాన్ ప్రపంచాన్ని ఎట్లా చూస్తారు, తమలో భాగంగానా?

జ: ఉన్నదల్లా ఆత్మే, ఇంకేదీ కాదు. అజ్ఞానం వల్ల అది మూడు విధాలుగా కనబడుతుంది. ఇట్లాగ -

1) తమ వంటిదాని వలెనే

2) వేరు విధంగా

3) తమలో భాగంగా

ప్రపంచం తన ఆత్మవంటి వేరొక ఆత్మకాదు. ఆత్మకి వేరుకాదు. ఆత్మలో భాగం కాదు.

ప్ర: ప్రపంచం ఆత్మపై ప్రతిబింబంగా పడదా?

జ: ఏదైనా ప్రతిబింబం కావాలంటే ఒక వస్తువూ, దాని బింబమూ ఉండాలి కదా. ఆత్మ ఇటువంటి విభేదాలకు తావీయదు.

ప్ర: జ్ఞానికి కలలు వస్తాయా?

జ: వస్తాయి. కాని అవి కలలేనని తెలుస్తుందతనికి. మెళకువగా ఉన్నప్పుడు కూడ అదీ ఒక కలేనని భావించినట్లే అదీను. కావాలంటే వాటిని ఒకటో కల, రెండో కల అని అనవచ్చు. జ్ఞాని నాల్గవ అవస్థలో ఉంటాడు. అదే తురియావస్థలో, అంటే పరమ సత్యంలో సంస్థితమవుతాడు. మెళకువ, స్వప్నం, సుషుప్తి అవస్థలని ఏ స్పందనా, రాగమూ లేకుండా చూస్తూంటాడు - దానిపై కదిలే బొమ్మలు లాగ.

మెళకువ, కల, నిద్ర అవస్థలని అనుభవించే వారికి, ఈ మూడింటికీ ఆవల ఉన్న స్థితిని తురియ అవస్థ అంటారు. ఇది మెళకువగా ఉండే నిద్ర. దానిసే నాల్గవ అవస్థ అని కూడా అంటారు. కాని వాస్తవానికి, ఉండేది తురియావస్థే, మిగిలిన మూడూ ఉన్నట్టే అనిపించినా అవి లేవు. అందువల్ల తురియావస్థే తురి యాతీతమైన అవస్థకూడ (అంటే, నాల్గవ అవస్థకి అతీతమైనది).

ప్ర: అంటే, జ్ఞానికి ఈ మూడు అవస్థలలోనూ మానసిక స్థితిలో తేడా ఉండదా?

జ: అదెట్లా సంభవం? మనస్సే నాశనమైపోయి, చైతన్యంలో లీనమైపోయిం తర్వాత?

జ్ఞానికి ఈ మూడు అవస్థలూ అసత్యాలే. కాని, అజ్ఞానికి అది అర్థం కాదు - అతనికి మెళకువగా ఉన్న స్థితే ప్రమాణం కనుక. జ్ఞానికో, సత్యానికి ప్రమాణం సత్యమే! శుద్ధ చైతన్యం యొక్క ఈ సత్యం శాశ్వతం. అందువల్ల నువ్వు చెప్పే మూడు అవస్థలలోనూ సమానంగా ఎప్పుడూ ఉంటుంది. ఆ సత్యంలో ఏకమైన వానికి మనస్సులేదు, ఆ మూడు అవస్థలూ లేవు. అందువల్ల అతనికి అంతర్ముఖమవటంగాని, బహిర్వర్తనమవటంగాని ఉండవు. అతను ఆత్మనే ఎప్పుడూ ఎరిగి ఉంటాడు కాబట్టి. అతను ఎప్పుడూ మెళకువగానే ఉన్నట్టే. అతనికి ప్రపంచం మళ్లీ మళ్లీ కనబడే కలవంటిదే. అతనెప్పుడూ గాఢనిద్రలో ఉన్నట్టే - దేహమంటూ ఉన్నదన్న ధ్యాసే ఉండదు.

ప్ర: జ్ఞానికి దేహాత్మ బుద్ధి (నేను ఈ దేహాన్ని, అనే భావం) ఉండదా? ఉదాహరణకి, శ్రీ భగవాన్ని ఏ పురుగైనా కుట్టితే ఆ విషయం తెలియదా?

జ: అదీ తెలుస్తుంది. దేహాత్మ బుద్ధి ఉంటుంది. ఇది జ్ఞానికీ ఉంటుంది. అజ్ఞానికీ ఉంటుంది. ఎటొచ్చీ, అజ్ఞాని ఈ శరీరమే తాననుకుంటాడు. జ్ఞాని మాత్రం ఇదంతా ఆత్మే బ్రహ్మమే అనుకుంటాడు. నొప్పి ఉంటే ఉండనీ, అది కూడ ఆత్మలో భాగమే. ఆత్మ పరిపూర్ణం.

దేహాత్మ బుద్ధిని దాటిన తరువాతే ఎవరైనా జ్ఞాని అవుతారు. ఆ బుద్ధి లేకపోతే కర్తృత్వమూ లేదు, కర్తా లేడు. అందువల్ల జ్ఞానికి కర్మలేదు (అంటే, ఏ కార్యాలూ చేయడు). అదీ అతని అనుభవం. అది లేకపోతే జ్ఞాని కాడనమాట. కాని, అజ్ఞాని మాత్రం జ్ఞానిని ఒక శరీరానికి పరిమితం చేస్తాడు. జ్ఞాని అట్లా చేసుకోడు.

ప్ర: మీరు ఏవేవో పనులు చేయటం చూస్తూనే ఉంటాం. అటువంటప్పుడు ఏ కార్యమూ చేయనని ఎట్లా అనగలరు?

జ. రేడియో పాడుతుంది, మాట్లాడుతుంది. కాని తెరచిచూస్తే దానిలోపల ఎవ్వరూ కనబడరు. ఆ విధంగానే నా ఉనికి కేవలం అంతరిక్షం వంటిది శరీరం రేడియో వలె మాట్లాడినా, పనిచేసేవాడంటూ ఎవ్వరూ లోపల లేరు.

ప్ర. దీనిని అర్థం చేసుకోవటం కష్టంగా ఉంది నాకు. మరి కొంచెం వివరంగా చెప్తారా?

జ. జీవించటానికీ, పనులు చేయటానికీ మనస్సు అవసరముంది. కాని మనస్సు యొక్క ప్రమేయం లేకుండానే జ్ఞాని ఈ రెండూ చేస్తాడు. దీనిని వివరించటానికి గ్రంథాలు ఎన్నో ఆధారాలు చూపుతాయి. కుండ తయారుకాగానే కుమ్మరి చక్రాన్ని తిప్పటం మానుకుంటాడు, కాని చక్రం మాత్రం ఇంకా తిరుగుతుంది. ఎలక్ట్రిక్ పంకాని మనం ఆపివేసినా, అది ఇంకొంచెంసేపు తిరుగుతుంది. శరీరం జన్మించటానికి కారణమైన ప్రారబ్ధ కర్మ శరీరమేయే పనులు చేయాలో దానితో చేయిస్తుంది. ఈ పనులని చేస్తూన్నా జ్ఞాని మాత్రం తాను కర్తనని అనుకోడు. ఇది ఎట్లా సాధ్యమో గ్రహించటం కష్టం. జ్ఞాని ఈ విధంగా పనులు చేయటాన్ని ఇంకొక దానితో పోలుస్తారు. నిద్రలో ఉన్న పసిపాపని అన్నం తినమని నిద్రలేపినప్పుడు అన్నం తింటుంది. కాని అట్లా తిన్నట్టు ఆ పాపకి మర్నాటి ఉదయం జ్ఞాపకముండదు. ఇంకొక విషయం కూడ గుర్తుంచుకోవాలి ఈ వివరాలన్నీ జ్ఞానికి అవసరం. తనకే సందేహాలూ లేవని జ్ఞానికి తెలుసు. తాను శరీరం కాననీ, ఆ శరీరమేయే పనులు చేసినా తాను మాత్రం చేయటం లేదనీ జ్ఞానికి తెలుసును.

జ్ఞానిని చూచి ఆయనకి శరీరమున్నట్టూ, ఆయనే శరీరమన్నట్టు భావించే వారి కోసమే ఈ వివరణలన్నీ!

ప్ర: ఆత్మసాక్షాత్కారం వల్ల కలిగే అఘాతం చాలా బలీయమైన దనీ దానిని తట్టుకోవటం కష్టమనీ అంటారు. నిజమేనా?

జ: ఆత్మసాక్షాత్కారమైన తరువాత కూడా జ్ఞాని ఆ దేహంలోనే ఇంకా జీవించి ఉండగలడా అనే విషయంపై ఎన్నో సిద్ధాంతాలూ, వివాదాలూ ఉన్నాయి. మామూలుగా చనిపోయే వ్యక్తి జ్ఞాని కాజాలడనీ, అతని శరీరం గాలిలో కలసి పోతుందనో, మరింకేమైనా అవుతుందనో ఊహాగానాలు చేస్తుంటారు. కొందరు. వాళ్లు ఎన్నో విచిత్రమైన భావాలని బయటపెట్టుతూంటారు. ఆత్మ సాక్షాత్కారమవగానే జ్ఞాని శరీరాన్ని విడిచిపేయాలనుకుంటే - ఆత్మ గురించి గాని, ఆత్మసాక్షాత్కారం పొందిన స్థితి గురించిగాని వివరణ ఇతరులకి ఎట్లా వస్తోంది? అంటే ఆత్మ సాక్షాత్కారమయిన తరువాత, సజీవంగా ఉండి దాని గురించి గ్రంథాలలో చెప్పిన వారంతా జ్ఞానులు కారనమాటేనా పనులు చెయ్యాలంటే మనస్సుకావాలి కాబట్టి! ఇట్లా చూస్తే జ్ఞానసిద్ధి అయిన తరువాత కూడ ఎన్నో కర్మలు చేసిన ఋషులూ, దేవతలూ, లోకాన్ని పాలించే ఈశ్వరుడూ - అంతా అజ్ఞానులే! అసలు విషయమిది- జ్ఞాని ఎన్ని పనులనైనా చేయవచ్చు. వాటిని ఎంతో సమర్థవంతంగా కూడా చేయవచ్చు. ఎటొచ్చీ - తాను చేస్తున్నానని గాని, ఆ పని తనదనిగాని భావించడు, అతని దేహాన్ని ఉపయోగించుకొని, ఆ పని చేయించుకునే శక్తి ఏదో ఉన్నది.

ప్ర: జ్ఞాని పాపాలు చేయగలడా? చేస్తాడా?

జ. తనకి ఆత్మజ్ఞానం లేకపోవటం వల్లా, తను శరీరమే అనుకోవటం వల్లా అజ్ఞాని, జ్ఞానిని చూచి ఒక దేహంగా భావిస్తాడు. ఆ అపోహతోనే జ్ఞాని యొక్క స్థితిని కూడ చూస్తాడు. జ్ఞానిని భౌతిక ఆకారంగానే చూస్తాడు. అంతేకాదు, తాను కర్తకాకపోయినా, తన దేహం చేసే పనులు తనవేనని కూడా అజ్ఞాని అనుకుంటాడు. అట్లాగే పనులు చేస్తున్న జ్ఞాని కూడ అంతేనను కుంటాడు. కాని, సత్యమేమిటో జ్ఞానికి తెలుసు. అతనికే సందేహమూ లేదు. జ్ఞాని యొక్క స్థితిని అజ్ఞాని ఊహించలేడు. అజ్ఞానిని బాధించే ప్రశ్నలు జ్ఞానికి ఉదయించవు. ఏ కర్త అయినా తన కార్యాలయొక్క సైజాన్ని నిర్ణయించుకోవాలి. ఆత్మ ఎప్పుడూ కర్తకానేరదు. కర్త ఎవరో తెలుసుకో ఆత్మ దర్శనమిస్తుంది!

ప్ర: అంటే, సారాంశమిదనమాట-జ్ఞానిని చూడటమంటే, అతనిని అర్థం చేసుకోవటం కాదనమాట. చూసేదల్లా జ్ఞాని యొక్క శరీరాన్నే గాని అతని జ్ఞానాన్ని కాదు. తాను జ్ఞాని అయితేనేగాని జ్ఞానిని గుర్తించటం కుదరదనమాట.

జ. జ్ఞాని ఎవ్వరినీ అజ్ఞానిగా భావించడు. అతని దృష్టిలో అందరూ జ్ఞానులే. అజ్ఞానంతో, తన అజ్ఞానాన్నే జ్ఞానిపై కూడ మోపి, జ్ఞానిని కర్తగా చూస్తాడు, అజ్ఞాని. జ్ఞాని దేనినీ ఆత్మకి భిన్నంగా గమనించడు. ఆత్మ ప్రకాశమానం, శుద్ధజ్ఞానం. అతని దృష్టిలో అజ్ఞానమంటూ ఏమీ లేదు.

ఒక ఉదాహరణ నిస్తాను, ఈ మాయను వివరించటానికి. ఇద్దరు స్నేహితులు ప్రక్కప్రక్కనే పడుకొని నిద్రపోయారట. అందులో ఒకడు, వాళ్లిద్దరూ ఎంతో దూరం ప్రయాణించినట్టూ, ఎన్నో అనుభవాలు పొందినట్టూ కలగన్నాడు. నిద్ర మేల్కొనగానే తన స్నేహితునితో తమ ప్రయాణం గురించి చెప్పి, అంతే కదా అని అడిగాడు. రెండవవాడు నవ్వి అదంతా అతని కలేనని తనకి దానికీ ఏ సంబంధమూ లేదనీ చెప్పాడు. అట్లాగే, అజ్ఞాని కూడా తన భ్రమలని ఇతరులకి ఆపాదిస్తాడు.

ప్ర: జ్ఞాని పనులు చేస్తాడనీ, చేయగలడనీ మనుష్యులతో వస్తువులతో వ్యవహరించగలడనీ సెలవిచ్చారు మీరు. నాకా విషయమై ఇంకే సందేహమూ లేదు. జ్ఞానికి ఇదంతా ఒకే విధంగా ఉంటుందనీ ఏ భేదభావమూ ఉండదనీ అతనెప్పుడూ చైతన్యంలోనే ఉంటాడని కూడా అన్నారు కదా - అటువంటప్పుడు ఇంత వైరుధ్యమూ వైవిధ్యమూ ఉన్న మనుష్యులతో, వస్తువులతో ఎట్లా వ్యవహరి స్తాడు జ్ఞాని?

జ: ఈ విభేదాలు ఉపరితలాన కనబడేవి గానే చూస్తాడు. వాటికీ సంస్థితమైన ఒకే ఒక సత్యానికీ ఏ భేదమూ లేదని గమనిస్తాడు.

ప్ర: సామాన్యుల కంటె జ్ఞాని తన మాటలలో నిర్దుష్టంగా ఉంటాడు, అందరిలోని వ్యత్యాసాలనూ ఇంకా నిశితంగా గమనిస్తాడు. నాకు పంచదార తియ్యగానూ, కరక్కాయ వగరుగానే అనిపించినట్టే జ్ఞానికి కూడా అనిపిస్తుంది కాబోలు. ఇతరులకు వలెనే జ్ఞానికి కూడా అన్ని రూపాలూ, ధ్వనులూ, రుచులూ ఉన్నట్టున్నాయి. అటువంటప్పుడు ఇవన్నీ పైపైకి మాత్రమే ఉన్నట్టెట్లా అవుతుంది? ఇవి ఆయన జీవితానుభవాలలో భాగాలుకావా?

జ: సమత్వం జ్ఞాని యొక్క నిజలక్షణమన్నాను. సమత్వం అనే పదాన్ని ఉపయోగించి నప్పుడు, విభేదాలున్నాయన్న మాటేకదా. అన్ని విభేదాల లోనూ ఏకతనే గమనిస్తాడు జ్ఞాని. దీనినే సమత్వమన్నాను. ఆత్మసాక్షాత్కారమైన తరువాత అన్ని విభేదాలూ పైకి కనబడే వేననీ అవి అంత బలీయమైనవిగాని, శాశ్వతమైనవి గాని కావనీ అన్నింటిలోనూ ఉండేది ఒకే ఒక సత్యమనీ తెలుస్తుంది. దానినే ఏ కత అంటాను నేను. రూపమూ, గంధమూ, రుచీ గురించి చెప్పావు. జ్ఞాని కూడ ఈ వ్యత్యాసాలని గమనిస్తాడు నిజమే. కాని వాటన్నిటిలోనూ ఒకే ఒక సత్యాన్ని చూస్తాడు, అనుభవిస్తాడు. అందువల్లనే అతనికి అభిమాన పాత్రమయినవంటూ ఏమీ ఉండవు. అతను కదలినా, మాట్లాడినా, ఏమైనా చేసినా కూడా అతని చేష్టలన్నీ ఒకే ఒక సత్యంలోనివే. ఆ పరమసత్యం కంటె అతని కింకేమీ లేదు.

ప్ర: అందరి పట్లా సమత్వంలో ఉంటాడు జ్ఞాని అంటారు -

జ: అవును.

స్నేహం, దయ, సంతోషం వంటివి జ్ఞానికి సహజమవుతాయి. మంచి వారి పట్ల ఆప్యాయత, నిస్సహాయుల పట్ల దయా, మంచి పనులు చేయటంలో ఆనందమూ, దుష్టుల పట్ల క్షమా ఇవన్నీ జ్ఞానికి సహజ లక్షణాలు (పతంజలి, యోగ సూత్రాలు 1:37) జ్ఞానులకి సత్యమేమిటో తెలుసుకొబట్టి వాళ్లు అన్ని అవస్థలలో, పరిస్థితులలో ఒకే విధంగా ఉంటారు. వారు నిత్య కృత్యాలు అంటే, భోజనం చేయటం, తిరగటం వంటివి - ఇతరుల కోసమే చేస్తారు. తమకోసమంటూ ఒక్కపనీ చేసుకోరు. ఎవరైనా చనిపోయినప్పుడు డబ్బు ఇస్తే అక్కడికి వెళ్లి శోకాలు పెట్టే వృత్తి కొందరికుంది. అట్లాగే జ్ఞాని కూడ. జ్ఞాని ఏ అనురక్తీ లేకుండా, ఏ విధంగానూ ప్రభావితం కాకుండా, ఇతరుల కోసం పనులు చేస్తాడు. ఈ విషయాన్ని చాలా సార్లు చెప్పాను. జ్ఞాని ఏడ్చేవాళ్లతో ఏడుస్తాడు. నవ్వేవాళ్లతో నవ్వుతాడు, ఆడే వాళ్లతో ఆడుతాడు, పాడే వాళ్లతో పాడుతాడు - పాడుతూ తాళం వేస్తాడు. అతనికి వచ్చిన నష్టమేమిటి? నిర్మలమైన, శుభ్రమైన అద్దం వంటిది అతని ఉనికి. బింబాన్ని ఉన్నద్దున్నట్టు చూపుతుందది. జ్ఞాని కేవలం అద్దమే కాబట్టి చేసే పనుల వల్ల అతని పై ఏ ప్రభావమూ

ఉండదు. ప్రతిబింబం వల్ల అద్దానికే మవుతుంది? అతనినేమీ చేయదది - కాని ఈ లోకంలోని పాత్రధారులు అంటే అన్నీ చేసేవాళ్లు. అజ్ఞానులు మాత్రం ఏ పాటపాడాలి. ఏ పని చెయ్యాలి. ఏ పనిచేస్తే లోకానికి మంచిది. ఏది శాస్త్రసమ్మతమవుతుంది. ఏది సాధ్యం - ఇవన్నీ నిర్ణయించుకోవలసి వస్తుంది.

ప్ర: సదేహముక్తులు (శరీరం ధరిస్తూండగానే ముక్తులు) విదేహముక్తులు (మరణించేప్పుడు ముక్తులు) అంటూ ఉన్నారంటారే?

జ: విముక్తి అంటూ ఏమీ లేదు ఇక ముక్తులెక్కడ నుంచి వస్తారు?

ప్ర: ముక్తి గురించి హిందూ శాస్త్రాలు చెప్తాయి కదా!

జ: ముక్తీ, ఆత్మా పర్యాయపదాలు. జీవన్ముక్తి, విదేహముక్తి అనేవన్నీ ఏమీ తెలియని, వాళ్లకి. జ్ఞానికి ముక్తీ, బంధమూ తెలియవు. బంధమూ, విముక్తీ, ముక్తిలో తారతమ్యాలూ అన్నీ అజ్ఞాని కోసమే అతను అజ్ఞానాన్ని వదిలించుకోవటానికే. ఉన్న దల్లా ముక్తే ఇంకేమీ లేదు.

ప్ర: భగవాన్ దృష్టిలో అది అంతేనేమో గాని, మా వంటి వారి సంగతేమిటి?

జ. 'నేను' 'అతను' అనే భేదభావం జ్ఞానానికి అవరోధం.

ప్ర: ఒకసారి మీరిట్లా సెలవిచ్చారు : "విముక్తుడు తన ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించ వచ్చు. ఈ భౌతిక కాయాన్ని విడిచినప్పుడు అతనికి మోక్షం వస్తుంది. ఈ జన్మ మళ్లీ నెత్తడు, నిజానికి, జన్మించటం మరణమే". ఇది ఇట్లా అర్థమవుతోంది - జ్ఞాని ఈ తలంలో మళ్లీ జన్మించక పోయినా తనకి కావాలంటే ఇతర లోకాలలో సూక్ష్మశరీరంలో పనిచేస్తూండ వచ్చని. అంటే అతనికింకా కోరికలుంటాయా, దేనినైనా ఎంపిక చేసుకోవటానికి?

జ. నా ఉద్దేశమది కాదు.

ప్ర: ఒక భారతీయ తత్త్వవేత్త, శంకరునికి భాష్యం వ్రాస్తూ విదేహముక్తి అంటూ ఏమీ లేదు, ముక్తుడు చనిపోయిన తరువాత మానవాళి కంతటికీ ముక్తి లభించేవరకూ జ్యోతి రూపం ధరించి ఉంటాడన్నారు.

జ: శంకరుని భావమదై ఉండదు. వివేకచూడామణి 566వ శ్లోకంలో శంకరుడన్నది ఇది: భౌతిక కోశం పోయిన తరువాత ముక్తుడు "నీటిలో కలిపిన నీరువలె, నూనెలో కలిపిన నూనె వలె" అయిపోతాడు. ఆ స్థితిలో బంధమూ లేదు. విముక్తీ లేదు. ఇంకొక రూపాన్ని ధరించటమంటే సత్యంపై ఒక సూక్ష్మమైన తెరని వేసినట్టే - అది బంధమే అవుతుంది. విముక్తి తిరుగులేనిది, అది కేవలం.

ప్ర: జ్ఞాని రెండు తలాలలో ఉండడని ఎట్లా అనగలం? మాతో బాటే ప్రపంచంలో తిరుగుతాడు, అన్నింటినీ చూస్తాడు. వాటిని చూడకుండా ఉండడు. నడిచేప్పుడు తన దారిని గమనిస్తాడు. దారిలో కుర్చీగాని, బల్లగాని ఉంటే దానిని తప్పించు కుంటాడు. అంటే, ఆత్మని గమనిస్తూన్నా, ఈ వస్తువులని కూడా చూస్తూనే ఉంటాడని అనకూడదా?

జ: జ్ఞాని దారిని చూస్తాడనీ, నడుస్తాడనీ, దారిలో అడ్డంకులని తప్పించుకుంటాడనీ అన్నావు. ఇవన్నీ ఎవని దృష్టిలో ఉన్నాయి? నీ దృష్టిలోనా, జ్ఞాని దృష్టిలోనా? అతను చూచేది ఆత్మనే, అన్నీ ఆత్మలోనే!

ప్ర: సహజ స్థితిని మాకు విశదపరచేందుకు పుస్తకాలలో దృష్టాంతాలులేవా?

జ: లేకేం, ఉన్నాయి. నువ్వు అద్దంలో ప్రతిబింబాన్ని, అద్దాన్నీ కూడా చూస్తావు. అద్దం వాస్తవమనీ, అందులో కనబడేది ప్రతిబింబమనీ ఎరుగుదువు. అద్దాన్ని చూడాలంటే, అందులోని ప్రతిబింబాన్ని చూడకుండా ఉండాలా యేమిటి?

ప్ర: ఆధ్యాత్మికంగా మహనీయులైన వారిని గుర్తించటమెట్లా? కొందరు పిచ్చివాళ్లలాగ ప్రవర్తిస్తారు కదా -

జ: జ్ఞాని మనస్సు జ్ఞానికే తెలుస్తుంది. స్వయంగా తాను జ్ఞాని అయితేనే గాని ఇంకొక జ్ఞాని మనస్సు తెలుసుకోలేడు. అయితే, ఋషి దగ్గర ఉండే ప్రశాంత వాతావరణం వల్లనే సాధకుడు ఋషిని గుర్తించగలడు. అతని మాటలుగాని, చేతలుగాని, రూపంగాని అతని గొప్పదనాన్ని చెప్పవు - సామాన్యుల అవగాహనకి అతీతంగా ఉంటాయవి.

ప్ర: ఋషికీ, పసిపిల్లవానికీ తేడా లేదంటాయి శాస్త్రాలు. ఎందువల్ల?

జ: జ్ఞానీ, పసిపిల్లా ఒకలాటి వాళ్లే అనవచ్చు ఒక విధంగా. ఏదైనా జరుగుతున్నంత సేపే పసిపిల్లకి దానిమీద ఆసక్తి ఉంటుంది. ఆ సంఘటన అయిపోయిన తర్వాత దాని గురించి ఆలోచించదు పసిపిల్ల. అంటే ఆ సంఘటన పసిపిల్ల మనస్సుపై ఏ ముద్రా వేయదు. దాని వల్ల ఏ ప్రభావమూ ఉండదనమాటే కదా. జ్ఞాని విషయంలోనూ అంతే!

ప్ర: మీరు భగవాన్లు - నాకెప్పుడు జ్ఞానం కలుగుతుందో మీకు తెలియాలి. నేను జ్ఞాని నెప్పుడవుతానో చెప్పండి.

జ: నేను భగవాన్నే అయితే ఆత్మ తప్ప వేరేమీ లేదనమాటే. అంటే జ్ఞానీ లేడు, అజ్ఞానీ లేడు. కాకపోతే, నేనూ నీ వంటి వాడినే, నీ కెంత తెలుసో, నాకూ అంతే తెలుసు. ఏమయినా, నేను నీ ప్రశ్నకి సమాధాన మివ్వలేను.

ఇక్కడికి వచ్చిన కొందరు తమ గురించి అడగరు. వాళ్లు "జీవన్ముక్తుడు ప్రపంచాన్ని చూస్తాడా? అతనిపై కర్మ ప్రభావముంటుందా? శరీరం పోయిన తరువాత విముక్తి ఏమిటి? చనిపోయిన తరువాతనే విముక్తా? బ్రతికి ఉండగానే కూడా సాధ్యమా? ఋషి శరీరం జ్యోతిగా అయిపోవాలా, ఏదో విధంగా మాయమై పోవాలా? శరీరం, కళేబరం వలె వెనుక ఉండిపోయినా అతను విముక్తుడవ గలడా?" అంటూ ఎడతెగని ప్రశ్నలు వేస్తూంటారు. వీటికి అంతంలేదు. వీటి గురించి చింతించట మెందుకు? వీటిని తెలుసుకోవటంలోనే విముక్తి ఉందా? అందువల్ల వాళ్లకి నేను చెప్పేది ఒక్కటే - "విముక్తి మాట అట్లా ఉండనీ! బంధమంటూ ఉన్నదా? దీనిని తెలుసుకో, మొట్టమొదటగా, నీ వెవ్వరవో తెలుసుకో."

రెండవ భాగము:

# ఆత్మ విచారము - శరణాగతి

ఎవరికైనా "నేనున్నాను" అన్నదే శాశ్వతమూ, సువిదతమూ అయిన అనుభవము "నేనున్నాను" కన్నా సుస్పష్టమైనదేదీ లేదు. ఇంద్రియాల ద్వారా కలిగే అనుభూతులే సువిదితాలనుకుంటారు, కాని అవి కావు. అటువంటిది ఆత్మ ఒకటే. కనుక చేయవలసిందల్లా ఆత్మవిచారమే. "నేను"గా ఉండటమే. "నేనున్నాను" అనేదే సత్యం. 'నేనుఇది', 'నేను అది' అనేది అసత్యం. "నేనున్నాన"నే సత్యానికే మరొక పేరు ఆత్మ.

తనని తానెరుగటమే భక్తి అంటే, మరేమీ కాదు. పరభక్తి జ్ఞానమూ ఒకటేననిపరిశీలన మీద తెలుస్తుంది. ఆ రెంటి గురించీ ఏమీ తెలియక పోవటం వల్లనే వాటిల్లోఒకటి రెండవ దానికి దారి చూపుతుందను కుంటారు. జ్ఞానమార్గానికీ, భక్తి మార్గానికీపరస్పర సంబంధముందని గ్రహించి, విడదీయజాలని ఆ రెండు మార్గాలనీ వేరువేరుగా భావించకుండా, వాటిని ఆశ్రయించు.

## 4. ఆత్మ విచారము - సిద్ధాంతము

ఒక వ్యక్తి అంటూ ఉండి, దేహమూ మనస్సుల ద్వారా పని చేస్తూంటాడనభావాన్ని విడనాడితే ఆత్మ సాక్షాత్కారాన్ని పొందవచ్చని శ్రీ రమణులు బోధించనటుఆత్మజ్ఞానము - ఆత్మవిస్మృతి" అనే అధ్యాయంలో చూచాం. వారి భక్తులలో

బాగాపురోగమించిన వారు ఈ పనిని సులభంగా, త్వరగా చేయగలిగేవారు. కాని ఏదోఒక రకమైన ఆధ్యాత్మిక సాధన లేక, ఒక జీవిత కాలం పాటు జీర్ణించుకు పోయినసంస్కారాలను చాలా మంది వదిలించుకో లేకపోయేవారు. అటువంటి వారి అవసనిఎంతో సానుభూతితో శ్రీ రమణులు చూచేవారు. ఆత్మజ్ఞానాన్ని పొందటానికితమకేదైనా ఆధ్యాత్మిక సాధనని చూపమని వాళ్లు అడిగితే ఆత్మవిచారమనే పద్ధతినిచెప్పేవారు. ఈ సాధన, అచరణీయమైన వారి తత్త్వానికి మూలస్తంభం వంటిది.ఈ పద్ధతిని రానున్న మూడు అధ్యాయాలలోను వివరిస్తాం.

ఆ సాధన గురించి చెప్పేముందు, మనస్సు యొక్క స్వరూపం గురించిశ్రీ రమణుల భావాలను చెప్పాలి. ప్రత్యక్షానుభవం ద్వారా మనస్సంటూ ఏమీ లేదనిగ్రహించటమే ఆత్మవిచారం యొక్క లక్ష్యం.

శ్రీ రమణుల దృష్టిలో మనం దేహంతో గాని మనస్సుతో గాని ఏ పనినైనా చేసేప్పుడువెనుకనుండి "నేను" అన్నదేదో చేయిస్తోందని భావిస్తాం. ఈ అవ్యక్తభావం చుట్టూనేఅన్ని పరిభ్రమిస్తాయి. "నేను ఆలోచిస్తాను"', "నేను జ్ఞాపకముంచు కుంటాను", "నేనుపని చేస్తున్నాను" అని అన్నప్పుడెల్లా, ఈ కలాపాలకన్నింటికీ బాధ్యత "నేను" అన్నదానికేఅన్నిటిలోనూ ఉండే ఈ భావాన్ని శ్రీ రమణులు 'అహంవృత్తి' అన్నారు ('నేను' అనేభావం). యదార్ధంగా, 'అహంవృత్తి' అన్న మాటకర్థం-నేను' అన్న దానికి మానసికమైనమార్పు నిజమైన "నేను', అంటే ఆత్మ. తానేదో చేస్తున్నట్టు గాని, అనుకుంటున్నట్టుగానిఊహించుకోదు. వీటిని ఊహించుకునే 'నేను' వేరు - అది మనస్సుచే కల్పింపబడింది.అందువల్లనే ఆత్మకి అది మానసిక మార్పు. 'అహం వృత్తి' అనే పదాన్ని ఇట్లాఅనువదించటం చాలా క్లిష్టం కాబట్టి, క్లుప్తంగా దానిని "నేను" అనే భావ మంటాం.

కేవలం ఈ "నేను" అనే భావం వ్యక్తమవటం వల్లనే ప్ృథక్ భావం కలుగుతుందనే వారు శ్రీ రమణులు. అహంకారం, బుద్ధి, స్మృతి - ఇవన్నీ మనస్సు యొక్కకలాపాలే.

వీటనన్నిటినీ వేరు వేరుగా పరిగణింపక వారు అవి అన్నీ "నేను అనే భావా"నికిభిన్నరూపాలుగా చూచేవారు. పృథక్ భావమూ - మనస్ూనా ఒకటే, మనస్తూ.ఆహంవృత్తీ ఒకటే అని వారనేవారు. అందువల్ల, అత్మసాక్షాత్కారమంటే - మనస్సూ,అహంవృత్తి మాయమవటమనమాటే. ఆత్మసాక్షాత్కారమైన తరువాత ఆలోచనలుచేసే యోచకుడుగాని, పనులు చేసే కర్తగాని, వ్యక్తి యొక్క ఉనికి గురించిన ఎరుకగానిఉండవని వారు తరచూ అనేవారు.

ఆత్మ ఒక్కటే అసలైన సత్యవమనీ, "నేను" అనే భావం ఒక తప్పు భావమనీదానికి ఉనికి లేనేలేదనీ అనేవారు - ఏదో ఒక వస్తువుతో తాదాత్మ్యం చెందినపుడేఅది ఉదయించగలదనే వారు. ఆలోచనలు ఉదయించేప్పుడు. "నేను ఆలోచిస్తాను"నేను నమ్ముతాను" "నేను కోరుతాను" "నేను పని చేస్తున్నాను" అని అన్నప్పుడునేను' అనే భావం వాటిని స్వంతం చేసుకుంటుంది. ఏదో ఒక విషయంతో ఏకతచెందనప్పుడు "నేను" అనే భావం వేరుగా ఉండదు. ఈ విధమైన తాదాత్మ్యంనిరంతరంగా సాగుతూండటం వల్ల ఆ భావం కూడ అవిచ్ఛిన్నంగా ఉన్నట్టూ,వాస్తవమైనట్టా అనిపిస్తుంది. ఇంచుమించు ఈ తాదాత్మ్యాలన్నిటికీ మూలం నేను'అన్నది దేహానికి పరిమితమని అనుకోవటమే - అటే "నేను" అనేది దేహధారిగానోదేహానికి స్వంతదారుగానో అనుకోవటమే. "నేను ఈ దేహాన్ని" అన్న భావమే ఆతరువాత కలిగే తప్పు తాదాత్మ్యాలకు మూలకారణం. ఆత్మవిచారం యొక్క ప్రధానలక్ష్యం దీనిని అంతమొందించటం.

రఇట్లా పరిమితం చేసుకునే తాదాత్మ్యాలని నిరోధించటం, "నేను' అనేదాన్ని అదితాదాత్మ్యం చెందేవాటి నుండి వేరుచేయటం వల్ల సాధ్యమనేవారు శ్రీరమణ. "నేనుఅనే భావం తనంతట తానుండలేదు. అందువల్ల "నేను" లేక "నేనున్నాను" పైనతీక్షణమైన దృష్టి నిలిపితే, "నేను ఇది" "నేను అది " అనే భావాలుదయించవు. అప్పుడునేను" అనేది ఇతర విషయాలతో పొత్తు ఏర్పర్చుకోలేదు. ఈ విధంగా నేను (అత్మ)పై వీకాగ్రత నిలిపితే అహంవృత్తి పోతుంది ఆ స్థానంలో ఆత్ానుభూతి ప్రత్యక్షంగాకలుగుతుంది. "నేను" "నేనున్నాను" అనే ఈ లోపలి ఎరుకనే ఆత్మవిచారమనే వారుశ్రీమణ. "నేను అనే భావం" కేవలం కల్పితమనీ అసత్యమనీ గ్రహించటానికి ఇదేఎంతో స్పష్టమైన, సూటియైన మార్గమని వారు బోధిస్తూండేవారు.

శ్రీరమణుల పరిభాషలో నేను అనే భావం - ఆత్మలేక హృదయం నుండిఉదయిస్తుంది, అందులోనే ఇంకి పోతుంది. అప్పుడు మిగిలిన వాటితో తాదాత్మ్యం చెందే ధోరణి ఆగిపోతుంది. అందువల్ల వారి బోధనలెప్పుడూ ఉదయిస్తూ, సమసిపోతూఉండే "నేను" అనే భావాన్ని అనుసరించే ఉండేవి. "నేను అనే భావం" ఎక్కడ నుండిఉదయిస్తోందో ఆరాతీయి" ఎక్కడ నుంచి వస్తుందో గమనించు' అంటూండేవారు.ఏ పదజాలం వాడినా, ఎప్పుడూ "నేను అనేభావం' తన మూలంలో కరిగిపోయే వరకూదాని పట్ల ధ్యాస కలిగి యుండమని తమ భక్తులకు సలహా ఇస్తూండేవారు.

ఎప్ుడూ 'నేను' గురించి చింతనా, పదే పదే మననమూ కూడా సరియైనమార్గంలోనే పెట్టుతాయనే వారు. అయితే, సాధనలో ఇది ప్రాథమిక దేశమాత్రమే ననిగుర్తుంచుకో మనేవారు. మననం చేయటంలో కూడ ఒక కర్త (నేను అనే భావం) పేరేవిషయంపై గమనింపు (నేను, నేను అనే ఆలోచనలు) ఉంటాయి. అటువంటి ద్వయీభావమున్నంత సేపూ అహంవృత్తి వీడదు. భౌతిక విషయాలైనా, మానసిక విషయాలైనాఏదైనా సరే అన్నిటి ఎరుకా సమసిపోయినప్పుడే అది పూర్తిగా పోతుంది. 'నేను' గురించిఎరుక కలిగి ఉండటం కాదిది, 'నేను' అవటమే. ఆ దశలో ఒక విషయం గురించిఎరుకకాక, ఆ విషయమవటమే సంభవిస్తుంది- అదే ఆత్మవిచారానికి పరాకాష్టతరువాతి అధ్యాయంలో దీని వివరణ ఉంటుంది.

ఆత్మ విచారణకీ ఇతర ఆధ్యాత్మిక సాధనలకీ ముఖ్యమైన భేదమిక్కడేఉంది. మిగిలిన ఆధ్యాత్మిక సాధకులకు ఇంత పాటవం లేదని శ్రీరమణులుఅనటానికి ఇదే అర్థం. మిగిలిన సంప్రదాయకమైన ధ్యానాలూ, యోగమూ ఒకకర్త ఉండి మరొక విషయం గురించి ధ్యానించమని నిర్దేశిస్తాయి. దీని వల్ల 'నేనుఅనే భావం పటిష్టమవుతుందే గాని సమసిపోదనేవారు. అటువంటి అభ్యాసాల వల్లమనస్సు నిశ్చలమవవచ్చు. ఒకసారి ఆనందానుభూతీ కలుగవచ్చు - అవి ఎప్పుడూఆత్మసాక్షాత్కారాన్ని కలిగించవు. దీనికి కారణమిది : అహంవృత్తిని వేరుచేసి, దానిఅస్తిత్వాన్ని లేకుండా చేయక పోవటమే.

ఈ అధ్యాయంలోని సంభాషణలు ఆత్మవిచారం గురించి శ్రీరమణులసైద్ధాంతిక నేపథ్యాన్ని చూపుతాయి. ఆచరణకి సంబంధించిన వివరాలూ, పద్ధతులూఅయిదవ అధ్యాయంలో ఉన్నాయి.

ప్ర: మనస్సు యొక్క స్వరూపమేమిటి?

జ: నేను' అనే భావం తప్ప మనసిపింకేమీ కాదు. మనస్సూ, అహంకారమూ ఒకటేబుద్ధీ, జ్ఞాపకశక్తీ కూడ అదే. మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం - అన్నీ ఒకే ఒక మనస్సు. ఒకే మనిషిని అతను చేసే పనులను బట్టి వేరు వేరు పేర్లతో పిలవటం వంటిడదే ఇదీను. వ్యక్తిగత జీవుడనేది ఈ అహంకారమే

ప్ర మనస్సు యొక్క స్వరూపాన్నీ అది దేనికి కారణమో, అది దేనికి వ్యక్త రూపమోఎట్లా గ్రహించటం?

జ: అన్ని భావాలలోకి అతి ముఖ్యమైనది 'నేను' అనే భావం. వ్యక్తిత్వమనే భావంకూడ అన్ని భావలకీ మూలమే. ఏ భావమైనా దేనినో ఆశ్రయించే ఉదయిస్తుందిఅహంకారం లేకుండా ఏ భావానికీ అస్థిత్వం లేదు. అహంకారమే భావాలకినిలయం. అంటే, భావాల వ్యాపకం అహంకారానికి సంబంధించినదే. నువ్వుఅతడు, అది అంటూ ప్రథమ మధ్యమ పురుషులకి సంబంధించినవి 'నేనుఅనే ఉత్తమ పురుషకి తప్ప ఇంకెవరికీ గోచరించవు. అందువల్ల ఉత్తమ పురుషఉదయించిన తరువాతనే అవీ ఉదయిస్ాయి. అంటే మూడూ కలిసే వస్తాయికలిసే అణిగిపోతాయి. కాబట్టి, 'నేను' లేక వయక్తిత్వం అనే అంతిమ కారణంయొక్క ఆరాతీయి.

ఈ 'నేను' అనేది ఎక్కడ నుంచి ఉదయిస్ుంది? దాని కోసం లోపల వెతుకుఅది మాయమవుతుంది. ఇదే జ్ఞానాన్వేషణ. తన స్వరూపాన్ని తెలుసుకోవటానికిమనస్సు నిర్విరామంగా కృషి చేస్తే మనస్సంటూ ఏమీ లేదని తేలుతుంది. ఇదేసూటైన మార్గం. మనస్సంటే ఆలోచనల సమూహమే. అన్ని ఆలోచనలకీ మూలంనేను" అనే భావం. కాబట్టి, మనస్సంటే ఈ 'నేను' అనే ఆలోచనే.

నేను' అనే ఆలోచన యొక్క పుట్టుకే వ్యక్తి యొక్క జననం కూడ, దానిమరణమంటే వ్యక్తి మరణమే. "నేను' అనే భావం ఉదయించిన తర్వాతనేశరీరంతో తప్పుగా తాదాత్యం ఉదయిస్తుంది. ఈ 'నేను' అనే భావాన్నివదిలించుకో. అది సజీవంగా ఉన్నంత కాలమూ బాధ తప్పదు. "నేను' పోతేబాధా పోతుంది.

ప్ర నిజమే. కాని నేను' అనే భావాన్ని నేను పట్టుకున్నప్పుడు ఇతర భావాలు వచ్చినన్ను చెదరగొట్టుతాయి.

జ అవి ఎవరి భావాలో గమనించు. అప్పుడవి మాయమవుతాయి. వాటిమూలం 'నేను' అనే భావమే. దానిని పట్టుకొని ఉంటే. మిగిలినవి మాయమవుతాయి.

ప్ర: అహంకారం ప్రారంభించిన ఏ పరిశీలనైనా, అహంకారమే, మిథ్య అని ఎటాతెల్చగలుగుతుంది

జ.నేను అనే భావం యొక్క మూలంలో లీనమైనప్పుడు వ్యక్తమైన అహంకారంకూడ దాటబడుతుంది

ప్ర ఆహం వత్తి కూడ అహంకారం కనబరచే మూడు రూపాలలో ఒకటే కదా.హంకారానికి మూడు రూపాలున్నాయని యోగవాసిష్టమూ, ప్రాచీన శాస్త్రాలూచెప్తాయి కదా.

జనిజమే. అహంకారానికి మూడు రూపాలున్నాయంటారు. స్థూలము, సూక్ష్మముకారణము - కాని ఇదంతా విచ్ఛేదంతో వివరించటానికి మాత్రమే. అహంకారంయొక్క రూపాలు అనేకం. అందువల్ల ఆ రూపంమీద ఆధారపడితే ఏవిచారమూ సాధ్యంకాదు. ఆత్మ విచారానికి సంబంధించినంత వరకూఆత్మఅహంకారానికి ఒకే ఒక రూపముందనుకోవాలి - అదే అహంవపత్తి

ప్ర: జ్ఞానాన్ని పొందటానికి అది సరిపోయేదేమో?

జ: అహంవృత్తి ఆధారంగా ఆత్మవిచారం చేయటమంటే వాసనని బట్టి తనయజమాని ఎక్కడున్నాడో కుక్క ఆరాతీసినట్టే. యజమాని ఎక్కడో, తెలియనిప్రదేశంలో ఉన్నా కుక్క అతనిని పసికట్టుతుంది. యజమాని వాసనే కుక్కకితిరుగులేని ఆధారం - అతని బట్టకాని, రూపంకాని, స్థానం కాని కావుఆ వాసనపైనే ఏకాగ్రత నిలిపి కుక్క తన యజమాని కోసం వెతుకుతుందిచివరికి ఆచూకీ తీస్తుంది.

ప్ర: ఇతర భావాలని విడిచి, అహంవృత్తి యొక్క మూలాన్ని మాత్రమే వెతకటంఆత్మసాక్షాత్కారానికి సూటైన మార్గమెట్లా అవుతుంది.

జ: నేను' నేనున్నాను' అనే భావాన్ని అహంవృత్తి అంటాం. కాని మనస్సు యొక్కఇతర భావాల వలె అదీ ఒక భావం మాత్రమే కాదు. ఇతర వృత్తులకు ఒకదానితో మరొక దానికి సంబంధముండక పోవచ్చు. కాని అహంవృత్తికి మాత్రంమనస్సు యొక్క ప్రతి వృత్తితోనూ సంబంధముంటుంది. అహంవృత్తి లేకుండాఇతర వృత్తులు లేవు. కాని అహంవృత్తి మాత్రం తనకు తానుగా ఇంక దేనిపైనాఆధారపడకుండా ఉండగలదు. అందువల్ల అహంవృత్తికీ ఇతర వృత్తులకూమౌలికమైన వ్యత్యాసముంది.

అహంవృత్తి యొక్క మూలాన్ని కనుక్కోవటమంటే కేవలం అహంకారం యొక్క

ఒక రూపానికి ఆధారం కనుక్కోవటం మాత్రమే కాదు. "నేనున్నాను" అనేదిఎక్కడ నుంచి వస్తుందోనని తెలుసుకోవటమే. అంటే, అహంవృత్తి రూపంలోఉన్న అహంకారం యొక్క అన్వేషణ, గ్రహింపు సాధిస్తే అహంకారానికి ఉన్నఇతర రూపాలని దాటినట్టే

ప్ర: అహంకారానికి కల అన్ని రూపాలూ అహంవృత్తిలో ఉన్నాయని ఒప్పుకున్నా ఆత్మవిచారాన్నకై ఆ వృత్తినే ఎందుకు ఎంచుకోవాలి

జ: నీ అనుభవానికి అంతకన్నా కనీసస్థాయిలేదు - దాని మూలం కనుక్కోవటమొక్కటే

ఆత్మని సాక్షాత్కరింప చేసుకోవటానికి అనుసరణీయమైన మార్గం. అహంకారానికి

కారణశరీరముందంటారు (అంటే సుషుప్తిలో "నేను' యొక్క స్థితి) కాని నీ

పరిశీలనకి దాని నెట్లా తీసుకోగలవు? ఆ రూపంలో అహంకారమున్నప్పుడు

నీవు గాఢనిద్ర అనే చీకటిలో మునిగి ఉన్నావాయె

ప్ర అహంకారం యొక్క సూక్ష్మకారణ రూపాలు తేలికగా పట్టుబడేవి కావుఅటువంటప్పుడు మనస్సు మేల్కొని ఉన్నస్థితిలో అహంవృత్తి యొక్క మూలాన్ని శోధించే యత్ం ఆ రూపాలని ఎట్లా సంబాళించగలదు?

జ అది కాదు విషయం. అహంవృత్తి యొక్క మూలాన్ని కనుగొనే ప్రయత్నంఅహంకారం యొక్క ఉనికినే ప్రశ్నిస్తుంది. అందువల్ల అహంకారం యొక్కసూక్ష్మత అసలు ప్రశ్న కానే కాదు.

ప్ర: నిష్కంళంకమూ, పరిశుద్ధమూ అయిన ఆత్మని, అహంకారం మీద ఏవిధంగానూ ఆధారపడని ఆత్మని, కనుగొనటమే ధ్యేయమైనప్పుడు అహంవృత్తిరూపంలో ఉన్న అహంకారం యొక్క మూలాన్ని కనుగొనటం ఏ విధంగాఉపయోగిస్తుంది

జ: వ్యవహారరీతావా అహంకారానికి ఒకే ఒక రూపముంది. ఆత్మ అంటే శుద్ధచైతన్యం: భౌతిక కాయం జడం, అచేతనం. ఈ రెంటినీ సంధానపరచే పనిని.అహంకారం చేస్తుంది. అందువల్లనే అహంకారాన్ని చిత్-జడ-గ్రంథి అంటారు(అంటే చైతన్యానికీ, జడమైన దేహానికీ ముడి అనమాట). అహంవృత్తి యొక్కమూలం గురించి విచారించేప్పుడు అహంకారరూపమైన చిత్ ని (చైతన్యం)గమనిస్తావన్న మాట. అందువల్ల ఆ పరిశోధన శుద్ధ చైతన్యమైన ఆత్మని సాక్షాత్కరింప చేస్తుంది. శుద్ధమైన "నేను" అంటే ఆత్మకీ, నేను' అనేభావానికీ భేదముందని నీవు గుర్తుంచుకోవాలి. ఈ రెండవది కేవలం ఒకభావం మాత్రమే. అది కర్తనీ కర్మనీ చూస్తుంది, నిద్రిస్తుంది, మేల్కొంటుందిభుజిస్తుంది, ఆలోచిస్తుంది, మరణిస్తుంది, మళ్లీ పుట్టుతుంది. కానిశుద్ధమైన "నేను" అనేది కేవలమూ, నిత్యమూ ఆయన ఉనికే. దానికి అజ్ఞానంగాని, భావమనే మాయగాని ఉండవు. ఆ "నేను" అనే స్థితిలో ఏ ఆలోచనాలేకుండా ఉంటే 'నేను' అనే భావం కూడా పోతుంది. అలాగే భ్రమ కూడశాశ్వతంగా పోతుంది. దీపాలను ఆర్ని వేసినప్పుడే లేక దీపాల కాంతినితగ్గించినప్పుడే, సినిమాలో బొమ్మలని చూడగలవు దీపాలు వెలిగిస్తే బొమ్మలుకనబడవు. అట్లాగే ఆత్మ అనే జ్యోతి యొక్క వెలుగులో అన్ని పదార్థాలూమాయమవుతాయి

ప్ర: అది సర్వాతీత స్థితి

జ. కాదు. దేనికి అతీతమవటం? అతీతమయేది ఎవరు? ఉన్నదల్లా నీవే

ప్ర: ఆత్మమనస్సుకి అతీతమంటారు. కాని ఆత్మ సాక్షాత్కారం మనస్సు ద్వారానేజరుగుతుంది. "దాని గురించి మనస్సుచింతించ లేదు. మనస్సు దానిని భావించలేదు. కాని మనస్సే దానిని సాక్షాత్కరింప చేయగలద"ంటారు. ఈ పరస్పర

ంవిరుద్ధాలైన భావాలకి సమన్వయమెట్లా కుదురుతుంది

జ

ఆత్మ జ్ఞానం మృతమనస్సుకే కలుగుతుంది - అంటే ఏ భావాలూ లేకఅంతర్ముఖమైన మనస్సుకే నన్న మాట. అపుడు మనస్సు తన మూలాన్నేతెలుసుకునే, అదే (అంటే ఆత్నే) అయిపోతుంది. ఒకరు వేరొక పదార్థాన్నిచూచినట్టు కాది.లకు40

గది చీకటిగా ఉన్నప్పుడు అందులోని వాటిని కళ్ళు చూచి గ్రహించాలంటేదీపమవసరం కాని సూర్యుడుదయించిన తర్వాత వాటిని చూడటానికిదీపమవసరం లేదు. సూర్యుణ్ణి చూడటానికి కూడా దీపమక్కర్లేదు. నువ్వుస్వయం ప్రకాశమైన సూర్యుని వైపు ముఖం త్రిపిపితే చాలు. మనస్సు విషయంకూడా అంతే. వస్తువులని చూడటానికి పరివర్తితమైన మనస్సు యొక్క కాంతిఅవసరం. హృదయాన్ని చూడాలంటే మనస్సు అంతర్ముఖమైతే చాలు. అప్పుడుమనస్సు, హృదయంలోకి మాయమై ప్రకాశిస్తుంది. మనస్సుకి ముఖ్య లక్షణం చైతన్యం లేక ఎరుక. కాని అహంకారం దానిపై ఆధిపత్యాన్ని పొందినప్పుడు అదేబుద్ధిగా, ఆలోచనగా, ఇంద్రియ జ్ఞానంగా పని చేస్తుంది. విశ్వమయమైన చిత్తానికిఅహంకారం విధించే పరిమితులుండవు. దానికి తన నుంచి భిన్నమైనదేదీఉండదు, అందువల్ల దానికి ఉండేదల్లా కేవలం ఎరుకే. బైబిల్లో "నేను నేనైననేను" అనే వాక్యానికి అర్థమిదే

మనస్సు తన ఆత్మ అనే శుద్ధ చైతన్యంలో దగ్ధమై పోయినప్పుడు అన్ని శక్తులూమాయమైపోతాయి. అంటే మక్కువ కలిగించే శక్తి, పని చేయించేది, తెలుసుకునేశక్తి పంటివన్నీను, ఇవన్నీ వ్యక్తిత చైతన్యంలో ఉదయించే అభూత కల్పనలనిఎరిగి, మాయమవుతాయి. ఆలోచిస్తూ, మరచిపోతూ ఉండే అపరిశుద్ధ మనస్సేసంసారమంటే. అదే జనన మరణాల పరిభ్రమణం. ఈ ఆలోచించటంమరచిపోవటం వంటి కలాపాలన్నీ నాశనమై పోతాయి అసలైన "నేను" లోఅదే శుద్ధమైన విముక్తి. అందులో ప్రమాదం లేదు (ఆత్మని మరచిపోవటంఅంటూ ఏమీ లేదు). ప్రమాదమే జనన మరణాలకు కారణం

ప్ర: అహంకారాన్ని నాశనం చేయటమెట్లా

జ: మొదట అహంకారాన్ని పట్టుకొని తర్వాత దానినెట్లా నాశనం చేయాలో అడుగుఆ ప్రశ్నని వేసేదెవరు? అహంకారమే. ఈ ప్రశ్న వేయటం వల్ల అహంకారంనిలుస్తుందే కాని నాశనం కాదు. అహంకారాన్ని అన్వేషిస్తే, అహంకారమంటూఏమీ లేదని గ్రహిస్తావు. దానిని నాశనం చేయటానికి అదే మార్గం

ప్ర: సాక్షాత్కారమెట్లా సాధ్యం

జ మంటనుంచి నిప్పుకణం లేచినట్లు ఆత్మనుంచి అహంకారం లేస్తుంది. లేవగానేదేనితోనో తాదాత్యం చెందుతుంది. అజ్ఞానిలో అట్లా దేనితోనైనా ఐక్యతచెందకుండా అది మన లేదు. ఈ ఐక్యతే అజ్ఞానం. దానిని నాశనం చేయటమేమన లక్ష్యం. అట్లా దేనితోనైనా ఐక్యత చెందే దాని ప్రవృత్తిని నాశనం చేస్తేఅది శుద్ధంగా ఉండటమే కాక, తన మూలంలో నిమగ్నమయి పోతుంది కూడాశరీరంతో తప్పుగా ఐక్యతని చెందటాన్ని దేహాత్మబుద్ధి అంటారు. (నేను దేహాన్నిఅనే భావం) ఇది పోతేనే గాని సత్ఫలితాలు రావు. ఎప్పుడూ రెండు ఆలోచనలకినడుమ గల వ్యవధిలో 'నేను" అనేది శుద్ధ రూపంలో అనుభవ సిద్ధమవుతుంది. గొంగళి పురుగు ఒక దాని పట్టు విడవాలంటే, రెండోది దొరకాలి. అహంకారం కూడ అంతే, ఏ ఇతర వస్తువులూ, అలోచనలూ దాని పట్టుకి చిక్కునప్పుడేదాని స్వరూపం తెలుస్తుంది

ఏ రూపమూ లేని అహంకారమనే ఈ భూతం ఏదో ఒక రూపాన్ని పటుకుంటుంది. అలాగే ఒక దానిని విడిచి మరొక దానిని పట్టుకుంటుంది.విడవకుండా అట్లాగే ఉంటుంది. పెద్దవుతూంటుంది. తీరా దానిని చేజిక్కించుకోబోతే, అది పారిపోతుంది

నేను దేహాన్నని" అనే రూపంలో ఉత్తమ పురుషమైన అహంకార ముంటేనే

మిగిలినవన్నీ ఉంటాయి. (అంటే-నువ్వు, వాడు, అది, అవి వగైరా) ఆ ఉత్తమ

పురుష స్వరూపాన్ని పరిశీలిస్తే అది నాశనమవుతుంది. అట్లాగే ద్వితీయ, తృతీయ

పురుషులకూడా. అప్పుడు మిగిలేదల్లా అసలు నిజస్వరూపమే, అది ఆత్మస్థితిగా

ప్రకాశిస్తుంది

నేను చీమూ నెత్తురూ కల దేహాన్ని" అనే ఒక్క భావానికే మిగిలిన భావాలన్నీదారానికి గుచ్చినట్టు కట్టబడి ఉంటాయి. కాబట్టి "ఈ నేను అనేది ఎక్కడుందిఅని మనం లోపలికి చూసుకుంటే, "నేను' అనే భావంతో సహా అన్ని భావాలూఅంతమవుతాయి. అప్పుడు ఆత్మజ్ఞానం తనంతటతానే స్వయం విదితమవుతుంది

ప్ర: శ్రీ భగవాన్ రచనలని చదివినప్పుడు విచారమార్గమొక్కటే అత్మసాక్షాత్కారానికిసరియైనది అని తెలుస్తుంది.

జ:అవును. ఆత్మ విచారమే

ప్ర దానిని చేయటమెట్లా

జ: తనకి ఆత్మ ఉన్నదన్న సంగతి మొదట పృచ్ఛకుడు ఒప్పుకోవాలి. "నేనున్నానన"దేసాక్షాత్కారం. ఈ ఆచూకీని సాక్షాత్కారమయే వరకూ వెంటాడుతూండటమేవిచారమార్గం. విచారమూ, సాక్షాత్కారమూ ఒకటే.

ప్ర: ఇది పట్టుబడేది కాదు. నేను దేని గురించి ధ్యానం చెయ్యాలి?

జ: ధ్యానానికి ధారయానింప వలసిన విషయమంటూ ఒకటుండాలి. ఇక విచారణలోకర్తే ఉన్నాడు గాని విచారింప వలసిన విషయమంటూ ఏమీ లేదుధ్యానానికీ విచారానికీ ఈ తేడా ఉంది.

ప్ర: ఆత్మసాక్షాత్కా రానికి ధ్యానం కూడా ఒక ఉత్తమమైన పద్ధతే కదా

జ

ధ్యానమంటే ఒక విషయంపైన ఏకాగ్రత ఉండటం. ఇతర ఆలోచనలు

రానీయకుండా, ఒకే ఒక ఆలోచనపై మనస్సుని లగ్నం చేయటానికిది

ఉపయోగిస్తుంది. కాని, సాక్షాత్కారానికి ఆ ఒక్క అలోచన కూడా పోవాలి.

అయినా, సాక్షాత్కారమనేది కొత్తగా సాధించ వలసిందేమీ లేదు. అది ఎప్పుడూఉంటూనే ఉంది. ఎటొచ్చీ ఆలోచనల తెర దానిని మరుగుపరచింది. తెరనితొలగిస్తే సాక్షాత్కారం అవుతుంది. మన ప్రయత్నమంతా ఇదే.ధ్యానం చేసుకోమని సాధకులకు చెప్తే ఆ సలహాతో సంతృప్తి పడి వెళ్తారు. కానివారిలో ఎవరైనా వెనక్కి తిరిగి "ఏదో విషయంపై ధ్యానించ వలసిన నేనెవర్ని"అని ప్రశ్నిస్తేనో అతనికి ఆత్మని తెలుసుకోమని చెప్పాలి. అదే అంతిమం. అదేవిచారం

ప్ర ధ్యానం లేకుండా విచారమొక్కటే చాలునా

జ: విచారమే మార్గమూ, గమ్యమూ కూడా. "నేను" అన్నదే గమ్యం. అదే పరమసత్యం. దానిని ప్రయత్న పూర్వకంగా పట్టుకొని ఉండటమే విచారం. అదిఆకస్మికంగా, సహజంగా ఉండటమే సాక్షాత్కారం. సాధనకి అన్నిటికన్నాప్రేష్టమైన విచారమార్గాన్ని విడిస్తే, మనస్సుని అణచివేసే వేరే సరియైన మార్గాలులేవు. ఇతర మార్గాల ద్వారా దానిని అణచి వేసినా అది కొంతసేపు అణగినట్లేఉండి మళ్ళీ లేస్తుంది. నీ కేవల స్వరూపాన్ని సాక్షాత్కరింప చేసుకోవటానికి గురితప్పని, సూటి అయిన మార్గం ఆత్మ విచారమొక్కటే

ప్ర: జ్ఞాన సంపాదనకి ఆత్మ విచార మొక్కటే సూటి అయిన మార్ధమని ఎందుచేతఅంటున్నారు

జ: ఆత్మ విచారంలో తప్ప ఏ ఇతర సాధనా పద్ధతిలో నైనా మనస్సే ఉపయోగింప బడుతుంది. మనస్సు లేకుండా ఆ అభ్యాసాలు సాగవు. సాధన చేసేప్పుడు ఒక్కో దశలో అహంకారం సూక్ష్మమైన రూపాన్ని దాల్చవచ్చు. కాని అది మాత్రం నశించదు. జనకుడు "నన్నిళాల బట్టి పీడిస్తున్న దొంగ దొరికాడు. అతనినింక విడిచేది లేదు" అని అన్నప్పుడు ఆయన చెప్పేది మనస్సు లేక అహంకారం గురించే.

ప్ర.అయినా ఆ దొంగని ఇతర సాధనా పద్ధతుల ద్వారా కూడా పట్టుకోవచ్చుకదా.

జ: అహంకారాన్ని లేక మనస్సుని ధ్వంసం చేయటానికి ఆత్మ విచారం తపవేరే ఏ ఇతర మార్గంలోనైనా, దొంగే పోలీసు వాడిగా నటించి తనను తానుపట్టుకుంటున్నట్టుగానే ఉంటుంది. అహంకారంగాని, మనస్సుగాని, లేనే లేదన్నసత్యాన్ని ఆత్మ విచారమొక్కటే విశదం చేసి, ఏ రూపాంతరమూ లేని శుదకేవల ఆత్మని సాక్షాత్కరింప చేయగలదు.

ఆత్మజ్ఞానం కలిగిన తరువాత వేరే తెలుసుకోవలసిందేమీ లేదు. అదేపరిపూర్ణమైన ఆనందం. అంతా అదే

ప్ర:ఇతర పద్ధతుల కంటె త్మవిచారమే సూటి అయినదంటారు. ఏ విధంగా

జ: నేను ఈ దేహాన్ని" అనుకుంటూ చావు పుట్టుకలతో ఉండే ఈ సంసారసాగరాన్ని దాటాలంటే ఆశ్రయించవలసిన ఒకే ఒక నౌక ఏ రూపమూలేని,నిత్యమూ ప్రకాశించే అవిభాజ్యమైన ఆత్మనే, 'నేను' అనే సత్యాన్నే ఆహంకారమంతర్ధాన మవటమే సత్యమంటే. అహంకారం యొక్క స్వరూపాన్నితెలుసుకొని దానిని ధ్వంసం చేయి. అప్పుడు అస్తిత్వమే లేని అహంకారంతనంతట తానే మాయమవుతుంది. సత్యం ప్రకాశిస్తుంది. ఇదే సూటి అయినమార్గం. ఇతర మార్గాలన్నీ అహంకారాన్ని అట్లాగే ఉంచుతాయి. వాటిలోఎన్నో సందేహాలుదయిస్తూనే ఉంటాయి. 'నేనెవర్ని' అనేది ఆఖరి ప్రశ్నగా మిగిలిపోతుంది. అప్పుడు దాని సంగతి చూడాలి. కాని ఈ పద్ధతిలో ఆ ఆఖరి ప్రశ్న, ఒకే ఒక ప్రశ్న, దానిని ఆరంభంలోనే లేవనెత్తుతాం. ఈ అన్వేషణకి ఏ సాధనా అక్కర్లేదు.

మనమే సత్య స్వరూపులం - కాని ఆ సత్యాన్నే వెతుక్కుంటూంటాం. అంతకన్నాఆశ్చర్య పడవలసిందేమిటి? మన సత్యాన్ని ఏదో దాచేస్తోందనీ, దానిని ద్వంసంచేస్తేనే గాని సత్యం దొరకదనీ అనుకుంటాం. ఇదెంతో హాస్యాస్పదం. దీనికైనీవు చేసిన ప్రయత్నాలనన్నిటినీ తలచుకొని నవ్వుకొనే రోజు ఎప్పుడో వస్తుంది.నువ్వు అట్లా నవ్వుకోవలసిన దినం ఇప్పుడే, ఇక్కడే ఉంది!

## 5.ఆత్మ విచారము - అభ్యాసము

ఆత్మవిచారాన్ని కొత్తగా ప్రారంభించిన వారికి శ్రీ రమణులు ఒక సలహానిస్తూండేవారు. లోపలకల "నేను" అనుభూతిపై సావధానమై, సాధ్యమైనంతవరకూ విడవకుండా పట్టుకోమని. ఏకాగ్రత ఇతర భావాల వల్ల చెల్లా చెదరయితేఅట్లా చెదురుతున్నట్లు తెలియగానే "నేను" అనే భావం వైపు ఎరుకని మళ్లించుకోవాలనే వారు.

ఈ పద్ధతి నవలంభించటానికి వారనేక మార్గాలు సూచించేవారు. "నేనెవరిని"అని గాని, "ఈ నేను ఎక్కడనుంచి ఉద్భవిస్తోంది" అని గాని తనని తానుప్రశ్నించుకోమనేవారు. శరీరమూ, మనస్సూ చేసే వ్యాపకాల కన్నింటికీ తానే మూలకారణమని భావించే "నేను" ని ఎల్లవేళలా గమనించటమే అంతిమ లక్ష్యం.

ప్రారంభ దశలో "నేను" అనే అనుభూతిపై ఏకాగ్రత నిలపటం కేవలం మనస్సుకిసంబంధించిన వ్యాసంగం. అది ఒక భావంగా, ఒక ఎరుకగా మాత్రమే ఉంటుంది.అభ్యసించిన కొద్దీ 'నేను' అనే భావం తొలగి, "నేను' అనే అనుభూతి కలుగుతుందిఈ అనుభూతి ఇతర భావాలతో, విషయాలతో సంబంధాన్ని త్రుంచేసుకుంటేపూర్తిగా మాయమై పోతుంది. మిగిలేదల్లా సంస్థితమయినట్టు అనుభవం, తానువ్యక్తిననే భావం తాత్కాలికంగా తొలగుతుంది. మొదట్లో ఈ అనుభవం అప్పుడపుడేకలిగినా, క్రమేపీ అభ్యాసం వల్ల దానిని అందుకోవటమూ, నిలుపుకోవటమ కూడాతేలిక అవుతాయి. ఆత్మవిచారం ఈ స్థాయికి చేరితే ఏ ప్రయాసా లేకుండాసంస్థితమయినట్టు ఎరుకే ఉంటుంది. వ్యక్తిగతమైన ప్రయత్నముండదు. దీనికికారణం, ప్రయత్నించే "నేను" అనేది తాత్కాలికంగా మాయ మవటం. అప్పుడపుడుఅహంవృత్తి తల ఎత్తుతూంటుంది. కాబట్టి అది ఆత్మసాక్షాత్కారమైన స్థితి కాదు. కానిఅభ్యాసానికి పరాకాష్ట అదే, ఈ స్థితిని మళ్ళీ మళ్ళీ అనుభవిస్తూంటే అహంవృత్తినిరేకెత్తించే వాసనలు నాశనమవుతాయి. వాటి పట్టు సన్నగిల్లిన కొద్దీ ఆత్మ శక్తీ ఇంకామిగిలియున్న కొద్ది వాసనలనీ ధ్వంసం చేస్తుంది. దానితో, అహంవృత్తి ఇంక తలఎత్తదు. ఇక తిరుగులేని, అంతిమమైన సాక్షాత్కార స్థితి యిది.

నేను" అనే భావంపై సావధానమూ, ఎరుకా ఒక సున్నితమైన పద్ధతి - మనస్సునినిగ్రహించటానికి అవలంబించే ఇతర కఠిన అభ్యాసాల అవసరాన్ని దాటేస్తుంది. ఇది ఏకాగ్రతకి సంబంధించిన అభ్యాసం కాదు. అన్ని భావాలనీ అణచి వేసే పద్ధతీకాదు. మనస్సు ఎక్కడ్నుంచి ఉద్భవిస్తుందో ఆ మూలస్థానం గురించిన ఎరుకనే ఇది ఆహ్వానిస్తుంది. ఆత్మవిచార పద్ధతి లక్ష్యము మనస్సు యొక్క మూలాన్ని ఎరిగిఅందులో లీనమవటం, తన నిజస్థితి గురించి ఎరుక కలిగి, దానికి భిన్నమైన వాటిపట్ల ఆసక్తిని ఉపసంహరించుకోవటం ప్రారంభదశలలో భావం నుంచి భావించే వానిపట్ల అవధానం కలగటానికి ప్రయత్నం చేయవలసి వస్తుంది. "నేను" అనే అనుభూతికిసంబంధించిన ఎరుక బాగా స్థిరపడిన తర్వాత ఇంక ప్రయత్నమూ అనవసరమే.అప్పట్నుంచి సంస్థితమై ఉండటమే గాని ప్రయత్నమంటూ ఏమీ ఉండదు. ఇదిఅనాయాసంగా సంస్థితమవటమే, ప్రయాస పడటం కాదు.

నిజస్థితిలో ఉండటానికి ప్రయత్నమవసరం లేదు. అది ఎప్పుడూ ఉండేదే.అనుభవ సిద్ధమయేదే. తానుకాని శరీరంగా, మనస్సుగా నటించటానికి ఎంతో ప్రయాసపడాలి. మానసికంగా, పరోక్షంగా, ఆత్మవిచార పద్ధతిలో చివరిదశలో ప్రయత్నమనేదిఅనుభూతి నుండి అవధానాన్ని తప్పిస్తుంది. మానసికమైన ప్రయాసలేకపోతేఆ అనుభూతి సంభవిస్తుంది. చిట్ట చివరికి ఆత్మ అనేది ఏ ప్రయత్నం వల్లా బయటపడదు. సంస్థితమై ఉండటం వల్ల తప్ప.

శ్రీరమణులు అన్నట్లు<br>
" ధ్యానం చేయకు - సంస్థితమై ఉండు.<br>
నేనున్నానని భావించు - సంస్థితమై ఉండు.<br>
ఉండటం గురించి భావించకు - ఉన్నావు నీవు."

ఆత్మవిచారమనేది ఒక ధ్యాన పద్ధతి అనీ, దానికి నియమితవేళలూ,ఆసనాలూ ఉన్నాయనీ అనుకోకూడదు. మేల్కొని ఉన్నంత సేపూ ఏ పని చేస్తున్నాఅది కొనసాగుతూనే ఉండాలి. పనులు చేయటానికీ, ఆత్మ విచారానికీ పొత్తులేదని శ్రీ రమణులు ఎప్పుడూ అనలేదు. కొద్ది పాటి అభ్యాసంతో దానిని ఏ పరిస్థితులలోనైనా చేయవచ్చనేవారు. ప్రారంభదశలో ఉన్నవారికి మాత్రం నియమితసమయంలో అభ్యాసం మంచిదనే వారు. అంతేగాని, గంటల తరబడి కూర్చునిధ్యానం చేయటాన్ని ఆమోదించేవారు కారు. అట్లాగే, లోక వ్యవహారాలను విడచిధయాన నిమగ్నులమై జీవితాన్ని గడుపుతామనే భక్తులను ఏమాత్రము ఆమోదించేవారు కాదు.

ప్ర: అన్వేషణ ద్వారా అత్మని తెలుసుకోవచ్చన్నారు మీరు. ఈ అన్వేషణ లక్షణమేమిటి

జ: నువ్వు మనస్సువి అనుకుంటావు. మనస్సంటే ఆలోచనల సమూహంతప్ప మరింకేమీ కాదు. ఈ ఆలోచనలన్నిటి వెనుకా సాధారణంగా ఒకభావముంటుంది. అది 'నేను' అనే భావం - అదే నువ్వన్న మాట. "నేను' అనేభావాన్ని మొదటి భావమందాం. దీనినే విడవకుండా పట్టుకొని అదేమిటోప్రశ్నించు. ఈ ప్రశ్న నీలో బలీయమైన కొద్దీ ఇతర భావాలకి తావుండదు

ప్ర: నేను' అనే భావాన్ని విడవకుండా ఉన్నచా ఇతర భావాలు వస్తూ పోతూ ఉంటాయి

ఏవరిని నేను" అని నన్ను నేను ప్రశ్నించుకుంటూనే ఉంటాను. కాని దానికి

సమాధానమేమీ రాదు. ఈ స్థితిలో ఉండటమేనా అభ్యాసమంటే

జ సాధారణంగా అందరూ చేసే పొరపాటిదే. ఆత్మాన్వేషణని ఎంతో చిత్తశుద్ధితోకొనసాగిస్తే 'నేను' అనే భావం మాయమవుతుంది. నీ అంతరాంతరాలలో నుంచివేరొకటి నిన్ను పట్టుకుంటుంది. అది, అన్వేషణని ప్రారంభించిన 'నేను' మాత్రంకాదు.

ప్ర: ఏమిటా వేరొకటి?

వడి

జ: అదే అసలైన ఆత్మ. అది అహంకారం కాదు. పరమోత్కృష్ట మయినదదే

ప్ర అన్వేషణ ప్రారంభించేవ్పుడు ఇతర భావాలని త్రోసిపుచ్చాలని మీరనేకసార్లన్నారు. కాని ఆలోచనలకి అంతేలేదు. ఒక భావాన్ని నిరాకరిస్తే ఇంకొకటివస్తుంది, దానిని త్రోసిపేస్తే మరొకటి. ఇట్లాగే అంతులేకుండా వస్తూంటాయి.

జ: భావాలని త్రోసిపుచ్చాలని నేననను. 'నేను' అనే భావాన్ని విడవకుండా ఉండు. ఆ ఒక్క భావంపైనే నీ ఆసక్తి అంతా ఉంటే, మిగిలిన భావాలు వాటంతట అవేనిరాకరింపబడుతాయి. అవి మాయమవుతాయి.

ప్ర: అంటే భావాలను తిరస్కరిస్తూండ నవసరం లేదన్నమాట.

జ: అక్కర్లేదు. కొందరికి కొంతసేపు అవసరముండవచ్చు. ఒక్కొక్క ఆలోచననేతిరస్కరిస్తూంటే వాటికి అంతులేదని నీకనిపిస్తుంది. అది నిజం కాదు.వాటికి అంతముంది. ఎంతో మెలకువగా ఉంటూ, ఉదయించే ప్రతి ఆలోచననీ గట్టిగా త్రోసిపుచ్చుతూంటే, నీలోకి నీవు ఇంకా లోతుగా వెళ్తున్నట్టు తెలుసుకుంటావు. ఆ స్థాయికి చేరగానే భావాలని త్రోసిపుచ్చే ప్రయత్నమేమీచేయనక్కరలేదు

ప్ర: అంటే, ఏ ప్రయత్నమూ, ప్రయాసా లేకుండా ఉండటం సాధ్యమేనన్న మాట.

జ: అంతేకాదు - ఒక దశ తరువాత ప్రయత్నం చేయటమే అసాధ్య మవుతుంది.

ప్ర: నా కింకా తెలుసుకోవాలని ఉంది. కృషి అంటూ చేయకుండా ఉండటానికి నేను ప్రయత్నించాలా?

జః ఇక్కడ ఏ కృషీ లేకుండా ఉండటం అసాధ్యం. నీవు లోపలకి వెళ్ళిన కొద్దీకృషి చేయటం అసాధ్యం. అహంవృత్తి యొక్క మూలాన్ని కనుగొనటానికిమనస్సు అంతర్ముఖ మయితే వాసనలన్నీ పోతాయి. ఆత్మయొక్క కాంతేవాసనలపై పడుతుంది. ఇవే ప్రతిబింబిత మవుతాయి. దీనినే మనం మనస్సనిచెప్పుకుంటాం. వాసనలు పోతే మనస్సూ పోతుంది.

అది హృదయమనేసత్యజ్యోతిలో విలీనమైపోతుంది. సాధకుడు తెలుసుకోవలసిన సారాంశమిదేఅతను చేయవలసిందల్లా అహంవృత్తి యొక్క మూలం గురించి చిత్తశుద్ధితోఏకాగ్రతతో విచారించటమే.

ప్ర: ఈ అభ్యాసాన్ని ప్రారంభ దశలో ఉన్నావాడెట్లా చేయాలి?

జ: నేనెవరిని' అనే విచారణ ద్వారానే మనస్సు అణగి పోతుంది. 'నేనెవరిని' అనేభావం మిగిలిన భావాలని నాశనం చేసినట్టే, అదీ నాశనమవుతుంది. చితిమీదఉన్న మంటని అటూ ఇటు కదపటానికి ఉపయోగించే కట్టె వలెనే ఇదీను. వేరేభావాలు ఉదయించగానే వాటిని వెంబడించక 'ఎవరికి ఉదయిస్తున్నాయ'ని ప్రశ్నించుకోవాలి. ఎన్ని భావాలుదయిస్తే మాత్రమేం? ఒక భావముదయించగానేఎంతో నిశితంగా "ఎవరికి ఉదయిస్తోందిది" అని ప్రశ్నించుకుంటే "నాకు" అనిసమాధానం వస్తుంది. అప్పుడు "ఎవరిని నేను" అని ప్రశ్నించుకుంటే మనస్సుతన మూలమైన ఆత్మవైపు మళ్ళుతుంది. ఉదయించిన భావం అణగి పోతుందిఇట్లా పదే పదే అభ్యాసం చేస్తూంటే మనస్సుకి తన మూల స్థానంలో ఉండగలశక్తి ఎక్కువవుతుంటుంది.

విషయ వాసనలు ఎంతో కాలంగా వస్తూనే ఉన్నాయి. సముద్రం మీదకెరటాల వలె అవి లెక్కలేనన్నివి, నిజ స్వరూపం గురించి నీ ధ్యానమెక్కువైనకొద్దీ అవి తగ్గిపోతాయి "ఈ వాసనలన్నిటినీ పోగొట్టి అత్మలో సంస్థితమవటం సాధ్యమేనా" అనే సందేహానికి తావీయకుండా, ఆత్మావలోకాన్ని విడవకుండాఉండాలి.

మనస్సులో విషయ వాసనలున్నంత కాలం 'నేను ఎవరిని' అనే విచారం అవసరమే. ఒక్కొక్క భావమూ ఉదయిస్తూంటే దానిని అక్కడికక్కడే మూలంలోనే విచారం ద్వారా ధ్వంసం చేసేయాలి. 'అన్యమైన వాటి పట్ల ధ్యాసలేకపోవటాన్ని వైరాగ్యమూ, నిరాశా అంటారు. ఆత్మని విడకుండా ఉండటమేజ్ఞానం. నిజానికి వైరాగ్యమూ, జ్ఞానమూ ఒక్కటే. ముత్యపు చిప్పలని తీసుకురావటానికి గజ ఈతగాడు నడుముకి ఒక రాయిని కట్టుకొని సముద్రంలోకిదిగుతాడు. అట్లాగే, వైరాగ్యంతో ప్రతివారూ తమ లోపలికి దిగితే ఆత్మ అనేముత్యాన్ని సాధించ గలుగుతారు. ఆత్మ సాక్షాత్కారం కలిగే దాకా, ఎల్లవేళలూస్వరూప స్మరణ కలిగి ఉండటమే చాలు.

"బంధంలో ఉన్న నేనెవరిని" అని విచారిస్తూ తన నిజస్వరూపాన్ని తెలుసుకోవటమేవిముక్తి అంటే, ఎప్పుడూ ఆత్మపైనే మనస్సుని లగ్నం చేయటమే ఆత్మవిచారమంటే. తానెప్పుడూ బ్రహ్మమే, సచ్చిదానందమే అని భావించుకోవటమే ధ్యానమంటే.

ప్ర: సత్యాన్వేషణకి, లోకాన్ని సన్యసించి అడవులకి వెళ్లాలి అని యోగులంటారేమరి

జ: కర్మతో కూడిన జీవితాన్ని సన్యసించనక్కర్లేదు. రోజు ఒకటి రెండు గంటలుధ్యానంలో గడిపితే, నీ పనులను నీవు చేసుకోవచ్చు. సరియైన పద్ధతిలోధ్యానం చేస్తే మనస్సులో ఉదయించిన ప్రవాహం నీవు ఏ పని చేసుకుంటున్నానిలుస్తుంది. ఒకే భావాన్ని రెండు విధాల చెప్పినట్టే ఇదీను. ధ్యానంలో నీవుఅనుసరించేదే, నీ వ్యాపకాలలో కూడా వ్యక్తమవుతుంది. గది

ప్ర: అట్లా చేయటం వల్ల కలిగే ఫలితమేమిటి?

జ: అట్లా చేస్తుంటే కొంత కాలానికి వ్యక్తుల పట్ల, సంఘటనల పట్లా బాహ్యవస్తుజాలం పట్లా నీ దృక్పథం క్రమంగా మారుతున్నట్లు గమనిస్తావు. నీకార్యకలాపాలు వాటంతటవే నీ ధ్యానాన్ని అనుసరిస్తాయి

ప్ర: అంటే మీరు యోగులతో ఏకీభవించరన్నమాట.

జా తనని లోకానికి బంధించే స్వార్థపరత్వాన్ని మనిషి త్యజించాలి. అసత్యమైననేను' ని విడనాడటమే అసలైన సన్యాసం

ప్ర: లోకంలో వ్యవహరిస్తూ స్వార్ధ రహితమెట్లా అవటం

జ: జ్ఞానానికీ, కర్మాచరణకీ వైరుధ్యమేమీ లేదు

ప్ర అంటే, ఎప్పటివలెనే తన వృత్తిలోనో, మరెందులోనో వ్యాపకాలను కొనసాగించుకుంటూ జ్ఞానోదయం పొందటం సాధ్యమేనంటారా"

జ ఎందుకు కాదు? అప్పుడు పూర్వపు వ్యక్తి సని చేస్తున్నాడని పించదు, అతని చైతన్యంఅహంకారం చుట్టూ కేంద్రీక్ృతం కాకుండా క్రమంగా జరిగిపోతుంది కాబటి

ప్ర: ఏవో పనులలో నిమగ్నమయే వానికి, ధ్యానం చేసుకునే సమయమే చిక్కదు.శ్రీ జధ్యానానికంటూ కొంత సమయాన్ని కేటాయించటం ఆధ్యాత్మిక విషయాలుబొత్తిగా తెలియని వారికే. పురోగమిస్తున్న కొద్దీ వ్యక్తి పని చేస్తున్నా చేయకపోయినా అంతరంగంలోని ఆనందాన్ని అనుభవిస్తూనే ఉంటాడు. అతని చేతులుపని చేస్తూండవచ్చు. కాని అతని మెదడు ఏకాంతంలో చల్లగా ఉంటుంది

ప్ర: మీరు యోగ పద్ధతిని చెప్పరన్న మాట

జ మనస్సుని గమ్యం వైపు తీసికొని వెళ్లాటానికి ప్రయత్నిస్తాడు. యోగి - పశులకాపరి పశువును కట్టతో తోలినట్టు. ఈ పద్ధతిలో మాత్రం సాధకుడు చేతిలోగడ్డిని పట్టుకొని చూపిస్తూ పశువుని బుజ్జగిస్తాడు

ప్ర దానినెట్లా చేస్తాడు

యని

జ ఎవరిని నేను" అనే ప్రశ్నని వేసుకోవాలి. ఈ పరిశీలన చివరికి నీ మనస్సుకివెనుక, నీలోనే ఉన్నదానికి చేరుస్తుంది. ఆ పెద్ద సమస్యని పరిష్కరించుకుంటేమిగిలిన వాటినన్నిటినీ కూడ పరిష్కరింపగలవు

ప్ర: నేను' అన్వేషించటం వల్ల కనబడేది ఏమీ లేదు

జ: నీవు దేహంతో తాదాత్మ్యం చెంది, కంటితో చూడటానికి అలవాటు పడిపోవటంవల్ల ఇంకేదీ కనబడదంటున్నావు. చూడటానికేముంది

చూసేదెవరు? చూసేదెట్లా? ఉన్నదల్లా ఒకే ఒక చైతన్యం. అదే నేను'గారూపం దాల్చి శరీరంతో తాదాత్మ్యం చెంది, కళ్ల ద్వారా బయటకు వెళ్లి, చుట్టూ ఉన్న వస్తువులని చూస్తుంది. మేల్కొని ఉన్నప్పుడు వ్యక్తి పరిమితుడైఏదో భిన్నమైన దానిని చూడాలనుకుంటాడు. ఇంద్రియాల సాక్ష్యమే తిరుగులేనిఆధారమనుకుంటాడు. కాని ద్రష్ట, దృశ్యము, దృక్కు అన్నీ "నేను' 'నేను' అనేఒకే ఒక చైతన్ాయానికి భిన్న రూపాలని ఒప్పుకోడు. ఆత్మ దృగ్గోచరమన్న భ్రమనిచింతన తొలగిస్తుంది. నిజానికి దృశ్యమానమైనదేదీ లేదు. ఇప్పుడు 'నేను'అనేదాన్ని ఎట్లా అనుభవిస్తున్నావు? నీ గురించి తెలుసుకోవటానికి ఎదురుగాఅద్దాన్ని పట్టుకొని ఉన్నావా? ఎరుకే 'నేను' అంటే. దానిని గ్రహించు. అదేసత్యం

ప్ర: ఆలోచనల మూలం గురించి చేసే విచారణ వల్ల నేను' అనే దాని గురించి ఒకఎరుక కలుగుతుంది. కాని అది నాకు సంతృప్తి నివ్వటం లేదు

జ నిజమే. 'నేను' అంటే కలిగిన ఎరుక ఏదో ఒక రూపంలో, బహుశః దేహంతోకూడి ఉంటుంది. శుద్ధ ఆత్మ దేనితోనూ జత కూడదు. ఆత్మ ఒంటరి, పరిశుద్ధమైన యదార్థం. దాని కాంతిలోనే దేహమూ, అహంకారమూ మెరుస్తాయిఅన్ని భావాలనీ అణచి వేసిన తరువాత మిగిలేదల్లా శుద్ధ చైతన్యమే

నిద్రనుండి మేల్కొన్న వెంటనే, ఇంకా ప్రపంచాన్ని ఎరుగక ముందు, ఆ

స్వచ్ఛమైన "అహం, అహం" ఉంటుంది. నిద్రపోకుండా ఆలోచనలు నిన్ను

చుట్టుముట్టకుండా, దానిని విడువక పట్టుకొని ఉండు. దానిని గట్టిగా పట్టకొని

ఉంటే, ప్రపంచాన్ని చూసినా ఫరవాలేదు. బయటకనబడే దృశ్యం వల్ల ద్రష్ట

ఏమీ ప్రభావితుడు కాడు.

అహంకారమేమిటి? విచారించు. శరీరం అచేతనం, "నేను' అనలేదు. ఆత్మ శుద్ధ చైతన్యం రూపాంతరం లేనిది. 'నేను' అని అదీ అనలేదు. గాఢ నిద్రలోనేను' అని ఎవ్వరూ అనరు. అయితే, అహంకార మేమిటి? అచేతనమైనదేహానికీ, ఆత్మకీ నడుమ ఉండేది. దానికి అస్తిత్వమంటూ ఏమీ లేదు. దానినిఅన్వేషించబోతే, భూతం వలె మాయమై పోతుంది. చీకట్లో, నీడ కదిలిక వల్ల తనప్రక్కనే భూతముందని ఎవరైనా అనుకోవచ్చు. పరీక్షగా చూస్తే అక్కడ నిజానికి భూతమే లేదనీ, తాను భూతమని కల్పన చేసుకున్నది ఏ చెట్టో, కట్టో అనిఉగ్రహిస్తాడు. అతనట్లా పరీక్షగా చూడకపోతే ఆ భూతమతనిని భయ పెట్టేస్తుందిచేయవలసిందల్లా నిశితంగా, పరీక్షించటమే. భూతం మాయమవుతుంది. అసలు భూతమక్కడ ఎప్పుడూ లేనేలేదు. అహంకారం కూడా అంతే. దేహహ్యేశుద్ధ చైతన్యానికీ నడుమ అగోచరమైన లంకె అది. అది వాస్తవం కాదు. దానినిపరీక్షగా గమనించనంత వరకూ అది బాధ పెడ్తూనే ఉంటుంది. కాని దానికోసవెతకటం ప్రారంభిస్తే అది లేనేలేదని తెలుస్తుంది. దీనినే వివరించటానికికథ ఉంది.

హిందువుల పెళ్ళిళ్ళల్లో విందులు అయిదారు రోజుల దాకా కొనసాగుతూంటాయివాటిల్లో ఒక సందర్భంలో ఎవరో అపరచిత వ్యక్తిని ఎంతో ముఖ్యుడనుకుంటూఆడ పెళ్ళివారు అతనికి ప్రత్యేకమైన మర్యాదలు చేశారు. ఆడపెళ్ళివారటాచేయటం చూచి వాళ్ళల్లో అతడు ముఖ్యుడనుకొని మగ పెళ్ళివారు కూడాఅతనిని ఎంతో మర్యాద చేశారు. ఆ కొత్త మనిషికిదంతా ఎంతో హాయిగాఉంది. అతనికి నిజమేమిటో తెలుసు. ఒకసారి, మగపెళ్ళివారు ఒక విషయంగురించి ఆయనని సంప్రదింతే మంచిదని, ఆడపెళ్ళివారిని అతని గురించిఅడిగారు. జరుగుతున్న దేదో పసిగట్టి అతను ఉడాయించాడు. అహంకూడాఅంతే. దానిని వెతకనారంభిస్తే మాయమవుతుంది. లేకపోతే, ఎన్నో చిక్కులుపెడ్తుంది

ంచిప్ర: నేనెవరిని' అనే పరిశోధన మొదలు పెడ్తే నాకు నిద్ర వస్తుంది. నేనేంచేయాలి

జ: మెలకువగా ఉన్న వేళల్లో ఎప్పుడూ నీ విచారాన్ని కొనసాగించు. అది చాలునిద్ర వచ్చే వరకూ నీ విచారణని కొనసాగిస్తూంటే, నిద్రలో కూడా ఆ విచారణసాగుతూనే ఉంటుంది. నిద్ర మేల్కొనగానే విచారణ మళ్ళీ ప్రారంభించుప్ర నాకు ప్రశాంతత ఎట్లా వస్తుంది

జ. ప్రశాంతత నీ సహజ స్థితి. ఆ సహజ స్థితికి ఆటంకం కలిగించేది మనస్సేనాకు ప్రశాంతత అనుభవంలోకి రావటం లేదం"టే దాని అర్థం నీ విచారణఅంతా మనస్సులోనే సాగుతోందని. మనస్సంటే ఏమిటో పరిశోధన చేయి. అదిమాయమై పోతుంది. ఆలోచనే మనస్సంటే - వేరే మనస్సంటూ ఏమీ లేదుఅయినా, ఆలోచన వస్తూండటం వల్ల అది ఎక్కడో పుట్టుతోందని అనుకొనిదానికి మనస్సని పేరు పెడ్తావు. అదేమిటో పరిశోధన చేస్తే మనస్సంటూ ఏమీలేదని తెలుస్తుంది. శాశ్వతమైన శాంతిని గ్రహిస్తావు.

ప్ర:

నేను' అనేది ఎక్కడ ఉద్భవిస్తోందని నేను వాచారణ చేస్తూంటే, మనస్సునిశ్చలమై పోయిన స్థితిని చేరుకుంటానే గాని దానిని దాట లేకపోతున్నాను. నాకే

భావమూ ఉండదు. అంతా శూన్యమే. కొద్ది వెలుగు వ్యాపించి ఉంటుంది. శరీరంలేనట్టూ అనిపిస్తుంది. అప్పుడు నాకే ఎరుకా ఉండదు. శరీరంగాని రూపంగానికనబడనూ కనబడదు. ఈ అనుభూతి దాదాపు అరగంటసేపు ఉంటుందిఎంతో హాయిగా ఉంటుంది. శాశ్వతమైన ఆనందాన్ని, లేక విముక్తిని లేక మోక్షాన్నిపొందటానికి ఇదంతా అవసరమనే అనుకోవచ్చా. ఆ అనుభూతే కొన్ని గంటలూ,

రోజులూ, నెలలూ నిలిచే వరకూ ఆ అభ్యాసాన్నే కొనసాగిస్తూండాలా

జ. ఇది విముక్తి కాదు. ఆ స్థితిని మనోలయమంటారు. అటే తాత్కాలికంగాభావం నిశ్చలమవట మనమాట. మనోలయమంటే ఏకాగ్రత, తాత్కాలికంగాభావ సంచలనాన్ని నిలపటం. ఈ ఏకాగ్రత సడలగానే పాతవీ కొత్తవీ అనేకఆ భావాలు యథా ప్రకారం వచ్చి పడతాయి. ఈ మనోలయం ఒక వెయ్యిసంవత్సరాలు నిలిచినా, ఆలోచన నాశనం కాదు - దానినే జీవన్మరణాల నుండివిముక్తి అంటారు. అందువల్లనే సాధకుడు ఎంతో మెలకువతో ఉండి, ఆఅనుభవమెవరికి కలుగుతోందో, ఆ హాయినెవరు పొందుతున్నారో విచారించాలిఇటువంటి విచారం లేకపోతే అతను యోగనిద్రలో పడిపోతాడు. ఆ స్థితిలోసరియైన మార్గదర్శకత్వం లేకపోవటం వల్ల చాలామంది విముక్తి చెందామనేభ్రమలో పడిపోయారు. కొద్దిమందే గమ్యాన్ని చేరుకోగలిగారు

ఈ కథవిను, ఈ విషయం బాగా తెలుసుతుంది. గంగాతీరాన ఒక యోగి ఎన్నోసంవత్సరాల పాటు తపస్సు చేస్తూండేవాడు. ఎంతో ఉత్కృష్టమైన ఏకాగ్రతనిచేరుకున్న తరువాత, ఆ స్థితిలో ఎక్కువ కాలం నిలవగలగటమే విముక్తి అనుకొనిదీనినే అభ్యసించటం ప్రారంభించాడు. ఒక రోజున తాను ఏకాగ్రపస్టితిలోకి వెళ్ళేముందు అతనికి దాహం వేసి శిష్యుణ్ణి పిలిచి కొంత గంగాజలం పట్టుకురమ్మని కోరాడు. కాని, శిష్యుడు నీరు తెచ్చేలోగా అతను యోగనిద్రలోకివెళ్ళిపోయి, ఆ స్థితిలో కొన్ని సంవత్సరాలుండి పోయాడు. ఆ నడుమ కాలంలోచాలా మార్పులు సంభవించాయి. అతను మేల్కొన్న వెంటనే "నీళ్ళు, నీళ్ళు"మఅంటూ అరచాడు. కాని అప్పటికి ఆ శిష్యుడూ లేడు, గంగాలేదక్కడఅతను మేల్కొనగానే మొట్టమొదట అడిగింది నీళ్లని, దీనికి కారణం, అతనుఆ ఏకాగ్ర స్థితిలోకి వెళ్లే ముందు, అతనికి అన్నింటికన్నా పైనున్న తలంపు నీటి గురించే. అతను ఏకాగ్రస్థితిలో ఎంత కాలమున్నా అతను తన భావాలను

తాత్కాలికంగానే లయ మొనర్చ గలిగాడు! అతనికి స్మారకం రాగానే అన్నింటికంటె పైనున్న భావమే ఎంతో వేగంతో కట్టలు తెంచుకున్న నదీ ప్రవాహంవలెపెల్లుబికింది. అతను ధ్యానంలోకి వెళ్లే ముందు, అప్పుడే ఉదయించిన ఒక,భావం సంగతే ఇదైతే అంతకు పూర్వ నాటుకుపోయిన భావాలు ఏమాత్రమూధ్వంసం కాలేదన్నది స్పష్టమే. మనస్సు ధ్వంసమవటమే ముక్తి అయితే, అతనుముక్తి చెందినట్టేనా? సాధకులు మనోలయానికీ, మనోనాశనానికీ గల తేడాని.ఎప్పుడోగాని గ్రహించరు. మనోలయస్థితిలో భావాలు తాత్కాలికంగానే అణగిఉంటాయి. ఈ తాత్కాలిక స్థితి ఎన్ని వేల సంవత్సరాలు కొనసాగినా, ఆమనోలయం అంతం కాగానే అప్పటి వరకూ అణచి ఉన్న భావాలు మళ్ళీతిరిగి పైకి వస్తాయి. అందువల్ల ఆధ్యాత్మిక ప్రగతిని జాగ్రత్తగా గమనిస్తూండాలిఅట్లా అప్పుడప్పుడు సంభవించే మానసిక నిశ్చలత వల్ల ఉప్పొంగి పోకూడదుఇటువంటి నిశ్చలత అనుభవంలోకి రాగానే తన చైతన్యాన్ని మేల్కొలుపుకొని,ఆ అనుభవాన్ని పొందేదెవరని ప్రశ్నించుకోవాలి. ఏ ఆలోచనలూ రాకుండాజాగ్రత్తపడుతూనే యోగనిద్రలోగాని, స్వసమోమాహనంలో గాని, పడకుండాజాగ్రత్తపడాలి. ఆ స్థితి కూడా గమ్యం వైపు పురోగమనమే అయినా, ముక్ిియోగనిద్ర స్థితికీ గల తేడాని తేల్చేది అదే. ముక్తికి అన్నిటికన్నా సులభమైనసూటైన, దగ్గరైన మార్గం ఆత్మ విచారమే. ఆ పద్ధతిలో భావాలని కలిగించే శక్తినిమూలం వైపు మళ్ళించి, ఆ మూలంలోనే లీనమయ్యే వరకూ, తోలుతావు. అప్పుడేఅంతరంగ స్పందన కలిగి, నీవక్కడ నిలచినట్టూ అన్ని భావాలూ శాశ్వతంగార్వంసమైనట్టూ గ్రహిస్తావు

ప్ర: "నేను" అనే భావముదయిస్తుంది నాలో. కాని ఆత్మ ఎరుక కాదు నాకు.

జ: ఇవన్నీ మానసిక భావనలే. నువ్వు "నేను" అనే తప్పు భావంతో తాదాత్మ్యం చెందిఉన్నావు - అదే అహంవృత్తి. ఇది లేస్తూ, పడుతూ ఉంటుంది. అసలైన ఆత్మదీనికి అతీతం. నీ ఉనికి నిలచి పోవటమంటూ ఏమీ ఉండదు. నిద్ర పోయిననీవే ఇప్పుడు మెలకువగా ఉన్నావు. నిద్రలో నీకు విచారం లేదు. ఇప్పుడుంది.ఈ రకమైన అనుభవం దేనివల్ల కలిగింది? నిద్రలో "నేను" అనే భావం లేదుఇప్పుడుంది. అసలైన "నేను" తెలిసి రావటం లేదు. నకిలీ 'నేను' మాత్రంఅటూ ఇటూ తిరుగుతోంది. ఈ నకిలీ "నేన" నీ అసలైన జ్ఞానానికి ఆటంకం.

ఇది ఎక్కడ నుంచి వస్తోందో పరిశీలించు - మాయమవుతుంది. అప్పుడు నీనిస్థితిలో, కేవల స్థితిలో ఉంటావు

ప్ర: ఎట్లా చేయటం? నేనింతవరకూ చేయలేకపోయాను.

జనేను" అనే భావానికి మూలాన్ని అన్వేషించు. చేయవలసిందల్లా అదే. "నేను"అనే భావం వల్లే విప్పమంతా ఉంది. అది పోతే వ్యాకులత కూడా పోతుంది. నేనుఅనే తప్పుడు భావన, దాని మూలాన్ని కనుక్కోవటం వల్లనే పోతుంది. మనస్సునిఅదుపులో పెట్టటమెట్లా అని అడుగుతుంటారు. వీరికి నా సమాధాన మొక్కటేఆ మనస్సుని నాకు చూపండి, ఏమి చేయాలో తరువాత తెలుస్తుంది".ఆలోచనల సమూహమే మనస్సంటే, ఇదే అసలు విషయం. దానిని మాయంచేయాలన్న భావంతోగాని, కోర్కెతో గాని ఎట్లా చేయగలుగుతావు? నీ భావాలూకొర్కెలూ మనస్సులోని భాగాలే - కొత్త ఆలోచనలు వస్తున్న కొద్దీ మనస్సుపుష్టి నొందుతుంది. కాబట్టి, మనస్సతోనే మనస్సుని ధ్వంసం చేయ బూనటంఅవివేకం. దాని మూలమేదో కనుగొని దానిని అంటి పెట్టుకొని ఉండటమేమార్గం. అప్పుడు తనంతట తానే మనస్సు మాయమైపోతుంది. చిత్త వృత్తినిరోధాన్ని (అంటే, మనస్సు యొక్క కలాపాలని అదుపులో పెట్టటం) యోగంబోధిస్తుంది. నేను మాత్రం 'ఆత్మవిచారాన్ని'. ఇదే ఆచరణీయమైన పద్ధతిచిత్తవృత్తినిరోధం నిద్రవల్లో, అపస్మారకంలో పడటం వల్లో, ఉపవాసముండటంవల్లో సాధ్యమే. ఆ అవస్థ దాటగానే, భావాలు మళ్ళీ ఉదయిస్తాయి. దానివల్ల ప్రయోజనమేమిటి? మత్తెక్కినప్పుడు ప్రశాంతత ఉంటుంది. వ్యాకులతఉండదు. మత్తు పోగానే వ్యాకులపాటు మళ్ళీ వస్తుంది. కాబట్టి నిరోధం వృథఅది శాశ్వతమైన ఫలితాన్నివ్వలేదు

ఫలితం శాశ్వతంగా ఎట్లా అవుతుంది? దుఃఖానికి మూలాన్నని తెలుసుకోవటంవల్ల. దుఃఖం వస్తు జాలాన్ని లేక ఇతర విషయాలని చూడటం వల్ల కలుగుతుందిఅవి లేకపోతే, వాటిననుసరించి వచ్చే భావాలుండవు. అందువల్ల దుఃఖం తుడిచిపెట్టుకు పోతుంది. వస్తువులు లేకుండా ఎట్లా పోతాయన్నది తరువాతి ప్రశ్నవస్తువులన్నీ మనస్సుచే సృష్టింపబడేవే నంటాయి. శృతుతులన్నీ వాటికి నికరమైనఅస్తిత్వం లేదు. ఈ విషయాన్ని పరిశోధించి ఇందులోని సత్యాన్ని గ్రహించుదీనివల్ల తెలిసేదిది. బయటి ప్రపంచం, అంతరంగపు చైతన్యంలోనే ఉన్నదనిఆత్మ ఒక్కటే సత్యం - అదే అంతటా వ్యాపించి ఉంది, అదే ప్రపంచాన్ని కప్పి వేసేది కూడా. ద్వయీ భావముండనందువల్ల నీ ప్రశాంతతను భంచేయటానికి భావాలుదయించవు. అదే ఆత్మని గ్రహించట మంటే. ఆతనిత్యం - సాక్షాత్కారమూ అంతేనిన్ను కలవరపరచే భావం రాగానే ఆత్మని ఆశ్రయించటమే అభ్యాసమంటే. అది

ఏకాగ్రత కాదు. మనస్సు ధ్వంసం చేయటం కాదు. ఆత్మలో విలీన మవటమే

ప్ర: ఏకాగ్రత ఫలితాన్ిివక పోవటానికి కారణమేమిటి

జ: మనస్సుని నాశనం చేయమని మనస్సునే అడగటం, దొంగనే పోలీసుగాపనిచేయమనటం వంటిది. అతను నీతోబాటే వచ్చి దొంగను వెతుకుతున్నట్లునటిస్తాడు. దాని వల్ల ఏమీ చేకూరదు. అందువల్ల, నీవు లోపలికే చూచుకొని మనస్సుఎక్కడనుంచి ఉదయిస్తోందో తెలుసుకో, అప్పుడది మాయమవుతుంది

ప్ర: మనస్సుని లోపలికి సారించినప్పుడు, మనస్సునే ఉపయోగిస్తాం కదా

జ మనస్సునే ఉపయోగిస్తాం, నిజమే. మనస్సు సహాయంతోనే మనస్సుని ధ్వంసంచేయగలమన్నది అందరికీ తెలిసినదే, అందరూ ఒప్పుకునేదే. అయితేమనస్సంటూ ఒకటుందనీ దానిని నేను చంపుతాననీ ప్రారంభించకుండా ఆమనస్సు యొక్క మూలమేదో కనుక్కో - అప్పుడు మనస్సంటూ ఏమీ లేదనితెలుస్తుంది. మనస్సు బయటికి వెళ్ళినప్పుడు ఫలితం - భావాలూ, వస్తువులూను.లోపలికి వెళ్లినప్పుడు అదే ఆత్మ అవుతుంది

ప్ర: అయినా, నాకర్థం కావటం లేదు. "నేను" అనబడేది అసలైన నేను' కాదంటారుమీరు. ఈ నకిలీ నేను' ని నేనెట్లా పోగొట్ట గలను

జ:నకిలీ 'నేను' ని నీవు పోగొట్ట నక్కర్లేదు. తనని తాను ఈ నేను' ఎట్లా పోగొట్టగలుగుతుంది? నువ్వు చేయవలసిందల్లా దాని మూలమేదో కనుక్కోని.అక్కడ ఉండటమే. నీ ప్రయత్నం అంతవరకే వెళ్ళ గలదు. ఆ తరువాతిదిఅదే చక్కబడుతుంది. అక్కడ నీవు నిస్సహాయుడివి. దానిని ఏ ప్రయత్నమూఅందుకోలేదు.

ప్ర: నేను' ఎప్పుడూ, ఇక్కడే, ఇప్పుడే ఉంటే నాకెందుకు తెలియటం లేదు?

జ: అదే అసలు సంగతి. అది తెలియటం లేదని అనే దెవరు? అసలు 'నేను అంటోందా నకిలీ 'నేను' అంటోందా? నకిలీ నేన'ని తెలుసుకుంటావు.

ఈ నకిలీ 'నేనే' ఆటంకం, అసలైన 'నేను' బయట పడాలంటే, దానినితొలగించాలి. 'నాకు సాక్షాత్కారం కాలేదు' అన్న భావమే సాక్షాత్కారానికిఅవరోధం. అది సాక్షాత్కారమయే ఉంది. ఇంకా సాక్షాత్కారమవవలసిందేమీలేదు. అట్లాగే అయితే, కొత్తగా సాక్షాత్కారమవవలసి వస్తుంది. ఇప్పటి వరకూఅది లేకపోతే, ఇక ముందెప్పుడో ఉండాలన్న మాట. పుట్టిన దేదో చావక మానదుసాక్షాత్కారం నిత్యం కాకపోతే, దానిని పొందటంలో పెద్ద ప్రయోజనమేమీ లేదుకాబట్టి మనం పొందగోరేదేదో, కొత్తగా సంభవించేది కాదు. అదీ నిత్యమైనదేఎటొచ్చీ ఇప్పుడున్న అడ్డంకుల వల్ల అది తెలియటం లేదు. మనమన్వేషించేదిఅదే. మనం చేయవలసిందల్లా ఈ అడ్డంకులని తొలగించు కోవటం.ఈ అవిద్యని అధిగమించు, అంతా బాగుంటుంది. "నేను' అనే భావమే ఈఅవిద్య. దాని మూలమేదో కనుక్కో, అది మాయమవుతుంది

ఈ 'నేను' అనే భావం భూతం వంటిది. దానిని పట్టుకోలేం. కాని శరీరంతో బాటేలేస్తుంది. ఉంటుంది. దానితో బాటే పోతుంది. ఈ శరీరముందనే స్మారకమేఆతప్పు 'నేను' ఆ ఎరుకను పోగొట్టుకో. "నేను' యొక్క మూలాన్ని తెలుసుకోవటంవల్ల అది సాధ్యమవుతుంది. నేనున్నా'నని దేహం అనదు. ఈ “శరీరమే నేనుఅనేది నువ్వే ఈ "నేను" ఎవరో తెలుసుకో. దాని మూలాన్ని వెతుకు. అదిమాయమై పోతుంది.

ప్ర: మనస్సు హృదయంలో ఎంతసేపు ఉండగలదు?

జ: అభ్యాసం వల్ల అది ఎక్కువ అవుతూంటుంది.

ప్ర: ఆ సమయం ముగిసిన తరువాత ఏమౌతుంది?

జః మనస్సు, ప్రస్తుత మామూలు స్థితికి తిరిగి వస్తుంది. హృదయంలో ఐక్యానికిబదులుగా ఎన్నింటినో చూడటం సంభవిస్తుంది. ఇదే బయటికి వెళ్లే మనస్సంటేహృదయం వైపు వెళ్ళే మనస్సుని విశ్రమించే మనస్సంటారు. ప్రతిరోజా ఈఅభ్యాసాన్ని ఎక్కువగా చేస్తూన్న కొద్దీ మనస్సులోని మాలిన్యాలు పోతూండటంవల్ల అది ఎంతో స్వచ్ఛమవుతుంది. చింతన ప్రారంభించగానే పరిశుద్ధమైన మనస్సుహృదయంలోకి దానంతటదే గంతు వేసేటంతటి సులభమయి పోతుంది.

ప్ర: ధ్యానంలో సచ్చిదానందానుభూతి పొందిన మనిషికి, ధ్యానం ముగిసింతర్వాతదేహంతో తాదాత్మ్యం చెందటం సంభవమేనా?

జ: సంభవమే. కాని అభ్యాసం వల్ల ఆ తాదాత్మ్యం క్రమేపీ తగ్గి పోతుంది. ఆత్మతేకాంతిలో భ్రమ అనే చీకటి పూర్తిగా తరిగి పోతుంది. వాసనలు పూర్తిగా నిర్మలకాకపోతే, కలిగి అనుభూతి స్థిరంగా ఉండదు. వాసనలనీ తొలగించటానికిప్రయత్నం చేస్తూనే ఉండాలి. వాసనలన్నీ మొదలంటూ తొలగింప బడ్ితరువాత, జ్ఞానం స్థిరపడుతుంది. ఎంతో కాలంగా ఉన్న వాసనలని పారద్రోలాలి.

అవన్నీ పోతాయి. పూర్వమే సాధన చేసిన వారికి త్వరగా పోతాయి. ఇతరులికెమ్మదిగా పోతాయిప్ర: ఈ వాసనలు క్రమేపీ పోతాయా లేక ఒక్కసారిగా పోతాయా? నేనిక్కడ ఎంతోకాలంగా ఉన్నానన్న మాటేగాని, నాలో క్రమంగా ఏ మార్పువస్తున్నట్టు నాకేమీతోచటం లేదు. అందువల్లే ఈ ప్రశ్న వేస్తున్నాను.

జ. సూర్యోదయం కాగానే చీకటి క్రమంగా పోతుందా, ఒక సారిగానా

ప్ర: నేను చేస్తున్న విచారణలో పురోగమిస్తున్నానో లేదో ఎట్లా తెలుసుకోవటం?

జ: నీలో భావాలు తగ్గటం బట్టే అవి లేకపోవటం బట్టే ఆత్మసాక్షాత్కారం వైపునీపురోగమనాన్ని తెలుసుకోవచ్చు. ఆత్మ సాక్షాత్కారంలో పురోగమనమంటూఏమీ లేదు. అది ఎప్పుడూ ఒక్కటే. ఆత్మ ఎప్పుడూ సాక్షాత్కారమయే ఉంటుంది.ఆలోచనలే అడ్డంకులు. ఆ అడ్డంకులను ఏ మాత్రం తొలగించామన్న దానిబట్టే పురోగమన మెంతయిందో తెలుసుకో గలుగుతాం. ఆలోచనలు ఎవరికిఉదయిస్తున్నాయని ప్రశ్నించుకోవటం వల్ల వాటిని అరికట్టాలి. అవి రాకుండావాటి మూలానికే వెళ్లాలి నీవు.

ప్ర: సందేహాలెప్పుడూ వస్తూనే ఉంటాయి. అందుకే ఈ ప్రశ్న

జ ఒక సందేహం వస్తుంది. దానిని తీరుస్తాం. దానికి వెనుక మరొకటి, దాని తర్వాతమరొకటి - ఇట్లా వస్తూనే ఉంటాయి. అందువల్ల అన్ని సందేహాలూ నివృత్తిఅవటమంటు జరుగదు. అసలు ఈ సందేహాలెవరికి వస్తున్నాయో గమనించువాటి మూలానికి వెళ్ళు - అక్కడే ఉండు. అప్పుడు అవి రావు. సందేహాలుతీరటానికి అదే మార్గం

ప్ర: సమాధానమిచ్చు కోకుండా, నేనెవరిని' అని ప్రశ్నించుకుంటూనే ఉండాలానేను ? ఎవరు ఎవరిని ప్రశ్నిస్తున్నట్టు? విచారణ చేసేప్పుడు మనస్సులో ఏభావముండాలి? నేను' ఏమిటి? ఆత్మ ఏమిటి? అహంకారమేమిటి?

జనేనేవరిని" అనే విచారణలో, అహంకారమే ఆ 'నేను'. ఆ ప్రశ్నకిసరియైన అర్ధమిది అహంకారానికి మూల మేమిటని. మనస్సులో ఏ భావమూఉండనక్కర్లేదు. నువ్వు విడవవలసిందల్లా ఒకే ఒక భావాన్ని. అది 'ఈ శరీరమేనేను' దీని రూపమిట్లాంటిది, దీని పేరిది వగైరా. నీ నిజతత్త్వం గురించి భావనఉండవలసిన అవసరమేమీ లేదు. ఎప్పుడూ ఉన్నట్లే అది ఉంటుంది. అదియదార్ధం - భావన కానేకాదు

పర: నేను అనబడేది నేను' కోసం అనేవేషించటం తమాషాగా లేదూ? నేనెవరిని

అనే విచారణ చివరికి అర్థం లేని సూత్రంగా తేలదా? లేక, మాత్రం వలె తెరిపి

లేకుండా నేను అనుకుంటూండాలా

జ: ఆత్మ విచారణ అర్థం లేని సూత్రమే మాత్రం కాదు. అది మంత్ర జపమూకాదు. 'నేనెవరిని' అనేది కేవలం ఒక నేను'. మరొక 'నేను' ని వెతకటం కూడాకానేకాదు. ఆత్మవిచారమంటే మనస్సు యొక్క వ్యాపకాలన్నీ ఆత్మ గురించినఎరుకలో నిలిపి వేయటమన్నమాట - అది అర్థం లేని సూత్రం కాదు

ప్ర నేను ప్రొద్దుట పూట కాస్సేపూ, సాయంకాలం కాస్సేపూ ఆత్మ విచారంలోగడిపితే చాలా? లేక, నేనేమి చేస్తున్నా- నడుస్తున్నా, వ్రాస్తున్నా - కూడా కొనసాగిస్తూనే ఉండాలా

జ: నీ నిజతత్త్వమేమిటి? వ్రాయటమా, నడవటమా, ఉండటమా? ఉండటమొక్కటే- ఏ మార్పులేని యదార్థం. ఆ ఉండటం యొక్క శుద్ధ స్థితిని నీవెరిగే వరకూవిచారణ కొనసాగిస్తూనే ఉండాలి. ఒకసారి అందులో నిలకడ కలిగితే ఇంక ఏబాధా లేదు. ఆలోచనలు రానప్పుడు, వాటి మూలమేమిటని ఎవ్వరూ విచారించరుకదా. 'నేను వ్రాస్తున్నాను' 'నేను నడుస్తున్నాను' అని అనుకుంటున్నంత కాలంరుఆ పనులను ఎవరు చేస్తున్నారని విచారించు

ప్ర: నేను భావాలను తిరస్కరిస్తుంటే అది విచారమవుతుందా?

జ: అది ఒక మెట్టు అవవచ్చు. నువ్వు ఆత్మని విడవకుండా ఉన్నప్పుడే, మానసికవ్యాపకమైన ఆలోచనా తరంగాలు లేనప్పుడే విచారం ప్రారంభమవుతుంది

ప్ర అంటే, విచారమనేది బుద్ధికి సంబంధించినది కాదన్నమాట.

జ: కాదు. అది 'అంతరవిచారం' అంటే లోపలి అన్వేషణ. మనస్సుని పట్టుకొనిదానిని పరిశోధించమని ప్రారంభ దశలో ఉన్నవారికి సలహానిస్తాం. అయినా, మనస్సంటే ఏమిటి అసలు? అది ఆత్మ వల్ల ముందుకు చొచ్చుకు వచ్చేదే కదా.ఆది ఎవరికి కనబడుతుంది. ఎక్కడ నుంచి ఉదయిస్తుంది. వీటిని గమనించు.నేన'నే భావమే మూలకారణమని తెలుస్తుంది. ఇంకా లోతుగా వెళ్లు. 'నేనుఅనే భావం పోతుంది. అవధులు లేని చైతన్యం, ఆత్మ ఉంటుంది

ప్ర శ్రీ అరవిందుల ఆశ్రమంలో శ్రీమాతని నేనీ ప్రశ్న అడిగాను. "భగవంతుడు నాకుతన నిజ స్వరూపం చూపాలని ఏ భావాలూ లేకుండా, మనస్సుని నిశ్చలంగాఉంచుకుంటాను. కాని నాకేమీ గోచరం కావటం లేదు." దాని కామె ఇచ్చినసమాధానమిది "ఆ భావన సరియైనదే ఆ శక్తి పైనుండి దిగి వస్తుంది. అదిప్రత్యక్షానుభవం" నేను చేయవలసిందింకేమైన ఉందా

జ: నీ నిజస్థితిలో ఉండు. దిగి రావలసినది గాని, ప్రత్యక్ష మవవలసినది గాని ఏదీలేదు. అహంకారం పోవటమొక్కటే జరగవలసినది. నిత్యమూ సంస్థితమై ఉండేదిఎప్పుడూ ఉంటుంది. ఇప్పుడు కూడ నీవదే. దానికి భిన్నం కావు. నిశ్చలతనిచూచేది. నీవే. దానిని చూడటానికి నీవున్నావు. నువ్వు దేనికోసమింకా వేచిఉన్నావు? "నేను చూడలేద" నీ దేనినో చూడాలన్న ఆశా. దేనినో పొందాలన్నవాంఛా ఇవన్నీ అహంకారం యొక్క వ్యాపకాలే. నువ్వు అహంకారపు ఉచ్చులోపడిపోయావు. వీటన్నిటినీ అనేది అహంకారమే - నువ్వు కాదు. నీ నిజస్థితిలోఉండు. ఇంకేమీ అక్కర్లేదు

ప్ర: అత్మని తెలుసుకోపేటమెట్లా

జ: ఆత్మని తెలుసుకోవటమంటే, ఆత్మపై ఉండటమే. అత్మ తెలియదన గలవానీ కళ్లని నీవు చూడలేవు. చూసుకోవటానికి అద్దం లేకపోయినా, కళ్ళు లేవనిఅనగలవా? ఆత్మ ఒక పదార్థంగా తెలియక పోయినా, ఆత్మ గురించి నీకుతెలుసు. అది ఒక పదార్థంగా తెలియనంత మాత్రాన ఆత్మ లేదనగలవాఆత్మ నాకు తెలియరాదు" అని అన్నపుడు నీవు సాప్క్షమైన జ్ఞానం గురించేమాట్లాడుతున్నావనమాట. నీకు సాపేక్షమైన జ్ఞానమే, అలవాటై పోవటం వల్లదానితోనే నీవు తాదాత్మ్యం చెందుతున్నావు. అటువంటి తప్పుడు తాదాత్మ్యంవల్లనే సువిదితమైన ఆత్మని, అది గుర్తింపదగిన పదార్థం కాకపోవటం వల్లతెలుసుకోలేక పోతున్నావు. పైపెచ్చు, 'ఆత్మని తెలుసుకోవట మెట్లా' అంటూ ప్రశ్న కూడా వేస్తున్నావు.

ప్ర "ఉండట" మంటూంటారు మీరు, దేనిగా ఉండటం

జ: నీ కర్తవ్యం ఉండటమే. 'ఇదిగా, అదిగా' ఉండటం కాదు. "నేను నేనైన నేను"అన్నది వాస్తవాన్నంతా చెప్పుతుంది. "నిశ్చలంగా ఉండు" అనేది పద్ధతినిశ్చలత అంటే ఏమిటి? నీ అహంకారాన్ని ధ్వంసం చేసుకోవటమన్న మాటఏ రూపమైనా, ఏ నామమైనా చిక్కుని తెచ్చి పెట్టుతుంది. "నేను ఫలానాఅనే భావాన్ని విడిచిపెట్టు. ఆత్మ సాక్షాత్కారానికి కావలసిందల్లా నిశ్చలంగాఉండటమే. అంతకన్నా తేలికైన దేమిటి? అందువల్ల ఆత్మ విద్యని పొందటంఅన్నిటికన్నా తేలిక. నీ గురించిన సత్యాన్ని పరిశీలించటం అవశ్యం చేయాలిదనిని లక్ష్యంగా పెట్టుకొని, దాని గురించి సావధానంగా హృదయంలో ఏరుకకలిగి ఉండాలి

తన గురించి ఎరుక నిశ్చలమూ, నిర్మలమూ, మనో వ్యాకులతన నుండివిముక్తమూ అయిన చైతన్యానికే కలుగుతుంది. హృదయంలో ఎప్పుడూ రూపరహితంగా ప్రకాశించేదే ఆత్మ అని తెలుసుకో. అదే నీవు. ఏదీ ఉన్నదీ, లేదూఅనుకోకుండా దేని గురించీ ఆలోచించకుండా నిశ్చలంగా ఉండటం వల్ల కలిగేఎరుక అదే. అదొక్కటే సత్యం!

# 6.ఆత్మ విచారము - కొన్ని అపోహలు

శ్రీరమణుల ఆధ్యాత్మిక ప్రవచనాలు, అద్వైత వేదాంతాన్ని అనుసరించే వారిబోధనల వలెనే ఉండేవి - అద్వత సిద్ధాంతం వేయి సంవత్సరాలపైనే ప్రాచుర్యంలో.ఉంది. శ్రీ రమణులకూ ఇతర అద్వైతులకూ సిద్ధాంతపరంగా చాలా విషయాలలోఏకీభావమున్నా అభ్యాసపద్ధతులలో మాత్రం విభేదాలున్నాయి. శ్రీరమణులుఆత్మవిచార మార్గాన్ని అనుసరించ మంటారు. ఇతర అద్వైతులు మాత్రం "ఆత్మ ఒక్కటే సత్య'" మనే యదార్థాన్ని మననం చేసుకుంటూ ధాయానం చేయమంటారు.వారు చెప్పే పద్ధతి ఇది : "అహం బ్రహ్మాస్మి" వంటి మంత్రాలను జపించటం లేకఆ మంత్రాల అర్థం గురించి చింతిస్తూ ధ్యానం చేసి ఆయా మహావ్యాక్యాలఅంతరార్థాన్ని అనుభవ సిద్ధం చేసుకోవటం

ఆత్మవిచారం 'నేనెవరిని' అనే ప్రశ్నతో మొదలవుతుంది సాధారణంగా కాబట్టిచాలా మంది అద్వైతులు ఆ ప్రశ్నకి సమాధానం "నేను బ్రహ్మాన్ని" అనే భావంతోఆ సమాధానాన్నే మననం చేసుకొమ్మనేవారు. శ్రీరమణులు ఈ అభ్యాసాన్ని ఖండించేవారు. ఎంతసేపూ మనస్సు ఆ ప్రశ్నకి సమాధానాన్నే మననం చేసుకుంటూంటే, అదిఎన్నటికీ తన మూలస్థానంలో చేరి, మాయం కాదనే వారు. అట్లాగే 'నేనెవరిని' అనేప్రశ్ని ఒక మంత్రంగా భావించే వారినీ విమర్శించేవారు. అట్లాగే "నేనెవరిని" అనేప్రశని ఒక మంత్రంగా భావించే వారినీ విమర్శించేవారు. ఈ రెండు పద్ధతులనూఅనుసరించే వారు అసలు ఆత్మ విచారమార్గమంటే ఏమిటో గ్రహించలేదనే వారునేనెవరిని" అనే ప్రశ్న మనస్సుని విచ్ఛిత్తి చేసి, దాని తత్త్వాన్ని తెలుసుకోవటానికి ఉపయోగించుకునేది కాదు. అదొక మంత్రం, సూత్రం గాని కాదు. భావాలదయించినపుడు వాటి నుండీ, అవి చూచే విషయంనుండీ దృష్టిని ఆ చూచేవానివైపు.ఆలోచించే వానివైపు మళ్లించటానికి అది ఒక సాధనం మాత్రమే. శ్రీ రమణుల అబిప్రాయంలో 'నేనెవరిని' అనే ప్రశ్నకు సమాధానం మనస్సులోగాని మనస్సువల్ల గానిదొరకదు. దానికొకే ఒక సమాధానం - మనస్సు లేమిని అనుభవించటం

ఇంకొక అపోహకూడా హైందవ సంప్రదాయం వల్ల జనించినదే. అది అనాత్మమైనవాటినన్నిటినీ మానసికంగా తిరస్కరిస్తూ పోతే, చివరికి ఆత్మని కనుగొనవచ్చన్నదిదీనినే "నేతినేతి" (ఇదికాదు, ఇది కాదు) పద్ధతి అంటారు. ఈ పద్ధతిని అవలంబించే వాడు, అహంకారం తాదాత్మ్యం చెందే వాటినన్నిటినీ తిరస్కరిస్తాడు. అంటే "నేనుదేహాన్ని కాను' నేను మనస్సుని కాను' ఇత్యాది. ఇట్లా తిరస్కరిస్తూంటే చివరికి పరిశుద్ధమైన స్థితిలో ఆత్మ అనుభవ సిద్ధమవుతుందని ఆశిస్తాడు. హిందూతత్త్వం దీనినేఆత్మవిచార పద్ధతి అంటుంది. శ్రీరమణుల పద్ధతికీ ఇదే పేరుండటం వల్ల రెండూఒకటేనన్న అభిప్రాయ మేర్పడింది. ఈ సాంప్రదాయకమైన మనోవిచ్ఛేదాన్ని శ్రీరమణులు తిరస్కరించేవారు. ఈ పద్ధతి కేవలం బౌద్ధకమైనదనీ, దీనిని అనుసరించటంవల్ల మనస్సుకి అతీతమైన స్థితిని చేరలేమనీ తన అనుచరులకు చెప్పేవారు

ఈ అభ్యాసం యొక్క పాటవం గురించి వారిని ప్రశ్నించినప్పుడువారిట్లా అనేవారు: ఇటువంటి విచ్ఛేదం వల్ల అహంవృత్తి బలపడుతుంది. దేహమూమనస్సూ తానుకానంటూ తిరస్కరించే అహంకారం తనని తాను ధ్వంసంచేసుకోలేదు. 'అహంబ్రహ్మాస్మి' అనే వారు 'నేతినేతి' అనుకునే వారూ ఒకవిషయంలో ఏకీభవిస్తారు - ధృవ పరుచుకోవటం వల్లగాని, తిరస్కరించటంవల్లగాని మనస్సుతో ఆత్మని గ్రాహించవచ్చని తన వ్యాపకాలవల్లనే మనస్సుఆత్మని

చేరుకోగలదన్న నమ్మకమే, ఆత్మ విచారమంటే ఉన్న అనేక అపోహలకుమూలం. ఈ నమ్మకానికి పరమోదాహరణ ఇది. దేహంలో హృదయకేంద్రం అనేదాని పైనే కేంద్రీకరించటమే ఆత్మవిచరమంటే ననుకోవటం! చాలామంది ఇట్లాఅనుకోవటానికి కారణం, హృదయం గురించి శ్రీరమణులు చెప్పిన దానిని సరిగ్గాఅర్థం చేసుకోక పోవటం. ఈ అపార్థానికి కారణమేమిటో గ్రహించాలంటే, ఆ విషయమైవారి అభిప్రాయాలను ఇంకొంచెం నిశితంగా గమనించాలి

అహంవృత్తి (నేను' అనే భావం) యొక్క పుట్టుక గురించి వారు సాధారణంగాఇట్లా చెప్పేవారు. ఛాతీలో కుడివైపు ఒక కేంద్రం నుండి ఉదయించి ఒక నాళం ద్వారాఅది మెదడుకి వెళ్తుంది. ఈ కేంద్రాన్ని వారు హృదయ కేంద్రమనే వారు. అహంవృత్తిఆత్మలో లీనమై పోయినప్పుడు అది ఆ కేంద్రంలోకి వెళ్ళి మాయమై పోతుందనేవారు. ఆత్మ స్ఫురణ కలిగినప్పుడు ఈ కేంద్రమే మనస్సుకీ, ప్రపంచానికీ మూలమనితెలియ వస్తుందనే వారు. తమ దేహంతో తాదాత్మ్యం చెందేవారి సౌలభ్యం కోసంఈ వర్ణనలు ఉదాహృతమవుతున్నాయే గాని ఈ మాటలు యదార్థాలు కావని కూడాశ్రీ రమణులు హెచ్చరించేవారు. నిజానికి ఈ హృదయమనేది దేహంలో ఎక్కడాలేదనే వారు. అంతేకాక, పరమోన్నత స్థాయిలో చూస్తే ఈ "నేను" అనే భావంఛాతిలో కుడి వైపున ఉండే ఈ కేంద్రంలో జనించదు, అందులో లయం కాదని అనేవారు. శ్రీ రమణులు తరచు "నేను" అనేది ఎక్కడ ఉదయిస్తుందో కనుక్కోమనోమనస్సుకి మూలస్థానమేమిటో కనుక్కోమనో అంటూండేవారు. అందువల్ల చాలామంది ఆత్మవిచారం చేసేప్పుడు ఈ కేంద్రంపైన ఏకాగ్రత వహించాలని అర్థంచేసుకునే వారు. ఈ అవగాహనని శ్రీ రమణులు అనేక పర్యాయాలు నిరాకరించారు.మనస్సుకి గాని, 'నేను' అనేభావానికి గాని, మూలం కనుక్కోవాలంటే ఆ అహంవత్తిఅవధానం కలిగి ఉండాలేగాని దేహంలో ఒక ప్రత్యేకమైన స్థలంపై కాదని చెప్పేవారుఈ కేంద్రంపై ఏకాగ్రత కలిగి ఉండటం మంచి అభ్యాసమే కావచ్చు కాని దానికీఆత్మ విచారానికీ ఏ సంబంధమూ లేదనే వారు. ఒక్కొక్కసారి ఆత్మని కనుగొనటానికిహృదయంపై ధ్యానం కలిగి ఉండటం మంచి పద్ధతే అనేవారు. అంతేకాని దీని అర్థంహృదయ కేంద్రంపై లగ్నం చేయటమని మాత్రం కాదనే వారు. ఆయన హృదయంయొక్క సహజస్థితిని ధ్యానించమనే వారు. హృదయం యొక్క సహజ స్థితి ఒక కేంద్రంకాదు. అది సర్వవ్యాప్తమైన ఆత్మ - దాని నిజస్వరూపం తెలియటమంటే, అందులోసంస్థిత మవటమే ననేవారు. ఏకాగ్రత వల్ల దానిని అందుకో లేమనే వారు

హృదయం గురించీ, హృదయ కేంద్రం గురించీ ఇటువంటి సంశయాస్పదాలైనవ్యాఖ్యలు ఎన్నో వారి రచనలలో, సంభాషణలలో కనబడుతాయి. కాని, ఈ కేంద్రంపైఏకాగ్రత నిలిపి ఆత్మ విచారాన్ని అభ్యాసం చేయాలంటూ ఒక్క వాక్యమైనా ఎక్కడాలేదు. నిజానికి వారి మాటలని జాగ్రత్తగా పరిశీలిస్తే తేలేది ఇది

.ఆత్మానుభూతిలో ఒక భాగం ఈ కేంద్రం గురించిన ఎరుక, అంతేగాని ఈకేంద్రంపై లగ్నం చేసినంత మాత్రాన ఆత్మానుభూతి కలుగదు.ప్ర: 'నేనెవరిని" అని నన్ను నేను ప్రశ్ించుకొని నేను' అంటే శరీరం కాద"ని

తిరస్కరిస్తాను. నేను అంటే ప్రాణం కాదని' తిరస్కరిస్తాను. ఆపైన సాగలేకుండా

ఉన్నాను

జ: బుద్ధి అంత వరకే వెళ్ళ గలదు. నీ పద్ధతి బుద్ధదికి సంబంధించినది. శాస్త్రాలన్నీ సత్యాన్వేషణలో సాధకునికి తోడ్పడటానికి పద్ధతులనే సూచించగలవుగాని సత్యాన్ని ప్రత్యక్షంగా చూపించలేవు. అందువల్లనే, ఈ బుద్ధికి సంబంధించినపద్ధతి "నేనుకానం"టూ తిరస్కరించే వాడు "నేను"ని మాత్రం నిరాకరించలేడు. "నేనిదికాదు, నేనది కాదు' అనటానికి 'నేను' అంటూ ఒకడుండాలి. ఈనేను' అనబడేది ఆహంకారమే, లేక అహంవృత్తే. ఈ అహంవృత్తి ఉదయించినతరువాతనే ఇతర భావాలుదయిస్తాయి. కాబట్టి అన్నిటికీ మూలం "నేను" అనే భావమే. ఆ మూలాన్ని పెకలించి వేస్తే మిగిలినవన్నీ పెకలించుకు పోతాయిఅందువల్ల 'నేను' యొక్క మూలాన్ని అన్వేషించు. 'నేనెవరిని' అని నిన్ననునీవు ప్రశ్నించుకో. మూలాన్ని కనుగొన్నావంటే, మిగిలిన భావాలన్నీ మాయమైపోతాయి. మిగిలేదల్లా శుద్ధమైన అత్మే

ప్ర ఎట్లా చేయటం

నేను" ఎప్పుడూ ఉంటూనే ఉంది - గాఢ నిద్రలో, కలలో, జాగ్రదవస్థలో,జఇప్పుడు మాట్లాడేదీ, గాఢనిద్రలో ఉండేదే ఒకటే. "నేను" అనే అనుభూతిఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. నీ ఉనికిని కాదనగలవా? కాదనలేవు. "నేనున్నానంటావు. ఉండేదెవరో కనుక్ోలో,

ప్ర: "నేతి - నేతి" (ఇదికాదు - ఇది కాదు) అని ధ్యానం చేస్తూంటాను

జ: అది ధ్యానం కాదు. మూలమేమిటో కనుక్కో. తప్పకుండా మూలాన్ని చేరాలినువ్వు. నకిలీ "నేను' పోయి అసలైన నేను గ్రహింపబడుతుంది. రెండవదిలేకుండా, మొదటిది ఉండలేదు దటంద

నేను' ఇప్పుడు శరీరంతో, ఇంద్రియాలతో తప్పుగా తాదాత్మ్యం చెంది యుంది.

వీటిని తిరస్కిరించు. అదే "నేతి" ఉన్న దానిని, అంటే 'ఇతి' ని విడవకుండా

ఉండటం వల్లనే ఇది సాధ్యంప్ర: 'ఏవరిని నేను" అని ప్రశ్నించుకున్నప్పుడు నేనీ భౌతిక శరీరాన్ని కాను, నేనుచైతన్యాన్ని, ఆత్మని' అని జవాబు వస్తుంది. దాని వెనుకనే "ఆత్మ మాయలోఎందుకు పడింది" అనో లేక "ఈ ప్రపంచాన్ని భగవంతుడెందుకు సృష్టించాడ"నో ప్రశ్న వస్తుంది.

జ ఎవరిని నేను"' అని విచారంచ మంటే అర్థం. అహంకారానికికి మూలాన్నివకనుగొనమని. "నేను ఈ శరీరాన్ని కాను" వంటి ఇతర ఆలోచనలురాకూడదు. 'నేను' యొక్క మూలాన్ని అన్వేషించటం, మిగిలిన భావాలను వదిలించుకోవటానికొక పద్ధతి. నీవు చెప్పిన ఇతర భావాలకు తావీయక "నేనుఅనే భావం యొక్క మూలాన్ని కనుగొనటం మీదే ధ్యాస ఉంచాలి. ఒక్కొక్కఆలోచనే ఉదయిస్తూంటే 'ఇది ఎవరికి వస్తోంద' ని ప్రశ్నిస్తుండాలి. 'ఈ ఆలోచన నాకు వస్తోంది' అని సమాధానం వస్తే 'ఈనేను ఎవరు? దాని మూలమేమిటి అంటూ విచారం కొనసాగించాలి.

ప్ర: నేనెవరిని" అని మంత్రం వలె పదే పదే అంటూండాలా?

జ నేనెవరిని' అనేది మంత్రం కాదు. అన్ని భావాలకూ మూలమయిన 'నేను' అనేభావమెక్కడ ఉదయిస్తుందో కనుగొనటం.

ప్ర: అహం బ్రహ్మాస్మి' అని ధ్యానం చేస్తేనో?

జ నేను బ్రహ్మాన్ని" అని అనుకోవటం కాదు. ఆ వాక్యం యొక్క ఉద్దేశం . 'అహం(నేను) అందరికీ తెలిసినదే. అందరి అహం లోనూ బ్రహ్మముంది. ఆ 'నేనుఎవరో తెలుసుకో 'నేను బ్రహ్మమే' - ఎలాగూ. నువ్వు అట్లా భావించక్కర్లేదు.నేను' ఏమిటో కనుక్కో.

ప్ర నేతి-నేతి' ద్వారా కోశాలను తిరస్కరించటం శాస్త్రాలలో చెప్పబడినదే కాదా.

జ:అహంవృత్తి ఉదయించిన తరువాత దేహంతో, మనస్సుతో, ఇంద్రియాలతో ఈనేను' తాదాత్మ్యం చెందుతుంది. తప్పుగా. దీనివల్ల అసలైన నేను' కనుమరుగైపోతుంది. శుద్ధమైన 'నేను'ని కళంకితమైన 'నేను' నుండి విడదీయటానికే ఈతిరస్కారం చెప్పబడింది. ఇది కేవలం అనాత్మని తిరస్కరించటమే కాదుశుద్ధ ఆత్మని కనుగొనటం. పరిశుద్ధమైన ఆత్మ పరిపూర్ణం, నిత్యం - దానికిఆద్యంతాలు లేవు. అదే అసంతమైన 'నేను'. ఇక, ఆ రెండో 'నేను' పుట్టుతుంది.గిట్టుతుంది. అది అనిత్యం, మారుతూండే ఆలోచనలు ఎవరికి చెందుతాయోగమనించు. అవన్నీ 'నేను' అనే భావముదయించిన తరువాతనే వస్తాయనితెలుస్తుంది. 'నేను' అనే భావాన్ని పట్టుకో, ఇవన్నీ తగ్గిపోతాయి. ఈ నేను' అనేభావాన్ని దాని మూలం వద్దకు తీసుకొని వెళ్ళు. మిగిలేదల్లా ఆత్మే

ప్ర: ఇది గ్రహించటం కష్టం. సిద్ధాంతమర్థమయింది. కాని ఆచరణ ఎట్ల?

జ. ఇతర పద్ధతులన్నీ ఆత్మని పరిశోధించటం చేతకాని వారి కోసం.

అహం బ్రహ్మాస్మి' అని అనటానికైనా చింతించటానికైనా ఒక కర్త అవసరంఅది ఎవరు? అది "నేను". ఆ నేనుగా ఉండు. అదే సూటైన పద్ధతి. మిగిలినపద్ధతులు కూడా ఆత్మ గురించిన పరిశోధనకై ఈ మార్గానికే దారితీస్తాయి.

ప్ర: నేను' అంటే నాకు ఎరుక ఉంది. కాని నా బాధలు తీరలేదు.

జ.నేను' అనే ఈ భావం నిష్కళంకం కాదు. శరీరంతోనూ, ఇంద్రియలతోనూఅది కలుషితమైంది. బాధ ఎవరికో గ్రహించు. 'నేను' అనే భావానికే. దాన్ని విడువకుండా ఉండు. మిగిలిన బాధలన్నీ పోతాయి.

ప్ర: నిజమే, కాని అది ఎట్లా చేయటం? ఉన్న చిక్కంతా అదే.

"నేను, నేను" అనే ఒక్క భావాన్నే విడవకుండా పట్టుకో. మిగిలిన భావాలేవీ రాకుండా చూసుకో.

ప్ర: భగవంతుడినే తలచుకోవటం ఈ విచారం కన్నా ఉత్తమమైనది కదా? తలచుకోవటంలో నిశ్చితమైన భావముంది. విచారంలో వ్యతిరేక భావముంది. అంతేగాక, వేర్పాటుని కూడ సూచిస్తుంది.

జ: సాక్షాత్కారం పొందటమెట్లా అని తెలుసుకొన కోరటం వల్ల ఈ ఆత్మని గ్రహించటానికి ఈ సలహా ఇవ్వబడింది. ఒక పద్ధతిని కోరటంలోనే నీ వేర్పాటు భావం తెలుస్తుంది.

ప్ర: 'నేనెవరిని' అని ప్రశ్నించుకోవటం కన్నా నేను పరబ్రహ్మని' అనుకోవటం నయం కదా?

జ: అనుకొనే దెవరు? అది చేయటానికెవరో ఉండాలి కదా. అతడెవరో కనుక్కో.

ప్ర: విచారణ కన్నా ధ్యానం ఉత్తమం కాదా?

జ: ధ్యానంలో మనోభావన ఉంటుంది. విచారణ సత్యం కోసం, మొదటిది బాహ్యమైనది రెండవది ఆత్మాశ్రయమైనది.

ప్ర: ఈ విషయాన్ని శాస్త్రీయంగా చూచే పద్ధతుండవద్దా?

22: అసత్యాన్ని విడిచి, సత్యాన్ని అన్వేషించటం శాస్త్రీయమే.

ప్ర: నా ఉద్దేశమిది. ఒక వరుస క్రమంలో ఒక్కొక్కదాన్ని విడువకలగాలి- ముందు మనస్సుని తరువాత బుద్ధినీ ఆ తరువాత అహంకారాన్ని...

ఆత్మ ఒక్కటే సత్యం. మిగిలినవన్నీ అసత్యం. నీవు లేకుండా మనస్సూ, బుద్ధి ఉండవు. "నిశ్చలంగా ఉండి నేనే భగవంతుడ్ని అని తెలుసుకో" అంటుంది బైబిల్. ఆత్మనే భగవంతునిగా ఎరుగటానికి, నిశ్చలత ఒక్కటే అవసరం.

ప్ర: "సోహం" అనుకోవటమూ, 'నేనెవరిని' అని అడగటమూ ఒకటేనా?

జ: ఈ రెంటిలోనూ 'అహం' సామాన్యమైన అంశంగా ఉంది. ఒకటి సోహం రెండవది కోహం రెండూ భిన్నం. 'సోహం' అని ఎందుకంటూండాలి? అసలైన 'నేను'ని కనుక్కోవాలి. 'నేనెవరిని' అన్న ప్రశ్నలో 'నేను' అంటే అహంకారం దాని మూలాన్ని వెతకటంతో దానికి ప్రత్యేకమయిన అస్తిత్వం లేదనీ, అది అసలైన 'నేను'లో విలీనమై పోతుందనీ గ్రహిస్తాం.

ఇక్కడ సమస్య ఇది - విచారణ పద్ధతి "శివోహం" అనో "సోహం" అనో ధ్యానించటం కన్నా భిన్నం. ఆత్మజ్ఞానానికే నేను ఎక్కువ ప్రాధాన్యమిస్తాను. ప్రపంచం గురించీ, ఈశ్వరుని గురించీ తెలుసుకునే ముందు నీ గురించి నీకు ఎరుక ఉండటం ముఖ్యం. 'సోహం' అంటూ ధ్యానం చేయటం గాని, 'అహం 'బ్రహ్మాస్మి' అంటూ ధ్యానం చేయటం కాని, మానసిక భావనే, వ్యాపకమే, ఇంచుమించు. నేను చెప్పే ఆత్మవిచారం మాత్రం సూటి అయిన పద్ధతి, ధ్యానంకన్నా ఉత్తమమైనది. నువ్వు ఆత్మకోసం అన్వేషణ మొదలు పెట్టి లోతుగా వెళ్తున్న కొద్దీ, నీ ఆత్మ నిన్ను తనలో కలుపుకోవటానికి ఎదురు చూస్తుంది. ఆ తరువాత ఏమి జరుగుతుందో, ఏది జరిపిస్తుందో నీ చేతుల్లో లేదు. ఈ పద్ధతిలో అన్ని సంశయాలూ చర్యలూ వాటంతటవే మాయమవుతాయి. గాఢ నిద్రలో ఉన్నప్పుడు అన్ని బాధలనూ మనిషి మరిచినట్లే.

ప్ర: నన్ను ఆహ్వానించటానికి ఏదో ఎదరు చూస్తోందని నమ్మకమేమిటి?

జ: పరిపక్వమైన వానికి ఆ నమ్మకం సహజంగానే కలుగుతుంది.

ప్ర: ఈ పరిణామమెట్లా సాధ్యం?

జ: దానికి అనేక సమాధానాలున్నాయి. పూర్వపు స్థితి ఏమయినా, విచారణ దానిని వేగిర పరుస్తుంది.

ప్ర: ఈ చర్య ఒక వలయంలో తిరుగుతున్నట్లుంది - నేను పక్వం చెందాను కాబట్టి అన్వేషణకి తగిన వాడిని - కాని అన్వేషణే నా పురోగతికి కారణమవుతుంది!

జ: మనస్సుకి ఇటువంటి చిక్కులు వస్తూనే ఉంటాయి. తనని సంతృప్తి పరచటానికొక సిద్ధాంతం కావాలంటుంది. భగవంతుడ్ని చేరుకోవాలనో, తన నిజతత్వం తెలుసుకోవాలనో తపన ఉన్న వానికి ఏ సిద్ధాంతమూ అవసరం లేదు.

ప్ర: శ్రీ భగవాన్ ఉపదేశించే మార్గం నిస్సందేహంగా సూటి అయినదే కాని అది ఎంతో కష్టమైనది కూడా. ఎట్లా ప్రారంభించాలో మాకు తెలియదు. "ఎవరిని నేను", "ఎవరిని నేను" అని ఒక మంత్రం వలె జపం చేస్తూంటే బండబారి పోయినట్లవుతుంది. మిగిలిన పద్ధతులలో ప్రాథమికమూ, నిశ్చయమూ అయినదేదో ఉంటుంది. మొదలు పెట్టటానికి, అక్కడ్నుంచి ఒక్కొక్క మెట్టే ఎక్కవచ్చు. శ్రీ భగవాన్ పద్ధతిలో అటువంటి దేమీ లేదు. నేరుగా ఆత్మనే అన్వేషింప ఎంత సూటి అయినదైనా, ఎంతో కష్టం కాదా?

సూటి అయిన మార్గమని నీవే ఒప్పుకుంటున్నావు. అది సూటి అయినదే కాదు. అన్నిటికన్నా తేలికైనది కూడా. నీవు కానివాటి వెంటబడటం సులభమైతే నీ ఆత్మ వెంటబడటమంత కష్టమెందుకవుతుంది? "ఎక్కడ ప్రారంభించాలి' అని అడుగుతున్నావు. ప్రారంభమూ లేదు. అంతమూ లేదు. నువ్వు ఇక్కడా, ఆత్మ మరొక ప్రదేశంలోనూ ఉండి. ఆ ఆత్మను నీవు చేరదలచితే నువ్వు ఎట్లా బయలు దేరాలి, ఎట్లా పయనం చేయాలి, ఎట్లా గమ్యాన్ని చేరాలి - ఇవన్నీ చెప్పవచ్చు. నువ్వు ఇప్పుడు రమణాశ్రమంలో ఉంటూ, "నేను రమణాశ్రమానికి వెళ్లాలి. నేనెట్లా బయలుదేరాలి, నేను ఎట్లా చేరుతాను" అని అడిగితే ఏమని సమాధాన మీయగలం? ఆత్మకై అన్వేషణ చేసేవాని పరిస్థితీ అంతే. అతనెప్పుడూ ఆత్మే. ఇంకేమీ కాడు. "ఎవరిని నేను' అనటం ఒక జపం కావచ్చన్నావు. 'ఎవరిని నేను' అంటూ ఎల్లప్పుడూ ప్రశ్నించుకోవాలని ఉద్దేశం కానేకాదు. అట్లా అయితే, ఆలోచనలు తేలికగా అంతం కావు. సూటి అయిన ఈ మార్గంలో "ఎవరిని నేను" అని నువ్వు ప్రశ్నించుకునేప్పుడు నీవు అంతర్ముఖుడవై ఇతర భావాలన్నిటికీ మూలమైన 'నేను' అనే భావం ఎక్కడ ఉదయిస్తుందో దానిపై కేంద్రీకరించాలని అర్థం, ఆత్మ అనేది నీలో ఉంది. నీ బయట కాదు. అందువల్ల బయటికి కాకుండా, లోపలికి లోతుగా వెళ్లమని చెపుతాము. నీలోకి వెళ్లటం కన్నా ఇంకేదైనా తేలికగా జరుగుతుందా? అయినా, కొందరికి ఈ పద్ధతి కష్టమనిపించవచ్చు. నచ్చకపోవచ్చు. అందువల్లనే ఎన్నో పద్ధతులను చెప్తాము.

ఒక్కొక్కరికి ఒక్కొక్కటి పరమ శ్రేష్ఠమైనదిగా, సులువైనదిగా అనిపిస్తుంది అది వారి ప్రకృతి బట్టి ఉంటుంది. కాని కొందరికి విచారమార్గం తప్ప ఇంకేదీ నచ్చదు. "నేను దేనినో ఎరుగాలనీ, దర్శించాలనీ అంటావు కదా. తెలుసుకొనే వాడెవడు? చూచేవాడెవడు?' అని వాళ్లడుగుతారు. దీనిని తప్పించుకోలేం. కర్త ఎవరో తెలుసుకోవాలి. అంతవరకూ సాధన ఆపలేం. కాబట్టి, చివరికి అందరూ 'ఎవరిని నేను' అని ప్రశ్నించుకునే స్థితికి రావలసిందే. ప్రారంభించటానికి ప్రాథమికంగా, నిశ్చితంగా ఏదీ లేదన్నావు ఈ పద్ధతిలో. లేకపోవటమేమిటి? "నేను" అన్నదాని దగ్గరే మొదలు పెట్టు. ఎల్లప్పుడూ నువ్వుంటావని నీకు తెలుసు. శరీరం లేని వేళలూ ఉంటాయి. గాఢ నిద్రలో వలె. శరీరం లేకపోయినా, నువ్వుంటావని నిద్ర విశద పరుస్తుంది. మనం ఈ 'నేను'ని దేహంతో ఏకం చేస్తాం. ఆత్మకి దేహముందంటాం, దానికి కొన్ని పరిమితులున్నాయంటాం. ఉన్న చిక్కంతా ఇదే. ఆత్మని, ఇన్ని రూపాలూ, పరిమితులూ ఉన్న శరీరంతో ఏకం చేయటాన్ని విడిచిపెట్టాలి. చేయవలసిందంతా ఇదే. ఎల్లప్పుడూ ఉండే ఆత్మ నేనేనని తెలుస్తుంది.

ప్ర: అంటే "నేనెవరిని" అని చింతిస్తూండాలా?

23: “నేను” అనే భావముదయిస్తుందని తెలుసు నీకు. ఆభావాన్ని పట్టుకుని దాని మొదలెక్కడో అన్వేషించు.

ప్ర: దీనికి పద్ధతేమిటో తెలుసుకోవచ్చా?

జ: ఇప్పుడు చెప్పినట్టు చేసి చూడు.

ప్ర: నేనేమి చేయాలో నాకర్థం కావటం లేదు.

జ: ఇదేదైనా బాహ్యమైన విషయమైతే, బయటి విషయాల ద్వారా తెలియ చేయవచ్చు. కాని ఇది లోపలి విషయం, ఆత్మాశ్రయమైనది.

ప్ర: కాని నాకర్థం కావటం లేదే!

22: ఏమిటీ? నువ్వున్నావని అర్థం కావటం లేదా?

ప్ర: నాకు పద్ధతిని ఉపదేశించండి.

22: నీ ఇంట్లోనే ఉన్న వాటికే దారి చూపాలా? ఇది నీలోనే ఉన్నది.

ప్ర: హృదయమే ఆత్మకి కేంద్రమని మీరు సెలవిచ్చారు.

జ: నిజమే. ఆత్మకి కేంద్రమదే. దాని విషయం నీకే సందేహమూ ఉండనక్కర్లేదు. ఆత్మ హృదయంలో - జీవుని వెనుక, అంటే అహంకారం వెనుక, ఉంది.

ప్ర: అయితే, దేహంలో అదెక్కడుందో చెప్పండి.

23: దానిని నీ మనస్సుతో గ్రహించలేవు. (తన ఛాతీలో కుడివైపు చూపుతూ..) అది ఇక్కడ ఉందని చెప్పినా నీ భావనలో దానిని గ్రహించలేవు. ఏవేవో కల్పనలు చేసుకోవటం మాని, నీ సహజ స్థితిలో ఉండటం వల్లనే దానిని ప్రత్యక్షంగా గ్రహించ గలుగుతావు. నీకా సాక్షాత్కారం కాగానే కేంద్ర మక్కడే ఉందని దానంతటదే తెలుస్తుంది.

శాస్త్రాలలో హృత్ గుహ అనీ, అనుగ్రహమనీ, హృదయమనీ చెప్పబడే కేంద్రమదే - అదే హృదయం.

ప్ర

: అది అక్కడే ఉంటుందని నేనే గ్రంథంలోనూ చూడలేదు -

జ:

నేనిక్కడికి వచ్చిన చాలా కాలం తర్వాత అష్టాంగ హృదయమనే గ్రంథాన్ని మళయాళ భాషలోని దానిని చూడటం తటస్థించింది. అందులో శరీరంలో ఓజస్థానం (అంటే శరీరపు జీవశక్తికి, కాంతికి మూలం) ఛాతీకి కుడివైపున ఉన్నదనీ, దానినే సంవిత్, అంటే చైతన్యానికి నిలయమని అంటారనీ ఉంది. అది అక్కడ ఉన్నట్టు నేను మరే గ్రంథంలోనూ చూడలేదు.

ప్ర:

ఈ కేంద్రాన్ని హృదయమని పూర్వీకులు అన్నారని ఎట్లా నమ్మకం?

అదే అది. నీవు అనుభూతిని పొందటానికి ప్రయత్నించాలేగాని ఆ అనుభూతికి స్థానమేమిటో తెలుసుకోవటానికి కాదు. దేనినైనా చూడాలంటే, తన కళ్ళు ఎక్కడున్నాయో తెలుసుకోనవసరం లేదు కదా ఎవరికైనా. హృదయం ఎప్పుడూ తెరుచుకునే ఉంటుంది. నీవందులో ప్రవేశించాలే గాని అది, నీకు తెలియక పోయినా నీ ప్రతి కదలికను బలపరుస్తూనే ఉంది. ఆత్మ హృదయంలో ఉన్నదనటం కన్నా ఆత్మే హృదయమానటం ఉచితం. నిజానికి ఆత్మే కేంద్రం అది ఎల్లెడలా ఉంది - హృదయంగా, ఆత్మజ్ఞానంగా.

ప్ర:

అట్లా అయితే, శరీరంలో ఒక చోట ఉన్నదని ఎట్లా అనగలం? శరీరంలో దానికొక స్థానం కల్పించటమంటే, భౌతికమైన పరిమితులను దేశకాలాతీతమైన దానికి విధించటమే కదా?

జ:

అది నిజమే. హృదయం యొక్క స్థానాన్ని తెలుసుకో గోరే వ్యక్తి తాను దేహాన్నో దేహంలో ఉన్నాననో భావించుకుంటాడు. ఆ ప్రశ్నని నీవిప్పుడు అడిగినప్పుడు నీ శరీర మొక్కటే ఇక్కడ ఉంది. నీవెక్కడనుండో మాట్లాడుతున్నానని అంటావా? కాదు కదా. నీ భౌతిక ఉనికిని నీ వంగీకరిస్తావు. ఈ దృక్పథం నుంచే భౌతిక దేహానికి సంబంధించిన వివరణ ఇవ్వటం జరుగుతుంది. వాస్తవానికి, శుద్ధ చైతన్యం అవిభాజ్యం. దానికి అంగాలు లేవు. రూపం లేదు. పార్శ్వాలు లేవు. లోపలా, బయటా అంటూ ఏమీ లేదు. శుద్ధ చైతన్యం హృదయం - అన్నిటికీ నిలయం. దాని వెలుపల గానీ, దానికి భిన్నంగా గాని ఏమీ లేదు అదే పరమ సత్యం. ఈ కేవల దృక్పథం నుంచి హృదయానికి గాని, ఆత్మకి గాని, చైతన్యానికి గాని, భౌతిక దేహంలో ఏ స్థానమూ ఇవ్వలేము. దానికి కారణమేమిటి? దేహమే మనస్సు యొక్క కల్పన. దేదీప్యమానమైన ఆత్మకి మనస్సు పేలవమైన ప్రతిబింబం. పరమ సత్యంలో అతి సూక్ష్మమైన, దృశ్యమానమైన అంశం ఈ దేహం. అటువంటి దానిలో, ఒక చిన్న స్థానంలో సర్వమూతనలోనే ఉన్న దానిని ఎట్లా బంధించ గలం? కాని ఇది ఎవ్వరికీ అర్థం కాదు. వారెంత సేపూ భౌతిక శరీరం గురించే, ప్రపంచం గురించే ఆలోచించ గలరు. "ఎక్కడో హిమాలయాలకి ఆవల ఉన్న నా స్వదేశం నుంచి ఈ ఆశ్రమానికి వచ్చాను" అని అంటావు. కాని యదార్ధమది కాదు. నువ్వు సర్వాంతర్యామి అయిన ఆత్మవే. అటువంటప్పుడు రావటం గాని, పోవటం గాని, ఏ కదలికైనా గాని ఎట్లా సాధ్యం? ఎప్పుడూ ఉండే చోటే ఉన్నావు నువ్వు. కదలింది నీ శరీరమే - ఒక చోటునుండి మరొక చోటుకి ఆశ్రమాన్ని చేరుకునే దాకా కదల్చబడింది. ఇదే అసలు సత్యం. ప్రపంచంలో తాను సంచరిస్తున్నాననుకునే వ్యక్తికి ఇదంతా కల్పితంగా అనిపిస్తుంది. మామూలుగా అర్థం చేసుకునే వారి స్థాయికి దిగి, హృదయానికి శరీరంలో ఒక స్థానముందంటూ చెప్తాం.

ప్ర

: హృదయకేంద్రం అనుభవమయితే, ఛాతీలో ఒక చోట ఉన్నట్టు తెలుస్తుందని మీరన్న మాటలని ఎట్లా అర్థం చేసుకోవాలి?

హృదయం శుద్ధ చైతన్యమనీ, దేశకాలాతీతమని ఆ కేవల దృక్పథం అర్థం చేసుకోగలిగితే, మిగిలిన వాటినన్నిటినీ సరిగ్గా అర్థం చేసుకోగలుగుతావు.

ప్ర

: హృదయం - కుడివైపునో, ఎడమవైపునో, మధ్యే, ఉందంటూంటారు ఇన్ని భిన్నాభిప్రాయాలుంటే దాని గురించి ధ్యానం చేయటమెట్లా?

జ:

నువ్వున్నావు - అది వాస్తవం. ధ్యానం చేసేది నీవు, నీ గురించి, నీలో నీవు నువ్వెక్కడుంటే అక్కడే అది కొనసాగాలి, నీ బయట కాలేదు కదా. ధ్యానానికి కేంద్రం నీవే, అదే హృదయం.

దానికి భౌతికమైన దానితో తాదాత్మ్యం కల్పిస్తే సందేహాలు వస్తాయి. హృదయమన్నది ఏదో ఊహకాదు ధ్యానం చేయవలసిన పదార్థమూ కాదు. ధ్యానానికి స్థానమదే. ఆత్మ ఒక్కటే ఉంది. నువ్వు దేహాన్నీ, ప్రపంచాన్నీ హృదయంలోనే చూస్తావు. దానికి భిన్నంగా ఏదీ లేదు. కాబట్టి అన్ని ప్రయత్నాలూ దానిలోనే ఉన్నాయి.

ప్ర: 'అహంవృత్తి' హృదయకేంద్రం నుంచి ఉదయిస్తుందన్నారు మీరు. దాని మూలాన్ని అక్కడ అన్వేషించాలా?

జ: నీ దేహంలో "నేను" అనేది ఎక్కడ ఉదయిస్తుందో కనుక్కోమన్నాను. ఛాతీకి కుడివైపున ఉన్న హృదయం నుంచి ఉద్భవించి, అందులోనే లీనమై పోతుందనటం కూడా సరికాదు. సత్యానికి, హృదయమన్నది మరోపేరు. అది శరీరం లోపలగాని వెలుపలగాని లేదు. ఉన్నదానికి లోపలా, వెలుపలా అంటూ

ఏమీ లేదు. ఉన్నదల్లా అదొక్కటే.

ప్ర:

హృదయం గురించి ధ్యానం చేసేప్పుడు ఛాతీలో కుడివైపుని ధ్యానించాలా?

జ: హృదయం భౌతికం కాదు. ధ్యానం కుడివైపు మీద గాని ఎడమ వైపు మీదగాని కాకూడదు. ధ్యానం ఆత్మ గురించే ఉండాలి. "నేనున్నా" నని అందరికీ తెలుసు, ఆ "నేను" ఎవరు? అది లోపలగాని, బయటగాని కాదు, కుడివైపున గాని, ఎడమవైపున గాని కాదు. "నేనున్నాను"- అంతే! హృదయమే ఆత్మ, దానిని గ్రహించు. తర్వాత నీకే తెలుస్తుంది. హృదయ మెక్కడ ఉందో తెలుసుకోవలసిన అవసరమేమీ లేదు. నువ్వు ఆత్మని అన్వేషిస్తూంటే అది చేసేపని అది చేస్తుంది.

ప్ర: "ఉపదేశసారం"లో “హృదయంలో ఉండటమే ఉత్తమమైన కర్మ, భక్తి యోగం, జ్ఞాన" మన్నారు. ఆ హృదయమేమిటి?

జ: అన్నిటికీ మూలమది. దానిలోనే మనమంతా జీవిస్తాం. అందులోనే లయమవుతాం హృదయమదే!

ప్ర: అటువంటి హృదయాన్ని ఊహించటమెట్లా?

జ: దేనినైనా ఎందుకూహించాలి? "నేను" ఎక్కడ్నుంచి ఉదయిస్తుందో దానిని చూడాలి. అన్ని జీవరాశులకీ సంబంధించిన భావాలు ఎక్కడ నుంచి ఉదయిస్తాయో అదే హృదయమంటే. దానికి సంబంధించిన వర్ణనలన్నీ మనస్సు కల్పించేవే.

ప్ర: వేరు వేరు రంగులు కల ఆరు అంగాలు ఛాతీలో ఉన్నాయనీ అందులో హృదయమనేది రెండువేళ్ళ వెడల్పున కుడివైపుగా ఉంటుందనీ అంటారు. కాని హృదయానికి రూపం లేదనీ అంటారు. అటువంటప్పుడు హృదయానికి ఒక రూపం ఊహించుకొని దానిపై ధ్యానం చేయాలా?

జ: కాదు. “నేనెవరిని" అన్న అన్వేషణ అవసరం. గాఢ నిద్రలోను జాగ్రదవస్థలోనూ ఉండే దొక్కటే, కాని మేల్కొని ఉన్న ప్పుడు దుఃఖమూ, దానిని వారించే యత్నమూ ఉంటాయి. నిద్ర నుండి మేల్కొనే దెవరని అడిగితే, "నేను" అంటావు. ఈ “నేను” ని గట్టిగా విడవకుండా పట్టుకొమ్మని నీకు చెప్తున్నాను. ఇది చేస్తే నిత్యమైనదేదో నీకు సాక్షాత్కరిస్తుంది. ఈ "నేను" గురించి విచారణ జరగాలి. హృదయకేంద్రం గురించి ధ్యానం కాదు చేయాల్సింది. లోపలా, బయటా అంటూ ఏమీ లేదు. ఉంటే రెంటికీ ఒకే అర్థముంది. లేకపోతే ఏ మీలేదు.

అయినా, హృదయకేంద్రం పై ధ్యానం చేసే అభ్యాసం కూడా ఉంది. అది అభ్యాసమే గాని విచారణ కాదు. హృదయంపై ధ్యానం చేసే వాళ్లకే మనస్సు తన వ్యాపకాలను చాలించి నిశ్చలమైనట్టు తెలుస్తుంది. మిగిలిన కేంద్రాలపై ధ్యానం చేసేవారికి అది తెలియదు. వాళ్ళు మనస్సు తన వ్యాపకాలను ప్రారంభించిన తర్వాతనే, అంతకు పూర్వ నిశ్చలంగా ఉందని గ్రహిస్తారు.

ఆత్మ దేహంలో ఎక్కడ ఉందని అనుకున్నా, ఆ ఆలోచనా ప్రభావం వల్ల ఆ స్థానంలోనే ఉన్నట్లనిపిస్తుంది. ఏమయినా, ప్రేమ మయమైన హృదయమే ఉదయిస్తూ సమసి పోతూ, ఉండే "నేను" కి అంటే అహంకారానికి శరణాలయం. హృదయం బయటా లోపలా ఉంటుందని అన్నా, పరమ సత్యమిదే. అది లోపలగాని, బయటగాని లేదు. ఈ లోపలా, బయటా అనేవి శరీర సంబంధాలు - శరీరం మనస్సు యొక్క కల్పన. హృదయమే అన్నిటికీ మూలం, ఆది, అంతం, హృదయం ఆకాశమే. రూపం కాదు. అదే సత్యానికి వెలుగు.

## 7. శరణాగతి

వ్యక్తిగత ఉనికికి అతీతమవాలంటే ఈశ్వరార్పితం కావాలని చాలా మతాలు సూచిస్తాయి. ఈ మార్గం సరియైనదేనని అంగీకరిస్తూ, శ్రీ రమణులు దీనికి కూడా ఆత్మవిచారమంత పాటవముందనే వారు. సాంప్రదాయకంగా శరణాగతి తత్త్వం ద్వైత సిద్ధాంతాచారణలతో, భక్తితో ముడివడి ఉంది. కాని శ్రీ రమణులు అటువంటి అభ్యాసాలకు అంత ప్రాధాన్యత నివ్వలేదు.

నిజమైన శరణాగతి అంటే భగవంతుడ్ని ఒక విషయంగా ఆరాధించటాన్ని అధిగమించటమనే వారు. తాను భగవంతుని కన్నా భిన్నమనుకొనే వ్యక్తి మాయమైన తరువాతనే అట్లా అధిగమించటం సాధ్యమవుతుందనే వారు. ఈ గమ్యాన్ని చేరటానికి వారు రెండు విభిన్నమయిన అభ్యాసాలని సూచించేవారు.

1. తాను ఈశ్వరునికన్నా భిన్నమని ఊహించుకునే వ్యక్తి మాయమయే వరకూ : అహంవృత్తిని, విడువకుండా, పట్టుకొని ఉండటం.

2. తన జీవిత బాధ్యతనంతా ఈశ్వరునికి లేక ఆత్మకి అర్పితం చేయటం. అటువంటి శరణాగతి సఫలం కావాలంటే తనకి కోర్కెగాని సంకల్పంగాని లేకుండా ఉండి, భగవంతునితో ప్రమేయమేమీ లేకుండా వ్యవహరించగల వ్యక్తి అంటూ

ఒకడున్నాడన్న భావాన్ని కూడ విడనాడటం. ఇందులో మొదటిది మరోపేరుతో ఉన్నా, ఆత్మవిచార మార్గమే. శరణాగతి, ఆత్మవిచారం - రెండూ వేరు వేరు పేర్లున్న అభ్యాసాలే అయినా రెండూ ఒకటేననీ, ఆత్మ సాక్షాత్కారానికి ఆ రెండే ఉత్తమమైన పద్ధతులనీ శ్రీ రమణులు అనేవారు. "నేను" అనే భావంపై ఎరుక కలిగి ఉండే ఏ అభ్యాసమయినా ఆత్మ సాక్షాత్కారానికి సూటి అయిన మార్గమే. ఆ ఎరుకలేని ఏ ఇతర అభ్యాసాలూ అటువంటి మార్గాలు కావు అనే వారి అభిప్రాయంతో ఈ దృష్టికి పొంతన ఉంది.

ఆత్మసాక్షాత్కారానికి "నేను" పట్ల ధ్యాస కలిగి ఉండాలన్నవారి అభిప్రాయానికి అనుగుణంగా భక్తికి సంబంధించిన అభ్యాసాలని వారు పరిగణించేవారు. ఈశ్వరుని పట్ల ప్రపత్తీ, భగవరాధాన- ఈ అభ్యాసాలలోనివే.

అటువంటి అభ్యాసాలని విడనాడాలని తమ భక్తులకు శ్రీ రమణులు ఎప్పుడూ చెప్పలేదు. అయితే, ఎటువంటి సంబంధమైనా వట్టి భ్రమేననేవారు. ఆ సంబంధం భక్తునిగా, ఆరాధకునిగా, లేక సేవకునిగా ఎట్లా ఉన్నాసరే. దీనికి కారణమిది: సంస్థితమైన దల్లా - భగవంతుడొక్కడే కాబట్టి నిజమైన భక్తి ఉంటే నిజస్థితిలో ఉండటమే - ఆ స్థితిలో భగవంతుని గురించి కాని, భగవంతునితో సంబంధం గురించి గాని ఏ భావమూ ఉండదు. ఇక రెండవ పద్ధతి: తన జీవితానికి సంబంధించిన బాధ్యతనంతా భగవంతునికే విడవటం. ఇదికూడ వస్తుజాలంతో కర్మలతో తాదాత్మ్యం చెందే "నేను" అనే భావాన్ని తొలగిస్తుంది. ఈ విధంగా ఇది కూడ ఆత్మ విచార పద్ధతి వంటిదే. ఈ అభ్యాసం చేసేప్పుడెప్పుడూ ఒకే ఎరుక కలిగి ఉండాలి. అది, పనులు చేస్తూ సంకల్పాలు కలుగుతూ ఉండే వ్యక్తి అంటూ ఎవ్వరూ లేరని! అంతేకాదు, ఉండేదల్లా ఆత్మేననీ, దానితో సంబంధం లేకుండా స్వతంత్రంగా వర్తించగలదేదీ లేదని కూడ తెలిసి ఉండాలి. ఈ అభ్యాసం చేసేప్పుడు ఎప్పుడైనా తానే తన భావాలకీ, పనులకీ బాధ్యత వహిస్తున్నట్లనిపిస్తే వెంటనే మనస్సుని బయటి సంపర్కాల నుంచి ఉపసంహరించి ఆత్మలో ప్రతిష్ఠించటానికి ప్రయత్నం చేయాలి. ఆత్మవిచార పద్ధతిలో తనపై అవధానం పోయినప్పుడు, అవధానాన్ని మళ్ళించటం వంటిదే ఇదీను. రెండు పద్ధతులలోనూ "నేను" అనే భావాన్ని వేరు చేసి అది మాయమై పోయేట్టు చేయటమే లక్ష్యం.

ఈ పద్ధతిలో స్వాభావికంగా, పరిపూర్ణంగా శరణాగతి కలిగి ఉండటం చాలామందికి అసాధ్యమైన లక్ష్యమని శ్రీరమణులు అంగీకరించేవారు. అందువల్ల భక్తినీ, మనోనిగ్రహాన్ని పెంపొందించే ప్రాథమిక అభ్యాసాలను అలవరచుకొమ్మని తమ అనుచరులకు చెప్పేవారు. ఈ పద్ధతులలో భగవంతునిపైనగాని, గురువుపైన గాని ధ్యానం కలిగి ఉండటం గాని, నామ జపం చేయటం గాని, ఆయన రూపాన్ని ఊహించటం గాని ఎక్కువగా ఉంటాయి. ఈ అభ్యాసాన్ని, ప్రేమతో, భక్తితో చేస్తుంటే మనస్సు ఆ ధ్యానింపబడే విషయంలో తేలికగా విలీనమయి పోతుందని చెప్పేవారు. ఇది జరిగిన తరువాత పరిపూర్ణమైన శరణాగతి తేలిక అవుతుంది. ఎల్లప్పుడూ భగవంతుని గురించి ఎరుక కలిగిన మనస్సు ఇతర వస్తుజాలంతో తాదాత్మ్యం చెందదు. "ఉన్నదల్లా ఈశ్వరుడొక్కడే" అనేభావం కూడా దృఢపడుతుంది. దీనితోబాటు ఆత్మయొక్క అనుగ్రహమూ శక్తీ వెల్లువై వచ్చి, అహం యొక్క పట్టుని సన్నిగిల్ల చేస్తూ ఆ అహాన్ని బలపరచే వాసనలని ధ్వంసం చేస్తుంది. కొంత కాలానికి అహాన్ని కైవశం చేసుకోగల పరిస్థితి ఏర్పడి, సావధానం వల్ల దానిని తాత్కాలికంగానైనా, హృదయంలో విలీనం చేయగల శక్తి వస్తుంది.

ఆత్మ విచారమార్గంలో వలె చివరి సాక్షాత్కారం ఆత్మయొక్క శక్తివల్ల తనంతట తానే సంభవిస్తుంది. ఆత్మానుభూతి పదే పదే కలుగుతూంటే, మనస్సు బయటికి వెళ్ళే ప్రవృత్తి కరిగిపోతుంది. అప్పుడు "నేను" అనేది పూర్తిగా పోతుంది. తిరిగి ఉదయించదు. ఏ ప్రతిఫలాపేక్షా లేని శరణాగతి ఉన్నప్పుడే అహం యొక్క ఈ పరిపూర్ణ విధ్వంసం సంభవం. అనుగ్రహం కొరకో, ఆత్మసాక్షాత్కార వాంఛతోనో చేసే శరణాగతి వల్ల ఇది పరిపూర్ణంగా సాధ్యం కాదు. అటువంటిది, తనకేదో ప్రతిఫలం దొరుకుతుందన్న వ్యాపార ధోరణిలో అహం చేసే వ్యవహారమే అవుతుంది.

ప్ర: బేషరతుగా శరణాగతి అవటమంటే ఏమిటి?

జ: తాను శరణాగతుడైతే ప్రశ్నలు వేసేవాడుగాని ఆలోచింపవలసినవాడు గాని ఎప్పుడూ ఉండడు. అహంవృత్తిని పట్టుకొనైనా ఉండాలి లేదా తనకన్నా మహనీయమైన శక్తికి వశమైనా వశమై పోవాలి. ఆత్మసాక్షాత్కారానికి ఈ రెండే మార్గాలున్నాయి.

ప్ర: ముక్తి కొరకు గాని, భగవంతుని కొరకు గాని కోర్కె లేకుండా ఉండటమే కదా పరిపూర్ణమైన శరణాగతి ఉంటే?

23:

నీకు సంకల్పమంటూ ఏమీ ఉండకూడదు పరిపూర్ణమైన శరణాగతిలో భగవంతుడు నీకేది అనుగ్రహిస్తే దానితో సంతుష్టుడవై ఉండాలి. నీదంటూ ఏ కోరికా ఉండరాదు.

ప్ర: ఈ అంశమర్థమయింది. అయితే, అటువంటి శరణాగతి పొందటానికి నేను తీసుకోవలసిన చర్యలేమిటి?

జ

: రెండు మార్గాలున్నాయి. ఒకటి, 'నేను' యొక్క మూలాన్ని కనుగొని దానిలో విలీనమవటం. రెండవది "నేను పూర్తిగా అశక్తుడిని, ఈశ్వరునికే అన్ని శక్తులూ ఉన్నాయి. ఆయనపైన పూర్తిగా భారం వేయటం తప్ప నాకు సురక్షణకై మార్గం లేదు" అనుకోవటం. ఈ పద్ధతి వల్ల భగవంతుడే సర్వమూ అనీ, తన 'అహం' ఎందుకూ పనికిరాదనీ నమ్మకం క్రమేపీ దృఢ పడుతుంది. రెండు పద్ధతులూ ఒకే గమ్యాన్ని చేరుస్తాయి. పరిపూర్ణమైన శరణాగతి జ్ఞానానికీ, విముక్తికీ మరొక పేరు.

ప్ర: శరణాగతి తేలికగా ఉన్నట్లుంది. నేనా మార్గాన్ని అనుసరిస్తాను.

జ: నీవే మార్గాన్ని అనుసరించినా, నీవందులో విలీనమై పోవాలి. "సర్వమూ నీవే, నీ యిచ్చనే కానీ" అనే స్థితి చేరుకునే వరకూ శరణాగతి పూర్తయినట్టు కాదు. ఈ స్థితికీ, జ్ఞానానికీ తేడా లేదు. సోహం (నేనే అతడిని) అన్నప్పుడు ద్వైత భావముంది. శరణాగతిలో ఉన్నది అద్వైతం. నిజానికి ద్వైతమూ లేదు అద్వైతమూ లేదు. ఒక్కటే ఎప్పుడూ ఉన్నదంతా. "నేను నిన్ను శరణుజొచ్చాను" అని పెదవులతో అనేసి, తమ భారాన్ని భగవంతునిపైన పెట్టేస్తే, ఇంక తమ ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించవచ్చని ఊహించుకుంటారు. అందువల్ల శరణాగతి తేలిక అనిపిస్తుంది. కాని, శరణు జొచ్చిన తరువాత నీ యిష్టాయిష్టాలుండరాదు, నీకు సంకల్పమంటూ ఏమీ ఉండరాదు - ఆ స్థానంలో భగవంతుని సంకల్పమే నెలకొనాలి. 'అహం' ఈ విధంగా అంతమవుతుంది. దీనికీ జ్ఞానం వల్ల అహం అంతమవటానికీ ఏ భేదమూ లేదు కాబట్టి, నువ్వే మార్గాన వచ్చినా నీవు చేరుకోవలసినది జ్ఞానాన్నే. అంటే ఏకతనే!

ప్ర: అహాన్ని అంతమొందించటానికి శ్రేష్ఠమైన పద్ధతి ఏమిటి?

జ: ఎవరికి ఏది తేలిక అనిపిస్తుందో ఏది నచ్చుతుందో అదే శ్రేష్ఠమైనది. అన్ని మార్గాలూ మంచివే. అహం ఆత్మలో విలీనమవటమనే గమ్యం వైపే దారి చూపుతాయి. భక్తుడు శరణాగతి అని దేనినంటాడో, దానినే జ్ఞానమంటాడు విచారం చేసేవాడు. ఇద్దరూ అహాన్ని మూలంలోకి తీసుకువెళ్ళి దానిలో విలీనం చేయటానికే ప్రయత్నిస్తారు.

ప్ర: సాధకుని పట్ల అనుగ్రహం వల్ల అటువంటి పర్యవసానం వేగిర పడదా?

జ: దానిని భగవంతునికి విడచిపెట్టు. భేషరతుగా "శరణ" నను నీ అశక్తతను గుర్తించి నీ కంటె మహనీయమైన శక్తి సహాయమవసరమని గ్రహించి శరణు వేడుకో, లేదా దుఃఖానికి కారణ మేమిటో పరిశోధించి, దాని మూలాన్ని కనుక్కొని ఆత్మలో విలీనమై పో, ఏ విధంగానైనా, దుఃఖం నుంచి విముక్తడవుతావు. తనను శరణుచొచ్చిన వానిని భగవంతుడెప్పుడూ విడిచి పెట్టడు.

ప్ర: శరణాగతి తరువాత మనస్సు యొక్క ప్రవృత్తి ఏమిటి?

జ :శరణన్న మనసే ఈ ప్రశ్నని వేస్తోందా?

ప్ర: శరణు పొందాలన్న కోరికను ఎప్పుడూ కలిగి ఉండటంవల్ల అనుగ్రహం ఎక్కువగా అనుభవమవు తూంటుందని ఆశిస్తున్నాను.

23:

89

ముందు శరణాగతి చెందు - అంతటితో కోరికను ఆపివేయి. కర్తృత్వ భావమున్నంత సేపూ వాంఛ ఉంటూనే ఉంటుంది. అదే వ్యక్తిననే భావం కూడా. ఇది పోతే, ఆత్మ నిర్మలంగా ప్రకాశిస్తున్నట్లు తెలుస్తుంది. కర్తృత్వ భావమే బంధం, కార్యం కాదు, "నిశ్చలంగా ఉండి నేను భగవంతుడిని" అన్న ఎరుక కలిగి ఉండు. ఇక్కడ నిశ్చలత్వమంటే పృథక్బవం ఏమాత్రమూ లేని పరిపూర్ణశరణాగతి అని అర్థం. నిశ్చలత ఉంటుంది. ఆందోళితం కాదు మనస్సు. మనస్సు యొక్క ఆందోళనమే వాంఛకీ కర్తృత్వ భావానికీ పృథక్ భావానికీ కారణం. దానిని నిలిపి వేస్తే ఉండేదల్లా ప్రశాంతతే. అప్పుడు “ఎరుక కలిగి ఉండట" మంటే - "ఉండటమే" త్రిపుటమైన జ్ఞానమ. జ్ఞేయము, జ్ఞాని అనబడే సాపేక్షమైన జ్ఞానం కాదది.

ప్ర: "నేను ఈశ్వరుణ్ణి" "నేను పరబ్రహ్మాన్ని" అనే భావం ఉపయోగిస్తుందా?

జ: “నేను నేనైన నేను”, “నేనున్నాను" అదే భగవంతుడు, "నేను ఈశ్వరుడ్ని" అనుకోవటం కాదు. "నేనున్నా" ననే దానిని సాక్షాత్కరింప చేసుకో. దాని గురించి ఆలోచించకు. “నేనే ఈశ్వరుడ్ని అని తెలుసుకో” మన్నారే కాని, “నేను భగవంతుడ్ని అనుకొమ్మ" ని ఎవ్వరూ చెప్పలేదు.

బెల్లంతో వినాయకుని ప్రతిమను తయారుచేసి దాని నుంచే ఒక ముక్కను త్రుంచి ఆ ప్రతిమకే నైవేద్యం పెట్టటం వంటిదే శరణాగతి గురించిన ఈ మాటలన్నీ, నీ దేహాన్ని, నీ అంతరంగాన్ని నీ సంపదనీ భగవంతునికి సమర్పిస్తున్నా నంటావు. సమర్పించటానికి అసలవన్నీ నీవేనా? మహా అయితే ఇట్లా అనవచ్చు "భగవంతుడా ఇప్పటి వరకూ నీవైన వీటన్నిటినీ నావనుకున్నాను తప్పుగా. ఇప్పుడు నా పొరపాటుని గ్రహించాను. అవన్నీ నావైనట్టు ఇక వ్యవహరించను".

ఈశ్వరుడు లేక ఆత్మ తప్ప వేరేమీ లేదన్న గ్రహింపూ, ఆత్మ తప్ప నేను, నాది అంటూ ఏమీ లేదన్న గ్రహింపూ ఇదే జ్ఞానం. భక్తికీ జ్ఞానానికీ తేడా లేదు. భక్తి జ్ఞాన మాత.

ప్ర: ఈ లోకంలో వ్యవహరిస్తున్న మాకు ఎప్పుడూ ఏదో ఒక చింత ఉంటూనే ఉంటుంది. దానిని దాటటమెట్లాగో తెలియదు. భగవంతుడిని ప్రార్థిస్తాం. అయినా సంతృప్తి చెందం. మేమేం చేయాలి?

జ:

భగవంతుడ్ని విశ్వసించు.

ప్ర: మేము శరణంటాం, అయినా సహాయం దొరకదు.

23:

నిజమే. అయితే నీవు నిజంగానే శరణన్నావంటే భగవంతుని యిచ్చకు బద్ధుడవై యుండాలి. నీకు నచ్చనిది జరిగితే దాని గురించి బాధ పడకూడదు. పైకి కనబడినట్టుకాక, పరిస్థితులు ఇంకొక విధంగా మారవచ్చు. దుఃఖం మనుష్యులని భగవంతుని వైపు తిప్పుతుంది, సాధారణంగా.

ప్ర: మా బ్రతుకులు ప్రాపంచకం. భార్య, పిల్లలు, మిత్రులు, బంధువులు ఉంటారు. వారి ఉనికిని మరచి దైవేచ్ఛ అంటూ ఊరుకోలేం. మా వ్యక్తిత్వాన్ని పూర్తిగా విడనాడలేం.

జ

: అంటే నువ్వు చెప్పుకుంటున్నట్టు నీవు పూర్తిగా శరణాగతి చెందలేదన్నమాట. నీవు భగవంతుడినే విశ్వసించాలి. ఆయన శరణు చెందు. ఆయన దర్శనమిచ్చినా, అదృశ్యమైనా ఆయన యిచ్ఛకి బద్ధుడవై ఉండు. ఆయన ఏమి చేస్తాడో వేచి ఉండు. నీ యిష్టం వచ్చినట్టు ఆయనని చేయమనటం ఆయనని శరణు వేడటం కాదు. అజ్ఞాపించడ మవుతుంది. ఆయన నీ ఆజ్ఞను వర్తికావాలంటూ వేరొక వంక ఆయన శరణు జొచ్చాననుకోవటం కుదరదు. ఏది మంచిదో, ఎప్పుడు ఎట్లా చేయాలో ఆయనకి తెలుసు. అంతా ఆయనకే విడచిపెట్టు ఆభారమాయనదే. ఇక నీకే చింతలూ లేవు. నీ చింతలన్నీ ఆయనవే. అదే శరణాగతి అంటే. అదే భక్తి.

కాకపోతే, ఈ ప్రశ్నలు ఎవరికి ఉదయిస్తున్నాయో, హృదయంలోకి లోతుగా వెళ్లి ఆత్మలో సంస్థితమవు. సాధకునికి ఈ రెండు మార్గాలూ ఉన్నాయి.

ప్ర: శరణాగతి అసాధ్యం.

23:

అవును, మొదట్లో పరిపూర్ణమైన శరణాగతి కష్టమే. కొంతవరకు శరణననటం అందరికీ సాధ్యమే. క్రమేపీ అదే పూర్తి శరణాగతికి దారి తీస్తుంది. అయితే, పూర్తి శరణాగతి అసాధ్యమైతే చేయవలసిందేమిటి? మనశ్శాంతి లేదు. దానిని నెలకొల్పటం నీ వల్ల కాదు. అది శరణాగతి వల్లనే లభిస్తుంది.

ఒక్క శరణాగతి వల్లనే ఆత్మని చేరుకోగలమా?

ప్ర:

శరణాగతి చెందటం చాలు. తన ఉనికికి మూలకారణమైన దానికి తననిని తాను అర్పించుకోవటమే శరణాగతి అంటే. ఆ మూలం నీకు వెలుపల ఉన్న భగవంతుడని భ్రమ పడకు. నీ మూలం నీలోనే ఉంది. దానికి అర్పితమవు. అంటే, మూలాన్ని అన్వేషించి అందులో విలీనమవట మన్నమాట.

ప్ర: (ఈ ప్రశ్న వ్రాతపూర్వకంగా శ్రీ రమణులకు సమర్పింపబడింది.) వేరే ఏ చింతనా లేకుండా భగవంతుడ్ని మాత్రమే పూర్తిగా ఆశ్రయిస్తే దేనినైనా పొందవచ్చంటారు. అంటే ఇతర ఆలోచనలన్నీ విడిచి ఆఖరికి శరీరం నిలవటానికి అవసరమైన ఆహారం గురించిన ఆలోచన కూడా విడనాడి, ఎల్లవేళలా భగవంతుడ్ని ధ్యానిస్తూ కూర్చోమని అర్థమా? జబ్బు చేస్తే ఔషధం గురించి గాని, వైద్యుని గురించి గాని ఆలోచించకుండా తన ఆరోగ్యపు బాధ్యతలని భగవంతునికి వదలివేయటమని అర్థమా? భగవద్గీతలో “అన్ని కోరికలని వదలి, అహంకార మమకారాలు వీడి, ఆశని విడచి మసలే పురుషుడు శాంతిని పొందుతాడు" అని ఉంది (2.71) అంటే అన్ని వాంఛలనీ త్యజించటమన్నమాట. ఎల్లప్పుడూ భగవంతునిపైనే ధ్యాస కలిగి ఉండి భగవంతుని అనుగ్రహం వల్ల సంక్రమించే అన్న పానాదులని మాత్రమే తీసుకోవాలనీ, వాటికోసం ఏ ప్రయత్నమూ చేయరాదనా దీని అర్థం? లేక మనిషి కొంత ప్రయత్నం చేయవచ్చా?

ఈ శరణాగతి యొక్క రహస్యాన్ని వివరించండి భగవాన్!

జ

: (ఆ వ్రాసిన దానిని చదివి గదిలో ఉన్న వారందరినీ ఉద్దేశించి భగవాన్ ఇచ్చిన సమాధానం)

'అనన్య శరణాగతి' అంటే ఏ ఆలోచనపైనా అనురక్తి లేకుండా ఉండటం, నిజమే. అయితే, శరీరం నిలవటానికి అవసరమైన అన్నపానాదుల గురించిన ఆలోచనలని కూడా త్యజించాలనా దీని అర్థం? "భగవంతుని ఆదేశానుసారం ఏదైనా దొరికితేనే తినాలి, దానికోసం ఎవ్వరినీ అడుగకూడదా. లేక నేను కొంత ప్రయత్నం చేయవచ్చా అదీ వీరి ప్రశ్న. సరే మనం తినవలసిన దేదో దానంతట అదే వస్తుందని ఒప్పుకుందాం. అప్పుడైనా, తినేది ఎవరు? ఎవరైనా ఆహారాన్ని నోట్లోపెట్టినా, దానిని మింగాలి కదా? "జబ్బు చేస్తే నేను మందు తీసుకోవాలా లేక ఊరికే ఉండి, నా ఆరోగ్యం భగవంతుని చేతుల్లో విడిచి పెట్టాలా"అని కూడ అడుగుతున్నారు. "సాధక పంచక" మనే గ్రంథంలో, ఆకలి అనే జాడ్యానికి భిక్షగా దొరికిన ఆహారాన్ని తీసుకోవాలని శ్రీ శంకరులు వ్రాసారు. అప్పుడైనా బయటికి వెళ్ళి బిచ్చమెత్తుకోవాలి కదా? అందరూ కళ్లు మూసుకు కూర్చుని ఆహారంవస్తే తింటామని ఊరుకుంటే ప్రపంచం నడిచేదెట్లా? అందుచేత, సంప్రదాయానుసారం వచ్చే వాటిని స్వీకరించాలి -కాని, తానే చేస్తున్నానన్న భావం లేకుండా ఉండాలి. "నేను చేస్తున్నా" నన్న భావనే బంధం. కాబట్టి అటువంటి భావాన్ని ఎట్లా అధిగమించాలని ఆలోచించాలి. అంతేనే గాని జబ్బు చేస్తే మందు వేసుకోవాలా. ఆకలి వేస్తే ఆహారం తీసుకోవాలా అన్న విషయాల గురించి కాదు! అటువంటి సందేహాలు వస్తూనే ఉంటాయి అంతులేకుండా. "నొప్పి పెట్టితే నేను మూలగవచ్చా" "గాలిని విడిచిన తర్వాత మళ్ళీ పీల్చవచ్చా" అంటూ కూడా సందేహాలు వస్తాయి. ప్రతి వ్యక్తి యొక్క మానసిక వికాసాన్ని బట్టి ఈశ్వరుడో, కర్మో, కర్త - ఏ పేరు పెట్టుకున్నా సరే - ఈ లోకంలో అన్నిటినీ నిర్వహిస్తుంది. బాధ్యతని ఆ కర్తమీద పడవేస్తే సరి. అన్నీ వాటంతటవే చక్క బడుతాయి. మనం నేలమీద నడుస్తాం. నడిచేప్పుడు ప్రతి అడుగు వేసేముందూ ఒక కాలి తరువాత రెండో కాలిని ఎత్తాలా అని తర్కించు కుంటూంటామా, ఆగిపోతామా? నడక దానంతట అది సాగిపోదా? శ్వాస పీల్చటం, విడవటం విషయమూ అంతే! దానికోసం ప్రత్యేకమైన ప్రయత్నమేమీ చెయ్యం. జీవితం విషయంలోనూ అంతే! దానికోసం ప్రత్యేకమైన ప్రయత్నమేమీ చెయ్యం. జీవితం విషయంలోనూ అంతే మనం కోరుకున్నంత మాత్రాన దేనినైనా విడిచిపెట్ట గలమా, మనం యిష్టం వచ్చినట్టు ప్రవర్తించగల మా? మనకి ఎరుక ఉన్నా లేకపోయినా వాటంతటవే ఎన్నో జరిగి పోతాయి. భగవంతుని పట్ల ప్రపత్తి అంటే, అన్ని ఆలోచనలను విడిచి మనస్సుని ఆయనపై లగ్నం చేయటమే. మనమాయన పట్ల ఏకాగ్రత కలిగి ఉంటే, మిగిలిన ఆలోచనలన్నీ వాటంతటవే మాయమై పోతాయి. మనం మనస్సుతో, వాక్కుతో దేహంతో చేసేవాటినన్నిటినీ భగవంతుని లోనే విలీనం చేస్తే, మన బ్రతుకు భారమంతా ఆయన మీదే ఉంటుంది.

ప్ర: నేను చేసే ప్రతి పనికి, కర్త భగవంతుడేనా?

జ:

ప్రస్తుతం ఉన్న చిక్కేమిటంటే, వ్యక్తి తానే కర్తననుకోవటం, అది తప్పు. వేరే శక్తి చేస్తుంది. మనిషి ఒక సాధనం మాత్రమే. ఆ స్థితిని అంగీకరిస్తే మనిషికి ఏ కష్టాలూ ఉండవు. లేకపోతే అతడు వాటిని కొని తెచ్చుకుంటాడు. గుడి గోపురం మొదట్లో ఉండే శిల్పాన్ని చూడు. ఆ బొమ్మని చూస్తే గోపురం యొక్క బరువునంతా దాని భుజాలమీదే ఉన్నట్టు కనబడుతుంది. ఆ శిల్ప భంగిమ, ఆ రూపం - అంత బరువునీ మోస్తున్నట్టే అనిపిస్తుంది. కానీ కాస్త ఆలోచించు, గోపురం భూమిమీద నిర్మింప బడింది. దాని పునాదుల మీద అది నిలబడుతుంది. ఆ శిల్పం గోపురంలో ఒక భాగమే. కాని చూడటానికి మాత్రం అదే గోపురం యొక్క బరువునంతా మోస్తున్నట్టుంటుంది. తమాషాగా లేదూ? అంతా తానే చేస్తున్నాననుకునే వారి పరిస్థితీ ఇంతే!

ప్ర:

స్వామీ! భగవంతుడ్ని ప్రేమించటం మంచిదే కదా? అయితే, ప్రేమ మార్గాన్నే ఎందుకనుసరించరాదు?

జ:

అట్లా అనుసరించకూడదని ఎవరన్నారు? కాని, నువ్వు ప్రేమ గురించి మాట్లాడేటప్పుడు అందులో ద్వయీ భావముంది కదా - ప్రేమించే వాడూ, ప్రేమింపబడే - భగవంతుడనబడేవాడూను. వ్యక్తి భగవంతుని నుండి వేరు కాదు. అంటే, ప్రేమంటే తనపట్ల (ఆత్మపట్ల) తనకే ప్రేమ అన్న మాట!

ప్ర

: ప్రేమ మార్గం ద్వారా భగవంతుడిని ఆరాధించవచ్చా? ఆ కారణం చేతనే అడుగుతున్నాను.

జ:

నేననేది అదే, ప్రేమే భగవంతుని స్వరూపం. "నేను దీనిని ప్రేమించను, దానిని ప్రేమించను" అంటూ అన్నింటినీ తిరస్కరిస్తే, మిగిలేదల్లా స్వరూపమే - అదే ఆత్మ యొక్క నిజరూపం. అదే శుద్ధానందం. కావాలంటే ఆనందమనిగాని, ఈశ్వరుడని గాని, ఆత్మ అని గాని ఏమో అనవచ్చు. అదే భక్తి, అదే సాక్షాత్కారం, అదే సర్వమూను. అన్నింటినీ తిరస్కరిస్తే మిగిలేది ఆత్మే. అదే అసలైన ప్రేమ. ఆ ప్రేమ యొక్క రహస్యం తెలిసిన వానికి ప్రపంచమంతా ప్రేమమయంగా ఉన్నట్టు తెలుస్తుంది.

"చైతన్యపు ఎరుక" అనే అనుభవమే భక్తి యొక్క స్థితి - భక్తి అంటే వాడిపోని స్వచ్ఛమైన ప్రేమ - ఎందువల్లనంటే ఆత్మ జ్ఞానం ప్రేమ స్వరూపంగా పెల్లుబుకుతుంది. ఆత్మే పరిపూర్ణమైన శుద్ధానందంగా ప్రకాశమవుతుంది. ఆత్మ యొక్క నిజతత్త్వం ప్రేమ. ప్రేమ గురించి సత్యం తెలిసినప్పుడే జీవితమనే చిక్కుముడి విడుతుంది. ప్రేమ యొక్క శిఖరాన్ని అధిరోహిస్తే, విముక్తి లభిస్తుంది. అదే అన్ని మతాల సారాంశమూను. ఆత్మానుభూతే ప్రేమ అంటే - దాని అర్థం, ప్రేమనే చూడటం, వినటం, అనుభవించటం, రుచి చూడటం, వాసన చూడటం. అదే పరమానందం.

ప్ర:

నాకు భక్తి కావాలి. ఈ తపన ఇంకా ఎక్కువ కావాలి. ఆత్మ సాక్షాత్కారం నాకంత ప్రధానం కాదు. నాకీ కోర్కె బాగా దృఢపడితే చాలు.

జ:

ఆ తపనే ఉంటే, సాక్షాత్కారం నీకు వద్దన్నా లభిస్తుంది. మనస్సు భక్తిలో కరిగిపోయేటంత తీవ్రంగా దానిని కాంక్షించు. కర్పూరం కాలిపోయిన తరువాత ఏమీ మిగలదు. మనస్సు కర్పూరం వంటిది. అది ఏ ఆచూకినీ విడవకుండా ఆత్మలో లీనమై పోవటమే ఆత్మ సాక్షాత్కారమంటే.

ప్ర:

మూర్తి ధ్యానంలో నాకు నమ్మకముంది. జ్ఞానం పొందటానికి అది ఉపయోగపడదా?

జ:

తప్పకుండా ఉపయోగపడుతుంది. ఉపాసన వల్ల మనస్సుకి ఏకాగ్రత ఏర్పడుతుంది. ఇతర భావాలేవి లేకుండా, ధ్యానించిన మూర్తితోనే మనస్సు నిండి పోతుంది. తరువాత మనస్సు ఆధ్యానింపబడే మూర్తితో ఏకమై పోతుంది. అది నిర్మల మవుతుంది. అప్పుడు ఆరాధించే దెవరని ఆలోచించు. “నేను” అంటే ఆత్మ అని సమాధానం వస్తుంది. ఈ విధంగా ఆత్మానుభూతి కలుగుతుంది చివరికి.

నిరాకారమైన సత్యాన్ని ఏ సంకల్పమూ లేని భావంతో ఆరాధించటమే అన్నిటికన్నా శ్రేష్ఠమయిన ఆరాధన. నిరాకారుడైన భగవంతుడిని ఆరాధించటం చేతకాకపోతే, సాకారుడైన భగవదారాధనమే తగినది. అహంకారం లేనివారే నిరాకారమైన ఆరాధనని చేయగలరు. అహంకారయుతులెప్పుడూ సాకార మూర్తినే ఆరాధిస్తారని తెలుసుకో.

ఏ విధమైన అనురక్తీ లేని శుద్ధ ఆత్మగా ఉండటమే నిశ్చలమైన మౌనస్థితి. ఆ మౌనంగా ఉండటమే, ఆ అనుభవం యథాతథంగా పొందటమే, మానసిన పూజ. అంటే నిరవధికమూ, సహజమూ, నిజమూ అయిన ఆరాధన ఆత్మకివశమై, ఆత్మలో సంస్థితమై, హృదయంలో భగవంతుని నెలకొల్పుకున్న మనస్సే చేయగలదు. అదే మౌనం. అదే పరమోత్కృష్టమైన ఆరాధన. అహంకారం లేకపోవటమే మౌనం, అదే విముక్తి. ఆత్మ విస్మృతివల్ల ఆ మౌనం నుండి దిగజారి పోవటం జరుగుతుంది. అదే విభక్తి. ఆత్మలో విలీనమై పోయిన మనస్సువల్ల కలిగే మౌనంలో సంస్థితమవటమే నిజమన శివభక్తి (ద్వైవభక్తి)

ఆత్మ స్వరూపమైన శివుని పాదాలకు తనని తాను పూర్తిగా అర్పణ చేసుకున్నప్పుడు ఎంతో శాంతి కలుగుతుంది. ఆ స్థితిలో తనలోపాల గురించి హదయంలో ఏ విధమైన భావమూ ఉండదు. అదే పరభక్తి యొక్క స్వరూపం. ఆ విధంగా భగవంతునికి దాసుడై, నిశ్చలంగా, మౌనంగా ఉండటమే. ఆఖరికి నేను దాసుడనన్న అహంకారయుతమైన భావం కూడా లేకుండా ఉండటమే ఆత్మలో సంస్థిత మవటమన్న మాట. అదే పరమోత్కృష్టమైన జ్ఞానం.

ప్ర:

ఈ గమ్యాన్ని భగవంతుని స్తోత్రాలను పాడుతూ తిరుగుతున్నా సాధకులు అందుకోగలరా? లేక ఒకే ఒక చోటనే ఉండాలా?

మనిషి ఎక్కడ తిరుగుతున్నా మనస్సు ఒక దానిపైనే లగ్నమయి ఉండటం మంచిది. మనస్సు అటూ ఇటూ తిరుగుతూంటే దేహాన్ని మాత్రం ఒక చోటనే ఉంచటంలో ప్రయోజన మేమిటి?

ప్ర

: అహేతుకమైన భక్తి సంభవమేనా?

జ

: సంభవమే. ఏదైనా ఒక దానిని కోరుకుంటూ భగవంతుడిని ఆరాధించటం, ఆ వస్తువుని ఆరాధించటమే అవుతుంది. వాంఛనీయమంటూ ఏమీ లేని మానసిక స్థితే శివత్వాన్ని అందుకోవటానికి ముఖ్యావసరం.

ప్ర: హృదయంలో కృష్ణుడ్ని దర్శించటానికై అందరికీ సాగిల పడుతూ అందరిలోనూ భగవంతుడినే చూడాలంటుంది శ్రీ మద్భాగవతం. ఆత్మాసాక్షాత్కారానికిది సరైన మార్గమేనా? ఈ విధంగా ఆరాధించటం, మానసికంగా 'నేనెవరిని" అని విచారిస్తూ మనస్సుకి అతీతమైన దానిని గ్రహించే ప్రయత్నం కంటే తేలిక కదా?

జ:

అవును. అందరిలోనూ భగవంతుడినే చూచేప్పుడు భగవంతుని గురించి చింతిస్తావా లేదా? నీ చుట్టూ భగవంతుడినే చూడ గోరితే ఆయన గురించే ఆలోచిస్తూండాలి. మనస్సులో ఈ విధంగా భగవంతుని నెలకొల్పుకోవటం ధ్యానమే అవుతుంది. సాక్షాత్కారానికి ముందు దశధ్యానం. సాక్షాత్కారం ఆత్మదే, ఆత్మకి సంబంధించినదే. ఆత్మని విడిచి ఎప్పుడూ కాదు. సాక్షాత్కారానికి ముందే ధ్యానము. నీవు భగవంతుని ధ్యానించినా, ఆత్మని ధ్యానించినా ఒకటే - గమ్యం ఒకటే. నీవే విధంగానూ ఆత్మని తప్పించు కోలేవు. నీలో తప్ప అంతటా భగవంతుడ్ని చూడగోరుతున్నావే సర్వమూ

భగవంతుడే అయితే ఆ సర్వంలో నీవు లేవా? నీవే భగవంతుడవైనప్పుడు సర్వమూ భగవంతుడవటంలో ఆశ్చర్య మేముంది. భాగవతంలోనూ ఇతర చోట్లా ఈ అభ్యాసాన్నే బోధించారు. ఈ అభ్యాసానికి కూడా చూచేవాడూ - ఆలోచించేవాడూ అంటూ ఒకడుండాలి కదా. అతడెవరు?

ప్ర: అంతటా వ్యాపించి ఉన్న భగవంతుడ్ని చూడటమెట్లా?

జ:

భగవంతుని చూడటమంటే భగవంతుడవటమే. భగవంతునికి భిన్నంగా వేరేమీ లేదు. అందులో ఆయన వ్యాపించి ఉండటానికి! ఉన్నదల్లా భగవంతుడే.

ప్ర

: తన భక్తిని చూపుకొనటానికి భక్తునికి ఒక దైవమవసరం. అటువంటి వానికి - "ఉన్నదల్లా ఆత్మే ఆరాధించేవాడూ, ఆరాధింపబడేదీ అంటూ ఏమీ లేవు" అని బోధించాలా?

జ:

సాధనకై భగవంతుడు కావలసిందే. భక్తి మార్గంలో కూడా సాధనకి తగిన ఫలితం పరిపూర్ణమైన ప్రపత్తి వల్లనే లభిస్తుంది. అహంకారం తుడిచిపెట్టుకుపోయి, ఆత్మ ఎప్పటివలె నిలుస్తుందని తప్పితే, దీని అర్థమేమిటి? ఏ మార్గాన్ని అనుసరించినా, “నేను”ని తప్పించుకోలేవు. నిష్కామ్య కర్మని చేసేదీ, వియోగమైన భగవంతునికై పరితపించేది, తన నిజస్థితి నుంచి జారిపోయాననుకు నేదీ 'నేను' ఆ 'నేను' యొక్క మూలాన్ని కనుక్కోవాలి. అప్పుడే అన్ని సమస్యలూ పరిష్కారమవుతాయి.

ప్ర:

ఈ "నేను" కూడా ఒక భ్రాంతే అయితే, ఆ భ్రాంతిని తొలగించే దెవరు?

22:

అహంకారమే ఆ భ్రాంతిని తొలగించి, నిజమైన 'నేను'గా నిలిచిపోతుంది. ఆత్మసాక్షాత్కారంలోని చమత్కారమిదే. సాక్షాత్కారం పొందిన వారి కందులో ఏ అబ్బురమూ కనబడదు. భక్తి విషయమే తీసుకో. ఈశ్వరుని ప్రార్థిస్తూ ఆయనలో విలీనమవాలని కోరుతారు. శరణుజొచ్చి ఎంతో నమ్మకంతో ఆయనపై లగ్నమవుతారు. ఆ తరువాత మిగిలేదేమిటి? అహంకారం స్థానంలో, పరిపూర్ణమైన ప్రపత్తి వల్ల మిగిలేది భగవంతుడే. అహంకారం అందులో మాయమైపోయి ఉంటుంది. ఇదే పరభక్తి ఇదే ప్రపత్తి, ఇదే వైరాగ్యం. 'నాది' అనుకున్న సంపదనంతా వదులుకుంటావు దీని బదులు 'నేను' 'నావి' వదులుకుంటే ఒక్క దెబ్బతో అన్నీ వదులు కున్నట్టే. సంపద అనబడే బీజమే పోతుంది. ఆ అరిష్టం మొగ్గలోనే త్రుంచి వేయబడుతుంది. విత్తుగానే చూర్ణమైపోతుంది. వైరాగ్యమెంతో పటిష్టం కావాలి, ఇట్లా చేయటానికి, దీనిని చేయాలన్న తపన కూడ - నీటిలో మునిగిపోతున్న వాడు పైకి తేలి గాలికోసం తపన పడేటంతటి తీవ్రంగా ఉండాలి.

మూడవ భాగము:-

# గురువు

నిజానికి దైవమూ, గురువూ ఒకరే. పులినోట పడిన దానికి తప్పించుకోవటమంటూ లేదు. అట్లాగే గురువు అనుగ్రహం పొందిన వారికి రక్షణ లేకపోవటమంటూ లేదు, గురువు వారినెప్పుడూ వీడడు. గురువు ఉపదేశించిన మార్గాన్ని మాత్రం వారనుసరించాలి.

శ్రీ భగవాన్ ధృక్పథంలో శిష్యులంటూ ఎవ్వరూ లేరు. కానీ, శిష్యుని ధృక్పథంలో ఒక మహాసముద్రం వంటిది గురుకృప. ఒక చిన్నగిన్నెతో వెళ్తే ఆ గిన్నెడే లభిస్తుంది. మహాసముద్రం లోభి అని ఫిర్యాదు చేయడంలో అర్థంలేదు. ఎంత పెద్ద పాత్రని తీసికొని వెళ్తే అంత ఎక్కువగా తీసుకోవచ్చు. అదంతా శిష్యుని పైనే ఆధారపడి యుంటుంది.

మనస్సు యొక్క కలాపాలను తాత్కాలికంగానైనా నిలపటానికి ఒక మార్గం ఋషుల సాంగత్యం పొందటం. ఋషులకు సమాధి స్థితిలో ఉండటం సామాన్యం, సహజం, నిరంతరం, వాళ్లతో సన్నిహితంగా మసలే వారికి కూడ అట్లా సమాధి స్థితిలో ఉండటం క్రమంగా పట్టు పడుతుంది.

## 8. గురువు

ఆధ్యాత్మిక బోధనని చేసేవారెవరినైనా గురువంటారు. కాని శ్రీరమణుల పరి భాషలో ఆ పదానికి ఇంకా సూక్ష్మమైన నిర్వచనముంది. ఆయన దృష్టిలో, అసలైన గురువంటే, తాను ఆత్మసాక్షాత్కారం పొంది తన శక్తితో ఇతరులను కూడ ఆత్మసాక్షాత్కారం వైపు వెళ్లేందుకు సహాయపడగలిగిన వ్యక్తే.

శ్రీ రమణులు తరచూ దైవము, గురువు, ఆత్మ ఒకటే నంటూండేవారు. మానవరూపంలోని దైవమే గురువు. అంతేకాక, గురువే భక్తుని హృదయంలో ఆత్మకూడా. ఆయన లోపలా, బయటా కూడా ఉండటంవల్ల ఆయన శక్తి రెండు విధాల పనిచేస్తుంది. బయటి గురువు సూచనలనిస్తూ తన శక్తితో భక్తుడు ఆత్మపైనే లగ్నమయేట్టు చేస్తాడు. లోపలి గురువు, భక్తుని మనస్సుని దాని మూలంవైపు లాగి అది ఆత్మలో లీనమయేట్టు చేసి, చివరికి దానిని ధ్వంసం చేస్తాడు.

ఆత్మ గురించి శాశ్వతమైన ఎరుకని కలిగి ఉండాలని సాధన చేసే వారిలో ఇంచుమించు అందరికీ గురువు యొక్క ప్రబోధనమవసరమని శ్రీ రమణుల బోధనలలో ముఖ్యాంశం. ఆధ్యాత్మిక ప్రగతిలో గురువు యొక్క పాత్ర కీలకమైనది. ఎక్కడో అరుదుగా తప్ప, సాధకులలో ఆత్మవిస్మృతి ఎంతో బలీయం. దాని బారి నుండి తమంతట తామే వారు తప్పించుకోలేరు.

ఆత్మ సాక్షాత్కారాన్ని పొందగోరే వారికి గురువు యొక్క అవసరముందని శ్రీరమణులు చెప్పినా, ఆ అన్వేషణని ఎంతో ప్రగాఢంగా కొనసాగించని వారికి తానుగా, తన శక్తితో గురువు వారికి సంపాదించి పెట్టే శక్తి లేదనేవారు. ఎవరికి వారే ఎంతో తీక్షణంగా ఆత్మని తెలుసుకునే ప్రయత్నం చేస్తే గురువు యొక్క కృప, శక్తీ కూడ తమంతట తామే ప్రవహిస్తాయనే వారు. అటువంటి ప్రయత్నం చేయకపోతే గురువు నిస్సహాయుడే!

ఈ అధ్యాయంలోని సంభాషణలు, గురువు యొక్క స్వరూపం గురించీ, ఆత్మసాక్షాత్కారంలో గురువు యొక్క పాత్ర గురించీ శ్రీ రమణుల అభిప్రాయాలు సంక్షిప్తంగా సూచిస్తాయి. తమదైన రీతిలో శ్రీరమణులు ఆ శక్తిని ఎట్లా వినియోగించారో, తొమ్మిదవ అధ్యాయంలో వివరింపబడుతుంది.

ప్ర:

గురువు యొక్క కృప అంటే ఏమిటి? అది ఆత్మసాక్షాత్కారానికి మార్గాన్ని ఎట్లా చూపుతుంది?

గురువే ఆత్మ. మనిషి తన జీవితం గురించి అసంతుష్టుడవుతాడు ఒకోసారి. తనకున్న దానితో సంతృప్తి చెందడు. తన కోర్కెలు తీరటానికై భగవంతుడిని ప్రార్థిస్తాడు. కేవలం తన కోర్కెలు తీరటం కంటే, భగవంతుని కృప కోసమే, భగవంతుడిని తెలుసుకోవాలన్న దశ వచ్చేంతగా అతని మనస్సు క్రమేపీ పరిశుద్ధ మవుతూంటుంది. అప్పుడు భగవంతుని కృప రూపం దాలుస్తుంది. భగవంతుడే గురువు రూపం దాల్చి భక్తునికి కనబడి సత్యం గురించి బోధిస్తాడు. అంతేకాక, తన సాంగత్యం వల్ల అతని మనస్సు ఇంకా నిర్మలం చేస్తాడు. భక్తుని మనస్సు పటిష్ఠమవుతుంది, అంతర్ముఖ మవుతుంది. ధ్యానం వల్ల ఇంకా పరిశుద్ధమై నిశ్చలమవుతుంది. ఆ ప్రశాంతతే, ఆత్మ.

గురువు బయటా, లోపలా కూడా ఉంటాడు. బయట నుంచి, మనస్సు అంతర్ముఖమయేట్టు తోస్తాడు. లోపలి నుంచి మనస్సుని ఆత్మవైపులాగి, అది ప్రశాంతమయేట్టు చేస్తాడు. అదే గురుకృప అంటే. దైవమూ, గురువూ, ఆత్మా - ఒక్కటే. వాటిలో భేదాలు లేవు.

ప్ర

: థియోసాఫికల్ సొసైటీకి చెందిన వాళ్లు పరమ గురువుల మార్గ దర్శకత్వం కోసం ధ్యానం చేస్తారు.

జ:

గురువు లోపలే ఉన్నాడు అతడు బయట ఉన్నాడన్న తప్పు భావాన్ని తొలగించటానికే ధ్యానం. నువ్వు ఏ అపరిచితుని కోసమో ఎదురుచూస్తూంటే, అతను అదృశ్యం కూడా అవుతాడు తప్పకుండా! తాత్కాలికంగా ఉండేవాని ప్రయోజనమేమిటి? నీవు వేరనీ, నీకొక దేహముందనీ నీవు భావిస్తున్నంత కాలం నీకు వెలుపల, దేహం కల ఒక గురువు అవసరమే. దేహంతో ఉండే అజ్ఞానపు తాదాత్మ్యం పోతే, గురువంటే ఆత్మ తప్ప ఇంకేమీ కాదని తెలుస్తుంది.

ప్ర:

తన ఉపదేశం వల్ల గురువు మాకు ఆత్మ గురించి ఎరుకని కలిగిస్తాడా?

జ:

నీ చేయిని పట్టుకొని, నీ చెవిలో ఏదో రహస్యంగా చెప్తాడా గురువు? నీ వెవరివో, అతడూ అంతేనని నీవు ఊహించు కుంటావు. నీకు దేహముండటం వల్ల అతనికీ దేహముంటుందనీ, నీవు గుర్తింపగల రూపం కలదానిని దేనినో చేస్తాడని అనుకుంటావు. కాని అతని పని అధ్యాత్మిక రంగంలో, అంతరంగంలో.

ప్ర:

గురువు ఎట్లా లభిస్తాడు?

జ:

సర్వాంతర్యామి అయిన భగవంతుడే తన భక్తుని పట్ల జాలితో, భక్తుని పరిపక్వతను బట్టి, సాక్షాత్కరిస్తాడు. అతడొక మనిషి అనుకొని, భక్తుడు ఇద్దరు దేహధారుల మధ్య ఉండే సంబంధాన్ని ఎదురు చూస్తాడు. కాని గురువు భగవంతునికీ, ఆత్మకీ రూపం. లోపలి నుండే పని చేస్తాడు. భక్తుని దోషాలను తెలిపి, అతను అంతరంగంలోని ఆత్మను చేరుకునే వరకూ సరియైన మార్గంలో నడిపిస్తాడు.

ప్ర: సద్గురు లక్షణా లేమిటి?

22: ఎల్ల వేళలా ఆత్మలో సంస్థితమవటం - అందరినీ సమానంగా చూడటం. ఎల్లవేళలా అన్నిప్రదేశాలలో, అన్ని పరిస్థితులలో- అచంచలమైన ధైర్యం కలిగి ఉండటం.

ప్ర: ఎన్నో విభిన్నమైన మార్గాలను ఉపదేశించే ఆధ్యాత్మిక గురువులున్నారు. ఎవరిని ఎంచుకోవాలి?

నీకెవరి దగ్గర శాంతి లభిస్తే వారిని ఎంచుకో.

ప్ర: ఆయన బోధనలని కూడ పరిగణనలోకి తీసికో నక్కర్లేదా?

22: ఎంతో నిజాయితీ పరుడైన సాధకుడిని 'ఇది చేయి, అది చేయి' అని చెప్పేవాడు నిజమైన గురువు కాజాలడు. సాధకునికి తన వ్యాపకాల బాధ ఉండనే ఉంది. అందువల్ల అతనికి కావలసింది శాంతి, విశ్రాంతీ. దీనినే ఇంకో విధంగా చెప్పాలంటే, అతనికి వ్యాపకాలు నిలిచి పోవాలనమాట, ఉన్న వ్యాపకాలకి అదనంగా మరికొన్నిటినో, లేక, వాటికి బదులుగా వేటినో చేయమని చెప్తే సాధకునికి ఏ విధంగా ఉపయోగం?

ఏదైనా చేస్తూండటం, సృజనాత్మకం. లోపల సహజంగా ఉండే సంతోషాన్ని అది నాశనం చేస్తుంది. ఏదో ఒకటి చేస్తూండమని చెప్పేవాడు గురువు కాజాలడు. హంతకుడే అవుతాడు. అటువంటప్పుడు, గురువు రూపంలో సృష్టికర్త (బ్రహ్మ) గాని మృత్యువు (యముడు) గాని వచ్చాడనుకోవాలి. సాధకుని బంధాలని మరింత బిగిస్తాడే గాని, విముక్తుడ్ని చేయలేడు.

ప్ర

: నా గురువుని నేనే ఎట్లా కనుగో గలను?

జ: తదేకమైన ధ్యానం వల్ల.

ప్ర: శిష్యుడు ఎంత చదువుకున్నవాడైనా, ఎంతటి అతీంద్రియ శక్తులున్నవాడయినా, గురుకృపలేనిదే ఆత్మసాక్షాత్కారం పొందలేడన్న సిద్ధాంతానికీ, గురువే శిష్యుని ఆత్మ అనటానికీ పొంతన ఎట్లా కుదురుతుంది?

గురువే తన ఆత్మ అన్నది పరమసత్యం - కాని అజ్ఞానం వల్ల జీవుడైన ఆత్మకి తన నిజస్థితిగాని స్వరూపంగాని గురుకృప లేకుండా తెలియదు.

ప్ర: గురుకృపకి చిహ్నాలేమిటి?

జ: అవి మాటలకీ, ఊహలకీ అతీతం.

ప్ర: అయితే, గురుకటాక్షం వల్లనే శిష్యునికి ఆత్మసాక్షాత్కార మవుతుందని ఎట్లా అంటారు?

జ: కలలో, సింహాన్ని చూచి మేల్కొనే ఏనుగు పరిస్థితి వంటిదే అది. సింహం కనబడినంత మాత్రానే ఏనుగు మేల్కొని నట్టే, గురువు యొక్క కృపావీక్షణం సోకినత మాత్రానే శిష్యుడు తన అజ్ఞానపు నిద్రనుండి మేల్కొని నిజమైన జ్ఞానోదయాన్ని అనుభవిస్తాడు.

ప్ర: సద్గురుని యొక్క స్వరూపం సర్వేశ్వరునిదే అంటారు. ఈ మాట అర్థమేమిటి?

23: దైవత్వాన్ని గాని, నిజమైన జ్ఞానాన్ని గాని, పొందాలననుకునే వ్యక్తి ఎడతెగని భక్తిని అభ్యసిస్తాడు. అ భక్తి పరిపక్వమైన తరువాత, తానే అయిన ఆ వ్యక్తి యొక్క ఆత్మని గమనించిన ఈశ్వరుడు ప్రత్యక్షమవుతాడు. ఆయన తన సహజ లక్షణాలైన సచ్చిదానందాలతో స్థూల రూపం ధరిస్తాడు. భక్తుడ్ని ఆశీర్వదిస్తున్నట్లే కనబడి అతనిని తనలో విలీనం చేసుకుంటాడు. ఈ సిద్ధాంతం ప్రకారం గురువుని సర్వేశ్వరుడన వచ్చు.

ప్ర: గురువు లేకుండానే కొందరికి జ్ఞానమెట్లా అబ్బింది?

ఎంతో పరిపక్వమైన కొందరికి ఈశ్వరుడు రూపంలేని జ్ఞాన జ్యోతిగా ప్రకాశించి నిజమైన జ్ఞానాన్ని అనుగ్రహిస్తాడు.

ప్ర:

సరియైన గురువు గురించి నిశ్చయించుకోవటమెట్లా? గురువు యొక్క స్వరూపమేమిటి?

జ:

నీ మనస్సు ఎవరితోనైతే శృతి కలుపుతుందో అతడే సరియైన గురువు. "గురువు నెట్లా నిశ్చయించుకోవటం, ఆతని స్వరూపమేమిటి" అని అడిగావు. అతనికి ప్రశాంతత, ఓర్పు, క్షమాది సద్గుణాలుండాలి. సూదంటురాయి ఇనుముని ఆకర్షించినట్టు, అతను తన చూపుతోనే ఇతరులను ఆకర్షింప గలగాలి. అతనికి అందరి పట్లా సమభావముండాలి. ఈ లక్షణాలున్న వాడే సద్గురువు. అయితే గురువు యొక్క స్వరూపాన్ని తెలుసుకోవాలంటే, నీ స్వరూపాన్ని నీవు తెలుసుకోవాలి ముందు. తన నిజస్వరూప మేమిటో తెలియని వాడు, గురువు యొక్క స్వరూపాన్ని ఎట్లా తెలుసుకో గలుగుతాడు? గురువు యొక్క స్వరూపాన్ని గాని, రూపాన్నిగాని, తెలుసుకో గోరితే ముందుగా విశ్వమంతా గురు రూపంగా చూడగలగాలి. అన్ని జీవరాశులలోనూ గురువుని చూడగలగాలి. భగవంతుని విషయంలోనూ అంతే. అన్నింటినీ భగవంతుని రూపంగానే చూడాలి. తన ఆత్మనే ఎరుగని వాడు భగవంతుని నిజరూపాన్ని గాని, గురువు యొక్క నిజరూపాన్ని గాని ఎట్లా చూడగలుగుతాడు? వాళ్ల నెట్లా గ్రహించ గలుగుతాడు? అందుచేత, ముందుగా నీ నిజ స్వరూపాన్ని, నైజాన్ని తెలుసుకో.

ప్ర: దానిని తెలుసుకోవటానికైనా గురువు అవసరమే కదా?

జ: ఆ మాట నిజమే. ప్రపంచంలో ఎందరో మహనీయులున్నారు. నీ మనస్సు ఎవరితో శృతి కలుపుతుదో ఆయనని గురువుగా భావించు. నీకెవరిమీద విశ్వాసముంటుందో ఆయనే నీ గురువు.

ప్ర: విముక్తి నొందటానికి గురుకృప ఏ విధంగా ముఖ్యం?

జ: విముక్తి అనేది నీ బయట ఎక్కడా లేదు. విముక్తి పొందాలన్న తపన ఉంటే, లోపలి గురువు ఆత్మలోపలికి లాగుతాడు, బయట గురువు అందులోకి తోస్తాడు. అదే గురువు యొక్క అనుగ్రహం.

ప్ర: గురువు అవసరం లేదని మీరన్నట్టు కొందరు చెప్తారు, మరికొందరు దీనికి వ్యతిరేకమైన వర్తమానాన్ని ఇస్తారు. మహర్షి దీని విషయమేమంటారు?

జ: గురువు అవసరం లేదని నేనెప్పుడూ అనలేదు.

ప్ర: మీకు గురవు లేడని, శ్రీ అరవిందులూ, మరికొందరూ అంటారు.

22: గురువంటే ఏమిటనుకుంటారో దాని బట్టి ఉంటుంది. గురువు మనిషిరూపంలోనే ఉండనక్కర్లేదు. దత్తాత్రేయునికి ఇరవై నాలుగు గురువులు - వారిలో పంచభూతాలూ - అంటే, భూమి, నీరు వగైరా - కూడా ఉన్నాయి. ఈ ప్రపంచంలోని ప్రతీది ఆయన గురువే.

గురువు విధిగా అవసరమే. బుద్ధి అనే అరణ్యంలోనుంచి, ఇంద్రియజ్ఞానం నుంచి మనిషిని బయటికి తీసుకువెళ్ళ గలిగేది గురువు తప్ప ఇంకెవ్వరూ కాదని, ఉపనిషత్తు లంటాయి. కాబట్టి, గురువు ఉండాలి.

ప్ర: నేననేది, మానవాకారంగల గురువు గురించి - -మహర్షికెవ్వరూ లేరు కదా -

నాకెప్పుడో ఒకప్పుడుండి ఉండవచ్చు. నేను అరుణాచలాన్ని స్తుతించలేదా? గురువంటే ఏమిటి? గురువంటే భగవంతుడే, ఆత్మే. ప్రారంభంలో, మనిషి తన కోర్కెలు తీరటానికై భగవంతుడిని ప్రార్థిస్తాడు. కొంతకాలానికి, తన భౌతిక వాంఛల తృప్తికోసం ప్రార్థించటమాపి వేస్తాడు. భగవంతుని కోసమే ప్రార్థిస్తాడు. అప్పుడతనికి భగవంతుడు మనిషిరూపంలోనో మరొక విధంగానో దర్శనమిస్తాడు. అతనిని, అతని అవసరాలబట్టి, అతని ప్రార్థనలననుసరించి - తన వద్దకు తీసుకు వెళ్ళుతాడు.

ప్ర: ఒక గురువుకి విధేయమై ఉన్నప్పుడు, ఇతరులని గౌరవించటం సాధ్యమేనా?

23: గురువు ఒక్కడే. అతడు భౌతికం కాదు. బలహీనత ఉన్నంత వరకూ ఏదో ఒక ఆసరా కావాలి.

ప్ర: జిడ్డు కృష్ణమూర్తి "గురువు అవసరం లేదం" టారు!

23: ఆయనకా విషయ మెట్లా తెలిసింది? ఆత్మసాక్షాత్కారమైన తర్వాత ఆ మాట అనవచ్చు, అంతకు పూర్వంకాదు.

ప్ర: సత్యాన్ని మేము గ్రహించేందుకు శ్రీ భగవాన్ సహాయపడుతారా?

23: సహాయమెప్పుడూ ఉండనే ఉంది.

ప్ర: అంటే, ప్రశ్నలడగటం అనవసరమన మాట. కాని ఎప్పుడూ ఉండే ఆ సహాయం నాకనుభవం కావటం లేదు.

23: శరణాగతి నొందు, అప్పుడు తెలుస్తుంది.

ప్ర: నేనుప్పుడూ మీ పాదాల చెంతనే ఉన్నాను. మేమనుసరించటానికి శ్రీ భగవాన్ ఏదైనా ఉపదేశమిస్తారా? ఎక్కడో ఆరువందల మైళ్ళ దూరంలో ఉండేవారికి సహాయమెట్లా లభిస్తుంది?

జ: సద్గురువు లోపలే ఉన్నాడు.

ప్ర: నేను చూడగల గురువుకావాలి.

జ: చూడగల గురువే, తాను లోపల ఉన్నానంటున్నాడు.

ప్ర: గురుకృప మీదనే కదా కృతార్థత ఆధారపడి ఉంటుంది?

జ: అవును. నీ అభ్యాసం కూడా అనుగ్రహం వల్లనే కదా. కృతార్థత నీ అభ్యాసాలకి ఫలితమే. వాటిననుసరించే ఉంటుందది. "నవనీత కైవల్యం"లో ఒక పద్యముంది. దాని భావమిది. "గురూ! నీ వెప్పుడూ నాతోనే, ప్రతి జన్మలోనూ

నన్ను గమనిస్తూనే ఉన్నావు. నాకు ముక్తి లభించే వరకూ నా గమనాన్ని నిర్ణయిస్తూనే ఉన్నావు". అవసరం వచ్చినప్పుడు ఆత్మే గురువుగా బయట సాక్షాత్కరిస్తుంది. లేకపోతే, అవసరమైన దేదో చేస్తూ ఎప్పుడూ లోపలే ఉంటాడు.

ప్ర: శ్రీ షిర్డీ సాయిబాబా యొక్క భక్తులు ఆయన పటాన్ని పూజిస్తూ అదే తమ గురువంటారు. అదెట్లా సాధ్యం? ఆ పటాన్ని భగవంతునిగా ఆరాధించవచ్చునే గాని గురువుగా ఆరాధించటం వల్ల కలిగే ప్రయోజనమేమిటి?

జ: దాని వల్ల ఏకాగ్రత లభిస్తుంది.

ప్ర: బాగానే ఉంది. అది ఏకాగ్రతకి అభ్యాసం కావచ్చు. ఆ ఏకాగ్రతకి కూడ గురువు అవసరమే కదా.

23: తప్పకుండాను. గురువంటే "గురి" యే కదా. అంటే ఏకాగ్రతే కదా.

ప్ర: నిర్జీవమైన పటం గాఢమైన ఏకాగ్రతని ఎట్లా కలిగిస్తుంది? అభ్యాసంలో చూపగల సజీవమైన గురువు కావాలి దానికి. శ్రీ భగవాన్కి సజీవమైన గురువు లేకుండా పరిపూర్ణత సాధ్యమైంది కాని నా బోటి సామాన్యునికి ఎట్లా?

జ: నిజమే. నిర్జీవమైన పటాన్ని పూజిస్తూంటే కొంత ఏకాగ్రత వస్తుంది మనస్సుకి. తన ఆత్మ గురించి విచారం పట్ల తెలుసు కోకపోతే ఆ ఏకాగ్రత ఎల్లప్పుడూ నిలువదు. ఆ విచారానికి గురువు కావాలి.

ప్ర: తన శక్తిని కొంత శిష్యునికి ధారపోయటం ద్వారా గురువు, శిష్యునికి ఆత్మ సాక్షాత్కారం కలుగ చేయగలడంటారు. నిజమేనా?

జ: అవును. ఆత్మసాక్షాత్కారానికి కల అడ్డంకులని తొలగిస్తాడు గురువు. ఆత్మ సాక్షాత్కారాన్ని కలిగించడు. ఆత్మ ఎప్పుడూ సాక్షాత్కారమయే ఉంది.

ప్ర: ఆత్మసాక్షాత్కారాన్ని పొందాలనుకుంటే, గురువు ఉండితీరాలా?

జ: ఆత్మసాక్షాత్కారాన్ని పొందాలని అనుకున్నంత కాలమూ గురువు అవసరమే. గురువే ఆత్మ. గురువునే అసలైన ఆత్మగానూ, నీవు వ్యక్తిగతమైన జీవిగానూ భావించు. ఈ ద్వయీభావం పోవటమంటే అజ్ఞానం పోయినట్టే. నీలో ద్వయీ భావమున్నంత కాలం, గురువు ఆవశ్యకమే. నీవు శరీరంతో తాదాత్మ్యం చెంది ఉన్నావు. అందువల్లే గురువు కూడ ఒక దేహమనే భావిస్తావు. నీవు దేహానివి కావు, గురువూ కాడు. నీవు ఆత్మవి - గురువూ అంతే. ఈ జ్ఞాన సంపాదననే నీవు ఆత్మ సాక్షాత్కార మంటున్నావు.

ప్ర: ఒక వ్యక్తి గురువుగా ఉండటానికి సమర్థుడవునో కాదో ఎట్లా తెలుస్తుంది?

జ: ఆయన సన్నిధానంలో నీకు కలిగే మనశ్శాంతి వల్లా, ఆయన పట్ల నీకు గల

గౌరవం వల్లాను.

ప్ర: గురువు అసమర్థుడని తేలితే అతనిలో పూర్తి విశ్వాసమున్న శిష్యుని గతి ఏమికాను?

జ: ఎంత చేసుకున్న వారి కంత!

ప్ర: గురుకృప నాకనుగ్రహింపరా?

23: కృప ఎప్పుడూ ఉంటూనే ఉంది.

ప్ర: కాని నాకది తెలియటం లేదు!

జ: ప్రపత్తి ఉంటే ఆ అనుగ్రహం తెలుస్తుంది.

ప్ర: నేను మనసారా శరణుజొచ్చాను. నా మనస్సు నాకు తెలుసుకదా. అయినా నాకనుగ్రహం తెలియటం లేదు.

జ: నీవు నిజంగానే శరణు జొచ్చి ఉంటే, ఈ ప్రశ్నలు ఉదయించవు.

ప్ర: నేను శరణాగతి జొచ్చాను. అయినా ప్రశ్నలుదయిస్తూనే ఉన్నాయి.

అనుగ్రహం ఎప్పుడూ ఉంటుంది. నీ సమాలోచనే మారుతూ ఉంటుంది. దోషం ఇంకెక్కడ ఉండగలదు?

ప్ర:

ఎవరికైనా ఒకరి కంటె ఎక్కువ మంది ఆధ్యాత్మిక గురువు లుండవచ్చా?

జ:

గురువంటే ఎవరు? ఆత్మే కదా, ఆఖరికి మనస్సు యొక్క వికాస దశలను బట్టి ఆత్మే బయట గురువుగా రూపందాలుస్తుంది. దత్తాత్రేయులు తనకి ఇరవై నలుగురి కన్న ఎక్కువ గురువులున్నారన్నారు. ఎవరి దగ్గర్నుంచి ఏమి నేర్చుకున్నా వారే గురువు. ఒకోసారి గురువు జడపదార్థం కూడ కావచ్చు - దత్తాత్రేయులకైనట్లు. భగవంతుడు, గురువు, ఆత్మ - ఒక్కటే. ఆధ్యాత్మిక బుద్ధి కలవాడు సర్వేశ్వరుడు విశ్వమంతా వ్యాపించి ఉన్నాడని భావించి, భగవంతుడినే తన గురువుగా ఎంచుకుంటాడు. తరువాత, భగవంతుడే అతనికి మానవ రూపంలో ఉన్న గురువుతో సంబంధ మేర్పరుస్తాడు. అతనినే సర్వంగా భావిస్తాడామనిషి, ఆ గురువు యొక్క కృపవల్లనే ఆ మనిషికి అతని ఆత్మ ఒక్కటే సత్యమనీ, వేరే ఏమీ లేదనీ తెలియవస్తుంది. అప్పుడు ఆత్మే గురువని తెలుసుకుంటాడు.

ప్ర

23:

: బుద్ధిలో, గురుసేవలో, ఆత్మవిచారంతో- ఆత్మని సాక్షాత్కరింప చేసుకొమ్మంటుంది శ్రీ మద్భగవద్గీత. ఈ మూడింటికీ సమన్వయమెట్లా కుదురుతుంది?

"ఈశ్వరో గురురాత్మేతి", అంటే ఈశ్వరుడూ, గురువూ, ఆత్మా - ఒక్కటే. నీలో ద్వయీ భావమున్నంత కాలం, నీకంటే భిన్నమనుకొని, గురువుని అన్వేషిస్తావు. ఆయన నీకు సత్యాన్ని బోధిస్తాడు. దానితో నీకు అంతర్దృష్టి కలుగుతుంది. ఆత్మ యొక్క పరమోత్కృష్టమైన జ్ఞానాన్ని అంతర్ముఖమవటం ద్వారా ఎవరైతే సంప్రాప్తింప చేస్తారో వారే పరమ గురువు. ఆయననే ఋషులు భగవంతునిగా స్తుతిస్తారు - ఆయనే పరమాత్మ. ఆయనని విడవకుండా పట్టుకో. గురువుని ఆశ్రయించి, ఆయనకి సేవ చేయి, ఆయన అనుగ్రహం ద్వారా జన్మకీ, దుఃఖానికీ కారణం తెలుసుకో, ఆత్మనుండి దూరమవటం వల్లనే ఇవి కలుగుతాయని గ్రహించి, ఆత్మని ఆశ్రయించి ఉండు. అదే అన్నిటికన్నా ఉత్తమం. విముక్తిని కోరుతూ ఈ మార్గంలో వెళ్తున్నవారు కూడ ఒకోసారి మరపువల్లనో, వేరే కారణాల వల్లనో వైదికమార్గం నుండి తప్పినా గురువు ఉపదేశానికి ఎప్పుడూ వ్యతిరేకంగా పోరాదు. భగవంతుని పట్ల అపచారం చేస్తే గురువు సరిదిద్ద గలడే గాని

గురువు పట్ల అపచారం చేస్తే భగవంతుడు కూడ సరిదిద్ద లేడంటారు ఋషులు. అపురూపము, తీవ్రము, పుష్కలమూ అయిన ప్రేమ వల్ల గురువు యొక్క కటాక్ష వీక్షణమ్మీద పరిపూర్ణమైన విశ్వాసం కలవానికి దుఃఖముండదు, ఈ లోకంలో పురూహుతుని (ఇంద్రుని) వలె జీవిస్తాడు.

అందరూ ఆశించే మనశ్శాంతిని - సద్గురుని కటాక్షం వల్ల మనోనిశ్చలతని పొందినవారు తప్ప - ఇంకెవ్వరూ. ఎవ్వరివల్లా, ఏ విధంగానూ పొందలేరు. కాబట్టి, ఎప్పుడూ ఏకాగ్రతతో ఆ అనుగ్రహాన్ని సంపాదించుకోవటానికి కృషి చేయి.

ప్ర:

శ్రీ భగవాన్ అనుగ్రహం వల్ల పెద్దశ్రమ లేకుండా ఆత్మ సాక్షాత్కారాన్ని పొందిన మీ శిష్యులున్నారు. నాక్కూడా అటువంటి అనుగ్రహం కావాలి. స్త్రీని అవటం వల్లా, ఎక్కడో దూరప్రాంతంలో ఉండటం వల్లా మీ సాన్నిధ్యం నేను కోరినంత తరచుగా నాకు లభించదు. నేను మళ్లీ రాలేనేమో కూడా! శ్రీ భగవాన్ కరుణని వేడుకుంటున్నాను. నా ప్రార్థనని శ్రీ భగవాన్ మన్నించాలి.

జ:

ఎక్కడికి వెళ్తున్నావు? నీ వెక్కడికీ వెళ్ళటం లేదు. నీవు దేహానివే అనుకున్నా. ఆ దేహమే లక్నో నుంచి తిరువణ్ణామలైకి వచ్చిందా? నువ్వు కారులో కూర్చున్నావు ఆ తరువాత ఏదో ఒక వాహనం కదులుతూనే ఉంది. చిట్టచివరికి నీ విక్కడికి వచ్చానంటున్నావు, నీవు దేహానివి కావు, అసలు సంగతి ఇది. ఆత్మ సంచారం చేయదు, ప్రపంచమే అందులో సంచరిస్తుంది. నీ వెపుడూ ఒకటే, నీలో ఏ మర్పులేదు. ఇక్కడ నుంచి వెళ్తే వెళ్తున్నట్టు అనిపించినా, నీవు ఇక్కడా, అక్కడా, ఎల్లెడలా ఉన్నావు. ప్రదేశాలు మాత్రం మారుతూంటాయి. ఇక అనుగ్రహ మంటావా, అది నీలోనే ఉంది. అది బయట ఎక్కడో ఉంటే, ఎందుకూ పనికిరాదు. అనుగ్రహమే, ఆత్మ. నీ వెప్పుడూ దాని వశంలోనే ఉన్నావు. అనుగ్రహ మెల్లప్పుడూ ఉంటుంది.

ప్ర:

నా ఉద్దేశమిది : నేను మిమ్మల్ని తలచుకున్నప్పుడల్లా, మనస్సుపటిష్ఠమవాలి, నీ వైపు నుండి కూడ ప్రతిస్పందన రావాలి. నేను బలహీనుడుని, నా ప్రయత్నాలకే నన్ను విడువకూడదు -

అనుగ్రహమే, ఆత్మ. నీవు భగవాన్ని జ్ఞాపకం తెచ్చుకోవటం కూడ ఆత్మయొక్క ప్రేరణ వల్లనే. అనుగ్రహమప్పుడే లేదా? అనుగ్రహం నీలో పనిచేయని క్షణమంటూ ఉందా? నీ జ్ఞాపకమే. అనుగ్రహానికి మొదటి మెట్టు. అదే ప్రతిస్పందన, అదే ప్రేరణ, అదే ఆత్మ, అదే అనుగ్రహం. ఆందోళన చెందవల సిన అవసరమేమీ లేదు.

ప్ర: బయటి సహాయాన్ని విడిచిపెట్టి, స్వయంకృషితోనే నేను నా గురించిన ఆంతరసత్యాన్ని గ్రహించ గలుగుతానా?

జ

: ఆత్మాన్వేషణ చేయాలన్న కోరిక కలగటమే, దైవకృప వలన. అది నీలో హృదయంగా, ఆత్మగా ప్రకాశిస్తూంటుంది. లోపలి నుండి నిన్ను ఆహ్వానిస్తుంది. బయట నుండి లోపలికి వెళ్లటానికి నీవు ప్రయత్నించాలి. నీ తీవ్రమైన అన్వేషణ వల్లనే ప్రయత్నం, అనుగ్రహం వల్లనే లోపలి కదలిక. అనుగ్రహం లేకపోతే అన్వేషణ చేయాలనిపించదు. అట్లాగే ఆత్మాన్వేషణ కోరిక లేని వానికి, అనుగ్రహం అంతగా పని చేయదు. రెండూ అవసరమే.

ప్ర: ఆత్మసాక్షాత్కారానికి గురువు ఎంతకాలమవసరం?

జ:

అజ్ఞానమున్నంత కాలం, గురువు అవసరమే, కావాలని ఆత్మని పరిమితం చేసుకోవటం వల్లనే అజ్ఞానం కలుగుతుంది. తనని ఆరాధిస్తూంటే భగవంతుడు, నిలకడగల భక్తిని అనుగ్రహిస్తాడు. అదే ప్రపత్తికి దారి తీస్తుంది. భక్తుడు శరణు జొచ్చిన తరువాత, గురువు రూపంలో ప్రత్యక్షమై భగవంతుడు తన కరుణనను ప్రదర్శిస్తాడు. గురువు లేక భగవంతుడు భక్తునికి మార్గం చూపిస్తాడు - భగవంతుడు లోపలే ఉన్నాడనీ, ఆత్మకి భిన్నం కాదనీను. దీని వల్ల మనస్సు అంతర్ముఖమవుతుంది. చివరికి సాక్షాత్కారానికి దారి తీస్తుంది.

ప్ర: అనుగ్రహమే అంత ప్రధానమైతే, వ్యక్తి యొక్క కృషి మాటేమిటి?

జ:

సాక్షాత్కారమయే వరకూ కృషి అవసరమే. అప్పుడైనా, ఆత్మ ఆకస్మికంగా తెలియరావాలి. లేకపోతే ఆనందం పరిపూర్ణం కాజాలదు.

ఆ ఆకస్మిక దశ వరకూ ఏ రూపంలోనైనా కృషి చేస్తూనే ఉండాలి. మన కృషికీ, కృషి చేయకపోవటానికీ అతీతమైన దశ ఒకటుంది. అది చేరే దాకా, కృషి అవసరమే. ఒక్కసారైనా ఆ ఆనందాన్ని చవిచూస్తే, దానినే మళ్లీ మళ్లీ పొందాలని ప్రయత్నిస్తారు. ఆ శాంతమనే ఆనందాన్ని అనుభవించిన తరువాత అది లేకుండా ఉండాలని గాని, ఏ ఇతర వ్యాపకంలోనైనా నిమగ్నమవాలని గాని అనిపించదు.

ప్ర: సాక్షాత్కారానికి దైవకృపే అవసరమా? వ్యక్తి యొక్క కృషి వల్లనే చావు - పుట్టుకలు లేని స్థితిని చేరుకోవటం సాధ్యమా?

జ: సాక్షాత్కారానికి దైవానుగ్రహం తప్పకుండా అవసరం. అది భగవత్సాక్షాత్కారానికి దారి తీస్తుంది. అయితే, అటువంటి అనుగ్రహం నిజమైన భక్తునికో, యోగికో మాత్రమే దొరుకుతుంది. విముక్తి పథాన నిర్విరామంగా, చిత్తశుద్ధితో పయనించిన వారికే లభిస్తుంది.

ప్ర: దూరంగా ఉంటే, అనుగ్రహం ఏమైనా కొరవడుతుందా?

జ: కాలమూ, దూరమూ మనలోనే ఉన్నాయి. నీ వెప్పుడూ నీ ఆత్మలోనే ఉన్నావు. దానిపై కాలానికీ, దూరానికీ ప్రభావమెట్లా ఉంటుంది?

ప్ర: రేడియో ప్రసారం చేసేవాటిని దూరంగా ఉన్నవాళ్ల కంటే, దగ్గరలో ఉన్నవాళ్లు త్వరగా వినగలుగుతారు. మీరు హైందవులు, మేమా అమెరికన్లము. దీని వల్ల ఏమైనా వ్యత్యాసముంటుందా?

జ: ఉండదు.

ప్ర: మనస్సులోని భావాలను ఇతరులు తెలుసుకో గలుగుతారు!

జ: దీని వల్ల, అందరమూ ఒకటేనని తెలుస్తుంది.

ప్ర: మేమంటే శ్రీ భగవాన్కి శ్రద్ధ ఉందా, మా పట్ల అనుగ్రహం చూపుతారా?

జ: మెడదాకా నీళ్లల్లో మునిగి ఉన్నా, నీళ్ల కోసం ఆరాటం చెందుతున్నావు. అంతగా నీటిలో మునిగిన వానికి దాహం వేస్తుంది, నీటిలోని చేపకి దాహం వేస్తుంది, ఆఖరికి నీటికే దాహం వేస్తుంది. అన్నట్లుగానే ఉంది ఇది కూడ. అనుగ్రహమెప్పుడూ ఉంది. "గురుకృప లేకుండా - వైరాగ్యాన్ని సంపాదించలేవు. సత్యాన్ని గ్రహించలేవు. ఆత్మలో సంస్థితం కాలేవు"

అయితే, అభ్యాసం కూడా అవసరమే. పెంకెగొడ్డు బయటికి వెళ్ళకుండా ఆపటానికి దాని ముందు గడ్డి వేసి పాకలో కట్టిపడవేసినట్లే. ఆత్మలో సంస్థితమవట మంటే,

ప్ర: ఈ మధ్య ఒక తమిళ గేయం చూశాను. అందులో కవి, "తాను తల్లిని గట్టిగా పట్టుకొనే కోతిపిల్ల వంటి వాడిని కాననీ, తల్లి పళ్లతో బిగించి ఒక చోటును మరొక చోటుకి కొనిపోబడే పిల్లికూన వంటివాడిననీ" అంటాడు. నా పరిస్థితీ అంతే, నాపై తమరు కరుణచూపాలి. నా మెడపట్టుకొని, నేను క్రిందపడి దెబ్బ తగిలించుకోకుండా కాపాడండి-

అది అసాధ్యం. నీవు శ్రమపడాలి. గురువు సహాయపడటానికే శ్రమపడాలి.

ప్ర: గురుకటాక్షం పొందటానికి ఎంతకాలం పట్టుతుంది?

23: ఈ విషయం తెలుసుకోవాలని ఎందుకనుకుంటున్నావు?

ప్ర: నాకు ఆశ కలగటానికి.

అటువంటి కోరిక కూడా ప్రతిబంధకమే. ఆత్మ ఎప్పుడూ ఉంటూనే ఉంది. అది లేకుండా ఏమీ లేదు. నువ్వు ఆ ఆత్మవే అయి ఉండు. అన్ని కోరికలూ, సందేహాలూ పోతాయి.

అనుగ్రహమే ఆది, మధ్యం, అంతం. అనుగ్రహమే ఆత్మ. ఆత్మని దేహంతో తప్పుగా తాదాత్మ్యం చేసుకోవటంవల్ల గురువుని దేహంగా భావిస్తున్నావు. కాని గురువు దృష్టిలో గురువు ఆత్మే. ఉన్నదొక్కటే - అది ఆత్మ. దానినే గురువు బోధిస్తాడు. అటువంటప్పుడు ఆత్మే నీ గురువు కాదా? అనుగ్రహ మింకెక్కడ నుంచి వస్తుంది? ఆత్మనుంచే వస్తుంది - ఆత్మ వ్యక్త మవటమంటే, అనుగ్రహం వ్యక్తమవటమే. ఇటునుంచి అటు జరిగినా అంతే. ఈ సందేహాలన్నిటికీ కారణం తప్పుడు అవగాహన - దానితో బాటు, బయట నుండి ఏదో వస్తుందనుకోవటం! ఆత్మకి బాహ్యంగా ఏదీ లేదు!

# 9.మౌనము - సత్సంగము

ఎవరైనా కోరితే వాక్కు ద్వారానే తమ బోధనలను చెప్పటానికి సిద్ధమే అయినా, శ్రీ రమణులు తమ "మౌనబోధనలే" సూటి అయినవనీ, ఇంకా ఎక్కువ పాటవమైనవనీ అంటూండే వారు. ఈ "మౌన భోదనలు" వారు విరజిమ్మే ఆధ్యాత్మిక శక్తి రూపంలో ఉండేవి. ఆ శక్తి ఎంతో బలీయమైనది. వారి బోధనలలో అత్యంత ప్రధానమయినదీ. మనో నిగ్రహాన్ని ఎట్లా చేసుకోవాలో మాటలతో బోధించక, తమ సన్నిధాన ఉన్నవారి యొక్క మనస్సులను నిశ్చలం చేయగల ఒక శక్తిని వారు అతి తేలికగా విరజిమ్మేవారు. ఈ అనుభవం కలిగినవారు దానిని ఎంతో ప్రశాంతత, సంతుష్టి కలిగిన స్థితిగా వర్ణించేవారు. ఇక బాగా పురోగమించిన భక్తులకు, సాక్షాత్తూ ఆత్మానుభూతినే కలిగించేది ఆ శక్తి.

ఈ రకమైన బోధన భారతీయ సంప్రదాయంలో ఒక ముఖ్యమైన అంశం. శ్రీ దక్షిణామూర్తి ఈ బోధనా పద్ధతికి ప్రసిద్ధుడు. ఆయన శివుని అవతారం. నలుగురు ఋషులకు తమ మౌన బోధన ద్వారా ఆత్మానుభూతి కలిగించారు. శ్రీరమణులు, శ్రీ దక్షిణామూర్తి గురించి ఎంతో ఆదరంతో చెప్తూండేవారు. ఆయన పేరు ఈ అధ్యాయంలోని సంభాషణలలో తరచూ వస్తుంది.

గురువు నుండి ప్రవహించే ఈ శక్తిని, ఆత్మపైగాని గురుమూర్తి పై గాని సావధాన చిత్తులైన వారెవరైనా పొందవచ్చు. ఎంత దూరంలో ఉన్నా ఆ శక్తి ఏమీ కొరవడదు. ఈ అవధానాన్నే తరచు, 'సత్సంగ' మంటారు. ఈ మాటకి అసలు అర్థం, 'జీవితో సంగమ' మని, ఈ అభ్యాసాన్ని శ్రీ రమణులు హృదయపూర్వంగా ప్రోత్సహించేవారు. నేరుగా ఆత్మానుభూతి కలగటానికి ఇది పరమశ్రేష్ఠమైన పద్ధతనే వారు. సంప్రదాయానుసారం. ఇది ఆత్మసాక్షాత్కారం పొందిన వారి సమక్షంలో భౌతికంగా ఉండటం. కాని శ్రీరమణులు దీనికి విస్తృతమైన అర్థానిచ్చారు. సత్సంగంలో ప్రధానమైన అంశం గురువుతో మానసికమైన సంబంధమనీ, గురువు సమక్షంలోనే కాక ఎక్కడైనా ఎప్పుడైనా ఆయనని తలచుకున్నా సత్సంగమేననీ అనేవారు. సత్సంగం యొక్క శ్రేష్ఠతని ఈ క్రింద ఉదహరించిన వాక్యాలు చెప్తాయి. వివిధ సందర్భాలలో శ్రీరమణులు గమనించిన సంస్కృత శ్లోకాలు అవి. వాటి భావాన్ని ఎంతగానో అభిమానించి, వారు వాటిని తమిళంలోకి అనువదించారు. సత్యం యొక్క స్వరూపం గురించి వారు రచించిన "ఉళ్లదు నార్పదు - అనుబంధం"లో వాటిని చేర్చారు.

1. సత్సంగం వల్ల ప్రాపంచక విషయాలతో సంబంధం తొలగుతుంది. ఆ సంబంధం తొలగితే, మనసులోని వాసనలు ధ్వంసమవుతాయి. మానసిక అనురక్తిలేని వారు - నిశ్చలమైన దానిలో లయమవుతారు. ఆ విధంగా వారికి జీవన్ముక్తి లభిస్తుంది. అట్టివారి సాంగత్యమును కాంక్షించు.

2.శ్లాఘనీయమైన ఈ పరమోత్కృష్టమైన స్థితి, ఆత్మవిచారం వల్ల ఈ జన్మలోనే లభించే ఈ స్థితి, సాధు సమక్షంలో, (ఆత్మసాక్షాత్కారం కలిగిన వాని సమక్షంలో) హృదయంలో ఉదయిస్తుంది. అది ఎందరి ప్రబోధకుల ప్రవచనాల సువిన్నా, ఎన్ని శాస్త్రాలను క్షుణ్ణంగా అభ్యసించినా, ఎన్ని సత్కార్యాలు చేసినా, ఏమి చేసినా లభించదు.

3. సాధు సమాగమం కలిగితే, ఇంక ఇతర నియమాలన్నీ ఎందుకు? దక్షిణ దిశ నుండి మలయమారుతం వీస్తున్నప్పుడు, చేతిలో విసనికఱ్ఱ ఎందుకు?

4. వెన్నెల వల్ల తాపం, కల్పవృక్షం వల్ల దరిద్రం, గంగాజలం వల్ల పాపం. తొలగుతాయి. ఇవన్నీ నిరుపమానులైన సాధుల దర్శన మాత్రముననే తొలగుతాయని తెలుసుకో.

5. నీటితో నిండిన పవిత్ర తీర్థాలుగాని, మట్టీ, రాయిలతో చేయబడిన ప్రతిమలు గాని - మహాత్ములతో సమానం కావు. ఆ తీర్థాలూ, విగ్రహాలూ మనస్సుని పరిశుద్ధ పరచటానికి ఎంతో కాలన్ని తీసుకుంటాయి. అటువంటి పారిశ్ర్యం సాధువు చూపు మనిషి మీద ఒక్కసారి పడితే వెంటనే సిద్ధిస్తుంది.

ప్ర: నలుగురిలోకీ వెళ్ళి శ్రీ భగవాన్ సత్యం గురించి ఎందుచేత బోధించరు?

జ: అది జరగటం లేదని నీ కెట్లా తెలుసు? ప్రబోధించటమంటే, వేదిక నెక్కి ప్రజల నుద్దేశించి ఉపన్యాసాలివ్వటమా? ప్రబోధించటమంటే, జ్ఞానాన్ని తెలియచేయటం -అది మౌనం వల్లనే సాధ్యం. ఒక గంట సేపు ఒక ఉపన్యాసాన్ని విని వెళ్లిపోతాడు ఒకడు - ఆ ఉపన్యాసమతనిని ఏ విధంగానూ ప్రభావితం చేయదు. మరొకడు, ఒక పవిత్రుని సమక్షాన కాస్సేపు కూర్చుంటాడు. జీవితమంటే అతని దృక్పథాన్నే మార్చివేస్తుంది అది. ఈ రెంటినీ పోల్చిచూడు. రెంటిలోనూ ఏది ఉత్తమమైనది? ఏ ఫలితమూ ఇవ్వని, బిగ్గరగా ప్రబోధించటమా, మౌనంగా లోపలినుండి శక్తిని ప్రసరింప చేయటమా? అయినా, మాట ఎట్లా ఉదయిస్తుంది? మొదట జ్ఞానముంటుంది. దీని నుండి అహంకారమూ, అందుండి ఆలోచనా వస్తాయి. ఆలోచన వాక్కుకి దారితీస్తుంది. అంటే, మూలానికి మునిమనుమడన్న మాట వాక్కు! మాటకే అంత ప్రభావముంటే, మౌనం ద్వారా జరిగే ప్రబోధానికెంత శక్తి ఉంటుందో ఆలోచించు.

ప్ర: మౌనం అంత శక్తివంత మెట్లా అవుతుంది?

జ:

ఆత్మసాక్షాత్కారం పొందిన వాడు తన నుండి తరంగాలను వెదజల్లుతాడు ఎందరో ఆకర్షితులవుతారు. ఆయన ఏ గుహలోనో మౌనంగా కూర్చుని ఉండవచ్చు. సత్యం గురించి మనమెన్నో ఉపన్యాసాలు వినవచ్చు. అసలు విషయం గ్రహించక తిరిగి రావచ్చు. కాని ఆత్మసాక్షాత్కారం పొందిన వారి సన్నిధికి వెళ్లటం వల్లనే ఆ విషయమంటే అవగాహన బాగా కలుగుతుంది - ఆయన ఒక్క మాటైనా పలుకక పోయినా సరే! ఆయనెప్పుడూ ప్రజలలోకి వెళ్లనవసరం లేదు. అవసరమైతే, ఇతరులని తన సాధనాలుగా వాడుకోవచ్చు.

గురువు మౌనాన్ని అనుగ్రహిస్తాడు. ఆత్మ జ్ఞానమనే వెలుగుని చూపుతుందది. అదే పరమసత్యంగా ప్రకాశిస్తుంది. శిష్యుని చూపులను గురువు వీక్షణాలు సోకితే చాలు, మాటలు అనవసరం.

ప్ర: శ్రీ భగవాన్ దీక్ష నిస్తారా?

జ:

అన్నిటికన్నా బలమైనదీ, శ్రేష్ఠమైనదీ మౌన దీక్ష. శ్రీ దక్షిణామూర్తి దానినే పాటించారు. తాకటం వల్లా, చూపుల వల్లా ఇచ్చే దీక్ష అంతకంటే తక్కుస్థాయిది. మౌన దీక్ష అందరి హృదయాలనూ పరివర్తింప చేస్తుంది. శిష్యులు దగ్గరకు రాగానే శ్రీ దక్షిణామూర్తి మౌనం వహించారు. ఉత్తమోత్తమమైన దీక్ష అదే. మిగిలిన దీక్షా విధానాలన్నీ దానిలో ఉన్నాయి. మిగిలిన దీక్షలలో కార్యకారణాది సంబంధ మేర్పడాలి. మొదట విషయముదయించాలి ఆ తరువాత కార్యం జరగాలి. ఈ రెండూ లేకపోతే ఒకరు రెండవ వానిని చూడటం గాని, తాకటం గాని ఎట్లా? మౌనదీక్ష పరిపూర్ణం - చూడటం, తాకటం, ప్రబోధించటం - అన్నీ దానిలో ఉన్నాయి. మనిషిని అన్ని విధాలా పరిశుద్ధపరుస్తుంది. సత్యంలో ప్రతిష్ఠిస్తుంది.

ప్ర:

"ఆధ్యాత్మిక గురువు తన ఆధ్యాత్మికతను శిష్యునికి ధారపోయ గలడ"ని స్వామి వివేకానందులన్నారు.

జ

: ధారపోయటానికి పదార్థమేమైనా ఉందా? శిష్యునికి గల పృథక్ భావాన్ని తొలగించటమే గురువు చేసేది. అంటే వ్యక్తి మొదట్లో ఒక విధంగానూ తరువాత వేరొక విధంగానూ మారటం కాదు.

ప్ర: అనుగ్రహం గురువు వల్ల కలిగేదే కదా?

జ:

భగవంతుడు, అనుగ్రహము, గురువు - అన్నీ ఒకటే. అన్నీ నిత్యమే. అన్నీ సర్వవ్యాప్తమే. ఆత్మ లోపలే ఉన్నదాయె తన చూపుల వల్ల గురువు ఇచ్చేది కాదు. అట్లా తానివ్వగలనని ఎవరైనా అనుకుంటే అతడు 'గురువు' అనిపించుకోవటానికే అనర్హుడు.

ఎన్నో రకాల దీక్షలున్నాయని పుస్తకాలలో చూస్తాం. అంటే, చేతితో, తాకటంతో, చూపుతో వగైరా. అంతేకాక, గురువు కొన్ని సంస్కారాలను అగ్నితో, నీటితో, జపంతో, మంత్రంతో చేస్తాడనీ - అటువంటి వింత ప్రయత్నాలకి "దీక్ష" అని పేరు పెడ్తాడనీ కూడా ఉంది. ఇటువంటి కర్మలన్నీ గురువు చేస్తేనే శిష్యుడు పరిపక్వమవుతాడట!

"వ్యక్తి"ని వెతికితే ఎక్కడా దొరకడు. గురువూ అంతే. అటువంటి వాడు శ్రీ దక్షిణా ఆయనేం చేశాడు? తన వద్దకు శిష్యులు వచ్చినప్పుడు మౌనం వహించాడు. ఆయన మౌనంగానే ఉన్నాడు. శిష్యుల సందేహాలు మాయమై పోయాయి. అంటే వారికి పృథక్ భావం పోయిందన మాట. అదే జ్ఞానమంటే. దానికి సంబంధించిన వాచాలతకానే కాదు.

మౌనం ఎంతో బలీయమైన పని. శాస్త్రాలు ఎంత విస్తృతమైనవైనా, ఎంత నొక్కి చెప్పినా వాటి ఫలితం శూన్యమే. గురువు నిశ్శబ్దంగా ఉంటాడు - అందరిలోనూ ప్రశాంతత ఉంటుంది. ఆయన మౌనం అన్ని శాస్త్రాల సముదాయం కన్నా ఎంతో విస్తృతమైనది, నొక్కి చెప్పగలిగేది. ఇన్నాళ్ల బట్టీ ఇక్కడ ఉంటున్నా. ఇన్ని వింటున్నా, ఇంత శ్రమిస్తున్నా- ఏమీ సాధించలేదే అన్న భావం వల్లనే ఈ ప్రశ్నలన్నీ ఉదయిస్తున్నాయి. లోపల జరిగేదేమిటో తెలియదు. నిజానికి, గురువు నీలో ఉన్నాడు.

ప్ర: గురువు యొక్క మౌనం ఉత్తమోత్తమమైన ఆధ్యాత్మిక ఎరుకని కలిగించగలదా?

జ: గురువు మౌనం యొక్క శక్తిని విశదం చేసే ఒక పాత కథ ఉంది. చెప్తా విను.

తత్త్వరాయుడు తన గురువు స్వరూపానందుని గౌరవార్థం 'భరణి' అనే కవిత్వ ప్రక్రియ నొక దానిని తమిళంలో రచించాడు. కొందరి పండితులనాహ్వానించి, ఆ రచన యొక్క విలువను తెలుపమన్నాడు. యుద్ధంలో వెయ్యి ఏనుగులను చంపగలిగిన యోధుని గౌరవార్థమే భరణి రచింప బడాలిగాని ఒక తాపసి గౌరవార్థం కాదని ఆ పండితులు అభ్యంతరం చెప్పారు. అప్పుడు, తత్త్వరాయుడు "సరే, మా గురువు గారి దగ్గరకే వెళ్లి ఈ సమస్యని పరిష్కరించుకుందా" మన్నాడు. అందరూ గురువుగారి దగ్గరకు వెళ్లారు. అందరూ కూర్చున్న తరువాత తత్త్వరాయుడు తమ రాకకు కారణం గురువు గారికి చెప్పాడు. గురువు గారు మౌనంగా కూర్చున్నారు. ఆ రోజంతా అట్లాగే గడిచింది - రాత్రి వచ్చింది. అట్లాగే మరికొనిన రేయింబవళ్లు గడిచిపోయాయి. అందర మౌనంగానే కూర్చున్నారు - ఎవ్వరికీ ఒక్క ఆలోచనకూడా రాలేదు. అసలు వారిక్కడికి ఎందుకు వచ్చామన్న భావం కూడా ఎవ్వరికీ కలుగలేదు. ఎవ్వరూ అడుగనూలేదు. మూడు నాలుగు రోజులిట్లా గడిచిం తర్వాత గురువు గారు తమ మనస్సుని కొంచెం ప్రక్కకి జరి పారు. వెంటనే అక్కడున్న వాళ్ల మనస్సులు కూడా పని చేయనారంభించాయి. అప్పుడు వాళ్లన్నారు, “మా అహంకారమనే మదపుటేనుగులను జయించగలిగిన గురువు శక్తి ముందు వెయ్యి ఏనుగులను గెలవటం ఏమీ గొప్ప కాదు. ఆయన గౌరవార్థం భరణి అవశ్యం రచింపబడాల్సిందే."

ప్ర:

ఈ మౌనశక్తి ఎట్లా పని చేస్తుంది?

జ:

ఒకరి భావాలని ఇంకొకరికి చెప్పటానికి భాష ఒక సాధనం మాత్రమే. భావాలుదయించగానే భాష రంగంలోకి దిగుతుంది. "నేను” అనే భావముదయించిన తరువాతనే మిగిలిన భావాలుదయిస్తాయి. కాబట్టి సంభాషణకి మూలం భావమే. ఏమీ ఆలోచించకుండా కూర్చుంటే, సర్వవ్యాప్తమైన మౌనమనే భాషతో ఇతరులను అర్థం చేసుకుంటాడు మనిషి.

మౌనం ఎప్పుడూ పలుకుతూనే ఉంటుంది. అది అవిశ్రాంతంగా ప్రవహిస్తుంది - మాట్లాడటం వల్లనే దానికి అడ్డంకు లేర్పడుతాయి. ఇప్పుడు నేను పలికే ఈ మాటలు ఆ మూగ భాషను నిరోధిస్తాయి. తీగెలో విద్యుత్ ప్రవహిస్తోంది. దాని ప్రవాహానికి నిరోధం కలిగితే దీపంగా వెలగవచ్చు లేదా పంకాగా తిరగవచ్చు. తీగెలో మాత్రం విద్యచ్ఛక్తిగానే ఉంటుంది. ఆ విధంగానే మౌనం నిరంతర భాషాస్రవంతి - శబ్దాలే దానికి ఆటంకాలు.

కొన్ని సంవత్సరాల తరబడి సంభాషించటం వల్ల తెలియని విషయం, మౌనం వల్ల ఒక్క క్షణంలో తెలుస్తుంది. అట్లాగే మౌనం సమక్షంలో కూడా! దీనికి శ్రీ దక్షిణామూర్తి, వారి నలుగురు శిష్యులూ పరమోదాహరణ. ఇదే అన్నిటికన్నా ఉత్కృష్టమూ, సమర్థవంతమూ అయిన భాష,

ప్ర: "జ్ఞాని యొక్క ప్రభావం భక్తుని హృదయంలోకి మౌనంగా ప్రవేశిస్తుంద"ని శ్రీ భగవాన్ సెలవిచ్చారు. అంతేకాకుండా, 'మహాత్ములతో సాంగత్యం నిజతత్వాన్ని తెలుసుకోవటానికి మంచి పద్ధతి" అని కూడా శ్రీ భగవాన్ సెలవిచ్చారు -

జ: అవును. ఇందులో పరస్పర వైరుధ్యమేముంది? జ్ఞానులకూ, మహాత్ములకూ భేదమేమైనా ఉన్నదా?

(2: 3.

2: వారితో సాంగత్యం మంచిది. వాళ్లు మౌనంగానే పనిచేస్తారు. మాట్లాడటం వల్ల వారి శక్తి తగ్గిపోతుంది. మౌనమే అన్నిటికన్నా శక్తి వంతమైనది. వాక్కుకి అంత శక్తి లేదు. అందువల్ల, మానసిక సంపర్కమే అన్నిటి కన్నా ఉత్తమం.

ప్ర: జ్ఞాని యొక్క భౌతిక కాయం లయమైపోయిన తరువాత కూడా ఇట్లాగే ఉంటుందా - లేక ఆయన భౌతిక కాయంతో ఉన్నంత వరకే ఇది వర్తిస్తుందా?

జ: గురువు భౌతిక రూపం కాదు. అందువల్ల, గురువు భౌతిక కాయం మాయమైపోయిం తరువాత కూడ సంపర్కం నిలుస్తుంది. గురువు పోయిన తరువాత మరొక గురువుని ఆశ్రయించవచ్చు అయినా, అందరు గురువులూ ఒకటే - నీకు కనబడే రూపం మాత్రం ఎవ్వరూ కారు. మానసిక సంపర్కమే అన్నిటి కన్నా ఉత్తమం.

ప్ర: అనుగ్రహం వ్యక్తమవటమంటే గురువు యొక్క మనస్సు శిష్యుని మనస్సుపై పని చేయటమేనా లేక ఇంకేమైనానా?

జ: అనుగ్రహానికి అత్యుత్తమ రూపం మౌనమే. అదే పరమోత్కృష్టమైన ఉపదేశం కూడా.

ప్ర: వివేకానందులు కూడ మౌనమే అన్నిటికన్నా బిగ్గరగా చేసే ప్రార్థన అన్నారు.

జ: సాధకుని మౌనానికి అది వర్తిస్తుంది. గురువు యొక్క మౌనం అన్నిటికన్నా బిగ్గరగా జరిగే ఉపదేశం. అదే అత్యుత్తమమైన అనుగ్రహం కూడా. ఇతర దీక్షలన్నీ మౌనం నుంచి వచ్చినవే. అందువల్ల అవన్నీ అప్రధానాలే. మౌనమే మౌలికమైన రూపం. గురువు మౌనంగా ఉంటే సాధకుని మనస్సు దానంతట అదే పరిశుద్ధమవుతుంది.

ప్ర: శ్రీ భగవాన్ మౌనం మహత్తరమైనది. మాకెంతో మనశ్శాంతిని ఇస్తుంది.

జ: మౌనం విరామంలేని సంభాషణ. బయటకి వచ్చే సంభాషణ ఆ మౌనసంభాషణకి అంతరాయం. మౌనంగా ఉన్నప్పుడు పరిసరాలతో ఎంతో సన్నిహితమైన సంబంధముంటుంది. శ్రీ దక్షిణామూర్తి మౌనం, నలుగురు ఋషుల సందేహాలను తీర్చి వేసింది. "మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం" అంటే, మౌనం ద్వారా ప్రకటితమైన సత్యమని అర్థం. విశదపరచటమంటే మౌనమే. అంతటి శక్తి ఉంది మౌనానికి.

బయటకి మాట్లాడటానికి, శబ్దాలని ఉచ్చరించే అంగాలు అవసరం మాట్లాడటానికి ముందుగా అని ఉండాలి. కాని ఆ రెండు సంభాషణ ఊహకి కూడ అతీతం. అది సంభాషణకి అతీతం. అదే పరవాక్కు.

ప్ర: ఈ మౌనం వల్ల అందరికీ లాభముంటుందా?

జ: మౌనమే అసలైన ఉపదేశం. అది పరిపూర్ణమైన ఉపదేశం. ఎంతో పురోగమించిన సాధకునికే అది తగినది. ఇతరులు దాని నుండి పూర్తి స్ఫూర్తిని పొందలేరు. అందువల్లనే వారికి సత్యం గురించి విశదీకరించటానికి మాటలు అవసరం. కాని, సత్యం వాక్కుకి అతీతం. దానిని విశ్లేషించలేము. మహా అయితే, సూచించగలం అంతే.

ప్ర: విగ్రహాలూ, తీర్థస్థానాలూ కూడా మహాత్ముని వీక్షణంతో సరికావంటారు. నేనిక్కడ మూడు నెలల నుంచీ ఉన్నాను, మహర్షి చూపు వల్ల నాకే లాభం చేకూరిందో నాకేమీ తెలియటం లేదు.

జ: వీక్షణానికి పరిశుద్ధ పరచే శక్తి ఉంది. పరిశుద్ధమవటాన్ని చూడలేవు. మహాత్ముల దగ్గరకు వచ్చే వాళ్లు రకరకాలు. రాక్షసి బొగ్గు నిప్పు అంటుకోవటానికి చాలా సేపు పట్టుతుంది. మామూలు బొగ్గు అంతకంటే త్వరగా నిప్పు అంటుకుంటుంది, మందు గుండు, తక్షణమే అంటుకుంటుంది. అట్లాగే మనుష్యులు కూడా. జ్ఞానాగ్ని అన్ని కలాపాలనూ ప్రభావితం చేస్తుంది. మహాత్ముల సత్సంగం వల్లా, అక్కడి మానసిక వాతావరణం వల్లా జ్ఞానం పొందవచ్చు.

ప్ర: శిష్యుని యత్నం లేకుండానే, గురువు యొక్క మౌనం వల్లనే అతనికి ఆత్మసాక్షాత్కారమవుతుందా?

మహనీయుని సమక్షాన వాసనలు అణగి, మనస్సు నిశ్చలమై, సమాధి అవస్థ వస్తుంది. ఆ విధంగా శిష్యునికి సరియైన జ్ఞానమూ, అనుభవమూ గురువు సమక్షాన లభిస్తాయి. అందులో కదలకుండా ఉండాలంటే, అభ్యాసమవసరం. అదే తన నిజతత్త్వమని శిష్యుడు తెలుసుకుంటాడు. జీవన్ముక్తుడవుతాడు.

ప్ర: అన్వేషణ లోపలే జరుపుకోవాలన్నప్పుడు భౌతికంగా గురువు సమీపంలో ఉండాలా?

జ: అన్ని సందేహాలూ నశించే వరకూ అవసరమే.

ప్ర: నా అంతటనేను ఏకాగ్రతని నిల్పుకోలేక పోతున్నాను. నాకు సహాయం చేయగల శక్తిని వెతుక్కుంటున్నాను.

జ: అవును - అదే అనుగ్రహమంటే, మనస్సు దుర్బల మవటం వల్ల మనంతటమనమే దానిని సాధించలేము. అనుగ్రహం అవసరం. సాధువుల సేవ దానిని కలిగిస్తుంది. అయితే, కొత్తగా సంపాదించేదంటూ ఏమీ లేదు. బలహీనుడు, బలవంతుని వశమవుతాడు. అట్లాగే దృఢచిత్తులైన సాధవుల సమక్షంలో దుర్బలమనస్కుల మనస్సు అదుపులోకి వస్తుంది. ఉన్నదల్లా అనుగ్రహమే. వేరేమీ లేదు.

ప్ర: గురువుకి భౌతికంగా సేవ చేయాలా?

జ: ఆత్మసాక్షాత్కారానికి, గురుసేవ పన్నెండు సంవత్సరాలు చేయాలంటాయి శాస్త్రాలు. గురువేమి చేస్తాడు? శిష్యునికి దానిని తెచ్చి అందిస్తాడా? ఆత్మ ఎప్పుడూ సాక్షాత్కారమయే లేదా? అయితే ఈ నమ్మకం అర్థమేమిటి? మనిషి ఎప్పుడూ ఆత్మే - దీనిని మాత్రం తెలుసుకోడు. పైగా, దానినే అనాత్మతో - శరీరాదులతో - ఏకం చేసుకుంటాడు. అటువంటి గందరగోళానికి కారణం, అవిద్య. అజ్ఞానాన్ని తుడిచి పెట్టివేస్తే ఆ గందరగోళం కూడ పోతుంది. అసలైన జ్ఞానం కలుగుతుంది. సాక్షాత్కారం చెందిన ఋషులతో సంపర్కం కలిగించు కోవటంవల్ల మనిషిలోని ఈ అవిద్య క్రమంగా సన్నగిల్లి చివరికి తొలగిపోతుంది. నిత్యమైన ఆత్మ సాక్షాత్కరిస్తుంది.

ప్ర: శిష్యులకి ఋషుల సత్సంగమూ, వారి సేవ, అవసరమంటారు-

జ: అవును. సత్సంగమంటే అవ్యక్తమైన సత్ తో కలసి ఉండటమనే అర్థం. అది అందరికీ సాధ్యంకాదు. అందువల్ల వారు అభివ్యక్తమైన సత్తో, అంటే గురువుతో, కలసి ఉండాలి. ఆలోచనలు ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి. కాబట్టి ఋషులతో గడపాల్సిన అవసరముంది. ఋషి ఇటువంటి మానసిక స్థితిని దాటి, ప్రశాంతంగా ఉంటాడు. ఆయన సమీపాన ఉండటంవల్ల ఇతరులకి కూడ ఆ స్థితే సంప్రాప్తిస్తుంది. లేకపోతే, ఆయన సామీప్యాన్ని కోరుకోవటంలో అర్థం లేదు. ఇతరులకి తెలియకుండా అవసరమైన శక్తిని గురువు అనుగ్రహిస్తాడు. ఇక సేవ అంటావా. ముఖ్యంగా ఆత్మనిష్ఠ కోసమే అది. సేవలో, గురువు దేహం సుఖంగా ఉండేట్టూ ఆయన నివాసం శుభ్రంగా ఉండేట్టూ చూడటం కూడా ఇమిడి ఉన్నాయి. గురువుతో సంపర్కం అవసరం, కాని అది ఆధ్యాత్మిక సంపర్కమే. గురువుని అంతరంగంలోనే గ్రహించగలిగితే, శిష్యుడు ఎక్కడికి వెళ్ళినా ఫరవాలేదు. ఇక్కడున్నా. ఎక్కడున్నా ఫలితమొకటేనని గ్రహించాలి.

ప్ర:

వృత్తిరీత్యా నేనెక్కడో ఉండాలి, సాధువు సమీపంలో ఉండటం కుదరదు. సత్సంగం లేకపోయినా, నాకు సాక్షాత్కారం లభిస్తుందా?

జ:

సత్ అంటే అహం ప్రత్యయసారం. అంటే ఆత్మలకు ఆత్మ. సాధువు అంటే అదే. సర్వాంతర్యామి. ఆత్మ లేకుండా ఎవరైనా ఉండగలరా? అందువల్ల సత్సంగానికి బయట ఎవ్వరూ ఉండరు.

ప్ర:

గురువు సమీపంలో ఉండటంవల్ల ఉపయోగం లేదా?

జ:

అంటే భౌతికంగా సమీపంగా ఉండటం గురించా నీవడిగేది? దాని వల్ల ప్రయోజనమేమిటి? మనస్సే ముఖ్యం. సంపర్కాన్ని పెట్టుకోవలసింది, మనస్సే. సత్సంగం వల్ల మనస్సు హృదయంలోకి వెళ్ళి పోతుంది.

అటువంటి సాంగత్యం భౌతికమూ, మానసికమూ కూడా. బయటకు కనబడే గురువు మనస్సుని లోపలికి తోస్తాడు. అతడు సాధకుని హృదయంలో కూడా ఉంటాడు అందువల్ల, అంతర్ముఖుడైన వాని మనస్సుని హృదయంలోకి లాగుతాడు.

ప్ర:

సత్సంగం అవసరమా? నేనిక్కడికి రావటం వల్ల నాకేమైనా ప్రయోజన ముంటుందా, ఉండదా నేను తెలుసుకో గోరేది ఇదే.

జ:

మొదట సత్సంగమంటే ఏమిటో తెలుసుకోవాలి నువ్వు. సత్తో, అంటే సత్యంతో, కలసి ఉండటమని దాని అర్థం. సత్ని ఎరిగినవాడినీ, గ్రహించిన వాడినీ కూడా సత్ అనే అంటారు. సత్తోగాని, సత్ని గ్రహించినవానితో గాని కలసి ఉండట మనేది తప్పనిసరి అందరికీ. సంసారసాగరాన్ని దాటించటానికి సత్సంగం వంటి నౌక ముల్లోకాలలో వేరే ఏమీ లేదన్నాడు శంకరుడు.

సత్సంగమంటే - సత్ తో కలసి ఉండటం. సత్ అంటే ఆత్మే. ప్రస్తుతం, ఆత్మే సత్ అని తెలియకపోవటం వల్ల. ఆ జ్ఞానం కల ఋషి యొక్క సాంగత్యాన్ని వెతుక్కుంటాం. అదే సత్సంగం. అంతర్ దృష్టి కలుగుతుంది. సత్ సాక్షాత్కరిస్తుంది.

నాల్గవ భాగము:-

# ధ్యానము -యోగము

మూడు అవస్థలలోనూ కొనసాగేదే అన్నిటికన్నా ఉత్తమమైన ధ్యానము. "నేను ధ్యానం చేస్తున్నా"ననే తలంపు కూడా ఉదయించనంతటి తీవ్రంగా ఉండాలది.

వంచించే యింద్రియాల ద్వారా గ్రహించాలన్న అభిలాషను తగ్గించి, ఆ విధంగా బాహ్య విషయాల నెరిగే మనస్సుని, ఎగసిపడే అహంకారాన్నీ అంతమొందించి హృదయంలోని అవ్యక్తమైన కాంతినీ, సర్వ్వడినీ ఎరుకపరచటమే యోగశక్తి!

## 10.ధ్యానము - ఏకాగ్రత

శ్రీరమణులు, అహంవృత్తి గురించిన ఎరుక ఆత్మసాక్షాత్కారానికి ప్రధమావశ్యకమనీ, ఇది ముఖ్యాంశంగా లేని ఏ ఆధ్యాత్మిక అభ్యాసమైనా పరోక్షమూ, అసమర్ధమేననీ అనేవారు.

"ఈ మార్గమే (అంటే, "నేను" పై ధ్యాస ఉంచటం) సూటి యైనది. మిగిలిన వన్నీ డొంక తిరుగుడు మార్గాలు. మొదటిది ఆత్మకి దారి చూపుతుంది. మిగిలినవి ఇంకెక్కడికో. అవి చివరికి ఆత్మ వద్దకు చేర్చినా, మొదటి మర్గానికే అవి కూడ వచ్చి కలియటం వల్లే మొదటి మర్గమే గమ్యానికి చేరుస్తుంది. సాధకులకు ఆ మార్గమే అనుసరణీయం. అటువంటప్పుడు దానితోనే ఎందుకు ప్రారంభింపరాదు? కాల యాపన ఎందుకు?"

అంటే, ఇతర పద్ధతుల వల్ల సాధకులలో మానసిక నిశ్చలత కలిగి తద్వారా ఆత్మపై అవధానము, ఆత్మజ్ఞానము అప్రయత్నంగా సంభవించినా ఆత్మని చేరుకోవటానికి అవన్నీ పరోక్ష పద్ధతులే. "ఆత్మ విచారం" ఎక్కడ ప్రారంభిస్తుందో అంత వరకే ఇతర పద్ధతులన్నీ తీసికొని వెళ్తాయని శ్రీరమణులు అనేవారు. ఆత్మవిచార మార్గాన్ని అనుసరించటానికి విముఖులనో, అసమర్థులనో తప్ప ఇతర పద్ధతుల ననుసరించమని పృచ్ఛకులను ప్రోత్సహించే వారు కారు. వారితో మొదటి సంభాషణా సంకలనాలలో ఒకటైన శ్రీ రమణగీతలో దీనికి దృష్టాంతం కనిపిస్తుంది, ఆత్మసాక్షాత్కారానికి, ఆత్మ విచారమార్గాన్నే ఎందుకు అనుసరించాలి అని ఒక పృచ్ఛకుడు అడిగితే వారిచ్చిన వివరణే. శ్రీరమణులు చెప్పిన దంతా శ్రద్ధగా వినిన తరువాత కూడ ఆ పృచ్ఛకుడు ఆత్మ సాక్షాత్కారానికి, ఆత్మవిచారం తప్ప వేరే మార్గాలులేవా అని అడిగాడు. శ్రీ రమణులు ఇచ్చిన సమాధానమిది:

"(ఏదో ఒక దానిని) ధ్యానం చేసేవానికీ, ఆత్మవిచారం అనుసరించే వానికీ లక్ష్య మొక్కటే. మనోనిశ్చలత ఒకరికి ధ్యానం వల్లా మరొకరికి జ్ఞానం వల్లా లభిస్తుంది. ఒకరు దేనినో సాధించాలని యత్నిస్తే, రెండవ వారు ఆ యత్నించే దెవరని అన్వేషిస్తారు. మొదటి వానికీ ఆత్మజ్ఞానం కలగుతుంది కాని ఎక్కువ కాలం పట్టుతుంది."

అభ్యాసాన్నే చేసుకోమని ప్రోత్సహిస్తూ అది కూడ చివరికి ఆత్మజ్ఞానం కలిగి స్తుందన్నారు. శ్రీ రమణుల దృష్టిలో ఏ అభ్యాసమూ లేకుండా ఉండటం కన్నా ఏ మార్గాన్నైనా అనుసరించటం ఉత్తమం - చివరికి ఏ అభ్యాసమైనా ఆత్మవిచార మార్గానికే దారి తీసే అవకాశముంది కాబట్టి. ఈ కారణాల వల్లే వారు ఇటువంటి సమాధానాలని ఎందరికో ఇచ్చారు. ఈ సమాధానాలు - ఆత్మవిచారం, శరణాగతీ మాత్రమే కాక ఇతర పద్ధతులు కూడ ఆత్మసాక్షాత్కారాన్ని కలిగిస్తాయని స్ఫురింప చేస్తాయి. ఆత్మవిచారానికి ఆకర్షితులు కాక, తమ పద్ధతులనే అనుసరిద్దామని భావించే పృచ్ఛకులకు ఇచ్చిన సమాధానాలివి. అందువల్ల వాటిని యథాతథంగా మనం స్వీకరింపరాదు. వారు కొన్ని పద్ధతులను పరోక్ష పద్ధతులుగా వర్ణించేవారు. వీటిపై ఆసక్తిలేని ఇతర భక్తులతో మాట్లాడేప్పుడు మాత్రం ఆత్మపై అవధానం కలిగి ఉండటమనివార్యమని పునరుద్ఘాటించేవారు.

ఆత్మ విచారమార్గాన్ని శ్రీరమణులు ఎంత దృఢంగా బలపరచినా, ఇతర నమ్మకాలూ, అభ్యాసాలూ ఉన్న వారిని మాత్రం మార్చటానికి ప్రయత్నించేవారు. కారు. ఆత్మవిచార మార్గాన్ని అనుసరించటానికి సంసిద్ధులు కాని వారికి ఇతర పద్ధతుల గురించి కూడ సలహాల నిచ్చేవారు. ఈ అధ్యాయంలోని సంభాషణలలో సాంప్రదాయకమైన ధ్యాన పద్ధతుల గురించి భక్తులకు ఇచ్చిన సలహాలున్నాయి. వారు ధ్యానానికి ఇచ్చిన నిర్వచన మిది: "ఇతర భావాలని విడిచి ఒకే ఒక భావంపై మనస్సుకి ఏకాగ్రత కలిగించటం". ఇంకా ఉన్నత స్థాయిలో, అసలైన ధ్యానమంటే మనస్సుని ఆత్మపైనే లగ్నం చేయటమని కూడ చెప్పేవారు. ఈ రెండవ అభ్యాసం, ఆత్మవిచారానికి మారు పేరు మాత్రమే. వారి తొలిరచనలలో ఒక చోత, “మనస్సుని ఆత్మపై ఎప్పుడూ లగ్నం చేయటమే ఆత్మ విచారమంటే. తానే బ్రహ్మమనుకోవటమే ధ్యానమంటే" అని వ్రాశారు.

ప్ర: ధ్యానానికీ విచారణకీ తేడా ఏమిటి?

జ: రెండూ ఒకటే, విచారణ చేసే యోగ్యత లేని వారు ధ్యానం చేసుకోవాలి. తనను తాను మరచి "నేను బ్రహ్మ"న్ని అనో "నేను ఈశ్వరుడు"ననో ధ్యానిస్తాడు సాధకుడు. ఈ పద్ధతి ద్వారా బ్రహ్మన్నో ఈశ్వరుడినో విడవకుండా పట్టుకుంటాడు. చివరికిది బ్రహ్మము లేక ఈశ్వరుని ఎరుకగా మిగులుతుంది. అదే శుద్ధస్థితి అనీ ఆత్మ అనీ గ్రహింపు కలుగుతుంది. విచారమార్గాన్ని అవలంబించే వాడు, “నేనెవరిని" అని ప్రశ్నించుకుంటూ తనని తాను విడువడు.

ఒక ఆయనకి దేనినైనా ధ్యానం చేయటమంటే మక్కువ, ఆత్మవిచార మార్గమంటే అయిష్టం - ఈ విషయాలని తెలిసికొని శ్రీ రమణులు ఆయనని తనకి నచ్చిన దీని వల్ల వానికి ఆత్మ అంటే ఏమిటో విశదమవుతుంది. సచ్చిదానందంగా భాసిల్లే పరమాత్మనే నేను - అని మనస్సులో ఊహించుకోవటమే ధ్యానం. మనస్సుని ఆత్మపై లగ్నం చేసి తద్వారా భ్రమని నాశనం చేసుకోవటం, విచారణ,

ఆత్మ గురించి ఏ భావంతో ధ్యానం చేసినా, ఆ రూపాన్నే అందుకుంటారు. ఏ విధమైన భావమూ లేకుండా, నిశ్చలంగా ఉండేవాళ్లు పరమోత్కృష్టమైన, నిష్కళంకమైన కైవల్యాన్ని, రూపం లేని ఆత్మని, అందుకుంటారు.

ప్ర: ధ్యానం సత్యాన్ని విడువకుండా పట్టుకుంటుంది. విచారణ అసత్యం నుంచి సత్యాన్ని వేరుచేస్తుంది. అందువల్ల విచారణ కన్నా ధ్యానం సూటి అయినది ?

జ: ప్రారంభదశలో ధ్యానం తేలికగా ఉంటుంది. నచ్చుతుంది కూడా. ఆ అభ్యాసమే ఆత్మవిచారానికి దారితీస్తుంది - అక్కడ సత్యాసత్యాల విచక్షణ జరుగుతుంది. ఒకదానికొకటి వైరుధ్యంకల అంశాలతో నీవు నిండి ఉన్నప్పుడు సత్యాన్ని పట్టుకొని ఉండటం వల్ల ప్రయోజన మేమిటి? "ఆత్మ ఇంకా సాక్షాత్కారం కాలేదం"టూ నీకు స్ఫురింపచేసే అవరోధాలని ఆత్మవిచారం తొలగిస్తుంది. ఆ విధంగా, నేరుగానే నీకు సాక్షాత్కారం కలుగ చేస్తుంది.

సాధకుని పురోగతిని బట్టి ధ్యానం మారుతూంటుంది, యోగ్యతే ఉంటే, యోచించే వాడెవడోనని అన్వేషించటమే నయం. అప్పుడా యోచించే వాడు తన మూలంలో, శుద్ధ చైతన్యంలో నిమగ్న మవుతాడు.

ఆ యోచించేవాడిని విడవకుండా పట్టుకో లేకపోతే భగవంతుడిని విడవకుండా పట్టుకోవాలి. కొంత కాలానికి ఆ మనిషి స్వచ్ఛమై యోచించేవాడిని పట్టుకో గలుగుతాడు, తన మూలంలో విలీనమై పోతాడు. అహంకారాన్ని నిలుపుకుంటేనే గాని ధ్యానం సాధ్యంకాదు; ధ్యానించే అహంకారమూ, ధ్యానింపబడే విషయమూ రెండూ ఉన్నాయి. కాని ఆత్మ ఒక్కటే కాబట్టి, ఇది పరోక్ష పద్ధతి.

అహంకారం యొక్క మూలాన్ని అన్వేషిస్తే, అహంకారమే మాయమవుతుంది. మిగిలేదల్లా ఆత్మే. ఈ పద్ధతి సూటి అయినది.

ప్ర:ధ్యానం వల్ల లోపలికి వెళ్లే మార్గమేమీ లేదల్లే ఉంది.

జ: మరింకెక్కడున్నామిప్పుడు? మన ఉనికే అది.

ప్ర: ఉన్నా కూడా ఆ ఎరుక లేదు మనకి -

జ: ఏమిటా అజ్ఞానం? ఎవరికా అజ్ఞానం? ఆత్మ గురించి తెలియక పోతే, రెండు "నేను" లున్నాయా?

రెండు "నేను"లు లేవు - అయినా పరిమితులమనే భావం కాదనలేం. పరిమితులన్నీ మనస్సులోనే ఉన్నాయి. గాఢనిద్రలో ఉన్నప్పుడల్లా అనిపించిందా? నిద్రలో కూడ నీవున్నావు కదా, అప్పుడు లేనని అనలేవు కదా. ఆ ఆత్మే,

ఇప్పుడూ, ఇక్కడే, జాగ్రదవస్థలో కూడా ఉంది. ఇప్పుడయితే పరిమితులున్నాయని అంటున్నావు. ఈ రెండు అవస్థలకీ భేదముండటమే జరిగినదల్లా. ఈ భేదానికి కారణం మనస్సు. నిద్రలో మనస్సు లేదు, కాని ఇప్పుడది ఎంతో చెలాకీగా ఉంది. మనస్సు లేకపోయినా ఆత్మ ఉంటుంది.

ప్ర: ఈ విషయమర్థమయినా, అనుభవసిద్ధం కావటంలేదు.

జ: క్రమేపీ జరుగుతుంది, ధ్యానం వల్ల.

ప్ర: ధ్యానం మనస్సుతో జరిగే వ్యాపకం. ఆత్మ సాక్షాత్కారమవటానికి అది మనస్సుని ఎట్లా హతమార్చగలదు?

జ: ఒక భావాన్ని విడకుండా ఉండటమే ధ్యానమంటే. ఆ ఒక్క భావమూ ఇతర ఆలోచనలని రానీయకుండా చేస్తుంది. మనస్సు అటూ ఇటూ పరుగెత్తటం దాని బలహీనత వల్లనే. ఎప్పుడూ ధ్యానం చేస్తూంటే దానికి బలం కలుగుతుంది. అంటే, చంచలమైన ఆలోచనలనే బలహీనత పోయి, ఆలోచన లేని స్థిరమైన నేపథ్యం నెలకొంటుంది. ఆలోచన లేని ఈ క్షేత్రమే, ఆత్మ. పరిశుద్ధమైన స్థితిలో, మనస్సే ఆత్మ.

ప్ర: ధ్యానమంటే ఏమిటి?

జ: ఆత్మలో సంస్థితమై, సహజస్థితి నుంచి ఏ విధమైన చలనమూ లేకుండా, తాను ధ్యానం చేస్తున్నానన్న భావం కూడా లేకుండా ఉండటం.

ప్ర: ధ్యానానికీ సమాధికీ తేడా ఏమిటి?

జ: మనస్సుతో ప్రయత్నపూర్వకంగా చేసేది ధ్యానం. సమాధిలో అటువంటి ప్రయత్నమేమీ లేదు.

ప్ర: ధ్యానం చేసేప్పుడు గుర్తుంచుకోవలసిన అంశాలేమిటి?

జ: ఆత్మనిష్ఠలో ఉన్నవాడు ఆ స్థితినుంచి ఏ మాత్రమూ చలనం లేకుండా చూసుకోవాలి. తన సహజస్థితి నుంచి కదలిన వానికి ఏవో జ్యోతులు కనబడవచ్చు. అసాధారణమైన ధ్వనులూ వినబడవచ్చు. వీటి వల్ల మోసపోకూడదు, తనని తాను మరువకూడదు.

ప్ర: ధ్యానమెట్లా చేయాలి?

జ: నిజానికి ధ్యానమంటే ఆత్మనిష్ఠ. మనస్సులో భావాలు మొదులుతూన్నప్పుడు పిల్లలు వాటిని తొలగించటానికి చేసే యత్నాన్ని సాధారణంగా ధ్యానమంటారు. ఆత్మనిష్ఠ నీ సహజస్థితి. నీవు నీవుగా ఉండు. అదే లక్ష్యం. ఉదా.

ప్ర: అయినా భావాలుదయిస్తూనే ఉంటాయి. వీటిని నివారించటమేనా మన ప్రయత్నం యొక్క ప్రయోజనం?

జ: అవును. ఒకే ఒక భావం మీద మనస్సు లగ్నం చేయటమే ధ్యానం. అట్లా ఇతర భావాలని తొలగిస్తాం. భావాలని దూరంగా ఉంచటానికే ధ్యానం.

ప్ర: "ఆత్మ సంస్థం మనః కృత్వా" (మనస్సుని ఆత్మలో ఉంచి) అంటారు. కాని ఆత్మ అనూహ్యం కదా.

జ: అసలు, ధ్యానం చేద్దామని ఎందుకనుకుంటున్నావు? అట్లా చేద్దామనుకోవటం ఇదా వల్లనే, "ఆత్మ సంస్థ మనః కృత్వ" అని చెప్తారు. ఏ ధ్యానమూ లేకుండా ఊరికే ఎందుకుండవు? ఆ మనః (మనస్సు) ఏమిటి? అన్ని భావాలూ తొలగింపబడితే 'అది 'ఆత్మ సంస్థ' మవుతుంది (ఆత్మలో ఉంటుంది).

ప్ర: నాకొక రూపాన్ని ఇస్తే దానిని ధ్యానం చేయగలను. కాని ఆత్మకి రూపంలేదు.

జ: ఏవో రూపాలపై, విషయాలపై మనస్సు నిలపటం ధ్యానం. ఆత్మ గురించిన విచారం. అంటే ఆత్మవిచారం, నిదిధ్యాసం (అంటే, ఉనికి గురించి నిరవధికమైన ఎరుక).

ప్ర: ఇంద్రియాలిచ్చే సుఖం కంటె, ధ్యానమే ఎక్కువ సంతోషాన్నిస్తుంది. అయినా వాటి వెంటే పరిగెత్తుతుంది మనస్సు, ధ్యానం వెంటకాదు, ఎందుచేత?

జ: సుఖమూ, దుఃఖమూ మనస్సు యొక్క అవస్థలే. మన సహజావస్థ ఆనందమే. కాని మనం ఆత్మని మరచిపోయి - శరీరమూ, మనస్సే ఆత్మ అని అనుకుంటాం. ఈ తప్పు తాదాత్మ్యమే దుఃఖాన్ని కలిగిస్తుంది. చేయవలసిన దేమిటి?

ఈ మానసికస్థితి ఎప్పటినుంచో, ఎన్ని జన్మలనుంచో వస్తూనే ఉంది. పటిష్ఠమవుతూ వచ్చింది. అది పోతేనే గాని, సహజస్థితి అయిన ఆనందం నెలకొనదు.

ప్ర: ధ్యానం చేసేప్పుడు కళ్లు మూసుకోవాలా, తెరచుకోవాలా?

జ: ఎట్లా అయినా చేయవచ్చు. అసలు విషయమిది: మనస్సుని లోపలికి మరల్చి అన్వేషణని చేసుకుంటూండ నీయాలి. ఒక్కొక్కసారి కళ్లు మూసుకొని ఉన్నప్పుడు నిద్రాణమై ఉన్న భావాలు వరదల్లాగ రావచ్చు. కళ్లు తెరచుకున్నప్పుడు, మనస్సుని లోపలకు పంపటం కష్టం కావచ్చు. అట్లా చేయటానికి మనోదార్ఢ్యం అవసరం. బయటి వాటిని చూసినప్పుడు మనస్సు కలుషిత మవుతుంది. లేకపోతే, పరి శుద్ధంగా ఉంటుంది. ధ్యానంలో ముఖ్యమైన విషయమేమిటంటే, మనస్సు బయట వాటిని పట్టించు కోకుండా, ఇతర విషయాల గురించి ఆలోచించకుండా తన అన్వేషణలో నిమగ్నమవటం.

ప్ర: భగవాన్, నేను ధ్యానం చేసేప్పుడల్లా నా తల వేడెక్కుతుంది, ఒళ్లంతా మండుతుంది. దీనికి మందేమిటి?

జ: మెదడుతో ఏకాగ్రతని చేస్తే వేడిమీ, ఒకోసారి తలనొప్పీ కూడా కలుగుతాయి. ఏకాగ్రతని హృదయంలో చేయాలి. చల్లగా, హాయిగా ఉంటుంది. ప్రశాంతంగా ఉండు, నీ ధ్యానం తేలిక అవుతుంది. నీ మనస్సుని నిశ్చలంగా ఉంచు, ఏమైనా ఆలోచనలు వస్తే వాటిని మృదువుగా, నెమ్మదిగా తొలగించు. త్వరలోనే కృతార్థుడవుతావు.

ప్ర: ధ్యానం చేస్తున్నప్పుడు వచ్చే నిద్రనాపుకోవట మెట్లా?

జ: నిద్రనాపటానికి ప్రయత్నిస్తున్నావంటే ధ్యానంలో ఆలోచిస్తున్నావన మాట, అది కూడదు. ధ్యానం చేస్తూండగా, నీకు నిద్ర దానంతటదే వస్తే, ఆ ధ్యానం నిద్రలోనూ, ఆ తరువాత కూడా కొనసాగుతుంది. అయినా, అది భావమే అవటం వల్ల నిద్రని వదిలించుకోవాలి. సహజస్థితి జాగ్రదవస్థలోనే ప్రయత్న పూర్వకంగా, ఎరుకతోనే సంపాదించాలి. ఏ భావమూ ఉండని సహజస్థితి అనే తెరపై, నిద్రా మెలకువా బొమ్మల వంటివే. వాటి గురించి పట్టించుకోకు.

ప్ర: ధ్యానం దేని గురించి చేయాలి?

జ: నీకేది ఇష్టమైతే దానిపై.

ప్ర: శివ, విష్ణు, గాయత్రి - వీటన్నిటికీ సమానమైన శక్తి ఉందంటారు. నేను ఏ ధ్యానం చేయాలి?

జ: నీకేది అన్నిటికంటె ప్రీతో దానిపై ఏకాగ్రత నుంచు. ఒక భావానిది పైచేయి అయితే మిగిలినవన్నీ దూరమవుతాయి, చివరికి మాసిపోతాయి. వైవిధ్యమున్నంత కాలం చెడ్డ తలంపులూ ఉంటాయి. నీకు ప్రేమపాత్రమైన భావమే ప్రముఖంగా ఉంటే, మంచి భావాలే ఉంటాయి ఎప్పుడూ. అందువల్ల ఒక్క భావాన్నే పట్టుకొని ఉండు. దీనికి ముఖ్యమైన అభ్యాసం, ధ్యానమే.

ధ్యాన మంటే పోరాటం. నీవు ధ్యానం ప్రారంభించగానే మిగిలిన భావాలన్నీ ముసురుకు వచ్చి, బలవంతమై, నీవు విడవకుండా పట్టుకుందామను కుంటున్న ఆ ఒక్క తలంపునూ అణచివేయటానికి ప్రయత్నిస్తాయి. నిత్యాభ్యాసం వల్ల ఆ మంచి భావానికి బలం కలగాలి. ధ్యానంలో జరిగే పోరాటమిదే. దానికి చిత్తశాంతి అవసరం - అంటే, అన్ని రకాల భావాల వల్లా కలిగే సంక్షోభం లేకపోవటం, మనశ్శాంతి ధ్యానం వల్లనే సాధ్యం.

ప్ర: ఆత్మ యొక్క స్థానం హృదయమే అయినా, అది ఏ చక్రంనుంచైనా పని చేయగలదని శ్రీ భగవాన్ అన్నారు కదా, కనుబొమ్మల మధ్య ఏకాగ్రతని నిలిపి తీవ్రంగా ధ్యానిస్తే ఆ చక్రమే ఆత్మకి స్థావరం కాకూడదా?

జ: ఆత్మకి దేహంలో ఒక స్థాన ముందనీ, దానిపై ఏకాగ్రతని నిలపటం అవసరమనీ అనటం కేవలం సిద్ధాంతపరమైన వ్యవహారమే. నీవొక కర్తగా, ఒక ద్రష్టగా, ఊహించుకుంటావు. నీవే స్థానంపై కేంద్రీకరిస్తావో అది ఒక దృశ్యంగా, పదార్థంగా అవుతుంది. ఇది కేవలం భావనే, అట్లా కాకుండా, నీవు ద్రష్టనే చూస్తే, నీవు ఆత్మలో విలీనమై పోయి దానితో ఏకమైపోతావు. అదే హృదయం.

ప్ర: కనుబొమ్మల నడుమ ఏకాగ్రతని నిలపటం వాంఛనీయమైన అభ్యాసమేనా?

జ: ఎటువంటి ధ్యానాభ్యాసానికైనా ఫలితం ఒకటే- సాధకుడు దేని మీదనైతే మనస్సుని లగ్నం చేస్తాడో, అది వేరే విషయంగా, భిన్నంగా కాకుండా పోతుంది. ద్రష్టా, దృశ్యమూ ఆత్మలో, అంటే హృదయంలో, ఏకమవుతాయి.

ప్ర: ఏదో ఒక చక్రంపై కేంద్రీకరించే అభ్యాసాన్ని అనుసరించమని శ్రీ భగవాన్ ఎప్పుడూ సలహానివ్వరు. ఎందుచేత?

జ: యోగశాస్త్రం ప్రకారం సహస్రార (మెదడులోని చక్రం) లేక మేదడు, ఆత్మకి స్థానం. పురుషసూక్తం ప్రకారం హృదయం ఆత్మకి స్థానం. సాధకునికి సందేహం రాకుండా ఉండటానికి నేను అహంవృత్తిని పట్టుకొని, దాని యొక్క మూలాన్ని అన్వేషించమని చెప్తాను. "నేను" అనే భావం అందరికీ ఉండేదే - దాని గురించి ఏ సందేహానికీ తావు లేదు. అంతేకాదు, నీవే అభ్యాసాన్ని అలవర్చుకొన్నా చిట్టచివరికి, ఈ "నేను" అనే దాని మూలాన్ని గ్రహించటం తప్పదు. ఎందువల్ల నంటే, నీ అనుభవాని కంతటికీ అదే మూలం కాబట్టి. అందుచేత, ఆత్మవిచారం చేస్తే నీవు హృదయాన్నే, అంటే ఆత్మనే చేరుతావు.

ప్ర: నేను హఠయోగాన్ని చేస్తాను. అంతేకాక "అహంబ్రహ్మాస్మి" అని ధ్యానం కూడా చేస్తాను. ఈ ధ్యానం చేస్తూంటే కొద్ది సేపట్లో అంతా శూన్యమై పోతుంది, మృత్యువంటే భయమేర్పడుతుంది. నేనేమి చేయాలి?

జ: 'అహం బ్రహ్మాస్మి' అనేది ఒక భావం మాత్రమే. అట్లా అనుకునేది ఎవరు? బ్రహ్మమే అట్లా అనదు కదా. అట్లా అనవలసిన అవసరం దానికేముంది? అసలైన "నేను" ఎప్పుడూ బ్రహ్మంలోనే ఉండటం వల్ల అది కూడా అట్లా అనలేదు. అట్లా అనటం కేవలం ఒక భావం మాత్రమే. ఎవరిదా భావం? అన్ని భావాలకీ మూలం అహంవృత్తే, అంటే 'నేను' అనే భావమే. ఏ భావమూ లేకుండా ఉండు. భావమున్నంత వరకూ భయముంటుంది.

ప్ర: దాని గురించే ఆలోచిస్తూంటే నాకు మతి మరుపు కలుగుతుంది. మొదడు వేడెక్కుతుంది. నాకు భయం వేస్తుంది.

జ: అవును - మనస్సు మెదడులో నిమగ్నమై ఉండటం వల్ల అక్కడ వేడి పుట్టుతుంది. అది 'అహంవృత్తి' వల్లే. 'నేను' అనే భావముదయించగానే, మృత్యువంటే భయంకూడ వెనువెంటనే ఉదయిస్తుంది. ఇక మతిమరపంటావా -ఆలోచన ఉన్నంత కాలం అది తప్పదు.

ముందుగా 'అహంబ్రహ్మాస్మి అనే భావం వస్తుంది, దాని తరువాత మరుపు. ఈ రెండూ కూడా అహంకారానికే. దానిని పట్టుకో, భూతం వలె పారిపోతుంది మిగిలేదల్లా అసలైన “నేను” - ఆత్మ.

'అహం బ్రహ్మాస్మి' అనేది ఇతర భావాలని రానీయకుండా ఉంచటానికి, ఏ కాగ్రత నిలుపుకోవటానికీ, ఒక సాధనం. ఆ ఒక్క భావమే మిగిలినప్పుడు, అదెవరి భావమో చూడు. అది "నేను" నుండి వచ్చిందని తెలుస్తుంది. ఈ 'నేను' అనే భావమెక్కడిది? పరిశీలించు. అది మాయమైపోతుంది - ఆత్మ ఒక్కటే ప్రకాశిస్తుంది - అంతకన్నా వేరే యత్నమేమీ అవసరం లేదు. ఆ అసలైన 'నేను' మాత్రమే మిగిలినప్పుడు అది "నేను బ్రహ్మాన్ని" అని అనదు. "నేను మనిషి" నంటూ ఎవరైనా చెప్పుకుంటారా? తాను ఒక జంతువునని తప్పుగా అనుకోకుండా ఉండటానికి "నేను జంతువుని కాను, మనిషిని" అని అంటాడా? ఉన్న వాస్తవమల్లా బ్రహ్మమే. లేక, అసలైన 'నేనే', దానిని కాదనే వారెవ్వరూ లేరు. అందుచేత 'అహం బ్రహ్మాస్మి' అని మళ్ళీమళ్ళీ చెప్పుకోనక్కరలేదు.

ప్ర: ఊహకందని విషయం ఆలోచిస్తూ ఈ విధమైన స్వయం సమ్మోహనం పొందటమెందుకు? వెలుగును చూడటమో, ఊపిరి బిగపట్టటమో సంగీతం వినటమో, ఓం కారాన్ని గాని, మరే మంత్రాన్నైనా గాని జపించటమో - చేయరాదా?

జ: వెలుగును చూస్తూండటం వల్ల మెదడు బండబారవచ్చు, తాత్కాలికంగా సంకల్పమంటూ లేకపోవచ్చు. కాని శాశ్వతమైన లాభమేమీ ఉండదు. ఊపిరి బిగపట్టటం వల్ల కూడ సంకల్పం తాత్కాలికంగా స్తబ్దమవవచ్చు. అదే శాశ్వతం కాదు. ధ్వనులు వినటం వల్లా అంటే. మంత్రాలు పవిత్రమై పరిశుద్ధపరచి, ఉద్ధరింపగల శక్తిని ఇవ్వగలగాలి- లేకపోతే అవీ తాత్కాలిక ప్రయోజనాన్నే ఇస్తాయి.

ప్ర: కనుబొమ్మల మధ్యనున్న కేంద్రంపై ఏకాగ్రత కలిగి ఉండమని నల హానిస్తూంటారు. ఇది సరియైనదేనా?

జ: “నేనున్నా”నని అందరికీ ఎరుక ఉంటుంది. ఆ ఎరుకను విడిచి భగవంతుడిని అన్వేషింప బూనుతారు. కనుబొమ్మల మధ్య ఏకాగ్రత కలిగి ఉండవలసిన అవసరమేమిటి? కనుబొమ్మల మధ్య భగవంతుడున్నాడనటం మూర్ఖత్వం. ఏ కాగ్రతని పెంచుకోవటానికే ఆ సలహాలన్నీ. మనస్సు అటూ ఇటూ పోకుండా, బలవంతంగా అదుపులోకి తీసుకురావటానికి ఉపయోగపడే పద్ధతులలో ఒకటది. మనస్సు బలవంతంగా ఒక మార్గంలోకి పెట్టబడుతుంది. ఏకాగ్రత పెంపొందించుకోవటానికి సహాయ పడుతుంది. సాక్షాత్కారానికి అన్నిటికన్నా మంచి పద్ధతి. 'ఎవరిని నేను' అన్న విచారణే. ప్రస్తుతం ఉన్న సమస్య అంతా మనస్సుకి సంబంధించినదే - దానిని మనస్సుతోనే మాపేయాలి.

ప్ర: శరీరంలో ఏదో ఒకే కేంద్రంపైనే ఏకాగ్రత కలిగి ఉండలేను. ఒకోసారి ఒకో కేంద్రం మీద లగ్నమవుతూంటాను. ఒక కేంద్రం పైన లగ్న మయి ఉండగా, దానంతట అదే మరొక కేంద్రానికి జరిగి దానిపై లగ్న మవుతుంది. ఎందువల్ల?

అది నీ పూర్వపు అభ్యాసంవల్ల కావచ్చు. అయినా, నీవు ఏ కేంద్రపై ఏకాగ్రత కలిగి ఉన్నా పెద్ద తేడారాదు. అసలైన హృదయం అన్ని కేంద్రాలలో, బయటా కూడ ఉంది. నీవు శరీరంలో ఏ కేంద్రం పైన లగ్నం చేసినా, బయట దేనిపైన లగ్నం చేసినా - అక్కడే ఉంది హృదయం.

ప్ర: ఒక కేంద్రంపై ఒకసారి, మరొక కేంద్రంపై ఇంకొకసారి ఏకాగ్రమై ఉండవచ్చా లేక ఒకే ఒక కేంద్రం పైనేనా?

జ: నేనిప్పుడే చెప్పినట్టు. దేనిపై ఏకాగ్రత కలిగి ఉన్నా తప్పులేదు- ఆలోచనలను రానీయకుండా చేసుకోవటానికి ఏకాగ్రత నభ్యసించటం ఒక పద్ధతి మాత్రమే. ఏ కేంద్రంపైన ఏకాగ్రత నిలిపినా, ఏ పదార్థంపైన నిలిపినా - నిలిపేవాడు ఒకడే కదా.

ప్ర: స్థూలమైన పదార్థాలపైనే ధ్యానం అభ్యాసం చేయాలంటారు. మనస్సుని నాశనం చేయటానికి ప్రయత్నించటం ప్రమాదమని కూడ అంటారు..

జ: ఎవరికి ప్రమాదం. ఆత్మకి భిన్నంగా ప్రమాదం ఉండగలదా?

'అహం', అహం' ('నేను, నేను") అనేది ఒక మహాసముద్రం. అహంకారం, అంటే, 'నేను' అనే భావం ఒక బుడగవంటిది. దానినే జీవుడంటారు. బుడగ కూడా నీరే అది చితికి నప్పుడు సముద్రంలోనే కలిసిపోతుంది. బుడగగా ఉన్నప్పుడు కూడా అది సముద్రంలో ఒక భాగమే. సరళమైన ఈ సత్యాన్ని తెలుసుకోక యోగం, భక్తి, కర్మ, మళ్ళీ వీటిలో శాఖోపశాఖలూ ఇంకేవేవో ఎంతో తెలివిగా సాధకులకు చెప్పి, వాళ్లని గందరగోళం చేస్తున్నారు.

అట్లాగే మతాలూ, వాటిలో శాఖలూ, సిద్ధాంతాలూను, అవన్నీ ఎందుకు? ఆత్మని తెలుసుకోవటానికే. ఆత్మని తెలుసుకోవటానికి అవన్నీ సాధనాలు మాత్రమే.ఇంద్రియాల ద్వారా తెలుసుకునే దానిని ప్రత్యక్ష జ్ఞానమంటారు ఇంద్రియాల సహాయం లేకుండా అనుభవ సిద్ధమయ్యే ఆత్మకన్నా సూటి అయినదేదైనా ఉందా? ఇంద్రియాల వల్ల కలిగేది పరోక్షజ్ఞానమే అవుతుంది. ప్రత్యక్షజ్ఞానం కాలేదు. తనగురించిన ఎరుకే ప్రత్యక్షజ్ఞానం. అదే అందరి అనుభవమూ కూడా, ఆత్మని తెలుసుకోవటానికి ఏ సాధనాలూ అవసరం లేదు!

## 11.మంత్రము - జపము

శిష్యునికి దీక్షనిచ్చేప్పుడు గురువు మంత్రోపదేశం కూడా చేస్తాడు. ధ్యానం వల్లగాని ఆత్మసాక్షాత్కారం వల్లగాని గురువుకి అధ్యాత్మిక శక్తి సమకూడితే ఆ శక్తిలో కొంతైనా మంత్రం ద్వారా ప్రసరింప బడుతుంది. ఆ మంత్రాన్ని శిష్యుడు పదే పదే స్మరిస్తుంటే గురువు యొక్క శక్తి అమంత్రింపబడి, ఆత్మసాక్షాత్కార గమ్యాన్ని చేరుకోవటానికి శిష్యునికి తోడ్పడుతుంది. శ్రీ రమణులు ఈ పద్ధతిని ఆమోదించినా, ఆయన మంత్రోపదేశంగాని, దీక్షనివ్వటంగాని చేయలేదు. అయితే, ఆయన నామజపం యొక్క ప్రాశస్త్యాన్ని కొనియాడే వారు, శరణాగతి నొందగోరే వారికి అది ఎంతో ఉపయోగ పడుతుందనే వారు.

భగవంతునికి గాని, ఆత్మకిగాని పరిపూర్ణంగా అంకిత మవాలంటే ఈ ప్రపంచ వ్యవహారాలన్నీ చూచుకొనే వేరే శక్తి ఏదో ఉందనీ, వ్యక్తి అంటూ ఎవ్వరూ వేరే లేరనీ ఎల్లవేళలా గుర్తుంచుకోవాలని ఏడవ అధ్యాయంలో చూచాం. ఈ విధమైన మానసిక స్థితిని ధృవపరచు కోవటానికి నామజపం ఉత్తమమైన పద్ధతి అని శ్రీ రమణులు చెప్పేవారు. దీని వల్ల వ్యక్తి గురించీ, ప్రపంచం గురించీ ఉండే ఎరుకకి బదులు ఆ మహనీయ శక్తి గురించిన ఎరుకే నిలుస్తుంది. ప్రారంభదశలలో భగవంతుని నామజపం ఏకాగ్రతకీ, ధ్యానానికీ పనికి వస్తుంది అంతే. కాని ఆ అభ్యాసాన్ని కొనసాగిస్తూంటే ఆ జపమే అప్రయత్నంగా, స్వచ్ఛందంగా, నిరంతరంగా సాగిపోతుంది. "భగవంతుని నామాన్ని వినియోగించుకోవటానికి ఆయనని మనసారా ఆహ్వానించాలి, నిస్సంకోచంగా అంకితమవాలి. ఆ అర్పణ జరిగిన తరువాతనే భగవన్నామం మనిషిలో విడవకుండా ఉంటుంది."

శ్రీ రమణులు జపంలో ఉన్నతస్థాయి గురించి చెప్పినప్పుడు వారి భావాల కేవో నిగూఢమైన అర్ధమున్నట్లనిపించేది. భగవంతుని నామమూ, ఆత్మా ఒకటే ననేవారు. అంతేకాక, ఆత్మసాక్షాత్కారమైన పిదప భగవన్నామస్మరణ హృదయంలో అప్రయత్నంగా సాగిపోతూంటుందనే వారు.

జపమూ, ఆత్మపట్ల అవధానమూ మిళితమైనప్పుడే ఈ అంతిమదశ సంభవిస్తుంది. ఈ పరివర్తన యొక్క ఆవశ్యకతను చెప్పుతూ, శ్రీ రమణులు పద్నాల్గవ శతాబ్దపు మహారాష్ట్ర యోగి నామ్ దేవ్ అనే భక్తుని మాటలు చెప్తూండేవారు.

అవి "విశ్వవ్యాప్తమైన నామం యొక్క స్వరూపాన్ని గ్రహించాలంటే ముందుగా ఆత్మజ్ఞానం కలిగి ఉండాలి. తనసంగతే తెలియనప్పుడు, విశ్వవ్యాప్తమైన నామాన్ని గ్రహించటం అసంభవం". ఈ మాటలు నామదేవ్ రచించిన "దివ్యనామతత్త్వం" లోనివి. ఈ అధ్యాయంలో - శ్రీరమణులు ఒక ప్రశ్నకిచ్చిన సమాధానం వివరింపబడింది. వారు ఈ

గ్రంథాన్ని 1937లో చూచారు. అప్పటినుండీ దానిని తమ ప్రక్కనే చివరి వరకూ ఉంచుకున్నారు. జపం యొక్క ప్రాశస్త్యం గురించి ఎవరైనా అడిగినప్పుడల్లా వారు ఆ పుస్తకం నుంచి ఉదహరించేవారు సాభిప్రాయంగా.

ప్ర: ఉచ్ఛ్వాసంలో భగవంతుని నామాన్నీ, నిశ్వాసంలో సాయిబాబా నామాన్ని జపించటం నా అభ్యాసం. దీనితో బాటే నాకెప్పుడూ బాబా రూపం కనబడుతూంటుంది. నేను దీనినే కొనసాగించవచ్చా, ఏదైనా మార్పు చేసుకోవాలా? ఎంతసేపూ నామరూపాలనే విడవకుండా ఉంటే వాటిని దాటి వెళ్ళ లేనేమో నని నాకే లోలోపల అనిపిస్తుంది. అయినా వాటిని విడిచి ఏమి చేయాలో కూడా తోచటం లేదు. శ్రీ భగవాన్ ఈ విషయమై వివరిస్తారా?

జ: నీ ప్రస్తుత అభ్యాసాన్ని కొనసాగించవచ్చు. జపం నిరంతరంగా కొనసాగుతూంటే, ఇతర భావాలన్నీ పోయి మనిషి తన నిజస్థితిలో ఉంటాడు. అదే జపమన్నా, ధ్యానమన్నా. జపం వల్లగాని, ధ్యానం వల్లగాని ప్రయత్నపూర్వకంగా మనస్సు ఇతర విషయాల గురించి ఆలోచించకుండా ఉండేట్టు చేసినప్పుడు మిగిలిందల్లా మన నిజస్వరూపమే. అదే జపమంటే.

నీకొక పేరూ, రూపమూ ఉన్నాయని నువ్వు అనుకున్నంత కాలమూ జపంలో నామరూపాలని తప్పించుకోలేవు. నీకు పేరూ, రూపమూ లేవని నీవు గ్రహించినంతనే ఆ రెండూ రాలిపోతాయి. వేరే ప్రయత్నమేమీ అక్కర్లేదు. జపమూ, ధ్యానమూ ఆ స్థితికే తీసుకుని వెళ్తాయి. ఇప్పుడు జపాన్ని సాధనమనుకుంటున్నావు. అదే సాధ్యమవు తుందప్పుడు. నామమూ, భగవంతుడూ వేరు కావు. నామదేవుని బోధనలలో ఇది స్పష్టంగా ఉంది.

1. భూనభోంతరాళాలలో పరివ్యాప్తమైన దల్లా నమమే. పాతాళంలో ఏ అగాధాల నంటిందో, గగనంలో ఏ అంచుల తాకిందో ఎవరికెరుక? ఎన్ని కోట్ల జన్మల నెత్తినా సారమెరుగరు అజ్ఞానులు. నామమే అమరమంటాడు నామదేవ్. రూపాల నంతం, అంతా నామమయం!

2. నామమే రూపం, నామ రూపాలకు లేదు అంతరం. అభివ్యక్తుడైన భగవంతుడే నామరూపధారి. అందుకే నామాన్ని వేదాలు ధృవపరచాయి. నామాన్ని మించిన మంత్రం లేదు - కాదనే వారు అజ్ఞానులు. నామమే సాక్షాత్తు కేశవుడంటాడు నామదేవ్! భగవంతుని భక్తులకే ఇది విదితం.

3. నామం సర్వవ్యాప్తమన్న ఎరుక ఆత్మజ్ఞానం కలవారికే సంభవం. తన నామమే తెలియని వానికి, విశ్వవ్యాప్తమైన నామం తెలియటు మసంభవం. తనను తానెరింగిన వాడు కాంచును నామము నెల్లెడలా. నామము, నామధారికి భిన్నమనుకొనుట భ్రమ. ఋషుల నడుగమంటాడు నామదేవ్.

4. జ్ఞానమూ, ధ్యానమూ, తపస్సూ - ఏ అభ్యాసమూ, నామస్వరూపాన్ని ఎరుక పరచదు. గురుపాదాక్రాంతుడవై ఆ నామమే 'నేన'ను జ్ఞానాన్ని సంపాదించు. ఆ 'నేను' యొక్క మూలాన్ని అన్వేషించు. ద్వంద్వాతీతము, స్వయంసంస్థితమూ అయిన దానిలో దానిని విలీనం చేయి. ద్వైతానికీ, ద్వైతతీతానికీ, అతీతమై పరివ్యాప్తి చెందే నామము ముల్లోకాలకీ వచ్చింది. ద్వయీ భావరహితమైన పరబ్రహ్మమే, నామం.

బైబిల్ లో కూడ ఈ భావమే ఉంది - "ఆదిలో ఉన్నదల్లా శబ్దమే. శబ్దం భగవంతునిలో ఉంది. భగవంతుడే శబ్దం."

ప్ర: అంటే, ఆత్మవిచారం వల్ల భగవంతుని నామం తెలియ వస్తుందన మాట.

జ: నీవే జపానికి రూపానివి. విచారణ వల్ల నీ నిజస్వరూపాన్ని తెలుసుకుంటే ఎంత అద్భుతంగా ఉంటుంది! అంతకు పూర్వం ప్రయత్నంతో సాగే జపం - అవిశ్రాంతంగా, అప్రయత్నంగా హృదయంలో కొనసాగి పోతుంది.

ప్ర: నేను జపమెంతకాలం చేయాలి? అదే సమయంలో భగవంతుని రూపంపై ఏ కాగ్రత కలిగి ఉండాలా?

జ: బయటి రూపం కంటె జపం ప్రధానం. అది సహజమయే వరకూ చేస్తూనే ఉండాలి. ప్రయత్నం వల్లనే ప్రారంభమైనా తనంతట తానే సాగిపోయే వరకూ చేస్తూండాలి. అది సహజమైనప్పుడు దానినే సాక్షాత్కార మంటారు.

ఇతర పనులలో ఉన్నప్పుడు కూడా జపం చేస్తూండవచ్చు. ఉన్నదే సత్యం. రూపంగాని, జపంగాని, మంత్రంగాని, విచారణగాని, ఇంక ఏ ప్రయత్నమైనా - దానికి ప్రతీకే. ఇవన్నీ ఒకే ఒక సత్యంలో ఇమిడిపోతాయి. భక్తి, విచారం, జపం - ఇవన్నీ అసత్యాన్ని దూరంగా ఉంచటానికి మనం చేసే ప్రయత్నాలే. భావాలపట్ల అనురక్తితో, లోకవ్యవహారాల పట్ల మమకారంతో మనం అసత్యంలోనే ఉంటున్నాం. వాటిని, ఈ వ్యాపకాలను ఆపివేస్తే సత్యం తెలియవస్తుంది. ఆ వ్యాపకాలని దూరంగా ఉంచ టమే మన ప్రయత్నమంతా సత్యం గురించిన చింతన వల్లనే ఇది కలుగుతుంది. అదే మన నిజప్రకృతి - కాని ఈ అభ్యాసాలు చేసేప్పుడు దాని గురించే మనం ఆలోచిస్తున్నట్లనిపిస్తుంది. ఆ నిజస్వరూపం మనకి తెలియకుండా చేసే అడ్డంకులని తొలగించు కుంటున్నాం.

ప్ర: మన ప్రయత్నం కృతార్థమవుతుందా?

జ: మన సహజస్థితే సాక్షాత్కారం. అది కొత్తగా సంపాదించ వలసిందేమీ కాదు. - కొత్తదే అయితే అది నిత్యమెట్లా కాగలదు? అందువల్ల ఆత్మని సాక్షాత్కారింప చేసుకుంటామా లేదా అన్న విషయంపై సందేహానికి తావు లేదు.

ప్ర: అసలు చేయవలసింది ఆత్మవిచారమే అని తెలిసినా జపం చేయటం మంచిదేనా?

జ: అన్ని పద్ధతులూ విచారణకే దారి తీస్తాయి. అందువల్ల అన్నీ మంచివే. మన నిజతత్త్వం జపమే. ఆత్మ సాక్షాత్కారమయితే, జపం తనంతట తానే సాగిపోతుంది. ఒక దశలో సాధనమే, మరొక దశలో సాధ్యమవుతుంది. అప్రయత్నంగా, నిరంతరంగా సాగే జపమే- సాక్షాత్కారమంటే.

ప్ర: నేను శాస్త్రాలను అభ్యసించలేదు. ఆత్మవిచార పద్ధతి కష్టమనిపిస్తుంది. నాకు ఏడుగురు పిల్లలు, ఇంటి పనులూను. అందువల్ల ధ్యానానికే మాత్రమూ తీరిక దొరకదు. నాకు సులభమైన మార్గాన్ని శ్రీ భగవాన్ సూచించాలి.

జ: తనని తాను ఎరగటానికి మనిషికి ఏ అద్దమూ అవసరం లేదు. అట్లాగే ఆత్మగురించి తెలుసుకోవటానికి ఏ శాస్త్రాలూ చదువక్కర్లేదు. ఈ విజ్ఞానాన్నంతా అనాత్మగా విడిచివేయాల్సిందే. ఇంటి పనులుగాని, పిల్లలుగాని అడ్డురావు. ఇంకేమీ చేయలేకపోయినా, నీలో నీవు "అహం, అహం" ("నేను, నేను') అనుకో. ఇట్లా ఎల్లప్పుడూ అనుకుంటూంటే ఆ స్థితికి (ఆత్మని) చేరుతావు. ఏ పని చేస్తున్నా అట్లాగే అనుకుంటూండు. 'నేను' అనేదే భగవంతుని నామం' అన్ని మంత్రాలలోకీ అదే మొదటిది. మహనీయమైనది. ఓంకారం కూడ దాని తర్వాతే!

ప్ర: మనస్సుని నిగ్రహించటానికి ఏది ఉత్తమం - అజపమైన మంత్రాన్ని జపించటమా, ఓంకారాన్ని జపించటమా?

జ: అజపజపమంటే నీ ఉద్దేశమేమిటి? "సోహం, సోహం" (నేను అతడినే, నేను అతడినే") అని నోటితో ఉచ్చరిస్తూంటే అజపమవుతుందా? అప్రయత్నంగా, ఒక్కమాట కూడ ఉచ్చరింపకుండానే సాగిపోయే జపాన్ని తెలుసుకోవటమే అజపమంటే. అసలైన ఈ అర్థాన్ని తెలుసుకోకుండా అజపమంటే "సోహం, సోహం" అని కొన్ని లక్షలసార్లు లెక్క పెట్టుకుంటూ జపించటమే అనుకుంటారు.

జపాన్ని ప్రారంభించే ముందు ప్రాణాయామం చేయమంటారు. అంటే, ముందు ప్రాణాయామం చేసి, తరువాత మంత్రాన్ని జపించటం. ప్రాణాయామంలో మొదట నోరు మూసుకోవాలి కదా. ఊపిరి బిగపట్టటం వల్ల దేహంలోని పంచభూతాలూ బంధింపబడి, నిగ్రహింప బడుతాయి. ఇక మిగిలేదల్లా, ఆత్మే. తనంతట తానే ఆ ఆత్మ "అహం, అహం" అంటూంటుంది. అదే అజపమంటే, ఇది తెలిస్తే, నోటితో జపించేది అజపమెట్లా అవుతుంది? స్వచ్ఛందంగా, నిరాటంకంగా తైలధారవలె, జపించే ఆత్మని ఎరగటమే అజపం, గాయత్రి అన్నీను.

జపాన్ని చేసెదెవరో తెలిస్తే, జపమంటే ఏమిటో తెలుస్తుంది. జపాన్ని చేసేదెవరో అన్వేషించి, గుర్తిస్తే ఆ జపమే ఆత్మ అవుతుంది.

ప్ర: పైకి ఉచ్చరిస్తూ జరిపే జపానికి సత్ఫలితమేమీ ఉండనే ఉండదా?

జ: లాభముండదని ఎవరన్నారు? అటువంటి జపం చిత్తశుద్ధికి దారి తీస్తుంది. నిరంతరం జపం చేస్తూండటం వల్ల ఆ ప్రయత్నమే పక్వమై ఎప్పటికో అప్పటికి సన్మార్గానికి దారి తీస్తుంది. మంచో, చెడో - ఏమి చేసినా వృథాకాదు. ఆ మనిషి యొక్క వికాసాన్ని బట్టి మంచీ చెడులను చెప్పాలి.

ప్ర: పైకి చేసే జపం కంటె, మనస్సులో చేసేది ఉత్తమం కాదా?

జ: పైకి చేసే జపంలో ధ్వనులున్నాయి. ఆ ధ్వనులు భావాలనుంచే ఉత్పన్న మవుతాయి - మాటలలో దేనినైనా పలికే ముందు ఆలోచించాలి కదా. ఆ ఆలోచనలే మనస్సవుతాయి. అందువల్ల ఉచ్చరించే జపం కన్నా, మానసిక జపం ఉత్తమం.

ప్ర: జపాన్ని భావించా, నోటితో కూడా ఉచ్చరించాలి కదా?

జ: జపం మానసిక మైనప్పుడు, ధ్వనుల అవసరమేమిటి? మానసికమైన జపం, ఆలోచన అవుతుంది. ధ్యానము, ఆలోచన, జపము అన్నీ ఒకటే. ఆలోచనలు అస్తవ్యస్తం కాకుండా, ఒకే ఒక ఆలోచన నిలకడగా ఉండటమే ధ్యానమంటే, అనేక ఆలోచనలకు తావీయక, ఒకే ఒక భావంతో ఉండటమే జపానికి గాని ధ్యానానికి గాని ధ్యేయం. చివరికి, ఆ ఒక్క భావం కూడా తన మూలంలో విలీనమై పోతుంది. జపం చేస్తూ మనస్సు తన మూలంలో మునిగిపోతుంది.

ప్ర: మనస్సు మెదడు నుండి ఉద్భవిస్తుందంటారు -

జ: మెదడు ఎక్కడుంది? దేహంలోనే. దేహాన్ని కల్పించేది మనస్సేనంటాను నేను. శరీరం గురించి మాట్లాడేటప్పుడు మెదడు గురించి కూడా మాట్లాడుతావు. శరీరాన్ని, మెదడునీ కల్పించేది మనస్సు. ఆ మనస్సే, తనకి స్థావరం మెదడంటుంది.

ప్ర: "జపం యొక్క మూలస్థానాన్ని కనుగొనాలి" అని శ్రీ భగవాన్ అంటూంటారు. అంటే, మనస్సనే కదా దీని అర్థం?

జ: ఇవన్నీ మనస్సు యొక్క వ్యాపకాలే. మనస్సుని ఒక భావం మీద లగ్నం చేయటానికి జపముపయోగిస్తుంది. మిగిలిన భావాలన్నీ అణగి, చివరికి లేకుండా పోతాయి. మానసిక జపాన్ని ధ్యానమంటారు. నీ సహజస్థితే ధ్యానం. కాని ప్రయత్నపూర్వకంగా చేయటం వల్ల దానికి ధ్యానమని పేరు పెట్టారు. అస్తవ్యస్తంగా ఆలోచనలున్నంత సేపూ ప్రయత్న మవసరమే. నీకితర ఆలోచనలు కూడా ఉంటూనే ఉంటాయి కాబట్టి, ఒకే ఒక ఆలోచన నిలిస్తే దానినే ధ్యానమంటావు. అప్రయత్నంగా ఆ ధ్యానమే కొనసాగితే, అదే నీ సహజస్థితి అని తెలుస్తుంది.

ప్ర: భగవంతునికి ఏవేవో పేర్లు పెట్టుకొని, అవి పవిత్రమయినవనీ, వాటిని జపిస్తే పుణ్యమనీ అంటారు. ఇది నిజమేనా?

జ: కాకేం? నీకొక పేరుంది - ఆ పేరుతో పిలిస్తే పలుకుతావు. నీ శరీరం ఆ పేరు పెట్టుకు పుట్టలేదు కదా. తనకా పేరుందని శరీరం కూడా ఎవ్వరితోనూ చెప్పనూ లేదు. అయినా నీకొక పేరు పెట్టారు. దానికి నీవు బదులు పలుకుతావు. ఎందువల్ల? నీవు ఆ పేరుతో తాదాత్మ్యం చెందటం వల్ల. అంటే, పేరు కేవలం కల్పనే కాదు - అది దేనినో సూచిస్తుందన మాట. ఆ విధంగానే భగవంతుని నామానికొక ప్రభావముంది. నామస్మరణ అంటే, ఆ పేరు దేనిని సూచిస్తుందో దానిని గుర్తుంచుకోవటం. అందువల్లనే పుణ్యం కూడాను.

ప్ర: ఒక గంటసేపో, అంతకంటే కొంచెం ఎక్కువ సేపో, జపం చేస్తే మగతగా అవుతుంది. మేల్కొనగానే, నా జపానికి అంతరాయం కలిగిందని గుర్తు వస్తుంది. అందువల్ల మళ్ళీ ప్రయత్నిస్తాను.

'మగత' అన్నావే - అది నిజమే. అది సహజస్థితి. నీవిప్పుడు అహంకార యుతంగా ఉండటం వల్ల, ఆ సహజస్థితి నీ పనికి అంతరాయ మనుకుంటావు. ఆ అనుభవం మళ్ళీ మళ్ళీ కలగాలి. అప్పుడుగాని అది నీ సహజస్థితి అని తెలియదు. అప్పుడు నీకు తెలిసేదిది: జపం బయటిది అనీ, అయినా అప్రయత్నంగా కొనసాగి పోతూంటుందనీను. ఇప్పటి నీ సందేహానికి కారణ మేమిటి? నీవు జపాన్ని చేసే మనస్సుతో తప్పుగా తాదాత్మ్యం చెందటం. జపమంటే ఏమిటి? ఇతర భావాలనన్నిటినీ విడిచి, ఒకే భావాన్ని విడవకుండా పట్టుకొని ఉండటం. దాని ప్రయోజనం కూడా అదే. అది ధ్యానానికి దారి తీస్తుంది. ధ్యానం, జ్ఞానంలో (అంటే, ఆత్మ సాక్షాత్కారంలో) అంతమవుతుంది.

ప్ర: నేను జపమెట్లా చేయాలి?

జ: భగవంతుని నామాన్ని యాంత్రికంగా కాని, పైపైకి గాని అనుకోకూడదు ఎంతో భక్తితో అనుకోవాలి.

ప్ర: అంటే, యాంత్రికంగా అనుకోవటం వృథా అనమాట.

జ: తీవ్రమైన జబ్బు తగ్గాలంటే దానికి సంబంధించిన మందుని వేసుకోవాలేగాని, ఆ మందుపేరు స్మరిస్తే చాలదు కదా. అట్లాగే, జననమరణబంధాలు పోవాలంటే, "శివోహం" వంటి మహావాక్యలను పదేపదే అనటం చాలదు. "అహం బ్రహ్మాస్మి" అని పదేపదే అనుకుంటూ తిరిగే బదులు నీవే బ్రహ్మంగా ఉండు. "తత్త్వమసి" అని పదేపదే నోటితో అన్నంత మాత్రాన జనన మరణాల శోకం మాయం కాదు. దానిలో సంస్థితమవటం వల్లే జరుగుతుంది.

ప్ర: మంత్రాలను యథాలావంగా తెలుసుకుని వాటిని జపిస్తే ఏమైనా లాభముంటుందా?

జ: ఉండదు. జపించేవాడు సమర్థుడై ఉండాలి. అతనికి ఆ మంత్రోపదేశం సవ్యంగా జరిగి ఉండాలి. దీనికి ఒక రోజా మంత్రుల కథ ఉదాహరణ. ఆ కథ ఇది: ఒకనాడు రాజు తన మంత్రి ఇంటికి వెళ్లాడు. ఆయన, మంత్ర జపం చేసుకుంటున్నాడని విని, మంత్రి కోసం రాజు వేచి ఉన్నాడు. మంత్రి బయటికి రాగానే, ఆయన జపించే మంత్రమేమిటని రాజు అడిగాడు. అది పరమ పవిత్రమైన గాయత్రి అని మంత్రి చెప్పాడు. ఆ మంత్రోపదేశం తనకి చేయమని రాజు కోరాడు. తన వల్ల కాదని మంత్రి అన్నాడు. రాజు మరొకరి దగ్గర ఆ మంత్రోపదేశం పొందాడు. తరువాత మంత్రిని కలుసుకున్నప్పుడు, ఆ మంత్రాన్ని చెప్పి, సరిగ్గా ఉన్నదా అని రాజు అడిగాడు. "సరిగ్గానే ఉంది గాని, మీరు ఉచ్చరించటం ఉచితం కాద" ని మంత్రి చెప్పాడు. కారణమేమిటని రాజు ఒత్తిడి చేయగా, మంత్రి ఒక బంటుని పిలిచి రాజుని బంధించమన్నాడు. ఆ ఆజ్ఞని బంటు పాటించలేదు. మంత్రి మళ్ళీ ఆజ్ఞాపించాడు, ఫలితం శూన్యం. రాజుకి కోపం వచ్చింది. ఆ బంటునే, మంత్రిని బందీ చేయమన్నాడు. వెంటనే ఆ పని జరిగింది. మంత్రి నవ్వి, రాజు కోరిన సమాధానమిదే నన్నాడు. "ఎట్లా" అని రాజడిగాడు. మంత్రి, "ఆజ్ఞ ఒక్కటే, ఆజ్ఞాపింపబడిన వాడూ ఒక్కడే. కాని ఆజ్ఞాపించిన మనిషి వేరు. నేను ఆజ్ఞాపించి నప్పుడు ఫలితమేమీ లేకపోయింది. మీరు ఆజ్ఞాపించగానే, ఫలితం తక్షణమే వచ్చింది. మంత్రాల విషయంలోనూ ఇంతే" అన్నాడు.

ప్ర: మంత్ర జపమెంతో బలీయమైన అభ్యాసమని విన్నాను -

జ: ఆత్మే అన్నింటి కంటె గొప్ప మంత్రం. తనంతటతాను, నిత్యమూ కొనసాగుతూనే ఉంటుంది. ఈ అంతరంగ మంత్రం నీకు తెలియకపోతే, దానినే ప్రయత్నపూర్వకంగా జపించాలి - ఇతర భావాలు రాకుండా ఉండటానికి దానిపై ఎప్పుడూ లగ్నమైతే, ఆ లోపలి మంత్రం గురించిన ఎరుక కలుగుతుంది. సాక్షాత్కార స్థితి అదే. అప్రయత్నంగా జరిగేది అదే. ఆ ఎరుక స్థిర పడితే, ఆ ప్రవాహంలోనే అప్రయత్నంగా, నిరంతరంగా ఉంటావు - ఏ ఇతర పనులు చేస్తున్నా సరే.

మంత్రాలని పదే పదే అంటూండటం వల్ల మనోనిగ్రహం కలుగుతుంది. అప్పుడు ఆ మంత్రమే మనస్సుతోనూ, ప్రాణంతోనూ ఒకటవుతుంది.

మంత్ర శబ్దాలు ప్రాణంతో ఏకమైతే, దానినే ధ్యానమంటారు. ధ్యానం దృఢమూ, ప్రగాఢమూ అయితే సహజస్థితికి దారి తీస్తుంది.

ప్ర: నాకొక మంత్రోపదేశమయింది. దానిని పదేపదే ఉచ్చరిస్తే ఏవో ఊహించని ఫలితాలు కలుగుతాయని నన్ను కొందరు భయపెడ్తున్నారు. అది ప్రణవమే. (ఓం కారమే) నాకు దానిలో ఎంతో నమ్మకముంది. నేను దానిని చెప్పుకో వచ్చా. కూడదా?

జ: మంత్ర జపం యొక్క ఉద్దేశమిది: ఆ జపమే లోపల అప్రయత్నంగా సాగుతోందని గ్రహించటం. నోటితో చేసే జపం, మానసిక మవుతుంది. మానసిక జపం చివరికి నిత్యమూ జరిగేదిగా ప్రత్యక్షమవుతుంది. మంత్రం మనిషి యొక్క సహజస్థితే. అదే సాక్షాత్కారం కూడా.

ప్ర: సమాధిలోని ఆనందాన్ని ఈ విధంగా పొందవచ్చా?

జ: జపం మానసికమై, ఆత్మగా ప్రత్యక్షమవుతుంది. అదే సమాధి!

## 12.ఈ లోకంలో వర్తనము

భారతీయ సంప్రదాయానుసారం సాధకులందరూ పాటించవలసిన ఆశ్రమాలంటూ నాలుగు నిర్దేశింపబడ్డాయి. అవి ఇవి:

1. బ్రహ్మచర్యం - వివాహానికి పూర్వం దీర్ఘకాలం శాస్త్రాలని పఠించాలి. ఇది కూడా, సాధారణంగా, ఒక వేద పాఠశాలలో జరగాలి.

2. గార్హస్థ్యం - విద్యాభ్యాసం ముగిసిన తరువాత సాధకుడు వివాహం చేసుకుని, తన వృత్తికీ కుటుంబానికీ సంబంధించిన విధులను చిత్తశుద్ధితో, మమకారమంటూ ఏమీ లేకుండా నిర్వహించాలి.

3. వానప్రస్థం - కుటుంబ బాధ్యతలన్నీ తీరిన తరువాత, అంటే పిల్లలకు వివాహాలు చేసిన తరువాత, సాధకుడు ఒక ఏకాంత ప్రదేశానికి - ఏ అడవికో - వెళ్ళి తన సమయాన్నంతా ధ్యానానికే వినియోగించాలి.

4. సన్న్యాసం - ఇది ఆఖరి దశ. ఈ దశలో లౌకిక వ్యవహారాలతో నిమిత్తం లేకుండా సాధకుడు పరివ్రాజకుడవుతాడు. అంతకు పూర్వం అతనికి ఆత్మసాక్షాత్కారానికి అడ్డంకులైన లౌకిక, సాంఘిక, ఆర్థిక బంధాలూ ఈ దశలో ఉండవు.

సాంప్రదాయకంగా వస్తున్న ఈ జీవన సరళి వల్ల సాధకుడు ఆత్మ సాక్షాత్కారం కావాలంటే సాధకుడు సంసారాన్ని త్యజించి, కాలాన్ని ధ్యానంలో గడపాలన్న నమ్మకం భారతీయులకు బలపడింది.

ఈ నమ్మకం గురించి శ్రీరమణులను ఎన్ని సార్లు అడిగినా, వారు దానిని సమర్థించలేదు. సంసారాన్ని విడిచి, ధ్యానంలో గడుపుతాము, అనుమతి నివ్వమని భక్తులు అడిగితే వారు వారించేవారు. భౌతిక పరిస్థితులేమైనా, అందరికీ ఆత్మసాక్షాత్కారం సంభవమేననే వారు. భౌతికంగా సన్న్యసించటం కన్నా ఉత్తమమైన మార్గం, తమ తమ విధులను నిర్వహిస్తున్నా. దేహం చేసే కార్యాల నిర్వహణా బాధ్యత వహించే "వ్యక్తి" అంటూ ఎవ్వరూ లేరన్న ఎరుక కలిగి ఉండాలనే వారు. అటువంటిఎరుకే, ఆధ్యాత్మికంగా ఎంతో ఫలప్రదమనీ అనేవారు. ఆధ్యాత్మిక పురోగమనానికి భౌతిక పరిస్థితులు కంటే మానసిక వైఖరి ప్రధానమనే వారు. భౌతిక పరిస్థితులలో కొద్దిపాటి మార్పైనా 'ఆ పురోగమనానికి దోహదం చేస్తుందని ఎవరన్నా అంటే, కాదనే వారు. భౌతికంగా ఒకే ఒక మార్పును వారు ఆమోదించే వారు రన్నా ఆహార

నియమంలో. మనిషి తీసుకునే ఆహారాన్ని బట్టి అతని భావాలు ఉంటాయనే హైందవ నమ్మకాన్ని వారు బలపరచేవారు. అందువల్ల, మితంగా శాకాహారం తీసుకోవటం ఆధ్యాత్మిక ప్రగతికి దోహదం చేస్తుందనే వారు.

శ్రీ రమణులు బలపరచిన సిద్ధాంతానుసారం, మనిషి భుజించే ఆహారం మనస్సుకి కొన్ని లక్షణాలు కలిగిస్తుంది. దీని ననుసరించి, ఆహారాన్ని ఈ క్రింది రీతిని వర్గీకరిస్తారు.

1. సత్త్వం - (స్వచ్ఛత, పొందిక) పాలు, పళ్లు, కూరలు, ధాన్యాలు - వీటిని సాత్త్వికమైన ఆహారమంటారు. ఆహారంలో అధికభాగం ఈ పదార్థాలుంటే మనస్సు నిశ్చలంగా, నిలకడగా ఉండగలదు. సాధకునికి ఎంతగానో సహాయపడగలదు.

2. రజస్ - (క్రియాశీలం) రాజసికమైన ఆహారమంటే మాంసము, చేపలు, మిరపకాయలు, ఉల్లిపాయలు, వెల్లి ఉల్లిపాయలు వంటివి. వీటిని భుజిస్తే మనస్సు ఎంతో తీవ్రంగా, క్రియాశీలమవుతుంది.

3. తమస్సు (బద్ధకం) తామసికమైన ఆహారమంటే కుళ్ళిపోయినవీ, పులియబెట్టినవీ, మద్యపానం వంటివి. ఇటువంటి ఆహారం తీసుకుంటే మనస్సులో బద్ధకం ఎక్కువ అవుతుంది. దేని గురించీ స్పష్టంగా ఆలోచింపలేక పోతుంది.

ప్ర: ఉద్యోగానికి రాజీనామా చేసి శ్రీ భగవాన్ సన్నిధిలో ఉండాలని నాకెంతో అనిపిస్తుంది.

జ: భగవాన్ ఎప్పుడూ నీతోనే, నీలోనే ఉన్నాడు - నీవే భగవాన్వి. ఈ విషయాన్ని గ్రహించటానికి నీవు ఉద్యోగానికి రాజీనామా ఇవ్వనక్కర్లేదు, ఇల్లు విడిచి పెట్ట నక్కర్లేదు. సన్యాసమంటే పైపై బట్టలను, కుటుంబ సంబంధాలను, సంపదనూ విడిచి పెట్టటం కాదు. సన్న్యసించటమంటే వాంఛలను, మమకారాన్ని విడవటం. నీవు ఉద్యోగానికి రాజీనామా ఇవ్వనక్కరలేదు, అందరి భాధ్యతలనూ వహించే భగవంతునితో రాజీపడు. వాంఛలని త్యజించినవాడు ప్రపంచంలో విలీనమైపోతాడు, అతని ప్రేమ విశ్వవ్యాప్తమవుతుంది. అట్లా విస్తరించే ప్రేమ, అనురాగం నిజమైన భగవద్భక్తుని చిహ్నాలు - సన్న్యాసం కన్నా అవే అసలు సూచనలు. తనకి సన్నిహితమైన బంధాలను తెంపుకున్నవాడు తన ప్రేమానురాగాలను జాతి, కుల మత 'విచక్షణ లేకుండా ప్రపంచమంతటికీ పంచిపెడ్తాడు. నిజమైన సన్న్యాసి తన దుస్తులనీ, సంసారాన్నీ త్యజించాడంటే అది వాటి పట్ల ద్వేషం వల్ల కాదు. అతని ప్రేమ ఇంకా విస్తృతమవటం వల్ల. ఈ విస్తరణ సంభవించగానే ఇంటినుంచి పారిపోతున్నానన్న భావముండదు - బాగా పండిన పండు చెట్టు నుంచి రాలిపోయినట్టే అదే అనిపిస్తుంది. అప్పటి వరకూ ఇంటినీ, ఉద్యోగాన్ని విడిచిపెట్టడం మూర్ఖం.

ప్ర: గృహస్థుకు మోక్షమ్మాట ఏమిటి? అతను కూడ పరివ్రాజకుడవనక్కర లేదా?

జ: నీవు గృహస్థునని ఎందుకను కుంటున్నావు? నీవు సన్న్యసించినా, 'నేను సన్యాసిని" అనే భావం నిన్ను వెంటాడుతూనే ఉంటుంది. నీవు గృహస్థువైనా, ఇల్లు విడిచి అడవులకు వెళ్లినా నీ మనస్సు నిన్ను వెంటాడుతూనే ఉంటుంది. అహంకారమే ఆలోచనకు మూలం. అదే దేహాన్ని, ప్రపంచాన్నీ కల్పిస్తుంది. నీవు గృహస్థువనే భావాన్ని కలిగిస్తుంది. నీవు త్యజిస్తే జరిగే దేమిటి? “గృహస్థు”ననే తలంపుకు బదులు "సన్న్యాసిని" అనీ, ఇంటి వాతావరణానికి బదులు, అడవి వాతావరణాన్ని కల్పిస్తుంది. మానసిక అవరోధాలు ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి. కొత్త పరిసరాలలో ఇంకా ఎక్కువ కూడా అవుతాయి. పరిసరాల మార్పిడివల్ల పెద్ద ప్రయోజన మేమీ ఒరగదు. ఒకే ఒక అవరోధం - మనస్సు. నీవు ఇంట్లో ఉన్నా, అడవిలో ఉన్నా- దానిని అధిగమించాలి. అందువల్ల, పరి సరాలని మార్చవలసిన అవసరమేమిటి? ఏ పరిసరాలైనా, నీ కృషిని ఇప్పుడు కూడా కొనసాగించవచ్చు.

ప్ర: లోకవ్యవహారలలో మునిగి తేలుతున్నా, సమాధి అవస్థ అనుభవించటం సాధ్యమేనా?

జ: “నేను పని చేస్తున్నాన”నే భావమే అవరోధం. పని చేసే దెవరు? అని నిన్ను నీవు ప్రశ్నించుకో. నీవెవరో గుర్తుంచుకో. అప్పుడు పని నీకు బంధం కాదు - దానంతట అదే కొనసాగిపోతుంది. జరుగ వలసింది తప్పకుండా జరుగుతుంది. నీకు పని చేసే యోగం లేకపోతే, నీవు ఎంత ప్రయత్నించినా నీకు పని దొరకదు. నీవు పని చేయ వలసి ఉంటే, ఏ విధంగానూ

తప్పించుకో లేవు - నీవు పనిలో నిమగ్నమై తీరుతావు. కాబట్టి ఆ సర్వేశ్వరునికే విడిచి పెట్టు - నీ ఇష్టం వచ్చినట్టు త్యజించనూ లేవు, పట్టుకొని ఉండనూ లేవు.

ప్ర: అంతరంగంలో భగవంతునికై అన్వేషణ జరుగుతున్నా. బయటిపని తానంతట తానే నెరవేరు తుందని నిన్న అన్నారు శ్రీ భగవాన్, అయితే శ్రీ చైతన్య ప్రభువు జీవితచరిత్రలో ఇట్లా ఉంది : ఆయన శిష్యులకు ఉపన్యాసాలిచ్చేప్పుడు అంతరంగంలో కృష్ణుని అన్వేషించే వారనీ, తన శరీరధ్యాసే లేకుండా కృష్ణుని గురించే మాట్లాడేవారనీను. అందువల్ల, పనిని దాని మానాన దానికే విడవటం మంచిదేనా అని సందేహం కలుగుతోంది. భౌతిక కార్యంపై కొంత ధ్యాసైనా ఉంచాలా?

జ: అంతా ఆత్మే. ఆత్మకి భిన్నంగా నీవున్నావా? ఆత్మతో నిమిత్తం లేకుండా పనికొనసాగ గలదా? ఆత్మ విశ్వమంతా ఉంది, కాబట్టి నువ్వు పాటుపడినా పడకపోయినా పని తనంతటతానే కొనసాగిపోతుంది. "కౌరవులను చంపటానికి నీవేమీ పాటు పడనక్కర్లేదు, వాళ్లని భగవంతుడెలాగూ చంపివేశాడ"ని కృష్ణుడు అర్జునునకు చెప్పటానికి కారణమిదే. ఒక పనిని చేయాలని సంకల్పించు కోవటంగాని దాని గురించి చింతించ వలసినది గాని అతను కాడు. ఆ సర్వేశ్వరుని సంకల్పాన్ని నెరవేర్చటానికి తన శక్తిని వినియోగించాలి అంతే.

ప్ర: నా ప్రమేయం లేకపోతే పని పాడవ వచ్చుకదా?

జ: ఆత్మపై ధ్యాస నుంచట మంటే, పనిపైన ఉంచటమే. నీవు దేహంతో తాదాత్మ్యం చెంది ఉండటం వల్ల పనిని చేసేది నీవే నన్న భావముంది నీకు. కాని దేహంకాని, అది చేసే పనులు కాని నీ ఆత్మకు భిన్నం కావు. నీవు పనిపై శ్రద్ధ చూపితే నేమి, చూపక పోతేనేమి? నీవు నడుస్తూన్నప్పుడు, వేసే ప్రతి అడుగు మీదా శ్రద్ధ చూపవు. అయినా నడిచి గమ్యం చేరుతావు. నీ ప్రమేయం లేకుండా నడక ఎట్లా సాగుతుందో గమనించు. మిగిలిన పనులూ అంతే.

ప్ర: ఎప్పుడూ ఆత్మస్మృతి కలిగి ఉంటే, మనిషి చేసే పనులు ఎప్పుడూ సక్రమంగానే ఉంటాయా?

జ: ఉండాలి. అయినా, అటువంటి వ్యక్తి కార్యాల యొక్క తప్పొప్పులను గురించి పట్టించుకోడు. అతని చేతలన్నీ భగవంతునివే, అందువల్ల సక్రమమైనవే!

ప్ర: ఇతరుల కంటే నేను ఎక్కువగా మనస్సుని ఉపయోగించ వలసి వస్తూన్నప్పుడు, అది నిశ్చలమెట్లా అవుతుంది? హెడ్మాస్టర్ ఉద్యోగాన్ని విడిచి ఏకాంత ప్రదేశానికి వెళ్లాలని ఉంది నాకు.

జ: వద్దు. ఉన్నచోటనే ఉండి, చేస్తూన్న పనినే చేస్తూండు. మనసుకి జీవంపోసి దానితో పనిచేయించే అంతర్వాహిని ఏమిటి? అదే ఆత్మ. అంటే నీ వ్యాపకాలకు మూల మదేనన మాట. పని చేసేప్పుడు దాని ఎరుక కలిగి ఉండు. దానిని మరువకు అంటే. పని చేస్తూన్నప్పుడు కూడా నీవు ఆ చింతన కలిగి ఉండు, తొందరపడకు, సావధానంగా చేయి. ధ్యానం అభ్యసించు. దాని వల్ల మనస్సు నిశ్చలమవుతుంది, అంతేకాక, తనకి ఆలంబనమైన ఆత్మతో తన సంబంధాన్ని ఎరిగి ఉంటుంది. పని చేసేది నీవేనని ఊహించుకోకు. ఆ అంతర్వాహినే పని చేస్తోందనుకో. ఆ ప్రవాహంతో తాదాత్మ్యం చెందు. నీవు తొందర పడకుండా నిదానంగా చేస్తే నీ వృత్తి నీకే విధంగానూ అవరోధం కానవసరం లేదు.

ప్ర: ప్రారంభ దశలలో మనిషి ఏకాంతంగా ఉండి, ఇతర వ్యాపకాలను విడవటం మంచిది కాదా?

జ: సన్న్యాసం మనస్సుకి సంబంధించినది. అడవులకి వెళ్లటంగాని, ఏకాంత ప్రదేశాలకి వెళ్లటంకాని, విధులను విడవటంగాని కాదు. ముఖ్యమైన విషయమేమంటే మనస్సు బయటి విషయాల వెంట బడక, లోదృష్టి కలిగేట్టు చూసుకోవటం. అసలు, మనిషి ఇక్కడ ఉండాలా, ఇంకొక చోటికి వెళ్లాలా, విధులను నిర్వహించాలా, విడిచి పెట్టాలా - ఈ విషయాలేవీ అతని చేతుల్లో లేవు. ఇవన్నీ ప్రారబ్ధం ప్రకారం జరుగుతాయి. దేహం నిర్వహించ వలసిన కలాపాలన్నీ జీవి

పుట్టినప్పుడే నిర్ణీతమై పోయి ఉంటాయి. వాటిని ఆమోదించటం గాని, నిరాకరించటం గాని మనిషి చేతుల్లో లేదు. నీకున్న స్వేచ్ఛంతా ఒకటే - మనస్సుకి లోదృష్టి కల్పించి, అన్ని వ్యాపకాలనీ అక్కడ త్యజించటం.

ప్ర: ప్రారంభ దశలలో బయటి వ్యాపకాలేమీ ఉపయోగించవా - మొక్కకి కంచెవలె. అంటే, తీర్థయాత్రలు చేయటం, దేవాలయాలని దర్శించటం, సత్సంగం వంటి వ్యాపకాలన మాట. ఇవన్నీ ఉపయోగిస్తాయని శాస్త్రాలు చెప్తాయి కదా.

జ: అవి ఉపయోగించవని ఎవరన్నారు? అవన్నీ చేయటం నీ వశంలో లేదు. నీ చేతుల్లో ఉన్నదల్లా మనస్సుని అంతర్ముఖం చేయటమే. ఎందరికో తీర్థయాత్రలకి వెళ్లామనో, సత్సంగంలో పాల్గొందామనో ఉంటుంది. కాని వాళ్లందరికీ సాధ్యమవుతోందా?

ప్ర: అంతర్ముఖమవటం తప్ప మన చేతుల్లో ఇంకేమీ లేకపోవటానికి కారణమేమిటి?

జ: మూలానికే వెళ్లదలచుకుంటే. నీవెవరివో - స్వేచ్ఛ. బంధం ఎవరికున్నాయో తెలుసుకోవాలి. నీవెవరవు? పరిమితులతో ఉండే ఈ దేహం నీ కెట్లా వచ్చింది?

ప్ర: ఆత్మ విచారానికి ఏకాంతమవసరమా?

జ: ఏకాంతమెల్లెడలా ఉంది. వ్యక్తి ఎప్పుడూ ఒంటరివాడే. ఆ ఏకాంతాన్ని లోపలే కనుగొనాలి. బయట ఎక్కడో కాదు. అదే అతని పని. ఏకాంతం మనిషి మనస్సులో ఉంది. ఎన్నో వ్యాపకాలలో నిమగ్నమైనా, మనశ్శాంతితో ఉండవచ్చు. అటువంటి వాడు ఏకాంతంగా ఉన్నట్టే. మరొకడు, అడవిలో ఉన్నా, మనస్సుని నిగ్రహించుకోలేడు. ఏకాంతం మనస్సుకి సంబంధించినది. వాంఛలున్న వాడెప్పుడూ ఏకాంతంగా ఉండలేడు. విరాగి ఎప్పుడూ ఏకాంతంగానే ఉంటాడు.

ప్ర: అంటే, పనిలో నిమగ్నమైనా వాంఛలేకుండా ఉంటే ఏకాంతంగా ఉండవచ్చన మాట. అంతేనా?

జ: అవును. మమకారంతో చేసేపని, బంధం. మమకారం లేకుండా చేసేపని, ఆ కర్తని ఏ విధంగానూ ప్రభావితం చేయదు. అట్లా పని చేసేవాడు, పని చేస్తున్నా ఏకాంతంగానే ఉంటాడు.

ప్ర: నిత్య జీవితానికీ, అటువంటి యత్నాలకీ పొంతన కుదరదు.

జ: పనిని నీవు చేస్తున్నానని ఎందుకనుకుంటున్నావు? నీవిక్కడికి రావటమనే విషయాన్నే తీసుకో. ఇంటి దగ్గర్నుంచి బండిలో బయలుదేరావు, రైలు ఎక్కావు, ఆశ్రమానికి వచ్చావు. ఎవరైనా ఏం చేశావని అడిగితే, ఆ ఇంటి దగ్గర్నుంచి ఆశ్రమానికి ప్రయాణం చేశానంటావు. ఇది యదార్థమేనా? అసలు విషయమేమిటి - నీవు అట్లాగే ఉన్నావు, కాని చలనమంతా వాహనాలదే, అంతే కదా? ఆ కదలికలన్నీ నీవేనని ఎట్లా భ్రమపడుతావో, నీ వ్యాపకాలన్నీ నీవేనని కూడ భ్రమపడుతావు. అవి నీవి కావు. అవన్నీ భగవంతునివే!

ప్ర: నివృత్తి (ఏ వ్యాపకాలూ లేకుండా ఉండటం), మనశ్శాంతీ నిరంతరం కొనసాగుతూండే సాంసారిక విధుల మధ్య ఎట్లా సంభవిస్తాయి?

జ్ఞాని పని చేస్తున్నట్టు ఇతరులకే అనిపిస్తుంది. కాని అది ఎంత ఘనకార్యమైనా ఆయనకి అట్లా అనిపించదు. ఆయనేమీ చేయడు. అందువల్ల ఆ వ్యాపకాలేవీ ఆయన మనశ్శాంతిని భంగపరచవు. తాను ఏమీ చేయననీ, అన్నీ తన సమక్షాన మాత్రమే జరుగుతాయనీ జ్ఞానికి తెలుసు. అందువల్ల, జరిగే వాటన్నిటికీ మౌనసాక్షిగా నిలిచిపోతాడు.

ప్ర: లోదృష్టి కలిగించుకోవటం పాశ్చాత్యులకు ఇంకా కష్టమా?

జ: అవును. వాళ్లది రాజసిక ప్రవృత్తి. వారి శక్తి అంతా ఎప్పుడూ బయటకే ప్రసరి స్తుంది. మనం ఆత్మని మరువకుండా, లోపల ప్రశాంతంగా ఉండాలి, ఆ తరువాతనే బయటి వ్యాపకాలను చేసుకుంటూండవచ్చు. నాటకంలో స్త్రీ పాత్రని ధరించే పురుషుడెప్పుడైనా తాను మగవాడినన్న విషయాన్ని మరచిపోతాడా? అట్లాగే, జీవితమనే నాటకరంగంపైన మన పాత్రను నిర్వహించాలి. అంతేనేకాని, ఆ పాత్రతో తాదాత్మ్యం చెందకూడదు.

ప్ర: ఇతరులకి కల ఆధ్యాత్మిక తామసాన్ని పోగొట్టటమెట్లా?

జ: నీ తామసాన్ని పోగొట్టుకున్నావా? నీ మార్గాన్ని ఆత్మవైపు మళ్ళించు. నీలో ఉద్భవించే శక్తి ఇతరులపైన కూడ పని చేస్తుంది.

ప్ర: ఇంకొకని సమస్యలలో, కష్టాలలో ఎట్లా పాలుపంచుకోవటం?

జ: “ఇతరం” అనే ఈ మాటేమిటి? ఉన్నదల్లా ఒక్కటే - నేను, నీవు, అతడు - అంటూ ఏమీ లేదనీ, ఉన్నదల్లా ఒకే ఒక ఆత్మేననీ గ్రహించటానికి ప్రయత్నించు. అంతా ఒకటేనని గ్రహించటం వల్లనే ఎంతో ఉపకారివి కాగలుగుతావు - బయట చేసే పనులు వల్ల కన్నా.

ప్ర: బ్రహ్మచర్యాన్ని మీరు ఆమోదిస్తారా?

జ: బ్రహ్మంలో సంస్థితమై ఉండే వాడే నిజమైన బ్రహ్మచారి. అప్పుడు వాంఛ అంటూ ఏమీ ఉండదు.

ప్ర: శ్రీ అరవింద ఆశ్రమంలో నివసించే దంపతులు బ్రహ్మచర్యాన్ని అవలంబించాలని ఒక నియమముంది.

జ: దాని వల్ల ప్రయోజన మేమిటి? మనస్సులో ఆ వాంఛ ఉన్నప్పుడు బలవంతంగా వాళ్లని దూరంగా ఉండమనటం వల్ల ప్రయోజన మేమిటి?

ప్ర: అధ్యాత్మిక ప్రగతికి వివాహం అవరోధమా?

జ: గార్హస్య జీవితం అవరోధం కాదు - గృహస్థు మనో నిగ్రహాన్ని అలవరచుకోవాలి. ఆధ్యాత్మిక జీవితం పట్ల తీవ్రమైన తపన ఉన్నవానికి, కామనాంఛ తగ్గుతుంది. మనస్సు ధ్వంసమైతే, ఇతర వాంఛలన్నీ ధ్వంసమై పోతాయి.

ప్ర: నేను, లైంగిక అపచారం చేశాను.

జ: చేసినా అట్లా చేసాననుకుంటూ అనుకోకపోతే ఫరవాలేదు. ఆత్మకి అపచారమంటూ ఏమీ తెలియదు. లైంగిక పరిత్యాగం మనస్సుకి సంబంధించినది. కేవలం, శరీరానికే కాదు.

ప్ర: మా పొరుగున ఉండే ఒక యువతి అంగసౌష్టవానికి ఆకర్షితుడనై ఆమెతో అక్రమ సంబంధం పెట్టుకోవాలని అనిపిస్తుంది. నేనేమి చేయాలి?

జ: నీవు ఎప్పుడూ నిర్మలుడవే. నిన్ను ప్రలోభపరచేవి నీ దేహమూ, ఇంద్రియాలూను. వాటినే నీ నిజస్వరూపంగా భ్రమపడుతావు. కాబట్టి, ఎవరు ప్రలోభపడుతున్నారో, ఎవరు ప్రలోభింప చేస్తున్నరో గ్రహించు. ఒక వేళ అక్రమసంబంధ మేర్పరచుకున్నా, నీవెప్పుడూ నిర్మలుడవే, కనుక, దాని గురించి ఆలోచించకు, నీవు పాపివి కావు.

ప్ర: అసలు కామవాంచ సమూలంగా ఎట్లా రూపుమాపాలి?

జ: 'ఈ శరీరమే ఆత్మ' అనే భ్రమని రూపుమాపటం వల్లనే. ఆత్మకి లింగ భేదమంటూ ఏమీ లేదు. ఆత్మనిష్ఠుడవై ఉండు. నీకు లైంగిక సమస్యలుండవు.

ప్ర: ఉపవాసాలుండటం వల్ల కామవాంఛ పోతుందా?

జ: తాత్కాలికంగా పోతుంది. మానసిక ఉపవాసం కొంత ఉపయోగిస్తుంది. ఉపవాసముండటమే గమ్యం కాదు. దానితో బాటు ఆధ్యాత్మిక వికాసం కూడా ఉండాలి. పూర్తి ఉపవాసం మనస్సుని బలహీన పరుస్తుంది. ఉపవాసం చేస్తున్నంత కాలం, ఆధ్యాత్మిక అన్వేషణని కొనసాగిస్తేనే కాని ఆ ఉపవాసం వల్ల ఆధ్యాత్మిక ప్రయోజనముండదు.

ప్ర: ఉపవాసముండటం వల్ల ఆధ్యాత్మికంగా పురోగమించ వచ్చా?

జ: ఉపవాసం ప్రధానంగా మానసికంగా ఉండాలి. అంటే ఏ భావాలూ లేకుండా ఉండాలి. ఊరికే ఆహారం తీసుకోకుండా ఉండటం వల్ల ప్రయోజనం లేదు. దానివల్ల మనస్సు కూడ అస్తవ్యస్తమవవచ్చు. క్రమబద్ధంగా ఆహారం తీసుకోవటం. వల్ల ఆధ్యాత్మిక వికాసం క్రమేపీ కలుగుతుంది. ఒక నెలరోజులు ఉపవాస దీక్షలో ఉన్నప్పుడు ఆధ్యాత్మిక దృక్పథాన్ని నిలుపుకుంటే ఆ దీక్షని సవ్యంగా విరమించిన తర్వాత, క్రమబద్ధంగా ఆహారం తీసుకుంటే, ఒక పదిరోజులలో మనస్సు నిర్మల మవుతుంది- స్థిరమవుతుంది. అట్లాగే నిలిచిపోతుంది.

నేనిక్కడికి వచ్చినా కొత్తలో కళ్లు మూసుకొని ధ్యానంలో ఉండేవాడిని. అప్పుడు నాకు పగలూ, రాత్రీ కూడ అంతగా తెలిసేవికావు. నాకు నిద్రాహారాలుండేవి కావు. శరీరం కదిలితే, ఆహారం తీసుకుంటావు. ఆహారం తీసుకుంటే నిద్ర అవసరమవు తుంది. ఆ కదలిక లేకపోతే, నీకు నిద్ర కూడ అవసరం లేదు. ప్రాణం నిలవటానికి, కొద్ది పాటి ఆహారం చాలును. అది నా అనుభవం. నేను కళ్లు తెరిచినప్పుడల్లా, ఎవరో ఒకరు నాకొక గ్లాసుడు ద్రావకం ఇచ్చేవారు. నేను తీసుకన్న ఆహారమదే. అయితే ఒక విషయం గుర్తుంచుకో మనస్సు పరిపూర్ణంగా నిశ్చలమైతే తప్ప, నిద్రాహారాలను పూర్తిగా విడవడటమసాధ్యం. శరీరమూ, మనస్సూ నిత్యకృత్యాలలో నిమగ్న మయినప్పుడు- నిద్రాహారాలు లేకపోతే, ఒళ్లు తిరుగుతుంది.

సాధకుడెంత తినాలి? ఎంత సేపు నిద్రపోవాలి? అనే అంశాలపై ఏవేవో సిద్ధాంతాలున్నాయి. రాత్రి పదిగంటలకు పడుక్కొని, తెల్లవారు జామున రెండుగంటలకే నిద్రలేవటం మంచిదని కొందరంటారు. అంటే, నాలుగు గంటల నిద్రచాలని అర్థం. కొందరు నాలుగు గంటలు చాలునంటే, మరికొందరు ఆరు గంటలంటారు. నిద్రాహారాలు అతిగా ఉండకూడదన్నదే దీని అర్థం. వాటిని పూర్తిగా వదిలేద్దామనుకున్నా వంటే, నీ మనసెప్పుడూ వాటిపైనే ఉంటుంది. కాబట్టి సాధకుడెవుడూ అన్నిటిలోనూ మితంగానే ఉండాలి.

రోజుకి మూడు నాలుగు సార్లు తినటంలో తప్పులేదు. ఎటొచ్చీ, "నాకిదేకావాలి, నాకది రుచించదు" అని మాత్రం అనవద్దు. అయినా, రోజులో పన్నెండు గంటలలోనే ఈ ఆహారం తీసుకోవటమనేది జరుగుతుంది. నిద్రపోయే పన్నెండు గంటలలోనూ ఏమీ తీసుకోవు. నిద్ర ముక్తికి దారి తీస్తుందా? ఏపనీ చేయకుండా ఉంటే, ముక్తి కలుగుతుందను కోవటం పొరపాటు.

ప్ర: ఆహారం మాటేమిటి?

జ: ఆహారానికి మనస్సు మీద ప్రభావముంది. ఏ యోగాభ్యాసానికైనా శాకాహార ముత్తమం. అది మనస్సుని ఇంకా సాత్త్వికం చేస్తుంది. (అంటే నిర్మలంగా పొందికగా ఉండేట్టు)

ప్ర: మాంసాహారం ఆధ్యాత్మిక జ్ఞానానికి అడ్డంకా?

జ: జ్ఞానం పొందవచ్చు. కాని క్రమంగా మాంసాహారాన్ని విడిచి సాత్త్వికాహారాన్ని అలవరచుకోవాలి. ఆ జ్ఞానోదయమైన తరువాత నీవు ఏమి తింటున్నావో అంత ప్రధానం కాదు. పెద్ద మంట రేగుతున్నప్పుడు దాంట్లో ఎటువంటి ఇంధనం వేసినా ఒకటే.

ప్ర: యూరోపియన్ల మయిన మేము ఒక రకపు ఆహారానికి అలవడ్డాము. దానిలో మార్పు వస్తే మా ఆరోగ్యం దెబ్బతింటుంది. మనస్సు నీరసిస్తుంది. దేహారోగ్యం నిలుపుకో నవసరం లేదా?

అవసరమే. దేహం బలహీనమయిన కొద్దీ మనస్సు పటిష్ఠ మవుతూంటుంది.

ప్ర: మామూలు ఆహారం లేకపోవటం వల్ల ఆరోగ్యం క్షీణిస్తుంది. మనసు శక్తిని కోల్పోతుంది.

జ: మనస్సు యొక్క శక్తి అంటే ఏమిటి నీ ఉద్దేశం?

ప్ర: ప్రాపంచక విషయాల పట్ల ఉండే మమకారాన్ని తొలగించే శక్తి.

జ: ఆహారాన్ని బట్టి మనస్సుంటుంది. తీసుకునే ఆహారం మీదే మనస్సు ఆధారపడుతుంది.

ప్ర: అట్లాగా? అటువంటప్పుడు సాత్త్వికాహారాన్నే యూరోపియన్లు ఎట్లా అలవరచుకో గలుగుతారు?

జ: అలవాటన్నది పరిసరాలకి సర్దుకోవటమే. ప్రధానమైనది మనస్సే. అసలు విషయమిది: కొన్ని ఆహార పదార్థాలే రుచిగా ఉంటాయనీ మంచివనీ మనస్సుకి తర్ఫీదవుతుంది. శాకాహారమూ, మాంసాహారమూ కూడా పుష్టినిస్తాయి ఒకే విధంగా. కాని మనస్సు ఏ ఆహారానికి అలవడిందో, రుచిగా ఉంటుందను కుంటుందో దానినే కోరుకుంటుంది.

ప్ర: ఆత్మసాక్షాత్కారం పొందిన వానికి ఆహార నియమాలున్నాయా?

జ: లేవు. అతను తీసుకునే ఆహారం వల్ల ప్రభావితుడు కాడు. అతను స్థిరంగా ఉంటాడు.

ప్ర: మాంసాహారాన్ని తయారు చేయటమంటే జంతుహింసే కదా?

జ: యోగులకు నిర్దేశింపబడిన నియమావళిలో అహింస అతి ముఖ్యమైనది.

ప్ర: మొక్కలకి కూడ ప్రాణముంటుంది -

జ: నీవు కూర్చున్న నాపరాళ్లకీ ఉంది -

ప్ర: మేము క్రమేపీ శాకాహారాన్ని అలవరచుకో గలుగుతామా?

జ: ఆః! అదే పద్ధతి.

ప్ర: పొగతాగటం విడువక పోతే తప్పులేదు కదా

జ: తప్పు లేకపోవటమేం? పొగాకు విషపదార్థం. అది లేకుండా ఉండటమే ఉత్తమం. నీవు పొగత్రాగటం నిలిపి వేశావు- మంచిది. మనుష్యులు పొగాకుకు వశుల వుతారు, విడువలేరు. పొగాకు తాత్కాలికంగా ఉత్తేజం కలిగిస్తుంది. ఆ తరువాత ఇంకా కావాలనిపిస్తుంది. అది ధ్యానానికి హానికరం.

ప్ర: మాంసాహారమూ, మద్యపానమూ విడవాలంటారా?

జ: ప్రారంభ దశలలో ఉన్నవారు వాటిని విడవటం మంచిది. వాటిని విడవటం అంత కష్టమూ కాదు. అవి అవసరాలు కావు. ఎటొచ్చీ, అలవాటు వల్ల, సంప్రదాయం వల్లా వాటికి వశులై విడవటం కష్టమనిపిస్తుంది.

ప్ర: సాధకుడు సాధారణంగా పాటించవలసిన నియమాలేమిటి ఆహారం, నిద్ర, సంభాషణ విషయాలలో?

జ: నిద్రాహారాలలో, మాట్లాడటంలో మితంగా ఉండాలి.

# 13.యోగము

"యోగ" మన్న సంస్కృత పదానికి అర్థం "కలయిక', యోగాభ్యాసాన్ని చేసే వారి లక్ష్యం ఆత్మతో ఏకమవటం. దానికై వారు కొన్ని ప్రత్యేకమైన శారీరక, మానసిక అభ్యాసాలను చేస్తారు. ఈ అభ్యాసాలన్నిటికీ మూలం 2000 సంవత్సరాల క్రితం రచింపబడిన పతంజలి యోగసూత్రాలు. పతంజలి పద్ధతిని రాజయోగమంటారు. అందులో, నిర్దిష్టమైన ఎనిమిది స్థాయిలూ, అభ్యాసాలూ ఉన్నాయి. అవి ఇవి:-

1. యమ - ఇతరులతో వ్యవహరించే వర్తనం, అసత్యం, దొంగతనం, పరహింస, కామం, దురాశ వీటిని వర్జించటం.

2. నియమం - తన పట్ల వర్తనం- శౌచ్యం, ప్రశాంతత, తపస్సు, అధ్యయనం, భక్తి.

3. ఆసనం చాచటం, వంగటం, సమతలంగా ఉండటం, కూర్చోవటం వంటి, దేహసంబంధమైన అభ్యాసాలు. ఈ అభ్యాలనన్నిటినీ కలిపి హఠయోగమంటున్నారిప్పుడు.

4. ప్రాణాయామం - ఉచ్ఛ్వాసనిశ్వాసలకి సంబంధించిన అభ్యాసాలు. వీటి లక్ష్యం మనో నిగ్రహం.

5. ప్రత్యాహారం-దేహంపైనా, ఇంద్రియాలపైనా ఉండే ధ్యాసని ఉపసంహరించటం.

6. ధారణ - మనస్సుకి ఏకాగ్రత.

7. ధ్యాన - ధ్యానం

8. సమాధి - సత్యం గురించి అవిచ్ఛిన్నమైన చింతన

ఇటువంటి అభ్యాసాలు చాలా మట్టుకు ఇతర ఆధ్యాత్మిక పద్ధతులలో కూడా ఉన్నాయి, ఉండని వల్లా - హఠయోగము, ప్రాణాయామమూను. ఇవే రాజయోగానికి విశిష్టతనిచ్చాయి.

ఈ అభ్యాసాల గురించి ఎవరైనా అడిగితే, శ్రీరమణులు హఠయోగాన్ని విమర్శించేవారు - అది ఎంతసేపూ దేహానికే సంబంధించినది కాబట్టి. ఆధ్యాత్మిక సమస్యలకి పరిష్కారం మనో నిగ్రహం వల్లనే సాధ్యమని వారి బోధనలలో మౌలికమైన అంశం. అందుచేత దేహం యొక్క మంచికే ప్రాధాన్యమిచ్చే ఏ ఆధ్యాత్మిక అభ్యాసాలనూ ప్రోత్సహించేవారు కారు. కానీ, ప్రాణాయామమంటే వారికి కొంచెం మంచి అభిప్రాయముండేది. ఇతర పద్ధతుల వల్ల మనోనిగ్రహాన్ని సాధించలేని వారికది మంచి సాధనమనే వారు. అయినా ఇది కూడా ప్రారంభ దశలలో ఉన్న సాధకులకే. రాజయోగంలోని ఇతర అంశాలైన నియమం, ధ్యానం, సమాధి - గురించిన చర్చ ఇతర అధ్యాయాలలో ఉంది.

రాజయోగంతోబాటు బహుళ ప్రచారంలో ఉన్నది కుండలిని యోగం. ఈ పద్ధతినవలింబించే వారు, దేహంలోని కొన్ని చక్రాలపై కేంద్రీకరించి, తద్వారా కుండలిని శక్తిని సుషుమ్న నాడి ద్వారా పైకి తీసుకొని వెళ్తారు. ఈ శక్తి మెదడులో నుండే సహస్రార చక్రాన్ని చేరుకుంటే, ఆత్మ సాక్షాత్కారం లభిస్తుందని వారి నమ్మకం.

శ్రీ రమణులు తమ భక్తులను, కుండలినీ యోగాభ్యాసం చేయవద్దనేవారు అది ప్రమాదభరితమూ, అనవసరమూ కూడా. చక్రాలూ, కుండలినీ ఉన్నాయని అంగీకరించినా, కుండలిని సహస్రార చక్రాన్ని చేరినంత మాత్రాన సాక్షాత్కారం కలుగదనే వారు.

అంతిమ సాక్షాత్కారానికి, కుండలిని సహస్రారని దాటి అమృతనాడి (పరానాడి, లేక జీవనాడి) ద్వారా ఛాతీలో కుడి వైపున ఉండే హృదయంలోకి దిగాలనేవారు.

ఆత్మవిచారం వల్ల కుండలిని తనంతట తానే హృదయంలోకి వెళ్తుంది కాబట్టి వేరే యోగాభ్యాసాలు అనవసరమని బోధించేవారు.

"అహంకారం యొక్క మూలాన్ని అన్వేషిస్తూ, హృదయంలో నిమజ్జనమవటం వల్ల ఆత్మ అందుతుంది. ఆత్మసాక్షాత్కారానికి ఇది ప్రత్యక్షమైన మార్గం. దీని నభ్యసించిన వారు వేటిగురించి, (అంటే - నాడులూ, సహస్రార, సుషుమ్న, పరనాడి, కుండలిని, ప్రాణాయామం, షట్చక్రాలు గురించీ) ఆలోచించనక్కర్లేదు"

పైన ఉదహరించిన అభ్యాసాలకి తోడు భారతీయ సంప్రదాయంలో కర్మయోగమని కూడ ఒకటుంది - అంటే కార్యాచరణ మనమాట. దీనినవలంబించేవారు, నిస్స్వార్థసేవ ద్వారా ఆధ్యాత్మిక పురోగతిని అభిలషిస్తారు. దీని గురించి భగవద్గీతలో ఎంతో గొప్పగా చెప్పబడి ఉంది. అయినా, ఈ పద్ధతిలో సత్కార్యాలను చేసే "నేను" ఒకడు, అటువంటి సహాయమవసరమైన "ఇతరులు" ఇమిడి ఉండటం వల్ల తన భక్తులు ఈ పద్ధతిని అభ్యసించటాన్ని నిరుత్సాహపరిచే వారు శ్రీరమణులు. జ్ఞాన, భక్తి, రాజయోగ మార్గాలను అనుసరించటం అసాధ్యమనిపించే కొందరికి మాత్రం, ఈ పద్ధతిని అనుసరించమని చెప్పేవారు.

"ప్రవృత్తి రీత్యా ఏ సాధకుడైనా జ్ఞాన, భక్తి మార్గాలకు సరిపడని వాడైనా, వయస్సు రీత్యా యోగాభ్యాసానికి సరిపడని వాడైనా, అతను కర్మమార్గాన్ని అవలంబించాలి. అతని ధర్మ బుద్ధి ఇంకా ప్రస్ఫుటమవుతుంది. అతనికి వైయక్తికం కాని సంతుష్టి కలుగుతుంది. అంతేకాక, మొదటి మూడు మార్గాలలో ఏదో ఒక దానికి కాలక్రమేణ అర్హుడు కూడ అవుతాడు." కృతార్థుడవాలంటే, కర్మయోగి తాను ఇతరులకు సహాయపడుతున్నానన్న భావం లేకుండా ఉండాలి. తన చర్యలకి ఫలితాల పట్ల అనాసక్తుడై, విరక్తుడై ఉండాలనే వారు శ్రీ రమణులు. కర్మమార్గానికి ఆయన ఎక్కువ ప్రాధాన్యమీయక పోయినా, కర్తృత్వభావం లేకుండా పని చేస్తే పైన చెప్పిన రెండు నియమాలూ పాటించినట్టే.

ప్ర: యోగమంటే కలయిక. ఏది, దేనితో కలవటం?

జ: నిజమే, యోగమంటే, ఆరంభంలో విభజన, తరువాత రెంటి కలయికా, అయితే ఎవరు, ఎవరితో కలవాలి? నీవు అన్వేషకుడివి - దేనితోనో కలయికని అన్వేషిస్తున్నావు. అంటే, నీవు దేనిని కలవాలనుకుంటున్నావో అది నీకన్నా వేరనమాటే కదా. కాని, నీ ఆత్మ నీ కత్యంత సన్నిహితం. దాని గురించి నీకు ఎప్పుడూ ఎరుక ఉంటూనే ఉంటుంది. దానిని అన్వేషించు, ఆత్మగానే ఉండు. అప్పుడది అనంతంగా విస్తరిస్తుంది. అప్పుడు, యోగం ప్రసక్తే రాదు. వియోగ మెవరిది?

ప్ర: నాకు తెలియదది. అయినా, వినియోగముందా అసలు?

జ: వియోగమెవరికో తెలుసుకో. అదే యోగం. అన్ని మార్గాలకూ యోగం సామాన్యం. నీవు ఆత్మకంటే, సత్యం కంటే వేరు కాదని అనుకోవటమే యోగం. అంతకన్నా మరేమీ కాదు. కర్మ, జ్ఞాన, భక్తి, రాజయోగాలు అన్నీ వివిధ ప్రకృతులకి,

వికాసదశలకీ సరిపడే పద్ధతులే! అన్నీ తాను ఆత్మకన్నా భిన్నమంటూ అనాదిగా వస్తున్న భావాన్ని తొలగించటానికే. మనకి దూరంగా, ఎక్కడో ఉన్నదానితో కల యిక అంటూ ఏమీ లేదు - నీ వెప్పుడూ ఆత్మనుంచి వేరు కానే కావు కదా!

ప్ర: యోగానికీ, విచారణకీ తేడా ఏమిటి?

జ: యోగం, చిత్తవృత్తి నిరోధాన్ని (ఆలోచనలను అణచివేయటాన్ని) అభ్యసించ మంటుంది. నేను, ఆత్మాన్వేషణ చేయమంటాను. ఈ రెండవ పద్ధతిని తేలికగా, అనుసరించవచ్చు.. మైకం కమ్మినా, ఉపవాసం చేసినా - మనస్సు అణగిపోతుంది. కాని, ఆ కారణం తొలగిన తరువాత ఆలోచనలు ఎప్పటివలె ప్రవహిస్తాయి. మనో నిగ్రహానికి రెండే పద్ధతులున్నాయి. ఒకటి, మనస్సు యొక్క మూలాన్ని అన్వేషించటం, లేదా దానిని అణచి వేసే, ఈశ్వరార్పణం చేయటం, అర్పణం అంటే, మనపై ఆధిపత్యం కల ఒక శక్తి ఉన్నదని ఒప్పుకోవటమన మాట. మూలాన్ని కనుక్కోవటానికి మనస్సు సహకరించిక పోతే, దానిని బయటకి వెళ్లనీ, తిరిగి వచ్చాక లోపలికి పంపించు. ఓర్పుతో కృషి చేయకపోతే, ఎవ్వరూ కృతార్థులు కాలేరు.

ప్ర: ప్రాణాయామ మవసరమా?

జ: తనలోనికి తాను వెళ్లటానికి ప్రాణాయామం ఒక సాధన మాత్రమే. మనోనిగ్రహం వల్ల కూడ ఆ పనిని చేయవచ్చు కదా. మనో నిగ్రహం కలిగితే, శ్వాసకూడ దానంతటదే అదుపులోకి వచ్చేస్తుంది. శ్వాసని అదుపులోకి తీసుకురావటానికి వేరే ప్రయత్నమేమీ చేయనక్కరలేదు - మనో నిగ్రహం చాలు. నేరుగా మనస్సుని అదుపులోకి తెచ్చుకోలేని వారి కోసమే ప్రాణాయామం.

ప్ర: ప్రాణాయామమెప్పుడు చేయాలి. అది అంత సత్ఫలితాన్నివ్వటానికి కారణమేమిటి?

జ: ఆత్మ విచారంగాని, భక్తి గాని లేనప్పుడు, సహజంగానే ఉపశమనాన్ని కలిగించే, ప్రాణాయామాన్ని ప్రయత్నించ వచ్చు. దీనినే యోగ మార్గమంటారు. ప్రాణానికి అపాయం వాటిల్లితే, ఉన్న ఆసక్తి అంతా ఆ ప్రాణ రక్షణ మీదనే కేంద్రీకృత మవుతుంది. శ్వాసని బంధిస్తే మనస్సు తన ఇష్టం వచ్చినట్లు ఆడలేదు - అంటే, బయటి విషయాలవైపు పోలేదు. శ్వాస బంధించినంత సేపూ, ఆ విధంగా మనస్సుకి విశ్రాంతి దొరుకుతుంది. శ్వాసపైన అవధానముండటం వల్ల, ఇతర విషయాల మీదకి మనస్సు వెళ్లదు. ప్రాణానికీ, మనస్సుకీ మూలం ఒకటే. అందువల్ల ఒకటి అణగితే, రెండవది కూడ ఏ ప్రయత్నమూ అక్కరలేకుండా అణగుతుంది.

ప్ర: శరీరంలో వివిధ చక్రాలపై ఏకాగ్రత కలిగి ఉండటం వల్ల, మనస్సు నెమ్మదిగా అవుతుందా?

జ: సహస్రార వంటి చక్రాలపై మనస్సుని నిలిపి శరీరధ్యాసే లేకుండా యోగులు ఎంతసేపో ఉండగలరు. ఈ స్థితి ఉన్నంత సేపూ వాళ్లెంతో ఆనంద పారవశ్యంలో ఉన్నట్టు కనబడుతారు. కాని మామూలు స్థితి వచ్చినప్పుడు, అంతవరకూ ప్రశాంతంగా ఉన్న మనస్సు తన ప్రాపంచక ఆలోచనలను తిరిగి ప్రారంభిస్తుంది. అందువల్ల, మనస్సు బయటి విషయాలపై వెళ్లకుండా ఉండటానికి ధ్యానం వంటి అభ్యాసాలతో దానిని ఒక మార్గంలో పెట్టాలి. ఆ తరువాత, విజృంభణగాని, అణగిపోవటం గాని లేని స్థితిని అది చేరుకుంటుంది.

ప్ర: ప్రాణాయామం వల్ల కలిగే మనోనిగ్రహం తాత్కాలికమేనా?

జ: శ్వాసని నిగ్రహించినంత వరకే మానసిక నిశ్చలత నిలుస్తుంది. ప్రాణాయామమే గమ్యం కాదు. అది ప్రత్యాహారానికీ, ధారణకీ, ధ్యానానికీ, సమాధికీ విస్తరి స్తుంది. ఆయా అవస్థలన్నీ మనోనిగ్రహానికి సంబంధించినవే. అంతకు పూర్వమే, ప్రాణాయామాన్ని అభ్యసించిన వారికి మనోనిగ్రహం తేలిక అవుతుంది. అందువల్ల ప్రాణాయామం ఆ ఉన్నత స్థాయిలకు దారి చూపుతుంది. ఈ ఉన్నత స్థాయిలన్నీ మనో నిగ్రహాన్ని కలిగిస్తాయి కాబట్టి, యోగాభ్యాసం యొక్క లక్ష్యం

మనోనిగ్రహమనే అనవచ్చు. బాగా పురోగమించిన వాళ్లు, ఈ ప్రాణాయామంతో కాలం వృథా పుచ్చకుండా, నేరుగా మనో నిగ్రహానికే వెళ్తారు.

ప్ర: ప్రాణాయామంలో మూడు దశలున్నాయి రేచకం (గాలిని విడవటం), పూరకం (గాలిని పీల్చటం), కుంభకం (గాలిని బంధించటం) - వీటి నెట్లా చేయాలి?

జ: శరీరంతో తాదాత్మ్యాన్ని పూర్తిగా విడవటమే రేచకం, 'నేనెవరిని' అనే విచారణలో అంతర్లీన మవటమే పూరకం, "తత్త్వమసి" అని సంస్థితమవటమే కుంభకం. అసలైన ప్రాణాయామమిదే.

ప్ర: ధ్యానం చేసేప్పుడు మొదట్లో ఉచ్ఛ్వాసనిశ్శ్వాసల వల్ల కొంత మనోనిశ్చలత కలుగుతుంది. ఆ తరువాత హృదయంలోకి దిగి, మనస్సు యొక్క మూలాన్ని అన్వేషించ వచ్చునని “మహాయోగం"లో చదివాను. ఈ పద్ధతి సరైనదేనా? నేను ఆచరించవచ్చా?

జ: ఎట్లాగైనా మనస్సుని విధ్వంసం చేయాలి. ఆత్మవిచారం చేసుకునే సామర్థ్యం లేని వారిని ప్రాణాయామ మభ్యసించ మంటాం. దీని వల్ల మనోనిగ్రహం కలుగుతుంది. ప్రాణాయామం రెండు విధాలు - ఒకటి ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలని నియంత్రించటం, రెండవది, శ్వాసని గమనిస్తూండటం.

ప్ర: శ్వాసని నియంత్రించటానికి 1:4:2 అనే నిష్పత్తి (అంటే గాలిని పీల్చటానికీ, ఊపిరి నిలబెట్టటానికీ, గాలిని విడవటానికీ) ఉత్తమం కాదా?

జ: లెక్క పెట్టు కుంటూనో, మంత్రాలను చెప్పుకుంటూనో పాటించే ఈ నిష్పత్తులన్నీ మనస్సుని నిగ్రహించటానికి సాధనలే. అంతకన్నా మరేమీ కాదు. ఊపిరిని గమనించటం కూడ ఒక రకమైన ప్రాణాయామమే. గాలి పీలవటం, నిలపటం, విడవటం - కొంచెముగ్రమైన అభ్యాసం. ఒకోసారి హాని కూడా జరుగవచ్చు - సాధకునికి సరియైన మార్గాన్ని అడుగడుగునా గురువు చూపాలి. కాని ఊపిరిని ఊరికే గమనించటంలో ఏ విధమైన ప్రమాదమూ లేదు.

ప్ర: కుండలిని శక్తి ప్రత్యేకమైన యోగాభ్యాసం చేసే వారికే లభిస్తుందా లేక, భక్తి, ప్రేమ మార్గాలను అనుసరించే వారికి కూడానా?

జ: కుండలిని శక్తి లేనిదెవరికి? ఆ శక్తి యొక్క నిజస్వరూపం తెలిస్తే దానిని అఖండాకారవృత్తి (అంటే, పూర్ణ చైతన్యం) లేదా అహంస్ఫురణ (ఆత్మ యొక్క ప్రకాశం) అంటారు. ఏ మార్గాన్ని అవలంబించే వారికైనా కుండలిని శక్తి ఉంది. పేరులో మాత్రమే భేదం.

ప్ర: శక్తి అయిదు దశలలోనో, పది దశలలోనో, వంద దశలలోనో, వెయ్యి దశలలోనో అభివ్యక్త మవుతుందంటారు. వీటిలో ఏది సరియైనది?

జ: శక్తికి ఒకే ఒక దశ ఉంది. ఎన్నో దశలలో కనబడుతుందనటం ఒక చమత్కారం మాత్రమే, శక్తి ఒక్కటే!

ప్ర: తన మార్గాన్ని అనుసరించే వారికే కాక, యోగం వంటి ఇతర మార్గాలని అనసరించే వారికి కూడ, జ్ఞాని తోడ్పడ గలడా?

జ: నిస్సందేహంగా. ఏ మార్గాన్ని ఎంచుకున్న వారికైనా తోడ్పడగలడు. ఇట్లా ఉంటుంది. ఒక కొండ ఉందనుకో. దానినెక్కటానికి ఎన్నో బాటలుంటాయి. తాను వచ్చిన దారినే ఎక్కమంటే కొందరికి నచ్చవచ్చు. కొందరికి నచ్చకపోవచ్చు. నచ్చని వాళ్లు కూడ తన బాటనే అనుసరించాలని పట్టుబడితే వాళ్లు ఎక్కలేక పోవచ్చు కూడా. అందుచేత, ఎవరు ఏ మార్గాన్ని అనుసరించినా జ్ఞాని వారికి సహాయపడుతాడు. దారి మధ్యలో ఉన్నవారికి, ఇతర

బాటల బాగోగులు తెలియక పోవచ్చు. కానీ, శిఖరాన్ని చేరి అక్కడ నుంచి గమనించే వానికి అన్ని బాటలూ కనబడుతాయి. అందువల్లనే అతను, కొండనెక్కుతున్న వారిని "అటు జరుగ" మనో, "అక్కడ గొయ్యి ఉంది జాగ్రత్త"నో సూచన లివ్వగలుగుతాడు. అందరికీ, గమ్య మొక్కటే!

ప్ర: శ్రీ రమణగీతలో చెప్పినట్టు చిత్-జడ-గ్రంథిని (చైతన్యాన్ని దేహంతో తాదాత్మ్యం చేసేది) ఛేదించటానికి ప్రాణాన్ని, సుషుమ్నలోకి ఎట్లా మరల్చటం?

జ: "ఎవరిని నేను" అనే విచారణ వల్ల. కుండలిని లేపి సుషన్నులోకి పంపాలని యోగి చూస్తాడు. జ్ఞానికి ఈ ఉద్దేశ ముండదు. అయినా ఇద్దరూ ప్రాణాన్ని సుషుమ్నలోకి పంపి, చిత్ - జడ - గ్రంధిని ఛేదించ గలుగుతారు. ఆత్మకి గాని, శక్తికిగాని కుండలిని మరొక పేరు అంతే.

మనమీ శరీరానికే పరిమితులమన్న భావముండటం వల్ల అది శరీరంలోపలే ఉందంటూంటాం. నిజానికి, అది లోపలా, బయటా కూడా ఉంది. అది ఆత్మకి, ఆత్మశక్తికి భిన్నం కాదు.

ప్ర: కుండలిని సుషుమ్న ద్వారా పైకి ఎక్కేట్టు చేయటానికి చక్రాలని ఎట్లా మధించాలి?

జ: దీనికి ప్రాణాయామాన్ని ఉపయోగిస్తాడు, యోగి. జ్ఞానికి గల మార్గం, అన్వేషణే. ఈ పద్ధతి వల్ల ఆ మనస్సు ఆత్మలో లీనమైనప్పుడు కుండలిని, లేక శక్తి తనంతట తానే లేస్తుంది. అది ఆత్మకి భిన్నం కాదు కదా!

కుండలిని సహస్రారలోకి పంపటానికి యోగులు ఎంతో ప్రాధాన్యమిస్తారు. ప్రాణం శరీరంలోకి ఊర్ధ్వభాగం ద్వారా చొచ్చుకుంటుందని శాస్త్ర వాక్యం. దానిననుసరించి వియోగం అట్లాగే ఏర్పడిందనీ, యోగాన్ని (కలయికని) సాధించాలంటే దానికి వ్యతిరేక మార్గం కావాలనీ అంటారు. అందువల్ల, యోగాభ్యాసం వల్ల ప్రాణాలనన్నిటినీ కూడగట్టుకొని యోగసిద్ధికి ఊర్ధ్వభాగానికి రావాలంటారు. ఇక, జ్ఞాని చెప్పేది ఇది; యోగి దృష్టిలో దేహం ఆత్మకి భిన్నం. ఈ విభేదాన్ని ఒప్పుకుంటే, సంయోగానికి యోగాభ్యాస మవసరమంటాడు యోగి.

నిజానికి, దేహం మనస్సులో ఉంది - దానికి స్థావరం మెదడు. మెదడు పనిచేయటం కూడ ఇంకెక్కడి నుంచో వచ్చే రశ్మి వల్లనే నని యోగులు కూడ ఒప్పుకుంటారు. జ్ఞాని ఏమంటాడంటే, "ఆ రశ్మి ఏదో ఒక మూలాన్నుంచే వచ్చి యుండాలి, కాబట్టి, ఆ మూలానికే నేరుగా వెళ్లాలి, వేరే ప్రదేశాలకి కాదు. ఆ మూలమే హృదయం, ఆత్మ" అని. ఆత్మ బయట ఎక్కడనుంచో వచ్చి దేహంలో ఊర్ధ్వభాగం ద్వారా చొరబడదు. అది ఎల్లప్పుడూ కాంతివంతమే, స్థిరమే, నిశ్చలమే, దానికెప్పుడూ పరివర్తనమంటూ లేదు. ఏ మార్పూ ఉండని ఆత్మనుండే ఉదయించే శరీరానికీ, మనస్సుకీ మనిషి తనని తాను పరిమితం చేసుకుంటాడు. కాని, ఈ రెంటికీ మార్పు ఎప్పుడూ ఉంటుంది. ఈ తప్పు తాదాత్మ్యాన్ని వదులు కోవాలి. అది జరిగితే ద్వైతమంటూ లేని సత్యం, ప్రకాశమానమైన ఆత్మ గోచరిస్తుంది.

సహస్రార మీద ఏకాగ్రత పెట్టుకుంటే తప్పకుండా సమాధి వస్తుంది. అయినా, వాసనలు ధ్వంసం కావు. అందువల్లనే, యోగి ఆ సమాధినుండి మేల్కొని తీరుతాడు. అతనికి బంధాలనుండి విముక్తి లభించలేదు కనుక! సమాధి అవస్థలోని ప్రశాంతతని భంగపరచు కోకుండా ఉండటానికి అతను తన వాసనల ను తుడిచి పెట్టేసుకోవాలి. అందువల్ల అతను సహస్రార నుండి జీవనాడి ద్వారా హృదయంలోకి వెళ్తాడు. అంటే సుషుమ్నకి ఒక వంపు ఉందనమాట. మూలాధార చక్రం వద్ద ప్రారంభమై, సుషుమ్న ద్వారా, సహస్రార వరకూ ప్రాకి అక్కడ ఒక వంపు తిరిగి హృదయంలోకి దిగుతుంది. ఈ హృదయాన్ని యోగి చేరుకోగానే, సమాధి పూర్తవుతుంది. అంతే, ఆఖరి చక్రం- హృదయమన మాట.

ప్ర: హఠయోగాభ్యాసాల వల్ల జబ్బులు కుదురుతాయనీ, అందువల్ల జ్ఞానయోగాన్ని ప్రారంభించేముందు ఆ అభ్యాసాలని చేయాలనీ అంటారు...

జ: అట్లా అనే వాళ్లని చేసుకోనీ, మా అనుభవం అది కాదు. నిరంతరం ఆత్మవిచారం చేస్తూంటే అన్ని జబ్బులూ మాడి పోతాయి. శారీరక ఆరోగ్యముంటేనే గాని, మానసిక ఆరోగ్యం ఉండదనే భావంతో ప్రారంభిస్తే, దేహంపై తీసుకోవలసిన శ్రద్ధకి అంతే ఉండదు.

ప్ర: ఆత్మ విచారానికి హఠయోగ మక్కరలేదా?

జ: ఎవరికి అనువైన మార్గాన్ని వారే ఎంచుకుంటారు, వాళ్ల పూర్వ సంస్కారాల వల్ల.

ప్ర: నా వయస్సులో హఠయోగం చేయవచ్చా.

జ: దాని గురించి అంత ఆలోచన ఎందుకు? ఆత్మ నీకు బయట ఎక్కడో ఉందనుకోవటం వల్లనే ఈ కోరికా, ఈ ప్రయత్నమూను. కాని నీవుండనే ఉన్నావు కదా? నిన్ను నీవు విడిచిపెట్టి ఎక్కడో బయట ఉన్నదాని కోసం ప్రాకులాడటం ఎందుకు?

ప్ర: ఆత్మవిచారానికి, హఠయోగమొక సాధన అని "అపరోక్ష అనుభూతి"లో ఉంది.

జ: శరీరాన్ని దృఢంగా ఉంచుకోవటం వల్ల ఆత్మవిచారం ఏ అంతరాయమూ లేకుండా కొనసాగించ వచ్చని హఠయోగు లంటారు. అంతేకాక, ఈ విచారం సఫలవంతంగా సమాప్తం కావటానికి వీలుగా ఆయుర్దాయాన్ని కూడా పొడిగించవచ్చని అంటారు. కొందరు కాయకల్పచికిత్సని కూడ ఈ ఉద్దేశంతోనే చేసుకుంటారు. దీనికి వాళ్లు చెప్పే ఉపమాన మిది: చిత్రం బాగుండాలంటే నేపథ్యం శుభ్రంగా ఉండాలని. నిజమే - కాని చిత్రమేమిటి? నేపథ్యమేమిటి? వాళ్ల ఉద్దేశంలో, శరీరం నేపథ్యం, విచారణ - చిత్రం. కాని, శరీరమే ఆత్మ అనే నేపథ్యంపై చిత్రం కాదా?

ప్ర: కాని, హఠయోగం గొప్ప సాధనమని అంటారే?

జ: నిజమే, వేదాంత పండితులు కూడా దానిని అభ్యసిస్తారు. లేకపోతే, వారి మనస్సు అణగి ఉండదు. అంటే, ఇంకే విధంగానూ మనస్సుని నిశ్చలం చేసుకోలేని వారికి అది ఉపయోగిస్తుందని అనుకోవచ్చు.

ప్ర: ఆసనాలంటే ఏమిటి? వాటి అవసరం ఉందా?

జ: యోగశాస్త్రాలలో అనేక ఆసనాలూ, వాటి ప్రయోజనాలూ వివరింపబడి ఉన్నాయి. పులి చర్మం, దర్భలు మొదలైనవి, కూర్చోవటానికి ఆసనాలు. పద్మాసనం, సుఖాసనం వంటివి మరికొన్ని ఉన్నాయి. నీ గురించి నీవు తెలుసుకోవటానికి ఇవన్నీ ఎందుకు? అసలు విషయమేమిటంటే, ఆత్మనుండి అహంకారం ఉదయిస్తుంది. తానే శరీరమను కుంటుంది, ఈ ప్రపంచమే నిజమనుకుంటుంది. ఈ అహంభావంతో వెట్టిగా చూస్తూ ఆసనాలకోసం వెతుక్కుంటుంది. అటువంటి వ్యక్తి తానే కేంద్రమనీ, అన్నిటికీ ఆధారం తానేననీ ఎరుగడు.

అతను కదలకుండా ఉండటానికే ఆసనం. తన నిజస్థితిలో తప్ప అతను కదలకుండా దృఢంగా మరెక్కడ ఉండగలడు? అదే అసలైన ఆసనం. విశ్వమంతా స్థిరంగా నిలబడే స్థావరం ఆత్మే నన్న జ్ఞానం నుండి కదలకుండా ఉంటమే, సమాధి నొందటానికి ఏకైక ఆసనం!

ప్ర: శ్రీ భగవాన్ సాధారణంగా ఏ ఆసనంలో కూర్చుంటారు?

జ: ఏ ఆసనమా? హృదయాసనంలో! ఏది సుఖంగా ఉంటే అదే నా ఆసనం! దానినే సుఖాసనమంటారు - సుఖాన్నిచ్చే ఆసనమన్నమాట. హృదయానికి సంబంధించిన ఆ ఆసనం ప్రశాంతంగా ఉంటుంది. సంతోషాన్నిస్తుంది. అందులో ఉన్నవారికి, వేరే ఏ ఆసనమూ అవసరం లేదు.

ప్ర: కర్మయోగాన్నే బలపరుస్తున్నట్లుంటుంది, గీత. యుద్ధం చేయమని అర్జునుడ్ని ఒప్పిస్తాడు శ్రీకృష్ణుడు. జీవితంలో ఎన్నో మహత్కార్యాలను సాధించి ఆయన కార్యాచరణ పరాయణత్వానికి ఆదర్శ ప్రాయుడైనాడు.

జ: "నీవు దేహానికి కావు, నీవు కర్తవి కావు' అంటూ ప్రారంభిస్తుంది గీత.

ప్ర: ఆ మాటల అంతరార్థ మేమిటి?

జ: తాను చేస్తున్నాననే భావం లేకుండా పని చేయాలనమాట. అహంకారం సమసిపోయినప్పుడు కూడా పనులు కొనసాగుతూనే ఉంటాయి. ప్రతి మనిషీ ఏ ప్రయోజనం కోసమో రూపం దాల్చాడు. తాను కర్తనని అతను భావించినా భావించకపోయినా ఆ ప్రయోజనం నెరవేరుతుంది.

ప్ర: కర్మయోగమంటే ఏమిటి? కర్మ పట్ల అనాసక్తతా, లేక, ఫలితం పట్లనా?

జ: తాను కర్తనన్న భావం లేకుండా ఉండటమే కర్మయోగమంటే. అన్ని కర్మలూ వాటంతటవే సాగిపోతాయి.

ప్ర: అంటే కర్మ ఫలితాల పట్ల మమకారం లేకుండా ఉండటమా?

జ: 'కర్త' అంటూ ఎవరైనా ఉన్నప్పుడే ఈ ప్రశ్న ఉదయిస్తుంది. "నేను కర్తని" అని భావించవద్దనే అన్ని శాస్త్రాలూ చెప్తాయి.

ప్ర: కర్మయోగమంటే, "కర్తృత్వ బుద్ధి రహిత కర్మ" (కర్తృత్వ భావం లేని కార్యాచరణ) అనమాట.

జ: అవును. అదే.

ప్ర: కార్యాచరణ పరాయణమైన జీవితం గడపాలని గీత బోధిస్తుంది.

జ: అవును. 'కర్త" లేని కార్యాచరణం.

ప్ర: ఏమీ చేయకుండా ఉంటే కర్మ ఎట్లా సాగుతుంది? కర్మ యోగానికి స్థానమేదీ?

జ: అసలు కర్మ అంటే ఏమిటో అర్థం చేసుకోవాలి - ఎవరి కర్మ? ఎవరు కర్త? వీటి విషయం విచ్ఛేదించి, సత్యాన్వేషణ కొనసాగిస్తే చివరికి ఆత్మలోనే ప్రశాంతంగా నిలవాల్సి వస్తుంది. ఆ స్థితిలో కూడా పనులు కొనసాగుతూనే ఉంటాయి.

ప్ర: నేనేమీ చేయకపోయినా, పనులెట్లా కొనసాగుతాయి?

జ: ఈ ప్రశ్నని అడిగేదెవరు? ఆత్మా, మరెవరైనానా? ఆత్మకి పనులలో నిమిత్తమేమైనా ఉందా?

ప్ర: ఈ ప్రశ్నవేసేది ఆత్మకాదు, రెండోది. ఆత్మకంటే వేరైనది.

జ: అంటే ఆత్మకీ, పనులకీ సంబంధం లేదని స్పష్టమే కదా - ఇంక ఆ ప్రశ్న ఎట్లా ఉదయిస్తుంది?

ప్ర: నాకు కర్మయోగం అనుసరించాలని ఉంది. ఇతరులకు నేనేవిధంగా సహాయపడగలుగుతాను?

జ: నీవు సహాయపడటాని కెవరున్నారు? ఇతరులకి సహాయపడ బోయేదెవరు? ముందు ఆ విషయాన్ని అర్థం చేసుకో, మిగిలినవన్నీ వాటంతటవే చక్కబడుతాయి.

ప్ర: అంటే ఆత్మసాక్షాత్కారం పొందట మన మాట. నాకు ఆత్మసాక్షాత్కారమయితే ఇతరులకి ఏమిటి లాభం?

జ: ఇతరులకి నీవు చేయగలిగిన పరమోత్తమమైన సహాయమదే. నిజానికి నీవు సహాయం చేయవలసిన "ఇతరులు" ఎవ్వరూ లేరు. నగల విలువను కట్టే ఆచారి వాటిలోని బంగారాన్నే గమనిస్తాడు. అట్లాగే సాక్షాత్కారం పొందిన వాడు గమనించేది ఒక్క ఆత్మేనే! దేహంతో తాదాత్మ్యం చెందినప్పుడే నామ రూపాలున్నాయి. దేహాత్మ బుద్ధిని దాటితే మిగిలినవన్నీ మాయమవుతాయి. సాక్షాత్కారం పొందినవాడు. ప్రపంచాన్ని తనకన్నా భిన్నంగా చూడడు.

ప్ర: ఇతరులకు సహాయపడటానికి సాధువులు జనంలో కలిసిపోవటం మంచిది కాదా?

జ: కలిసిపోవటానికి ఇతరులంటూ ఎవ్వరూ లేరు. ఆత్మ ఒక్కటే ఉన్న సత్యమంతా. ఆత్మనిష్ఠుడై ఉండటం వల్లనే సాధువు ప్రపంచానికి సహాయపడతాడు. అహంకారం లేని స్థితి చేరుకోవటమే ప్రపంచానికి నీవు చేయగల మహోపకారం, ఆ స్థితిని అందుకోవటం వల్ల ప్రపంచానికి సహాయపడలేనని నీవు అనుకుంటే, ప్రపంచపు సమస్యలనీ, నీ సమస్యలనీ కూడా భగవంతునికే అర్పించు.

ప్ర: దుఃఖంలో మునిగి ఉన్న ప్రపంచానికి నేను సహాయం చేయనక్కర లేదా?

జ: నిన్ను సృష్టించిన శక్తే ప్రపంచాన్ని కూడా సృష్టించింది. నిన్ను కాపాడినట్టే, ఆ శక్తి ప్రపంచాన్ని కాపాడగలదు. ఈ ప్రపంచాన్ని భగవంతుడే సృష్టించినట్లయితే, దాని సంగతి చూసుకోవలసింది ఆయనే, నీ పని కాదది.

ప్ర: స్వరాజ్యం కావాలన్న కోరిక సరియైనదేనా?

జ: అటువంటి కోర్కె స్వార్థంతోనే ప్రారంభిస్తుంది. కాని కార్యరూపంలో అది మనిషి దృక్పథాన్ని విశాలం చేస్తుంది. వ్యక్తి దేశంలో విలీనమై పోతాడు. అట్లా విలీనమవటం మంచిదే. దానినే నిష్కామ్యకర్మ అంటారు.

ప్ర: ఎంతో శ్రమ తరువాత, ఎన్నో త్యాగాల తరువాత స్వరాజ్యం సిద్ధిస్తే - ఆ పరి ణామానికి సంతోషించటంలో తప్పేముంది?

జ: తాను పనిచేసేప్పుడు వ్యక్తి తనని తాను దివ్యశక్తికి అంకితం చేసుకోవాలి, ఆ శక్తి యొక్క మహత్తుని ఎప్పుడూ మనస్సులో ఉంచుకోవాలి, మరువరాదు. అటువంటప్పుడు సంతోషించటమంటూ ఎట్లా సంభవం? తన పనుల ఫలితాన్ని గురించి కూడా అతను పట్టించుకో కూడదు. అప్పుడే అది నిస్స్వార్థమైన కర్మ అవుతుంది.

అయిదవ భాగము:-

# అనుభూతి

సత్యమొక్కటే దానికి వర్గాలంటూ ఏమీలేవు. వ్యక్తిగత అనుభూతులకు మాత్రం శ్రేణులున్నాయి. సత్యానికి లేవు. అనుభూతులేమైనా, అనుభవించేవాడు మాత్రం ఎప్పుడూ ఒక్కడే.

ఆత్మ అందరికీ అనుభవనీయమే - కాని మనం ఊహించుకునే రీతిలో కాదు. సత్యానికెప్పుడూ ఒకే ఒక స్థితికి ఉంది.

# 14.సమాధి

ప్రాగ్దేశాల ఆధ్యాత్మిక సాహిత్యంలో 'సమాధి' అనే పదాన్ని వాడుతారు. మహోత్కృష్టమైన ధ్యానంలో ప్రత్యక్షంగా కలిగే ఆత్మానుభూతిని గాని, ధ్యానింపబడే విషయంలో నిమగ్నమవటాన్ని గాని సూచిస్తుంది ఆ పదం.

శ్రీరమణులు సమాధిని మూడు విధాలుగా విభజిస్తారు. అవి ఇవి:

1. సహజ నిర్వికల్ప సమాధి: అహంకారాన్ని పూర్తిగా ఇక తలెత్తనీయకుండా విసర్జన. జ్ఞాని యొక్క స్థితి ఇది. "సహజ" అంటే సహజంగానే ఉండే, "నిర్వికల్ప" అంటే విభేదాలులేని, అని అర్థం. ఈ స్థితిలో జ్ఞాని మామూలు వారి వలెనే లోకంలో వ్యవహరి స్తాడు. ఆత్మజ్ఞానం కలిగి యుండటం వల్ల తనకీ ఇతరులకీ భేదముందనిగాని, తనకీ ప్రపంచానికీ భేదముందని గాని సహజజ్ఞాని భావింపడు. ఆ వ్యక్తికి అన్నీ అవిభాజ్యమైన ఆత్మకి రూపాంతరాలే.

2. కేవల నిర్వికల్ప సమాధి: ఆత్మ సాక్షాత్కార స్థితికి ఇది ఒక మెట్టు క్రిందిది. ఈ స్థితిలో వ్యక్తికి అప్రయత్నంగానే తన ఆత్మ గురించి తాత్కాలికమైన ఎరుక ఉంటుంది. కాని, అహంకారం పూర్తిగా పోదు. ఈ స్థితిలో దేహం గురించిన ఎరుక ఉండదు. ఆత్మ గురించి తాత్కాలికంగా ఎరుక కలిగినా అట్టి వ్యక్తికి ఇంద్రియాల వల్ల కలిగే జ్ఞానం గాని, లోకంలో వ్యవహరించే శక్తిగాని ఉండవు. దేహం గురించిన ఎరుక తిరిగి రాగానే మళ్లీ అహంకారం విజృంభిస్తుంది.

3. సవికల్ప సమాధి: ఈ స్థితిలో, ఎంతో ప్రయత్నంతోనే ఆత్మ గురించిన ఎరక నిలుస్తుంది. అట్టి సమాధి నిలవాలంటే ఎప్పుడూ ప్రయత్నం చేస్తూనే ఉండాలి. ఆత్మపై ఏకాగ్రత ఏ మాత్రం సడలినా, ఆత్మ గురించిన ఎరుకకూడా చలిస్తుంది.

“సమాధి”కి సంబంధించిన పారిభాషిక పదాలని అర్థం చేసుకోవటానికి శ్రీరమణులు ఇచ్చిన నిర్వచనాలు ఉపకరిస్తాయి. అవి ఇవి:

1. సత్యాన్ని విడువకుండా ఉండటం - సమాధి.

2. ప్రయత్నంతో, సత్యాన్ని పట్టుకొని ఉండటం - సవికల్ప సమాధి.

3. సత్యంలో లీనమైపోయి, ప్రపంచమంటే ఎరుక లేకుండా ఉండటం - నిర్వికల్ప సమాధి.

4. అజ్ఞానంలో విలీనమైపోయి, ప్రపంచమంటే ఎరుకలేకుండా ఉండటం గాఢనిద్ర.

5. ఏ ప్రయత్నమూ లేకుండానే స్వచ్ఛమైన, ఆదిమమైన, సహజమైన స్థితిలో ఉండటం - సహజ నిర్వికల్ప సమాధి.

ప్ర: సమాధి అంటే ఏమిటి?

సత్ - చిత్ లను అవిచ్ఛిన్నంగా నిశ్చలమైన మనస్సు అనుభవించటమే సమాధి అంటే. నిశ్చలమైన మనస్సుపొందే అనంతమైన ఆ ఆత్మానుభూతే సమాధి - అదే భగవదనుభూతి కూడ.

అజ్ఞానస్థితిలో మనస్సు ఆత్మలో విలీనమయిన స్థితిని నిద్ర అంటారు. మెలకువగా ఉన్నప్పుడు మనస్సు అట్లా విలీనమవటం, సమాధి. అంటే, మేల్కొని ఉన్నా మనస్సు ఆత్మలో నిమజ్జనమై ఉండటం. నిద్రలో కూడ ఆత్మలో నిమజ్జనమయే ఉంటుంది మనస్సు. కాని అది అపస్మారక స్థితి. సహజ సమాధిలో ఆత్మతో సమ్మేళనం ఎల్లప్పుడూ ఉంటుంది.

ప్ర: కేవల నిర్వికల్ప సమాధీ, సహజ నిర్వికల్ప సమాధీ అంటే ఏమిటి?

జ: మనస్సు ధ్వంసం కాకపోయినా ఆత్మలో నిమజ్జనమవటం కేవల నిర్వికల్ప సమాధి. ఆ స్థితిలో వ్యక్తికి ఇంకా వాసనలుంటాయి. అందువల్ల ముక్తినొందడు. వాసనలు నాశనమైన తరువాతనే ముక్తి సంభవం.

ప్ర: సహజ సమాధిని ఎప్పుడు అభ్యాసం చేసుకోవాలి?

జ: మొదటి నుంచీ చేసుకోవచ్చు. కేవల నిర్వికల్ప సమాధిని కొన్ని సంవత్సరాల పాటు అభ్యాసం చేసుకున్నా వాసనలను రూపుమాపనంత వరకూ ముక్తి కలుగదు ఎవ్వరికీ.

ప్ర: సవికల్ప, నిర్వికల్ప సమాధుల తేడా ఏమిటో స్పష్టంగా తెలుసుకో గోరుతున్నాను-

జ: పరమోత్కృష్టమైన స్థితిని అంటిపెట్టుకొని ఉండటం, సమాధి. ఈ స్థితి, ప్రయత్నం వల్లనే సాధ్యమైతే దానిని సవికల్ప సమాధి అంటారు. మానసిక అలజడులు లేకపోతే, నిర్వికల్ప సమాధి. ఏ ప్రయత్నమూ లేకుండా ఆదిమస్థితిలో శాశ్వతంగా ఉండటం, సహజ సమాధి.

ప్ర: సహజ సమాధినందుకొనే ముందు నిర్వికల్ప స్థితిని అందుకోవాలా?

జ: ఏ సమాధి స్థితిలోనైనా అంటే సవికల్ప స్థితైనా సరే, నిర్వికల్ప సమాధి అయినా సరే, శాశ్వతంగా ఉండటమే, సహజ స్థితి. శరీరధ్యాస కలిగి ఉండటమంటే ఏమిటసలు? జడమైన దేహానికి చైతన్యం తోడవటమనమాట. అంటే ఈ రెండూ ఇంకో చైతన్యంలోని వనమాట ఆ చైతన్యం దేనివల్లా ప్రభావితం కాదు. ఎప్పుడూ ఒకే స్థితిలో ఉంటుంది, అది కేవలం-శరీర ధ్యాస ఉన్నా లేకపోయినా ఉంటుంది. ఆ శుద్ధ చైతన్యాన్ని విడువకుండా ఉంటే, ఈ శరీరధ్యాస ఉంటేనేం, లేకపోతేనేం? శరీరధ్యాస అసలు లేకపోవటం, సమాధి అవస్థను ఇంకా తీవ్రం చేస్తుంది. అంతేనేగాని పరమాత్మ అంటే ఉండే ఎరుకని ఏ విధంగాన తగ్గించదు.

ప్ర: నాల్గవ అవస్థ అయిన "తురియ"కూ సమాధికీ ఏమైనా తేడా ఉందా?

జ: సమాధి, తురియ, నిర్వికల్ప - వీటన్నిటికీ ఒకే లక్షణం - ఆత్మజ్ఞానం కలిగి ఉండటం. తురియ అంటే నాల్గవ స్థితి పరమోత్కృష్టమైన చైతన్యం. ఇది మిగిలిన మూడు అవస్థలైన మెలకువ, స్వప్నం, సుషుప్తి అవస్థలకు భిన్నం. ఆ నాల్గవ అవస్థ శాశ్వతం. మిగిలిన మూడూ వస్తూపోతూ ఉంటాయి. తురియ అవస్థలో, మనస్సు తన మూలమైన హృదయంలో లీనమై అక్కడ మౌనంగా ఉన్నదన్న ఎరుక ఉంటుంది. అయినా, కొన్ని భావాలు వస్తూనే ఉంటాయి.

ఇంద్రియాలు కొద్దిగా చురుకుగా ఉంటాయి. నిర్వికల్ప స్థితిలో ఇంద్రియాలు ఏమీ పనిచేయవు, భావాలు ఏమాత్రమూ ఉండవు. అందువల్ల ఈ స్థితిలో శుద్ధ చైతన్యానుభూతి చాలా ప్రగాఢంగా, ఆనందమయంగా ఉంటుంది. సవికల్ప సమాధిలో తురియ అవస్థ అందుతుంది.

ప్ర: నిద్రలో కలిగే ఆనందానికీ, తురియ అవస్థలో కలిగే ఆనందానికీ భేదమేమిటి?

జ: ఆనందం ఒక్కటే, ఎన్నో రకాలు కాదు. ఉన్నదంతా ఒకే ఆనందం. అందులో మెలకువగా ఉన్నప్పటి ఆనందం, అన్ని జీవరాశులూ అనుభవించే ఆనందం. బ్రహ్మానందం ఉన్నాయి. అది ఆత్మ యొక్క ఆనందం. నిద్రలో తెలియకుండా అనుభవించే ఆనందాన్నే తురియ అవస్థలో ఎరుకతోనే అనుభవిస్తాం. ఉన్న భేదమంతా అదే. మెలకువగా ఉన్నప్పుడు అనుభవించే దాన్ని ఉపాధి ఆనందమంటారు - అది అసలైన ఆనందానికి ఒక మెట్టు క్రిందిది.

ప్ర:రాజయోగంలోని ఎనిమిదవ దశ అయిన సమాధీ, మీరు చెప్పే సమాధి ఒకటేనా?

జ: యోగంలో సమాధి అంటే ఒక విధమైన పారవశ్యం. అందులో చాలా రకాలున్నాయి. నేను చెప్పే సమాధి వేరు. ఇది సహజసమాధి. ఇక్కడ సమాధానముంటుంది - చురుకుగా ఉన్నా కూడా నీవు నిశ్చలంగా, ప్రశాంతంగా ఉంటావు. అంతరంగంలోని ఆత్మే నిన్ను నడిపిస్తోందన్న జ్ఞాన ముంటుంది అప్పుడు. ఏదీ నీ స్వంతంకాదని తెలియటం వల్ల నీకే చింతలూ, ఆందోళనలూ, భాధ్యతలూ ఉండవు. కావాలని నీవు దేనితో సమ్మేళనమయ్యావో అదే అన్నింటినీ చేస్తోందని తెలుస్తుంది.

ప్ర: సహజసమాధే వాంఛనీయమైన స్థితి అయితే, నిర్వికల్ప సమాధి అవసరం లేనట్టేనా?

జ:రాజయోగంలో నిర్వికల్ప సమాధికేమైనా ప్రయోజనముండవచ్చు. కాని, జ్ఞాన యోగంలో ఈ సహజస్థితే, ఈ సహజనిష - నిర్వికల్ప అవస్థ. ఈ సహజస్థితిలో మనస్సుకి ఏ సంశయాలూ ఉండవు. సంభవాసంభవాల మధ్య ఊగిసలాడవల సిన అవసరం దానికి లేదు. ఏ విధమైన వికల్పాలనూ అది గమనించదు. సత్యమనుభవసిద్ధ మవటం వల్ల, వాస్తవమేదో దానికి తెలిసే ఉంటుంది. ఏ వ్యాపకంలో ఉన్నా ఆ వ్యాపకం - ఆత్మలో, సత్యంలో, పరమాత్మలోనే జరుగుతోందన్న జ్ఞానముంటుంది.

ప్ర: సుషుప్తీ, మనోలయ, సమాధీ - వీటిలో తేడాలేమిటి?

జ: సుషుప్తిలో మనస్సు విలీనమవుతుందే గాని, వినాశం కాదు. విలీనమయినది మళ్లీ ఉదయిస్తుంది. ధ్యానంలో కూడా అట్లా జరుగవచ్చు. ధ్వంసమైన మనస్సు మళ్లీ ఉదయించలేదు. మనస్సుని నాశనం చేయటమే లక్ష్యంగా పెట్టుకోవాలి గాని - లయంలో ఇంకి పోవటాన్ని కాదు. ధ్యానంలో కలిగే శాంతిలో మనోలయం సంభవం, కాని అది చాలదు. మనస్సుని ధ్వంసం చేయాలంటే వేరే కొన్ని అభ్యాసాల అవసరముంది. ఏదో ఒక అల్పమైన భావంవల్ల యోగంలో, సమాధి స్థితిలో పడేవారున్నారు - అయినా, చాలా కాలం తరువాత మెలకువ వచ్చినా, ఆ భావంతోనే మేల్కొంటారు. ఈ లోగా ఈ లోకంలో కొన్ని తరాలు వచ్చి, వెళ్ళి ఉండవచ్చు. మనస్సుని నిజంగానే ధ్వంసం చేయటమంటే, మనస్సు ఆత్మకి భిన్నం కాదని గుర్తించటమన మాట. ఇప్పుడు కూడా, మనస్సంటూ ఏ మీ లేదు. దీనిని గ్రహించు. నీ ప్రమేయమే లేకుండా జరిగే నిత్యకృత్యాల బట్టే ఆ విషయాన్ని గ్రహించగలుగుతావు. వాటిని జరిపించే మనస్సు నిజంకాదనీ, ఆత్మ నుండి ఉదయించే భూతమనీ తెలుసుకో. మనస్సుని ఆ విధంగానే ధ్వంసం చేయాలి.

ప్ర: నిర్వికల్పసమాధి అవస్థలో ఉన్న వానిని బైతిక పరిస్థితులు ప్రభావితం చేస్తాయా? ఈ విషయంలో, నాకూ నా స్నేహితునికీ భేదాభిప్రాయాలున్నాయి.

జ: మీ రిద్దరు అనుకొనేదీ సరియైనదే. మీలో ఒకరు కేవల సమాధి గురించి చెప్తే, రెండవవారు, సహజసమాధి గురించి చెప్తున్నారు. ఈ రెండు అవస్థలలోనూ మనస్సు ఆత్మానందంలో మునిగి ఉంటుంది. మొదటి దాంట్లో భౌతిక పరి స్థితులలో మార్పులు ధ్యానం చేసుకునే వానికి అంతరాయం కలిగించవచ్చు, దీనికి కారణం, మనస్సు పూర్తిగా ధ్వంసం కాక పోవటమే. అది ఇంకా సజీవంగానే ఉంది - సుషుప్తి తర్వాత అయినట్లే. ఎప్పుడైనా తిరిగి పని చేయవచ్చు. నీళ్లు పూర్తిగా మునిగిన బాల్చీని దానికి తగిలియున్న తాడుతో ఎప్పుడైనా పైకి లాగవచ్చు, అట్లాగే ఇదీను. సహజస్థితిలో, మనస్సు ఆత్మలో పూర్తిగా విలీనమై ఉంటుంది - తాడుతో సహ నూతిలో మునిగిపోయిన బాల్చీ వలనే! సహజస్థితిలో అంతరాయం చెందటానికి గాని, లోకంలోకి తిరిగి రప్పించటానికి గాని ఏమీ మిగిలి ఉండదు. నిద్రలో తల్లి పాలుత్రాగినా, ఆ విషయమే ఎరుగని శిశువు స్థితి వంటిదే ఇది.

ప్ర: అటువంటి స్థితిలో, ఈ ప్రపంచంలో వ్యవహరించట మెట్లా?

జ: ధ్యానానికీ, అందులోని ఆనందానికీ సహజంగానే అలవాటు పడినవాడు సమాధిస్థితిని ఎప్పుడూ పోగొట్టుకోడు పైకి ఏ పనులు చేస్తున్నా, ఏ భావాలు వచ్చినా సరే. అదే సహజ నిర్వికల్పస్థితి ఆ స్థితిలో మనస్సు పూర్తిగా నాశనమయి ఉంటుంది. కేవల నిర్వకల్ప స్థితిలో మనస్సు లయమవుతుంది. - అంటే తాత్కాలికంగా లేకుండా పోతుందన మాట. ఈ స్థితిలో ఉన్న వాళ్లు ఎప్పటికప్పుడు, మనస్సుని అదుపులో పెట్టుతూండాల్సిన అవసరం వస్తుంది. సహజ సమాధిలో

వలె, మనస్సుని నాశనం చేస్తే అది తిరిగి తల ఎత్తదు. అటువంటి వాళ్లు ఏమి చేసినా యాదృచ్ఛికమే అవుతుంది. వాళ్లు ఆ ఉన్నతస్థాయి నుంచి దిగజారరు.

కేవల నిర్వికల్ప స్థితిలో ఉన్నవాళ్లు, ఆత్మ సాక్షాత్కారాన్ని పొందని వాళ్లు, ఇంకా సాధకులే. సహజనిర్వికల్ప స్థితలోని వాళ్లు ఏ గాలివీచని ప్రదేశంలోని దీపం వలెనో, కెరటాలు లేని సముద్రం వలెనో ఉంటారు. అంటే, వారికి నిశ్చలత్వ ముంటుంది. తమకంటే భిన్నంగా ఏదీ కనిపించదు వాళ్లకి. ఆ స్థితిని చేరుకోని వాళ్లకి, అన్నీ తమకంటె వేరుగానే కనిపిస్తాయి.

ప్ర: లోకంలోకి దిగివచ్చినా, కేవల నిర్వికల్పస్థితిలోని అనుభూతికీ సహజ సమాధిలోని దానికీ తేడా ఉందా?

జ: పైకి వెళ్లటం, దిగి రావటం అంటూ ఏమీ లేవు. పైకీ, క్రిందకీ వెళ్లేది సత్యంకాదు. కేవల నిర్వికల్పస్థితిలో మనస్సనే బాల్చీ నీటిలో ఉంది, ఎప్పుడైనా త్రాడుతో దానిని పైకి లాగవచ్చు. సహజస్థితి, సముద్రంలో కలిసి పోయిన నది వంటిది. తిరిగి రావటమంటూ లేదు దానికి. అసలు ఈ ప్రశ్నలన్నీ ఎందుకు అడుగుతున్నావు? ఆ అనుభూతి పొందేవరకూ వెళ్ళి సాధన చేసుకో.

ప్ర: సమాధి యొక్క ప్రయోజనమేమిటి? ఆ స్థితిలో ఆలోచనంటూ ఏమైనా ఉంటుందా?

జ:సత్యాన్ని ఎరుకపరచగలిగేది సమాధి ఒక్కటే. సత్యంపై భావాలు ఒక తెరని కప్పుతాయి - సమాధిలో తప్ప. ఈ పరిస్థితిని గ్రహించలేం. సమాధిలో “అహం” యొక్క అనుభూతి తప్ప వేరే భావాలుండవు. ఆ అనుభవమే, నిశ్చలంగా ఉండట మనమాట.

ప్ర: మీ సమక్షంలో నాకు కలిగే ఈ సమాధిని, నిశ్చలతనీ తిరిగి ఎట్లా పొందటం?

జ:ఇప్పటి నీ అనుభూతికి కారణం ఇక్కడి వాతావరణం. ఈ వాతావరణానికి బయట కూడా ఈ అనుభవం కలుగుతుందా? ఈ అనుభవం, తాత్కాలికం. అది శాశ్వతమయే వరకూ అభ్యాసం అవసరం.

ప్ర:సమాధి ఎటువంటి అనుభూతి - నిశ్చలతా లేక ప్రశాంతతా?

జ: మానసిక అలజడిలేని ప్రశాంతమైన నిర్మలత్వమే సమాధి అంటే. ఇదే మోక్షానికి గట్టి పునాది. మానసిక అలజడి, మిథ్య. దానిని ధ్వంసం చేయటానికి ప్రయత్నించు. సమాధిని అనుభవించు. అది ప్రశాంతమైన చైతన్యం. అదే అంతర్గతమైన నిర్మలత్వం.

ప్ర: లోపలి సమాధికీ, బయటి సమాధికీ తేడా ఏమిటి?

జ: సత్యాన్ని విడవకుండా ఉండి, ప్రపంచాన్ని చూస్తూ ఏ విధంగానూ లోపలి నుండి ప్రతిస్పందించకుండా ఉండటం - బయటి సమాధి. తరంగాలు లేని సముద్రపు ప్రశాంతత అది. శరీరధ్యాస కోల్పోవటం, లోపలి సమాధి.

ప్ర: ఆ స్థితిలోకి ఒక్కక్షణంకూడా మనస్సు చేరదు.

జ:"నేను ఆత్మని. మనస్సుకీ, దృశ్యమానమైన వాటికీ అతీతుడను" అనే దృఢ విశ్వాసముండాలి.

ప్ర: అయినా, ఆత్మలో విలీనమవటానికి చేసే ప్రయత్నాలకు అవరోధం- ఏ విధంగాను లొంగని మనస్సు.

జ: మనస్సు తన వ్యాపకాలలో ఉంటే మాత్రమేం? ఆత్మ యొక్క పునాదిపైనే కదా అది ఉండేది? మనస్సు ఏమి చేస్తున్నా ఆ ఆత్మనే పట్టుకొని ఉండు.

ప్ర: శ్రీరామకృష్ణుని జీవితం వ్రాస్తూ రొమైరోలా నిర్వికల్ప సమాధి గురించి ఇట్లా అన్నారు. “అది ఎంతో భయాపహమైన, ఘోరమైన అనుభూతి" అని. ఆ స్థితిని చేరటానికేనా మేము పడే ఈ ప్రయాస అంతా? మేమంతా జీవచ్ఛవాల వలె అయిపోతామా?

జ: 'నిర్వికల్పం' గురించి రకరకాల అభిప్రాయాలున్నాయి. ఎందరికో! రొమైరోలా గురించి చెప్పటమెందుకు? ఉపనిషత్తులూ, వేదాంత సంప్రదాయమూ అందుబాటులో ఉన్న వాళ్లకే నిర్వికల్పం గురించి పిచ్చి అభిప్రాయాలుండగా ఇక ఒక పాశ్చాత్య దేశస్థుణ్ణి గురించి అనుకోవట మెందుకు? ప్రాణాయామం వల్ల కొందరు యోగులు సుషుప్తి కంటె గాఢమైన అపస్మారక స్థితిని చేరుకుంటారు. ఆ స్థితిలో వాళ్లకి ఏ ఎరుకా ఉండదు. దీనినే వాళ్లు నిర్వికల్పమని గొప్పలు చెప్పుకుంటారు. మరికొందరు, నిర్వికల్ప మనుభవమైతే, పూర్తిగా మారిపోయిన మనిషినైపోతారను కుంటారు. ఇంకా కొందరు, నిర్వికల్పం అనేది ప్రపంచ ధ్యాసే ఉండని పారవశ్యస్థితి వల్లనే సాధ్యమను కుంటారు. ఈ భావాలన్నింటికీ కారణం, వాళ్లు దీని గురించి బుద్ధితో ఆలోచించటమే. నిర్వికల్పమంటే, చిత్ - అప్రయత్నమూ, నిరాకారమునైన చైతన్యం. ఇందులో భయమెక్కడుంది? నువ్వు నువ్వుగా ఉండటంలో రహస్యమేముంది? కొందరికి దీర్ఘకాలపు అభ్యాసం వల్ల మనస్సు పరిపక్వమై నిర్వికల్పం హఠాత్తుగా ఒక వరద వలె వస్తుంది.

కాని మరికొందరికి క్రమేపీ ఆధ్యాత్మిక అభ్యాసాల వల్ల వస్తుంది. అడ్డుతగిలే భావాలని ఈ అభ్యాసంలో అణచివేయటం వల్ల "అహం, అహం" అనే శుద్ధ చైతన్యపు తెరగోచరిస్తుంది. ఇంకొంత అభ్యాసం వల్ల, ఆ తెర స్పష్టమవుతుంది. ఇదే ఆత్మసాక్షాత్కారం, ఇదే ముక్తి. ఇదే సహజసమాధి. ఇదే సహజంగా, ఏ ప్రయత్నమూ అవసరముండని స్థితి. బయటి వికల్పాలను గమనించనంత మాత్రాన అది దృఢమైన నిర్వికల్పం కానే కాదు. నశించిన మనస్సులో వికల్పాలు తల ఎత్తకుండా ఉండటమే, నిర్వికల్పమంటే

ప్ర:మనస్సు ఆత్మలో శమించటానికి ప్రారంభమవుతున్నప్పుడు తరచూ భయం కలుగుతుంది...

జ:సమాధి స్థితిలోకి వెళ్తున్నప్పుడు భయమూ, శరీరకంపనమూ కలుగుతాయి పూర్తిగాపోని అహంకారం వల్ల. ఇది కూడా ఈషణ్మాత్రమైనా లేకుండా సమసిపోతే, ఒకే ఒక చైతన్యంలో మాత్రమే ఉండే స్థితిలోకి వెళ్తాడు మనిషి ఒళ్ళు వణకటం కూడ ఆగిపోతుంది.

ప్ర:సమాధి అవస్థ అంటే పరమానందమా, సంతోషాతిరేకమా?

జ:సమాధిలో ఉండేది ప్రశాంతత. సమాధి ముగిసిన తరువాత మనస్సు మళ్లీ ఉదయిస్తుంది. అప్పుడు కలిగేది సంతోషాతిరేకం. భక్తిలో ముందుగా కలిగేది సంతోషాతిరేకం. కళ్లవెంట నీరు కారటం, ఒళ్లు గగుర్పాటు చెందటం, కంఠం గద్గద మవటం - ఇవన్నీ దాని లక్షణాలు. “అహం” పూర్తిగా సమసిపోయిన తరువాత, సహజస్థితి కలిగినప్పుడు ఈ చిహ్నాలూ, పారవశ్యాలూ పోతాయి.

ప్ర: సమాధి స్థితి పొందగలిగితే, కొన్ని సిద్ధులు కూడా లభిస్తాయి కదా -

జ:సిద్ధులను గుర్తించటానికి ప్రేక్షకుడంటూ ఒకడుండాలి కదా. అంటే, వాటిని ప్రదర్శించేవానికింకా జ్ఞానం కలగలేదన మాట! కాబట్టి, సిద్ధులను పట్టించుకో నక్కరలేదు. సాధించ వలసిన లక్ష్య మొక్కటే - జ్ఞానం.

ప్ర:మండూక్యోపనిషత్తులో, సమాధిస్థితి - అంటే యోగంలోని ఆఖరిదశ - కూడ అనుభవమైతేనే గాని ఎంత ధ్యానం చేసినా, ఎంత తపస్సు చేసినా ముక్తి లభించదని ఉంది -

జ: సరిగ్గా అర్థం చేసుకుంటే అవన్నీ ఒకటే - నీవే పేరు పెట్టినా - అంటే ధ్యానమన్నా, తపస్సన్నా, నిమగ్న మవటమన్నా ఇంకేమన్నా సరే. నిశ్చలంగా, అవిచ్ఛనంగా, తైలధారవలె ఉండేదే తపస్సూ, ధ్యానమూ, నిమగ్నమూ. తాను ఆత్మలో సంస్థిత మవటమే సమాధి అవటమంటే.

ప్ర: కాని మండూక్యోపనిషత్తులో ముక్తిపొందే ముందే సమాధి అనుభవించాలని ఉందే?

జ: అది కాదని ఎవరన్నారు. మండూక్యోపనిషత్తులోనే కాక, మన ప్రాచీన గ్రంథాల న్నిటిలోనూ ఆ మాటలే ఉన్నాయి. ఆత్మజ్ఞానం కలగటమే అసలైన సమాధి. జడపదార్థం వలె నిశ్చలంగా కూర్చుంటే ఒరిగేదేమిటి? చేతి మీద కురుపులేస్తే, మత్తుమందు ఇచ్చి, దానిని ఆపరేషన్ చేస్తే ఏమవుతుంది? అప్పుడు నొప్పి A తెలియదు. అంటే నువ్వు సమాధిలో ఉన్నట్టా? ఇదీ అంతే. సమాధి అంటే జి ఏమిటో తెలుసుకోవాలి. ఆత్మ జ్ఞానం లేకుండా అదెట్లా సంభవం? ఆత్మ అంటే ఏమిటో తెలిస్తే సమాధి అంటే ఏమిటో దానంతటదే తెలుస్తుంది.

సమాధి మనిషికి సహజస్థితి. మెలకువ, స్వప్నం సుషుప్తి - వీటన్నిటికీ నేపథ్యమదే. ఈ మూడు అవస్థలలోనూ, ఆత్మ లేదు. కాని ఆ మూడూ, ఆత్మలో ఉన్నాయి. మెలకువగా ఉన్నప్పుడు సమాధి కలిగితే, అదే సుషుప్తిలో కూడా కొనసాగుతుంది. ఎరుక కలిగి ఉండటం, లేకపోవటం - మనస్సుకి సంబంధించిన అవస్థలు. ఆత్మ వీటికి అతీతం.

ప్ర: అంటే, సమాధి నందుకోవటానికి ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఉండాలనమాట.

జ:అహంకార రహితమైన మానసికసమతని మౌన సమాధి అంటారు ఋషులు, అదే జ్ఞానానికి పరాకాష్ఠ. ఆ మౌనసమాధి - అహంకారం లేని సత్యం - ఆ స్థితిని అందుకునే వరకూ అహంకారాన్ని ధ్వంసం చేయటమే లక్ష్యంగా పెట్టుకో!

# 15 మనోదర్శనాలు - సిద్ధులు

ధ్యానం వల్ల ఒక్కొక్కసారి అద్భుతమైన పరిణామాలు సంభవించవచ్చు - దేవతల దర్శనం కలగవచ్చు, అతీంద్రియ శక్తులు సంప్రాప్తింపవచ్చు - అంటే దివ్యదృష్టి. దూరసంవాదం వంటివి. ఈ రెంటినీ ప్రయత్న పూర్వకంగా కూడా పొందవచ్చు. ఏదో ఒక రూపంపై ఏకాగ్రతని భక్తితో నిలుపుకున్నా. ఆ రూపాన్ని చూడాలన్న తీవ్రమైన వాంఛతో ఉన్నా ఆ రూప దర్శనం కావచ్చు. సిద్ధులను యోగాభ్యాసం వల్ల కూడా పొందవచ్చు. పతంజలి యోగ సూత్రాలలో అష్టసిద్ధులను పొందటానికి అభ్యాసాలున్నాయి. మనిషి అదృశ్యమవటం నుంచీ, నీటిపై నడవగలగటం వరకూ ఉన్నాయి ఆ సిద్ధులు.

ఇటువంటి సిద్ధుల కోసం గాని, మనోదర్శనాల కోసం గాని ప్రయత్నించ వద్దని తమ అనుచరులకు శ్రీరమణులు చెప్పేవారు. అవన్నీ మనస్సు కల్పించే వేననీ, అవి ఏ విధంగానూ ఆత్మసాక్షాత్కారానికి దోహదం కావనీ అనేవారు. అప్రయత్నంగా మనోదర్శనాలయితే మాత్రం అవి ఆధ్యాత్మిక ప్రగతికి నిదర్శనాలనేవారు. అయినా అవి కూడ "తాత్కాలిక మానసిక అనుభూతులే" నని అవి "ఆత్మసాక్షాత్కారానికి దిగువ దశ" లోనివే ననీ హెచ్చరించేవారు.

వాటంతటవే సిద్ధులు సమకూడితే, వాటి పట్ల మమకారం పెట్టుకోవటం హానికరమే. అవి అహంకారాన్ని పారద్రోలటానికి బదులు పటిష్ఠం చేస్తాయనే వారు. అంతేకాక, సిద్ధులను కోరటానికీ, ఆత్మసాక్షాత్కారాన్ని కోరటానికీ పరస్పర వైరుధ్యముందనే వారు.

"ఆత్మ అత్యంత సన్నిహితమైనది, నిత్యమైనది. సిద్ధులు బాహ్యమైనవి. సిద్ధులని ప్రయత్న పూర్వకంగా పొందగలం, ఆత్మ అట్లా కాదు. ఆ సిద్ధులని సంపాదించేది మనస్సు. దానినెప్పుడూ మెలకువగా ఉంచాలి. మనస్సు నశించిన తరువాత గ్రహింపబడేదే, ఆత్మ. సిద్ధులు అహంకారమున్నప్పుడే బయట పడతాయి. ఆత్మ అహంకారానికి అతీతం - అహంకారం ధ్వంసమైన తరువాతనే గోచరిస్తుంది."

ప్ర: నేను హిందూ మతాన్ని స్వీకరించినప్పుడు నాకు శివుని దర్శనమయిందని శ్రీభగవానికి విన్నవించుకొన్నాను. కుర్తాళంలో కూడా అట్లాగే జరిగింది. ఈ మనోదర్శనాలు క్షణికాలే అయినా ఆనందమయంగా ఉంటాయి. అవి ఎల్లప్పుడూ, అవిచ్ఛినంగా ఉంచుకోవట మెట్లా? శివుడు లేకపోతే అంతా నిర్జీవమే, ఆయనని తలచుకుంటేనే నాకెంతో ఆనందం కలుగుతుంది. ఈ దర్శనం నాకు శాశ్వతంగా ఎట్లా ఉండగలదో తెలియచేయండి.

జ: శివుని దర్శనమయిందన్నావు. ఏ దర్శనమైనా ఏదో ఒక పదార్థానికి సంబంధించినదే అవుతుంది. అంటే, దర్శించే వాడంటూ ఒకడున్నాడని దాని అర్థం. దర్శింపబడే దానికి, దర్శించేవాని కంటె ఎక్కువ విలువేమీ లేదు. ఏదైనా దర్శన మయిందంటే, అది మాయమవటం కూడా సంభవమే. మనోదర్శనం నిత్యం కాదు. శివుడు నిత్యుడు.

దర్శనానికి ద్రష్ట ఉండాలికదా. ఏ ద్రష్టా. ఆత్మ లేదని అనలేడు. చైతన్యంగా, ఆత్మలేని సమయమంటూ ఏదీ లేదు. చైతన్యానికి భిన్నంగా ద్రష్ట కూడా ఉండలేడు. ఈ చైతన్యమే నిత్యమైనది. అభిన్నమైనది. ద్రష్ట తనని తాను చూచుకోలేడు. తనని తాను తన కళ్లతో చూసుకోలేనంత మాత్రాన తానులేనని ఎవడైనా అనగలడా? అంటే, అపరోక్షానుభూతి అంటే చూడటంకాదు, ఉండటం.

ఉనికే సాక్షాత్కారం. అందువల్ల 'నేను - శివుడు' శివునికి భిన్నంగా ఏదీ లేదు. అన్నీ శివునిలోనే ఉన్నాయి. శివుని వల్లనే ఉన్నాయి. అందువల్ల, "ఎవరిని నేను" అని విచారించు. లోపలికి ప్రయాణం చేసి, అక్కడ ఆత్మనిష్ఠ చెందు. అదే శివునిగా ఉనికి, ఆయనకి సంబంధించిన మనోదర్శనాలు కావాలని కోరుకోక, నువ్వు చూచే ఈ పదార్థాలకీ ఆ శివునికీ తేడా ఏమిటి? ఆయనే కార్యయూ, కారణమూను. శివుడు లేకుండా నీవు లేవు. శివుడు ఎప్పుడూ సాక్షాత్కారమయే ఉన్నాడు - ఇప్పుడు, ఇక్కడ కూడా! ఆయనని గ్రహించలేదని నీవు తప్పుగా భావిస్తున్నావు. ఈ భావమే అవరోధం ఆ భావాన్ని విడిచిపెట్టు. సాక్షాత్కార మిక్కడే ఉంది.

ప్ర: నిజమే. కాని దానిని త్వరగా జరిపించటమెట్లా?

జ: సాక్షాత్కారానికి అడ్డు అదే. శివుడు లేకుండా వ్యక్తి ఉండగలడా? ఇప్పుడు కూడా ఆయనే నీవు. దీనికి కాలంతో నిమిత్తం లేదు. సాక్షాత్కారం లేని క్షణమంటూ ఉంటే. "సాక్షాత్కార మెట్లా" అనే ప్రశ్న ఉదయించవచ్చు. కాని ఆయన లేకుండా నీవు లేనే లేవు. ఆయనెప్పుడూ సాక్షాత్కారమయే ఉన్నాడు - సాక్షాత్కారం కాకుండా ఎప్పుడూ లేడు.

ప్ర: నాకు శ్రీకృష్ణుని సాక్షాత్కారం పొందాలని ఉంది. దానికి నేనేం చేయాలి?

జ: శ్రీకృష్ణుడంటేనూ, సాక్షాత్కారమంటేనూ నీ ఉద్దేశమేమిటి?

ప్ర: బృందావనంలో గోపికలు కృష్ణుడ్ని చూసినట్టు చూడాలని నా ఉద్దేశం.

జ: ఆయన ఒక మానవుడనీ, రూపం కలవాడనీ, ఫలానా వారి కుమారుడనీ నీవనుకుంటున్నావు. కానీ "అందరి హృదయాలలోనూ ఉండేది నేను. అన్ని జీవులకూ అది మధ్యాంతాలని నేనే" అని ఆయనే అనలేదా? అన్ని జీవరాశులలో వలె నీలోనూ ఉన్నాడు. ఆయనే నీ ఆత్మ. నీ ఆత్మకి, ఆత్మ ఆయనే. అందువల్ల, ఈ ఆత్మ సాక్షాత్కారమైతే, కృష్ణుని సాక్షాత్కారమూ అవుతుంది. ఆత్మసాక్షాత్కారానికీ, కృష్ణుని సాక్షాత్కారానికీ తేడా ఏమీ లేదు. అయినా, నీ మార్గాన్నే నువ్వు వెళ్లదలచుకొంటే, శ్రీకృష్ణునికే పూర్తిగా అంకితమైపో. నీవు కోరే సాక్షాత్కారాన్ని అనుగ్రహించటం విషయం ఆయనకే విడిచి పెట్టు.

ప్ర: శ్రీరామకృష్ణుని వలె భగవంతునితో మాట్లాడటం సాధ్యమేనా?

జ: ఒకళ్లతో ఒకళ్లం మాట్లాడుకుంటున్నప్పుడు, ఈశ్వరునితో మాత్రం ఎందుకు మాట్లాడలేం?

ప్ర: మరి నాకెందుకు సాధ్యం కాదు?

జ: దానికి మనోబలం, స్వచ్ఛతా ఉండాలి, ధ్యానంలో అభ్యాసం కావాలి.

ప్ర: అవి ఉంటే భగవంతుడు కనబడుతాడా?

జ: నీ వెంత నిజమో, అటువంటి దృశ్యాలూ అంతే నిజం. నీవు మెలకువగా ఉన్నప్పుడు నీ శరీరంతో తాదాత్మ్యం చెందుతావు, అప్పుడు వస్తువులని స్థూలంగా చూస్తావు. సూక్ష్మశరీరంలో లేక కలలో మానసిక తలంలో ఉన్నప్పుడు వస్తువులని కూడ సూక్ష్మ రూపంలోనే చూస్తావు. గాఢ నిద్రలో ఏ తాదాత్మ్యమూ ఉండకపోవటం వల్ల దేనినీ చూడవు. అంటే, చూచేవాని స్థితి బట్టే చూడబడేవాటి స్థితి కూడా ఉంటుంది. భగవంతుని దర్శనాలకి కూడ ఇదే వర్తిస్తుంది. భగవంతుని రూపాన్ని ఎంతో కాలం ధ్యానం చేస్తే ఆ రూపంలో, కలలో కనబడుతుంది. తరువాత, మెలకువగా ఉన్న వేళల్లో కూడా కనబడవచ్చు.

ప్ర: తమ వద్దనున్నప్పుడు ఏవో భావతరంగాలూ, మనోదృశ్యాలూ అనుభవ మయ్యాయని ఇక్కడికి వచ్చిన వాళ్లు నాతో చెప్పారు. నేను ఇక్కడ గడచిన నెల రోజుల బట్టి ఉంటున్నాను - అటువంటి అనుభవమేమీ నాకు కలుగలేదు. దీని అర్థం, నేను మీ అనుగ్రహానికి అర్హుణ్ణి కాననా?

జ: ఈ మనోదర్శనాలూ, భావతరంగాలూ వాళ్ల వాళ్ల మానసిక స్థితిపై ఆధారపడి ఉంటాయి. అవి వ్యక్తులమీదే ఆధారపడి ఉంటాయిగాని, విశ్వమయమైన దానిపై కాదు. అయినా, అవి అంత ప్రధానం కాదు - మానసిక ప్రశాంతత ముఖ్యం. సాక్షాత్కారమంటే ఏమిటి? శంఖచక్రాదులని ధరించి, నాలుగు చేతులు గల దేవుణ్ణి చూడటమా? అటువంటి రూపంలో భగవంతుడు కనబడినా, భక్తుని అజ్ఞానమెట్లా మాయమవుతుంది? సాక్షాత్కారమంటే, నిత్యమైన సత్యమే. నిత్యంగా ఉండే అనుభవమే, సాక్షాత్కారం. ఏదో ఒక రూపంలో భక్తునికి కనబడటం కాదు. సాక్షాత్కారం శాశ్వతం కానప్పుడు దాని ప్రయోజనమేమిటి? నాలుగు చేతులతో దేవుడు కనబడటం, శాశ్వతమైన సాక్షాత్కారం కాగలదా? అది కేవలం దృశ్యమానమైన భ్రమే. ద్రష్ట ఉండాలి దానికి. ద్రష్టే సత్యం. నిత్యం.

కోటి సూర్యులవలె భగవంతుడు దర్శన మిచ్చినా అది ప్రత్యక్షానుభవమేనా? భగవంతుని మనోదర్శనం చూడటానికి మనస్సూ, కళ్లూ అవసరం. అది పరోక్షజ్ఞానం. కాని ద్రష్ట, నేరుగా అనుభవనీయం. ద్రష్టే ప్రత్యక్షం.

ప్ర: వైకుంఠం, కైలాసం, ఇంద్రలోకం, చంద్రలోకం అంటూంటారే, అవన్నీ నిజంగానే ఉన్నాయా?

జ: లేకేం, అవన్నీ ఉన్నాయి. సందేహం లేదు. అక్కడ కూడా నా వంటి స్వామి కూర్చొని ఉంటాడు. అతని చుట్టూ శిష్యులుంటారు. వాళ్లేదో అడుగుతూంటారు, ఆయనేదో చెప్తూంటాడు. అంతా ఇక్కడి లాగానే ఉంటుంది. అయితే మాత్రం ఏమిటి? చంద్రలోకాన్ని చూస్తే ఇంద్రలోకం కావాలంటావు, ఇంద్రలోకాన్ని చూసి వైకుంఠం కావాలంటావు. ఆ తరువాత కైలాసం. ఆ తరువాత ఇంకేదో! మనస్సు అట్లా పరుగెత్తుతూనే ఉంటుంది. ఇందులో శాంతి ఎక్కడుంది? శాంతి కావాలంటే, దానిని పొందే ఒకే ఒక మార్గం - ఆత్మవిచారం. ఆత్మవిచారం ద్వారా ఆత్మ సాక్షాత్కారం సంభవం. అది జరిగితే, అన్ని లోకాలనూ ఆత్మలోనే దర్శించవచ్చు. అన్నిటికీ మూలం ఆత్మే. ఆత్మసాక్షాత్కారమయితే, ఆత్మకి భిన్నంగా ఏదీ లేదని తెలుస్తుంది. అప్పుడు ఈ ప్రశ్నలుదయించవు. వైకుంఠం ఉన్నాలేకపోయినా కైలాసం ఉన్నాలేకపోయినా, నీవు మాత్రం ఇక్కడున్నావన్నది వాస్తవం. నువ్వు ఇక్కడ ఎట్లా ఉన్నావు? నువ్వు ఎక్కడ ఉన్నావు? వీటి గురించి తెలుసుకున్న తరువాత ఇతర లోకాల గురించి ఆలోచించవచ్చు.

ప్ర: పతంజలి చెప్పిన సిద్ధులు నిజమైనవేనా లేక అన్నీ ఆయన కల్పనలేనా?

జ: ఆత్మనిష్టలో ఉన్నవాడు, ఈ సిద్ధులకి అంత ప్రాధాన్యమీయడు. ఈ సిద్ధులన్నీ మనస్సుతో పొందబడేవేననీ, ఆత్మసాక్షాత్కారానికి అడ్డంకులనీ, పతంజలే అన్నాడు.

ప్ర: కొన్ని శక్తులు మానవాతీతమంటారు. వాటి మాటేమిటి?

జ: ఆ శక్తులు గొప్పవో, అధమమైనవో, సామాన్య మనస్సువో మానవాతీతమైన మనస్సువో - ఏమైనా అవన్నీ ఆ శక్తి కలవానికి సంబంధించినవి. అతడెవరో కనుక్కో.

ప్ర: ఆధ్యాత్మిక పథంలో సిద్ధులు లభిస్తాయా లేక అవి ముక్తికి ఆటంకాలా?

జ: అన్నిటికన్నా ఉత్తమోత్తమమైన సిద్ధి ఆత్మసాక్షాత్కారం. ఆ సత్యాన్ని గ్రహిస్తే అవిద్యామార్గాన వెళ్లవు.

ప్ర: అయితే, సిద్ధుల ప్రయోజన మేమిటి?

జ: సిద్ధులు రండు రకాలు- వాటిలో ఒక రకం, ఆత్మసాక్షాత్కారానికి అడ్డంకి కూడా కావచ్చు. మంత్రం వల్లనో, మాదకద్రవ్యాల వల్లనో, తపోనిష్ఠ వల్లనో, ఒక విధమైన సమాధి వల్లనో సిద్ధులు సంపాదించవచ్చు. అయినా అవి ఆత్మజ్ఞానాన్ని కలిగించే సాధనాలు కావు. అవి కలిగినంత మాత్రాన, అజ్ఞానం పోదు.

ప్ర: రెండవ రకం ఏమిటి?

జ: ఆత్మ సాక్షాత్కారమైన తరువాత సహజంగానే కలిగే శక్తికీ, జ్ఞానానికీ రూపాలని. ఆత్మని చేరుకున్న వానికి కల తపోఫలాలు ఆ సిద్ధులు. అవి మామూలుగా, సహజంగా లభిస్తాయి వాళ్లకి. అవి భగవంతుని ప్రసాదాలు లాగ, వాటంతట అవే వస్తాయి. వారి వారి యోగం బట్టి కూడా ఉంటుందది. పరమశాంతిలో ఉండే జ్ఞానికి అవి వచ్చినా, రాకపోయినా ఒకటే. వాటి వల్ల అతను చలించడు.ఆత్మజ్ఞానం కలిగి ఉండటమే అచంచలమైన సిద్ధి అని జ్ఞానికి తెలుసు. ప్రయత్నిస్తే దొరికే సిద్ధులు కావవి. సాక్షాత్కారం పొందిన స్థితికి చేరితే, ఈ శక్తులేమిటో నీకు తెలుస్తుంది.

ప్ర: ఇతరులకి కూడ ఆత్మసాక్షాత్కారం కలగటానికై మహాత్ములు గొప్ప శక్తులని ఉపయోగిస్తారా లేక వారికి ఆత్మసాక్షాత్కార మవటమే చాలునా?

జ: మహాత్మునికి కల ఆత్మసాక్షాత్కార బలమే ఇతర శక్తుల ఉపయోగం కన్నా బలీయమైనది.

ఎన్నో రకాల సిద్ధులున్నా, అన్నిటిలోకీ పరమోత్కృష్టమైనది జ్ఞానమే. ఇతర సిద్ధులను పొందినవారు కూడ జ్ఞానాన్నే కోరుకుంటారు. జ్ఞానం కలిగిన వారు ఇతర సిద్ధులని కోరరు. అందువల్ల జ్ఞానమే కావాలని కృషి చేయి.

ఆ శక్తులు లేనివారికవి బ్రహ్మాండంగా కనబడుతాయి - కాని అవి తాత్కాలికాలే. తాత్కాలికమైన వాటి కోసం ఎగబడటం వృథా. ఈ మహత్తులన్నీ అచంచల మైన ఆత్మలో ఉన్నాయి.

తననే నీకు ఇవ్వగల దేవుడ్ని, సర్వమూ తానే అయిన దేవుడ్ని ఈ సిద్ధుల కోసం వేడుకోవటం - సర్వమూ ధారపోయటానికి సిద్ధమైన దాతను పాచిపోయిన గంజి కోసం వేడు కోవటం వంటిదే!

పరభక్తి అనే జ్వాలలో జ్వలించిపోయే హృదయంలో అన్ని సిద్ధులూ ఉన్నాయి. భగవంతుని పాదాక్రాంతులైన భక్తుడు ఏ సిద్ధులనీ కోరడు. ముక్తిని పొందాలనుకొనే సాధకులు ఈ సిద్ధుల మీద మనస్సు పెట్టుకుంటే వారి బంధం ఇంకా బిగుసుకు పోతుంది. వారి అహంకారమింకా ఎక్కువ అవుతుంది.

ఆత్మసిద్ధే పరిపూర్ణ మయినది, అదే ముక్తి, అదే అసలైన జ్ఞాన సముపార్జన. అణిమాది సిద్ధులన్నీ అవివేకి చిత్తభ్రమకి చెందినవే.

ఈ సిద్ధులకన్నా మహాద్భుతాలని చూస్తూంటారు - కాని వాటిని చూడటం అల వాటయి పోవటం వల్ల వాటిని గమనించరు. మనిషి పుట్టినప్పుడు గుప్పెడుకన్నా పెద్దదిగా ఉండడు. కాని అతనే పెరిగి, పెద్ద మల్లయోధుడో, ప్రసిద్ధుడైన కళాకారుడో, వక్త, రాజకీయ వేత్తో, ఋషో అవవచ్చు. దీనిని మహాద్భుతంగా ఎవ్వరూ పరిగణించరు. కాని కళేబరాన్ని మాట్లాడించగలిగితే ఆశ్చర్యపోతారు!

ప్ర: నాకు ఇరవై ఏళ్లబట్టీ ఆధ్యాత్మిక విషయాలలో ఆసక్తి ఉంది. కాని ఎందరో చెప్పుకుంటున్నట్టు నాకే వింత అనుభూతీ కలుగలేదు. నాకు దూరదృష్టి, దూరశ్రవణం వంటివేమీ లేవు. ఈ శరీరంలో బంధింపబడినట్టు తప్ప ఇంకే అనుభూతీ లేదు నాకు.

జ: అది మంచిదే. యదార్థం ఒక్కటే - అది ఆత్మ. మిగిలినవన్నీ దానికి సంబంధించిన దృశ్యాలు, చూచేవాడూ, చూడబడేవీ, చూపూ - అన్ని ఆత్మకి సంబంధించినవే. ఆత్మని ప్రక్కకి పెట్టి ఎవరైనా చూడగలరా, వినగలరా? ఎవరినైనా దగ్గరలో చూడటానికీ, వినటానికీ - వాళ్లనే దూరంగా ఉన్నా చూడటానికీ, వినటానికీ పెద్ద తేడా ఏముంది? వీటికి చెవులూ, కళ్లూకావాలి - మనస్సు కూడా కావాలి. వీటిలో దేనినీ వదులుకోలేం. వాటి మీద ఆధారపడటం తప్పదు. అటువంటప్పుడు, దూరదృష్టి, దూరశ్రవణం వంటివంటే మోజు ఎందుకు? అంతేకాదు, ఈ శక్తి ఎట్లా వచ్చిందో, అట్లాగే పోతుంది. శాశ్వతమెన్నటికీ కాదు.

ప్ర: దూరసంవాదం వంటి శక్తులను సంపాదించటం మంచిది కాదా?

జ: దూరసంవాదంగాని, రేడియోగాని దూరంగా ఉండి వినటానికీ, చూడటానికీ పనికి వస్తాయి. అవన్నీ ఒకటే - వినటం, చూడటం. వినేవాడికి, దగ్గర్నుంచి విన్నా దూరం నుంచి విన్నా పెద్ద తేడా ఏమీ లేదు. వీటిలో ముఖ్యమైన అంశం - వినేవాడు. వినేవాడుగాని, చూచేవాడుగాని లేకపోతే, వినడమూ లేదు, చూడటమూ లేదు. ఇవన్నీ మనస్సు యొక్క వ్యాపకాలు. సిద్ధులన్నీ మనస్సులోనివే. అవి ఆత్మకి సహజమైనవి కావు. ఏదైనా సహజం కాకపోయినా, ప్రయత్నం వల్లనే సంపాదింపబడినదైనా శాశ్వతం కాజాలదు. దాని కోసం ప్రాకులాడట మనవసరం. కొన్ని శక్తులు విస్తరిస్తే సిద్ధులవుతాయి. మనిషికి పరిమితమైన శక్తి ఉండటం వల్ల చాలా బాధపడతాడు. ఇంకా ఎక్కువ శక్తి కావాలనుకుంటాడు, దానివల్ల సంతోషం కలుగుతుందనుకుంటాడు. కాని, వాటివల్ల నిజంగానే సంతోషం కలుగుతుందా అని ఆలోచించడు. పరిమితమైన దృష్టితోనే చాలా బాధగా ఉంటే, ఇంకా ఎక్కువ దృష్టితో ఆ బాధకూడా ఎక్కువ కాదా? నిగూఢ శక్తుల వల్ల ఎవ్వరికీ సంతోషముండదు. బాధే ఎక్కువవుతుంది. పైగా, ఈ సిద్ధులన్నీ ఎందుకు? తనకి సంక్రమించిన సిద్ధులని ప్రదర్శించాలనీ, అందరూ తనని మెచ్చుకోవాలనీ సిద్ధుడు అనుకుంటాడు. ఆ మెప్పురాకపోతే, బాధ పడిపోతాడు. అతనిని మెచ్చుకోవటానికి వేరొకళ్లు ఉండాలి. అతని కన్నా ఎక్కువ సిద్ధులున్న వాళ్లూ తటస్థపడవచ్చు - దాని వల్ల ఈర్ష్యా, వ్యాకులపాటూ ఎక్కువవుతాయి.

అసలైన శక్తి ఏమిటి? సంపదని పెంపొందించు కోవటాన్నా, శాంతినా? శాంతినిచ్చేదే ఉత్తమోత్తమమైన సిద్ధి!

# 16.సమస్యలు - అనుభూతులు

ఆధ్యాత్మిక అభ్యాసాలను చేసేవాళ్లు రకరకాల అనుభూతులకు లోనవుతారు: భౌతికమైన బాధ, అస్వస్థత, మానసిక అరాచకం, ఉద్రేకతరంగాలు, అప్పుడప్పుడు కలిగే ఆనందమయ స్థితులూను. గడచిన రెండు అధ్యాయాలలో వివరించిన అనుభూతులంత ప్రగాఢంగా ఇవి ఉండకపోయినా, ఆ అనుభూతులకు లోనైన వారికి మాత్రం ఆసక్తిదాయకాలే ఆత్మజ్ఞానం పొందాలంటూ చేసే ప్రయాణంలో వీటిని అవాంతరాలుగా గాని, గొప్ప సంఘటనలుగా గాని వ్యాఖ్యానించుకుంటారు. ఆ వ్యాఖ్యానానికి అనుగుణంగా వాటిని వారించు కోవటానికో, వృద్ధి చేసుకోవటానికో ఎన్నో ప్రయత్నాలు కూడ చేస్తారు.

ఈ ఆధ్యాత్మిక అనుభూతులకు శ్రీరమణులు అంత ప్రాధాన్యమిచ్చేవారు కారు. ఎవరైనా వాటి గురించి చెప్పితే, ఆ అనుభవం పొందే వాని పట్లే ధ్యాస ఉండాలిగాని, ఆ అనుభవంలో నిమగ్నమవటంగాని, అనుభవాన్ని విచ్ఛేదం చేయటంగాని అనుచితమనేవారు. ఒక్కొక్క సారి ఆ అనుభవాలకి కారణాలని విశ్లేషించి, అవి ఆత్మసాక్షాత్కారానికి దోహదం చేస్తాయో, చేయవో చెప్పినా, స్థూలంగా మాత్రం వాటిలో ఆసక్తిని పెంపొందించు కోవద్దనే వారు.

ధ్యానం చేసుకొనేప్పుడు ఎదురయే సమస్యలను భక్తులు విన్నవించుకొని, వారి సలహాలను కోరినప్పుడు మాత్రం ఇంకొంచెం ముందుకు వచ్చేవారు. వాళ్ల సమస్యలను ఓర్పుతో వినేవారు, ఉచితరీతిని సమాధానాలనిచ్చేవారు. ఒక్కొక్కసారి అవసరమనిపిస్తే, ఆత్మని దృష్టిలో పెట్టుకున్న వారికి అవి సమస్యలు కానే కావనే వారు.

ప్ర: ఒక్కొక్కసారి చైతన్యజ్యోతులు వెలిగిపోతూ తెలుస్తాయి. ఇవి నాకు బయటనే కేంద్రీకృతమైనట్టు, సర్వవ్యాప్తమైనట్టూ అనిపిస్తుంది. వాటికి సంబంధించిన తత్త్వాన్ని ప్రక్కన పెట్టి, ఆ కాంతులనే సంపాదించుకొని, నిలువుకొని, పెంపొందిచు కోవాలంటే నేనేమి చేయాలో శ్రీ భగవాన్ చెప్తారా? దానికి సంబంధించిన అభ్యాసానికై నివృత్తి అవసరమా?

జ: "బయట" అన్నావు. లోపలా - బయటా ఎవరికున్నాయి? కర్తా-కర్మా ఉంటేనే కదా ఇవి సంభవం? ఈ రెండూ కూడా ఎవరికి? పరిశీలిస్తే ఉండేది కర్తేనని తెలుతుంది. ఈ కర్త ఎవరో గమనించు. ఆ విచారణ నిన్ను శుద్ధ చైతన్యానికి తీసికొని వెళ్తుంది. అది కర్తకి అతీతం.

"నాకు" అన్నావు. ఇక్కడ, 'నాకు' అంటే మనస్సుకి అని అర్థం. మనస్సుకి పరిమితులున్నాయి. కాని శుద్ధ చైతన్యానికి అవి లేవు- దానిని అందుకోవటానికి "నేను" ఎవరనే విచారణ చేయాలి.

"సంపాదించుకొని" అన్నావు. ఆత్మ ఎప్పుడూ ఉండనే ఉంది. ఆత్మని మరుగుపరచే తెరనే నీవు తొలగించాలి. "నిలుపుకొని" అన్నావు. ఆత్మసాక్షాత్కారమయితే, అది నీ ప్రత్యక్షానుభూతే అవుతుంది. అది పోదు.

“పెంపొందించుకోవాలి" అన్నావు. ఆత్మని పెంపొందించు కోవటమంటూ ఏమీ లేదు. దానికి వ్యాకోచ, సంకోచాలంటూ లేవు. ఎప్పుడూ ఒకే స్థితిలో ఉంది.

"నివృత్తి" అన్నావు. ఆత్మకి భిన్నంగా వేరేమీ లేదు. అందువల్ల ఆత్మనిష్టే నివృత్తి. ఒక స్థలం నుంచిగాని, ఒక అవస్థనుంచిగాని మరొకదానికి వెళ్లటమే నివృత్తి అంటే. ఒకటిగాని, మరొకటిగాని అంటూ ఏమీ లేదు ఆత్మకి. అంతా ఆత్మే అవటం వల్ల, నివృత్తి అసంభవం, అనూహ్యంకూడా.

"అభ్యాస" మన్నావు. సహజంగా ఉండే ప్రశాంతతకి అలజడిని నివారించటమే అభ్యాసం. నీవు అభ్యాసం చేసినా చేయకపోయినా నీవు సహజస్థితిలోనే ఉన్నావు. ఏ సంకోచమూ, ఏ ప్రశ్నా లేకుండా యథాతథంగా ఉండటమే నీ సహజస్థితి.

ప్ర: ఒకోసారి మనుష్యులూ, వస్తువులూ కలలో వలె అస్పష్టంగానో, పారదర్శకంగానో అయిపోతాయి. బయటనుంచి వాళ్లని గమనించకపోయినా వాళ్లు ఉన్నట్టు సాత్త్వికంగా ఎరుక ఉంటుంది. మనస్సు ఎంతో ప్రశాంతంగా ఉంటుంది. అటువంటప్పుడు మనస్సు ఆత్మలో నిమజ్జనం కావటానికి సిద్ధమైనట్టు అర్థమా? ఈ స్థితి మంచిదా లేక ఇదంతా స్వయంగా కల్పించుకున్న సమ్మోహనానికి ఫలితమా? తాత్కాలిక శాంతిని పొందటానికి ఈ అవస్థనే ఇంకా పొడిగించుకోవాలా?

జ: ఎరుకా, మనశ్శాంతి ఒకే సారి ఉన్నాయన మాట. ఈ స్థితిని అందుకోవటానికే ప్రయత్నించాలి. అది ఆత్మేనని తెలియకపోవటం వల్లనే ఈ ప్రశ్న ఇప్పుడు దయించింది. దీనిబట్టి ఆ స్థితి స్థిరంకాదనీ యాదృచ్ఛికమేననీ తెలుస్తోంది. "నిమజ్జనమవటం" అనే పదాన్ని ఎప్పుడుపయోగించాలంటే బాహ్య విషయాల వల్ల మనస్సు ఆకర్షితం కాకుండా,

లోపలికి త్రిప్పు కోవటాన్ని సూచించటానికే. అటువంటి సమయాలలో ఉపరితలంలోని విషయాలని దాటి లోతుగా వెళ్లాలి. కాని సచేతనంగా ఉన్నా, మనస్సు ఎంతో ప్రశాంతంగా ఉంటే ఇంక నిమజ్జనమవవలసిన అవసరమేముంది?

ప్ర: ధ్యాన సమయాలలో ఒకోసారి ఆనందం కలుగుతుంది. అప్పుడు, "ఆనందం పొందేదెవరు?" అని నన్ను నేను ప్రశ్నించుకోవాలా?

జ: అది ఆత్మానుభూతి వల్ల కలిగే ఆనందమే అయితే, అంటే మనస్సు ఆత్మలో నిజంగానే విలీనమైనప్పుడు కలిగే ఆనందమే అయితే, ఈ సందేహం రానేరాదు. ఆ ఆనందం ఇంకా అందలేదని ఈ ప్రశ్న వల్ల స్పష్టమవుతోంది. సంశయాత్మకుడ్నీ, అతని మూలాన్ని కనుగొన్న తరువాతే అన్ని సందేహాలూ పోతాయి. ఒక్కొక్క సందేహాన్ని తొలగించుకుంటూ పోవటంలో అర్థం లేదు. ఒక సందేహాన్ని తీర్చుకుంటే వేరొకటి వస్తుంది. అట్లా సందేహాలు ఎడతెగకుండా వస్తూనే ఉంటాయి. సంశయాత్మకుని మూలం అన్వేషిస్తే, అసలు అతను లేనే లేడని తేలుతుంది. అన్ని సందేహాలూ పోతాయి.

ప్ర: ఒక్కొక్కసారి లోపల ఏవో ధ్వనులు వినబడుతాయి. అటువంటప్పుడేం చెయ్యాలి?

జ: ఏమి జరిగినా, ఆత్మవిచారణ కొనసాగించు. "ఈ ధ్వనులు ఎవరికి వినబడుతున్నాయి" అని ప్రశ్నించుకుంటూ ఉండు, సత్యం తెలిసే దాకా.

ప్ర: ఒకోసారి ధ్యానంలో ఆనందభాష్పాలు రాలుతాయి. మరికొన్ని సమయాలలో అవి రావు. ఎందువల్ల?

జ: ఆనందమనేది ఎప్పుడూ ఉంటూనే ఉంది - వస్తూపోయేది కాదది. వస్తూపోతూండే దానిని మనస్సే కల్పిస్తుంది. దాని గురించి నువ్వు పట్టించుకోనక్కర్లేదు.

ప్ర: ఆనందాతిరేకంలో ఒళ్లు జలదరిస్తుంది. అది పోగానే, కృంగిపోతాను. ఆ అనుభూతి మళ్లీ కావాలనిపిస్తుంది. ఎందువల్ల?

జ: ఆ ఆనందం కలిగినప్పుడూ, అది పోయినప్పుడూ కూడా నీవే ఉన్నావు కదా. ఆ "నీవు ఎవరో సరిగ్గా అర్థం చేసుకుంటే ఆ అనుభూతులు అంత ప్రధానం కావని తెలుస్తుంది.

ప్ర: ఆ ఆనందాన్ని అనుభవసిద్ధం చేసుకోవటానికి దేనినో పట్టుకొని ఉండాలి కదా?

జ: దేనినన్నా పట్టుకొని ఉండాలంటే, ద్వియీ భావముండాలి. కాని ఉన్నదల్లా ఒకే ఒకటి, అది ఆత్మ - రెండవదంటూ లేదు దానికి. కాబట్టి, ఎవరు దేనిని పట్టుకోవాలి? పట్టుకోవలసింది ఏమిటి?

ప్ర: నా సాధనలో ఏ భావమూ లేని స్థితిని చేరుకోగానే ఒక విధమైన సంతోషం కలుగుతుంది, కాని ఒకోసారి నేను చెప్పలేని భయంకూడా వేస్తుంది.

జ: నీకే అనుభూతి అయినా కలుగవచ్చు. కాని దానితో సంతృప్తి చెందకూడదు. నీకు సంతోషం కలిగినా, భయం వేసినా ఆ సంతోషంగాని, భయంగాని ఎవరికి కలుగుతున్నాయో పరిశీలించుకో, ఏ సంతోషమూ, భయమూ, ఏ విధమైన ద్వియీ భావమూ లేకుండా, ఒకే ఒక సత్యం నిలచే స్థితిని చేరే వరకూ నీ సాధనని కొనసాగనీ, ఆ అనుభూతులు కలగటంలో ఏ దోషమూ లేదు కాని వాటితోనే ఆగిపోకూడదు. ఉదాహరణకి, భావాలన్నిటినీ అణచివేసినప్పుడు, మనోలయమై ఎంతో ఆనందం కలుగుతుంది అంతటితో సంతృప్తి చెందక, ద్వియీ భావమే లేని స్థితిని చేరే వరకూ సాధనని కొనసాగించు.

ప్ర: భయాన్ని వదిలించు కోవటమెట్లా?

జ: భయమంటే ఏమిటి? అదీ ఒక భావమే. ఆత్మకి భిన్నంగా ఏదైనా ఉంటే, భయముంటుంది. ఆత్మకి భిన్నంగా దేనినైనా చూచేదెవరు? మొదట అహంకారముదయించి, తనకి బయట ఉన్నట్టు వస్తుజాలాన్ని చూస్తుంది. అహంకారముదయించక పోతే, ఉండేదల్లా ఆత్మే - అప్పుడు, బాహ్యంగా ఏమీ ఉండదు. తనకి బయట ఏవో ఉన్నాయంటే, లోపల ద్రష్ట ఎవరో ఉన్నట్టే అర్థం. ఆ లోపలి వానిని అన్వేషిస్తే సందేహమూ, భయమూ పోతాయి. భయమే కాదు, అహంకారాన్ని చుట్టుకొని ఉన్న అన్ని భావాలూ దానితో బాటే పోతాయి.

ప్ర: మృత్యువంటే భయమెట్లా పోతుంది?

జ: ఆ భయం నీకెప్పుడు కలుగుతుంది? నీవు గాఢ నిద్రలో ఉన్నప్పుడు నీకు శరీరధ్యాస ఉండదు. అప్పుడా భయముంటుందా? నీవు పూర్తిగా మేల్కొని,నీ శరీరాన్ని, ప్రపంచాన్ని చూస్తున్నప్పుడే ఆ భయముంటుంది. కలలులేని నిద్రలో వలె నీవు వీటిని చూడకుండా, కేవలం ఆత్మగానే ఉన్నప్పుడు ఏ భయమూ నిన్ను సోకలేదు.

ఏదో పోతుందన్న భావమే భయాన్ని కలిగిస్తుంది. ఆ పోయేదేమిటి అని విచారిస్తే అది నీ శరీరంకాదనీ, అందులో పనిచేసే మనస్సనీ తేలుతుంది. తనకి ఎల్లప్పుడూ ఎరుక ఉండేట్టయితే, ఈ రోగపీడితమైన శరీరాన్ని, దాని వల్ల కలిగే ఇబ్బందినీ వదిలించుకోవటానికి అందరూ సిద్ధమే. పోతుందని అతను భయపడేది ఈ ఎరుకని, ఈ చైతన్యాన్ని, జీవించి ఉండటమంటే, సదా ఎరుక కలిగి ఉండటమే. అదే వారి ఆత్మ. ఇదంటేనే అందరికీ ప్రీతి. అటువంటప్పుడు ఈ దేహంలో ఉంటూనే ఆ శుద్ధ చైతన్యాన్నే పట్టుకొని ఎందుకుండ కూడదు? అన్ని భయాలనీ ఎందుకు వదిలించుకోకూడదు?

ప్ర: ఏ భావమూ లేకుండా ఉండటానికి ప్రయత్నించినప్పుడు నాకు నిద్రవస్తుంది. నేనేం చేయాలి?

జ: నిద్రపోతే, ఆ స్థితిలో ఏమీ చేయలేవు. కాని మేల్కొని ఉండగానే ఏ భావమూ లేకుండేట్టు ప్రయత్నించు. నిద్ర గురించి ఆలోచించట మెందుకు? అది కూడ ఒక భావమే కదా? మేల్కొని ఉండగా ఏ భావమూ లేకుండా ఉండగలిగితే చాలు. నీకు నిద్రవస్తే, అంతకు పూర్వమున్న స్థితే మేల్కొనగానే కొనసాగుతుంది. నిద్రపోయే ముందు ఎక్కడ విడిచిపెట్టావో అక్కడ్నుంచే మళ్లీ అందుకుంటుంది. ఏదో ఒక వ్యాపకం గురించి ఆలోచనలుంటే, నిద్ర కూడా ఉంటుంది. నిద్రా ఆలోచనా రెంటికీ పరస్పర సంబంధముంది. మనమతిగా నిద్రపోకూడదు, అసలు నిద్రే లేకుండానూ ఉండకూడదు మితంగా నిద్రిపోవాలి. అతిగా లేకుండా చేసుకోవాలంటే ఏ ఆలోచనలుగాని, చలనంగాని లేకుండా, మితంగా సాత్వికమైన ఆహారం తీసుకోవాలి, భౌతికమైన పనిని కూడా ఎక్కువ చేయకూడదు. ఆలోచనలనీ, ఆహారాన్నీ, వ్యాపకాలనీ నిగ్రహించిన కొద్దీ నిద్రని కూడ నిగ్రహించవచ్చు. కాని, గీతలో చెప్పినట్లు సాధకునికి అన్నిటిలోనూ "మితం" అవసరం. సాధకులందరికీ మొదటి అవరోధం, నిద్ర. రెండవది, విక్షేపం - అంటే ప్రపంచంలోని విషయాలు- ఏకాగ్రతని చెడగొట్టేవి. మూడవది కషాయ గడచిపోయిన విషయానుభూతలకి సంభంధించిన ఆలోచనలు. నాల్గవది, ఆనందం. దీనిని కూడ అవరోధమనే అంటారు. ఎందుచేతనంటే, ఆ స్థితిలో ఆనందానికి మూలస్థానం నుండా ఎడబాటు కలిగి, “నేనిప్పుడు ఆనందంగా ఉన్నాను" అనే భావం కలగటం చేత. దీనిని కూడా అతిక్రమించాలి. ఆఖరి దశ అయిన సమాధిని చేరాలి. ఇందులో, మనిషి ఆనందంతో, లేక సత్యంతో ఏకమైపోతాడు. ఈ స్థితిలో ఆనందించేవాడూ, ఆనందమూ అనే ద్వమూ భావం పోతుంది, సత్ - చిత్ ఆనందం, లేక ఆత్మ అనే మహాసముద్రంలో.

ప్ర: అంటే ఈ ఆనందమయస్థితినిగాని సంతోషాతిరేకాన్నిగాని పెంపొందించు కోవటానికి ప్రయత్నించకూడదన మాట.

జ: ధ్యానంలో ఆఖరి అవరోధం సంతోషాతిరేకం. ఎంతో ఆనందం కలుగు తున్నప్పుడు ఆ స్థితిలోనే ఉండాలనిపిస్తుంది. దానికి వశంకాక, ఆ తరువాతి స్థితి అయిన ప్రశాంతతకి వెళ్లు. ఆ ప్రశాంతతే సంతోషాతిరేకం కంటే గొప్పది, సమాధిలో విలీనమవుతుంది. సమాధి సఫలవంతమైనప్పుడు మెలకువలోనే నిద్రావస్థని కలిగిస్తుంది. ఆ స్థితిలో నీవు చైతన్యవంతుడవనే ఎరుక ఉంటూనే ఉంటుంది. చైతన్యమే నీ సహజస్థితి. ఆ మాటకి వస్తే, మనిషి ఎప్పుడూ సమాధిలోనే ఉంటాడు కాని ఆ విషయమెరుగడు. అది తెలియాలంటే ఉన్న అవరోధాలని ప్రక్కకు నెట్టగలగాలి.

ప్ర: కావ్యపఠనం, సంగీతం, జపం, భజనలు, ఆధ్యాత్మిక గ్రంథపఠనం, ప్రాకృతిక దంటే సౌందర్యోపాసన - ఇవన్నీ చేస్తున్నప్పుడు విశ్వవ్యాప్తమైనది, ఒకటే ఉందనిపిస్తుంది. నెం. పృథక్ భావంలేని ఆ ఆనందమయ ప్రశాంతతా, శ్రీభగవాన్ చెప్పే హృదయంలో విలీనమవటమూ, ఒకటేనా? ఈ వ్యాపకాలని అభ్యసిస్తే సమాధినీ, చివరికి, - ఆత్మసాక్షాత్కారాన్ని పొందవచ్చా?

జ: నచ్చిన వాటిని సమర్పిస్తే మనస్సుకి సంతుష్టి ఉంటుంది. ఆత్మలో సంస్థితమైన సంతుష్టే అది - వేరే సంతుష్టి ఏమీ లేదు. అది పరాయిది కాదు. నీకు సంతోషాన్ని కలిగే సమయాల్లో నీవు ఆత్మలో మునుగు తున్నావన మాట. ఆ మునగటమే ఆత్మలోనే ఉన్న ఆనందంలో కాని దీనికేవేవో భావాలను జోడించటం వల్ల ఆ సంతుష్టి బయటివాటి వల్లో, బయటి సంఘటనల వల్లనో జరిగాయని వాటికి ఆపాదిస్తాం. నిజానికి ఆనందం నీలోనే ఉంది. ఆ సమయాలలో, నీకు తెలియకుండానే నీవు నీ ఆత్మలో విలీనమవుతున్నావన్న మాట. ఆ ఆనందమే నీవనీ, అదే ఆత్మ అనే నమ్మకంతో నీవు ప్రయత్నపూర్వకంగా అట్లా విలీనమవటమే - సాక్షాత్కారం.

ప్ర: నేను ఇరవై సంవత్సరాల బట్టీ సాధన చేస్తున్నాను. కాని ఏ మాత్రమూ పురోగమించ లేదు. నేనేమి చేయాలి? ఉదయం అయిదు గంటల నుండీ - "ఆత్మ ఒక్కటే సత్యం, మిగిలిన దేదీ కాదు" అనే భావం పైనే ఏకాగ్రత పెట్టుకొని ఉంటాను. ఇట్లా ఇరవై ఏళ్ళబట్టీ చేస్తున్నా ఆ ఏకాగ్రత, రెండు మూడు నిమిషాల కంటే ఎక్కువనిలువదు. ఏవేవో భావాలుదయిస్తూనే ఉంటాయి.

జ: మనస్సు బయటకి పరిగెత్తుతున్నప్పుడల్లా దానిని వెనక్కి తీసికొని వచ్చి ఆత్మమీద లగ్నం చేయటం తప్ప వేరే మార్గం లేదు. వేరే ధ్యానంగాని, మంత్రంగాని, జపంగాని అవసరం లేదు మన సహజస్థితే అది. అనాత్మమైన వాటి గురించి ఆలోంచ కూడదు. చేయవలసిందల్లా అదే. మనస్సుని వాటివైపు వెళ్లనీయకుండా లోపలికి మళ్ళించి, ఆత్మమీదే కేంద్రీకరిస్తే - మిగిలేదల్లా ఆత్మే!

ప్ర: ఏవో ఆలోచనలూ, వాంఛలూ నన్ను లాగుతూంటాయి. దానిని అధిగమించటమెట్లా? ఆలోచనలని నిగ్రహించటానికి నేనేయే నియమాలను పాటించాలి?

జ: నీవు ఆత్మపై కేంద్రీకరించటం ఎక్కువైన కొద్దీ ఆలోచనలు వాటంతటవే రాలిపోతాయి. మనస్సు, ఆలోచనల సమూహమే తప్ప మరేమీ కాదు. ఆలోచనలన్నిటికీ మూలం "నేను" అనే భావం. ఈ “నేను” ఎవరోగమనిస్తే, అది ఎక్కడనుంచి ఉద్భవిస్తోందో కనుగొంటే, అన్ని వాంఛలూ ఆత్మలో విలీనమయిపోతాయి.

ఆత్మవిచారం అంటే ఇష్టంలేని వారికీ, ఆత్మవిచారాన్ని చేయలేని వారికోసమే కొన్ని నియమాలున్నాయి. అంటే, ఒక నిర్ణీతసమయానికి నిద్రలేవటం, స్నానం చేయటం, మంత్రం, జపం, ఆచారాలనుపాటించటం వంటివి. ఆత్మవిచారం చేయగలిగిన వారికి ఈ నియమాలన్నీ అనవసరం.

ప్ర: ఎంత ప్రయత్నించినా, మనస్సు లోపలికి వెళ్లదు. ఎందుచేత?

జ: అభ్యాసం వల్లా, వైరాగ్యం వల్లా అది జరుగుతుంది కాని నెమ్మదిగా ఫలిస్తుంది. పొరుగువారి పొలాలలోకి వెళ్ళి గడ్డిని మేయటానికి అలవాటు పడ్డ గోవుని పాకలో ఉంచటం కష్టం. మనస్సూ అంతే. పాలేరు ఆ గోవుకి ఎంత మంచి గడ్డిని ఇచ్చినా మొదట్లో అది తీసుకోదు. కాస్సేపటికి కొద్దిగా తీసుకుంటుంది -అవకాశం రాగానే తన స్వభావాన్ననుసరించి బయటకి పోతుంది. పాలేరు అట్లా ప్రలోభపెట్టగా, పెట్టగా పాకలో ఉండటానికి అలవాటు పడుతుంది. ఇక దానిని కట్టేయకుండా విడిచినా, బయటికి పోదు. మనస్సూ అంతే, లోపలి ఆనందాన్ని చవిచూస్తే బయటకి వెళ్లదు.

ప్ర: పరిస్థితులబట్టి ధ్యానంలో కూడా ఎత్తుపల్లాలుండవా?

జ: ఉంటాయి. ఒకోసారి నిర్మలంగా ఉంటుంది. ధ్యానం తేలిక అవుతుంది. ఒకోసారి ఎంత ప్రయత్నించినా, ధ్యానం కుదరదు. సత్వరజస్తమో గుణాల ప్రభావమే అది.

ప్ర: మన వ్యాపకాలకీ, పరిస్థితులకీ ప్రభావముండదా?

జ: ఉండదు. కర్తృత్వ భావమే అవరోధం.

ప్ర: నా మనస్సు నిర్మలంగా రెండు మూడు రోజులుంటుంది- ఆ తరువాత బద్ధకంగా అయిపోతుంది, మళ్ళీ నిర్మలమవుతుంది - ఎందువల్ల?

జ: అది సహజమే. స్వచ్ఛత, చలాకీతనం, బద్ధకం - అంటే సత్త్వరజస్తమోగుణాలు - ఒకదాని తరువాత ఒకటి పనిచేయటం వల్లనే. బద్ధకం (తమస్సు) వచ్చిందని బాధపడకు. కాని సత్త్వగుణం పనిచేస్తున్నప్పుడు దానిని విడువకుండా పట్టుకో సాధ్యమైనంత లబ్ధిపొందు.

ప్ర: ఒకోసారి శరీరం ధ్యానాన్ని కుదరనీయదు. అందుకై యోగాభ్యాసాన్ని చేసి శరీరాన్ని లొంగదీసుకోవాలా?

జ: అది వాళ్ల వాళ్ల సంస్కారాలను బట్టి ఉంటుంది - జబ్బుని నయం చేసుకోవటానికి ఒకడు హఠయోగాభ్యాసం చేస్తాడు, మరొకడు భగవంతుడ్ని నమ్ముతాడు. ఇంకొకడు తన సంకల్పబలాన్ని నమ్ముతాడు. నాలుగో వాడు ఆ జబ్బుని నిర్లక్ష్యం చేయవచ్చు! అందరూ ధ్యానం చేసుకుంటూనే ఉంటారు. ఆత్మాన్వేషణే ప్రధానం. మిగిలిన వన్నీ అప్రధానం.

ప్ర: ఏకాగ్రతని నిలుపుకుందామంటే దానిని భంగపరుస్తూ గుండెదడా, సరిగ్గా ఊపిరాడకపోవటం జరుగుతూంటాయి. అప్పుడు నా మనస్సు నా ఆధీనంలో ఉండదు. ఆలోచనలన్నీ బయటకి పరిగెత్తుతాయి. ఆరోగ్యంగా ఉన్నప్పుడు మంచి ఏకాగ్రత కుదురుతుంది, శ్వాసకూడ నిశ్చలమవుతుంది. నా ధ్యానం సఫలం కావాలని శ్రీ భగవాన్ సన్నిధిలో ఉంటే అట్లా అవుతుందని అనుకుంటూ ఎంతో ప్రయాసపడి ఇక్కడికి వచ్చాను. ఇక్కడికి వచ్చింతర్వాత జబ్బు పడ్డాను. ధ్యానం కుదరక, ఎంతో చింతలో పడ్డాను. ఊపిరి సరిగ్గా ఆడకపోయినా ఏ కాగ్రతని నిలుపుకుందామని ఎంతో ప్రయత్నించాను. కొంత మేలు జరిగినా, నాకింకా సంతృప్తిగా లేదు. ఇక నేను వెళ్లి పోవలసిన సమయం దగ్గర పడుతోంది. “ఇక్కడున్నంచి వెళ్లాలే" అన్న దిగులు కూడ పట్టుకుంటోంది. ఈ హాలులో కూర్చుని ధ్యానం చేసుకుంటూ ఎంతో మనశ్శాంతిని ఎందరో పొందుతున్నట్టు చూస్తున్నాను. కాని నాకా శాంతి దొరకటం లేదు. ఇదే నాకు వ్యాకులపాటుని కలిగిస్తోంది.

జ: "నేను ఏకాగ్రతను నిలుపుకో లేక పోతున్నా న"నే భావమే అసలైన అవరోధం. ఆ భావమెందుకు ఉదయించాలి?

ప్ర: ఆలోచనలే ఉదయించకుండా ఇరవైనాలుగు గంటలూ గడపటం సాధ్యమేనా? ధ్యానం చేయకుండా ఉండాలా?

జ: "గంటల"న్నావు అవేమిటి? అది ఒక భావనే. నీవు వేసే ప్రతి ప్రశ్నకీ ప్రేరణ ఆలోచనే! ఎప్పుడైనా ఒక ఆలోచన వస్తే దానినే వెంబడించకు ఆత్మని మరచినప్పుడే నీకు శరీర ధ్యాస ఉంటుంది. కాని ఆత్మని మరువగలవా? నీవే ఆత్మవి, ఇంక మరువటమేమిటి? అంటే, రెండు న్నాయన మాట ఒకటి రెండవదానిని మరువటానికి. అది అర్థరహితం. అందువల్ల ఆత్మకి వ్యాకులత అంటూ ఏమీ లేదు. అది అసంపూర్ణం కాదు. ఎప్పుడూ సంతోషంగానే ఉంటుందది. దీనికి విరుద్ధమైన అనుభూతి కేవలం ఒక ఊహ. దానికి వేరే సత్తా ఏమీ లేదు. ఆలోచనలన్నింటినీ వదిలించుకో.

నీ అస్వస్థత నీ ధ్యానానికి అడ్డనుకుంటున్నావు. ఈ దిగులుకి మూలమేమిటో కనుక్కోవాలి. దేహమే ఆత్మ అనుకోవటమే మూలకారణం. జబ్బు ఆత్మకి కాదు, శరీరానికి. "నాకు జబ్బుగా ఉంది" అని శరీరం వచ్చి నీతో చెప్పదు, ఆ మాట అనేది నువ్వు. ఎందువల్ల? దేహమే నీవని తప్పుగా తాదాత్మ్యం చెందుతున్నావు కాబట్టి. శరీరమే ఒక భావన. నీవు నీ సహజస్థితిలోనే ఉండు, దిగులు పడవలసిన అవసరం లేదు.

ప్ర: ధ్యానం చేసేటప్పుడు ఏ దోమో కుట్టడం వల్ల అంతరాయ మేర్పడిందనుకోండి. దానిని లెక్క పెట్టకుండా ధ్యానం చేసుకోవాలా లేక ఆ దోమని తరిమివేసి మళ్ళీ ధ్యానం చేసుకోవాలా?

జ: నీకేది వీలయితే అదే చేసుకోవాలి. దోమని తరిమి వేసినంతమాత్రాన ముక్తిరాదు. ఏకాగ్రతను పొంది, మనస్సుని నాశనం చేసే స్థితిని అందుకోవాలి. దానికై దోమ కాట్లని భరించాలా, దోమలని తరిమివేయాలా అన్నది. నీ యిష్టం. ధ్యానంలో పూర్తిగా నిమగ్నమయితే, దోమలు నిన్ను కుట్టుతున్నాయని నీకు తెలియదు. ఆ స్థితిని చేరుకునే వరకూ వాటిని తరిమి వేయటంలో తప్పేముంది?

ప్ర: ధ్యానం చేసుకునే వాళ్లకి ఏవేవో కొత్త జబ్బులు వస్తాయంటారు - నా మట్టుకు నాకు వెన్నులోనో, ఛాతీలోనో నొప్పి వస్తున్నట్లనిపిస్తుంది. ఇదంతా భగవంతుడు చేసే పరీక్షేనంటారు. ఇది నిజమేనా? దీనికి కారణమేమిటి?

జ: నీకు వెలుపల భగవంతుడంటూ ఎవ్వరూ లేరు. ఏ పరీక్షా పెట్టడు. ఆధ్యాత్మిక అభ్యాసాల వల్ల నీకేదో పరీక్ష జరుగు తోందనీ, వింత జబ్బు వచ్చిందనీ అనుకుంటున్నావే - అదంతా నీ నరాలమీదా, పంచేంద్రియాల మీదా కలిగే వత్తిడి. మనస్సు నాడుల ద్వారా బయటి ప్రపంచంతో సంబంధాన్ని ఇంద్రియాల సహాయంతో ఏర్పర్చుకుంటుంది మామూలుగా. ఇప్పుడా సంబంధాన్ని తెంచుకోవలసిన అవసరం వచ్చింది. ఆ ఉపసంహరణ వల్ల కొంత ఒత్తిడి, బాధా కలగటం సహజమే. దీనినే కొందరు జబ్బంటారు. మరికొందరు - భగవంతుడు చేసే పరీక్ష అంటారు. దృష్టిని ఆత్మసాక్షాత్కారం పైనే కేంద్రీకరించి, ధ్యానాన్ని కొనసాగిస్తూంటే ఈ నొప్పులన్నీ వాటంతటవే పోతాయి. ఎప్పుడూ భగవంతునితో ఆత్మతో సంయోగాన్ని నిలుపుకోవటమే అన్నిటికన్నా గొప్ప ఔషధం. ఇన్నాళ్ల బట్టీ ఉన్న వాసనలని విసర్జించటంలో బాధ తప్పదు.

ప్ర: వాంఛలనీ, వాసనలనీ వదిలించు కోవటానికి ఉత్తమమైన మార్గమేమిటి - వాటిని సంతృప్తి పరచుకోవటమా, లేక వాటిని అణచి వేయటమా?

జ: ఒక వాంఛని సంతృప్తి పరచుకోవటంతో అది పోతుందనుకుంటే, సంతృప్తి పరచుకోవటంలో తప్పులేదు. కాని సాధారణంగా తీర్చుకోవటం వల్ల వాంఛలు పోవు. సంతృప్తి పరచుకోవటం వల్ల వాంఛలని రూపుమాపబోవటం, అగ్నిని ఆర్పటానికి ఆజ్యం పోయటం వంటిదే. అయినా, బలవంతంగా వాటిని అణచివేయటమూ మంచి పనికాదు. అట్లా బలవంతంగా అణిచివేస్తే ఎప్పుడో ఒక్కసారి వాంఛలు పెల్లుబికి, అవాంఛనీయ పరిణామాలకి దారితీస్తాయి. వాంఛని వదిలించు కోవటానికి సరియైన పద్ధతి ఏమిటంటే, “ఈ వాంఛ కలిగే దెవరికి? అది ఎక్కడనుంచి బయలు దేరుతోంది"? అని ప్రశ్నించుకొని, పరిశీలించటం. ఆ మూలాన్ని కనుగొంటే, వాంఛ నిర్మూలమవుతుంది. మళ్ళీ తల ఎత్తదు. చిన్న చిన్న కోరికలు, అంటే తినటం, త్రాగటం, నిద్రపోవటం, కాల కృత్యాలు తీర్చుకోవటం వంటివి కూడా కోరికలే అయినా వాటిని తీర్చుకోవచ్చు ఏ హానీ లేకుండా. వాటి వల్ల మనస్సులో వాసనలు నాటుకోవు, వాటిని సంతృప్తి పరచుకోవటానికి మళ్లీ జన్మనెత్తాల్సిన అవసరమూ రాదు. అవన్నీ బ్రతికి ఉండటానికి అవసరమైన కార్యకలాపాలు, వాటి వల్ల వాసనలు పెంపొందే అవకాశం లేదు. ఒక వాంఛని సంతృప్తి పరచుకోవటం వల్ల, ఇంకా కొన్ని వాంఛల ను తీర్చుకోవాలనే వాసనని మనస్సులో పెంపొందించని వాంఛలను తీర్చు కోవచ్చని స్థూలంగా చెప్పుకోవచ్చు.

ప్ర: ధ్యానం చేసుకొనేప్పుడు తాను ఆత్మసాక్షాత్కారం దిశగా పురోగమిస్తున్నానా లేదా అని ఎట్లా తెలుస్తుంది, దీనికి నిదర్శనా లేమిటి?

జ: అనవసరమైన ఆలోచనలనుండి విముక్తి, ఒకే భావంపై మనస్సు నిలవటం - ఇవే పురోగతికి నిదర్శనాలు.

ఆరవ భాగము:-

# సిద్ధాంతము

ఆత్మాన్వేషణ ద్వారా సత్యాన్ని గ్రహించటానికి ఉపకరింపని తాత్త్విక చర్చలన్నీ వృథాయే.

సృష్టి, విశ్వం యొక్క లక్షణం, పరిణామం, భగవంతుని ప్రయోజనం - ఇత్యాది విషయాలపై కల వాగ్వివాదాలన్నీ వృథాయే! మన ఆనందానికవేమీ ఉపకరించవు. "నేను ఎవరిని" అనే ప్రాథమికమైన లోపలి విషయాన్ని కనుక్కోక, బయటివాటి గురించి పరి శీలన కొనసాగిస్తూంటారు అందరూ. మనకి ఆనందాన్నిచ్చేది ఆ ప్రాథమిక మైనదే!

## 17 సృష్టి గురించి సిద్ధాంతాలు - విశ్వానికి సంబంధించిన వాస్తవము

ఆధ్యాత్మికతకి సంబంధించిన సిద్ధాంతాలంటే శ్రీరమణులకు ఆసక్తి లేదు. ఉన్నా స్వల్పమే. ఆత్మానుభూతిని పొందాలనే వారికి అభ్యాసమే ప్రధానంగాని, ఊహాగానాలు కావు. సిద్ధాంతపరమైన ప్రశ్నలు ఎవరన్నా అడిగితే వారు జవాబివ్వక మౌనంగా ఉండేవారు. లేదా, ఆ ప్రశ్నని అడిగేదెవరో కనుక్కోమని పృచ్ఛకునికి చెప్పేవారు. అప్పుడప్పుడు తత్త్వానికి సంబంధించిన విషయాలపై కొంత వివరణ ఇచ్చేవారు. కాని చర్చని దీర్ఘమైన ప్రశ్నలతో కొనసాగించినా, వ్యర్థ ప్రసంగాల ధోరణి కనబడినా వారు విషయాన్ని మార్చి పృచ్ఛకుని దృష్టిని కార్యాచరణం వైపు మరల్చేవారు.

ఈ చర్చలు చాలా మట్టుకు ఈ భౌతిక జగత్తు యొక్క ఆవిర్భావం, లక్షణం గురించే ఉండేవి. దీనికొక కారణముంది. ఈ విషయాలపై సాధారణంగా లోకంలో ఉన్న అభిప్రాయాలకు శ్రీరమణుల భావాలు విరుద్ధమైనవి. పృచ్ఛకుల మానసిక వికాసాన్ని దృష్టిలో పెట్టుకొనే వారు సమాధానాలిచ్చేవారు. అయినా, భతిక యదార్థం గురించి అందరికీ సామాన్యంగా ఉండే అభిప్రాయాలకి వారి ధోరణి పూర్తిగా విరుద్ధమే.

భౌతిక ప్రపంచం గురించి మాట్లాడేటప్పుడు శ్రీరమణులు మూడు విభిన్న దృక్కోణాలనుంచి చెప్పేవారు. ఈ క్రింద చెప్పబడిన మూడు సిద్ధాంతాలనీ ఎప్పుడో ఒకప్పుడు సమర్థించినా, మొదటి రెండు సిద్ధాంతాలే వారి దృష్టిలో కొంత సమర్థనీయాలని తెలుస్తుంది.

1. అజాతవాదం (పుట్టుక లేదనే వాదం): ప్రాచీన భారతీయ సిద్ధాంతాలలో ఇదొకటి. దీని ప్రకారం, ప్రపంచానికి సంబంధించిన సృష్టి కార్యమంటూ ఏమీ లేదు. భౌతిక ప్రపంచం సృష్టింపబడిందనే వాదానికి ఇది విరుద్ధం. దీనిని శ్రీరమణులు సమర్థించేవారు. దీనికి కారణమిది: ఏ వికారమూ లేకుండా సంస్థితమై ఉండేది ఆత్మ ఒక్కటే. అందువల్ల జ్ఞాని అనుభవంలో ఏదీ రాదు, ఏదీ పోదు. ఈ దృక్కోణానికి పర్యవసానం ఇది: దేశకాలాలు, కార్యకారణాలు, ఇవన్నీ సృష్టికి సంబంధించిన సిద్ధాంతాలలో ముఖ్యాంశాలు. కాని ఇవన్నీ అజ్ఞాని మనస్సులోనివేననీ, ఆత్మానుభూతి అయితే అవేవీ లేవని తెలుస్తుంది.

భౌతిక ప్రపంచం యొక్క వాస్తవాన్ని ఈ సిద్ధాంతం నిరాకరించదు. దానిని సంస్థితం చేసిన కార్యాన్నే లేదంటుంది. తమ స్వానుభవం నుండి శ్రీ రమణులు ఇట్లా అంటారు. జ్ఞానికి ప్రపంచం యొక్క వాస్తవికత తెలుసు. కాని అది పదార్థ - శక్తుల పరస్పర సమ్మేళనంగా కాక, అకారణంగా అభివ్యక్తమైన ఆత్మగానే దానిని గ్రహిస్తాడు. ఈ కనబడే దాని ఆధారమూ, ఆత్మ యొక్క ఉనికీ ఒకటే. అందువల్ల ప్రపంచం కూడ ఆ వాస్తవానికి రూపమే. దీనినే ఇంకో విధంగా చెప్పాలంటే, జ్ఞాని దృష్టిలో ప్రపంచం యదార్థమవటానికి కారణం అది దృగ్గోచరమవటం కాదు, అది ఆత్మకి భిన్నం కాక పోవటమే!

ఆ మూలానికీ, విశ్వానికీ భేదం లేదని అజ్ఞానికి తెలియదు. అందువల్ల తనకి ఇంద్రియాల వల్ల కలిగే అనుభూతులను తప్పుగా అర్థం చేసుకొని ప్రపంచాన్ని పరస్పర సంబంధాలు కల పదార్థాలుగా ఊహించుకుంటాడు. వాస్తవమైన ఆత్మపై మనస్సు తన కల్పనలను ముద్రవేసి కలలో చూపుతుంది. ఈ కాల్పనిక జగత్తుకూడా అంతే నంటారు శ్రీరమణులు. జ్ఞాని దృక్పథానికీ, అజ్ఞాని దృక్పథానికీ గల వ్యత్యాసాన్ని శ్రీ రమణులు ఇట్లా చెప్పేవారు: విభిన్నమైన పదార్థాల సమ్మేళనంగా మనస్సుచేసే జగత్తు మిథ్య - కాని ఆత్మకి అభివ్యక్తమైన ఒక రూపంగా చూచినప్పుడు, జగత్తు సత్యం.

2. దృష్టి - సృష్టి వాదం: పృచ్ఛకులు అజతవాదాన్ని అర్థం చేసుకో లేనప్పుడు అహం వృత్తితో బాటే ప్రపంచం కూడా ఉంటుందని శ్రీ రమణులు బోధించేవారు. దీనినే దృష్టి - సృష్టి సిద్ధాంతమంటారు. అజ్ఞానికి కనబడే ప్రపంచం అతని మానసిక కల్పనేననీ, మనస్సు లేనప్పుడు ఈ ప్రపంచమూ ఉండదనీ ఈ సిద్ధాంత సారాంశం. మనస్సు ప్రపంచాన్ని

కల్పించుకోవటం వరకూ ఈ సిద్ధాంతం సబబే. కాని ఆత్మ దృక్పథం నుంచి చూస్తే కల్పితమైన "నేను" ఒక ప్రపంచాన్ని కల్పించుకోవటమనేది అజతవాదానికేమీ విరుద్ధం కాదు. దృష్టి - సృష్టి వాదం, సృష్టి గురించి అంతిమ సత్యం కాకపోయినా, లోకవ్యవహారానికి ఉపయోగించే సిద్ధాంతంగా ఒప్పుకోమని తన అనుచరులకు శ్రీ రమణులు సలహానిచ్చేవారు. ఈ సలహాని వారిట్లా సమర్థించేవారు: ఈ ప్రపంచం మనస్సు కల్పించిన అవాస్తవమైన సృష్టి అని ఎల్లవేళలా గుర్తుంచుకుంటే, ఈ ప్రపంచం యొక్క ఆకర్షణ తగ్గిపోతుంది. అందువల్ల "నేను" అనే భావంపై ఎరుకని, ఏ అంతరాయమూ లేకుండా నిలుపుకోవటం సాధ్యమవుతుంది.

3. సృష్టి - దృష్టి వాదం (క్రమంగా జరిగే సృష్టి): ప్రపంచం ప్రత్యక్షంగా కనబడే వాస్తవమేననీ, దానికి కార్య - కారణ సంబంధితమైన నియమాలున్నాయనీ, ఇవన్నీ ఆదిలోనే జరిగిన ఒకే ఒక సృష్టికి తరువాతి పరిణామాలేననీ ఈ దృక్పథం. "బృహత్తర విస్ఫోటం" మొదలు బైబిల్ లోని సృష్టివృత్తాంతం వరకూ పాశ్చాత్యులచే ప్రతిపాదింపబడిన సిద్ధాంతాలన్నీ ఇందులో ఇమిడి ఉన్నాయి. అజత, దృష్టి - సృష్టి సిద్ధాంతాలని అంగీకరింపని పృచ్ఛకులతో మాట్లాడేటప్పుడే శ్రీ రమణులు ఈ సిద్ధాంతాన్ని ఉల్లేఖించేవారు. అప్పుడుకూడా, ఇటువంటి సిద్ధాంతాలని అంతగా పట్టించుకోనవసరం లేదనీ, అవన్నీ మేధాపరమైన జిజ్ఞాసను సంతృప్తి పరచటానికి చెప్పబడినవేనని హెచ్చరిస్తూండేవారు.

నిజానికి, దృష్టి - సృష్టి అంటే చూచినప్పుడే ప్రపంచముంటుంది, సృష్టి - దృష్టి అంటే ఎవ్వరూ దానిని చూడక పూర్వం నుంచే ప్రపంచముంది! ఈ రెంటిలో మొదటి సిద్ధాంతం విడ్డూరమనిపించినా, దానినే సాధకులు అంగీకరించాలనే వారు, శ్రీ రమణులు. దీనికి కారణమిది: సత్యానికి అదే చేరువగా ఉంటుంది. అంతేకాక ఆత్మసాక్షాత్కారాన్ని పొందాలని తీవ్రమైన ఆసక్తి ఉంటే, ఈ దృక్పథాన్ని అల వరచుకోవటమే శ్రేయస్కరం.

ప్ర: సృష్టి ఎట్లా సంభవించింది? అది అనివార్యమని కొందరూ, భగవంతుని లీల అని మరికొందరూ అంటారు వీటిలో ఏది నిజం?

జ: శాస్త్రాలలో ఎన్నో వర్ణనలున్నాయి. కాని సృష్టి అంటూ ఏమైనా ఉందా? సృష్టి అంటే ఏమైనా ఉంటేనే కదా అది ఎట్లా సంభవించిందో చెప్పగలుగుతాం. ఈ సిద్ధాంతాల గురించి మనకి తెలియక పోవచ్చు, కాని మనమున్నట్టు మనకి తెల సు. ఆ “నేను” ఎవరో తెలుసుకున్న తరువాత సృష్టి ఉన్నదో లేదో తెలుసుకో వచ్చు కదా.

ప్ర: శ్రీ శంకరాచార్యుల వేదాంతంలో ప్రారంభదశలో ఉన్న సాధకులకు ప్రపంచం యొక్క సృష్టిని సూత్రప్రాయంగా ఆమోదించారు, కాని బాగా పురోగమించిన వారికి సృష్టి అంటూ ఏమీ లేదని తెల్పారు. ఈ విషయమై మీ అభిప్రాయమేమిటి?

జ: "సృష్టిలేదు, లయమూ లేదు. బంధితుడు లేడు, ఆధ్యాత్మిక సాధకుడూ లేడు, ముక్తికాముడూ లేడు, ముక్తుడూ లేడు. ఉన్నదల్లా సత్యమే". గౌడపాదుని కారి కలో రెండవ అధ్యాయంలో ఈ శ్లోకముంటుంది. ఆత్మనిష్ఠుడు సత్యం గురించి తన జ్ఞానం వల్ల ఈ విషయాన్ని గ్రహిస్తాడు.

ప్ర: మనం చూచే ఈ ప్రపంచానికి కారణం ఆత్మే కదా?

జ: ఆత్మే ప్రపంచంగా అనేక నామరూపాలతో కనబడుతుంది. అయితే, ఆత్మ సృష్టి స్థితిలయలకు నిమిత్త కారణంకాదు. "తానే ప్రపంచంగా కనబడుతుందన్న విషయ మెరుగక, ఆత్మ గురించిన గందరగోళ మెందుకు కలుగుతుంది?" అని ప్రశ్నించకు. దాని బదులు, "ఈ గందరగోళం ఎవరికి కలుగుతోంది" అని ప్రశ్నించుకో. పరిశీలన మీద, ఆత్మకి ఏ విధమైన గందరగోళమూ లేదని తేలుతుంది.

ప్ర: అద్వైత సిద్ధాంతంలోని అజతవాదాన్ని మీరు బోధిస్తున్నట్లనిపిస్తోంది.

జ: నేను అజత వాదాన్నే బోధించను. అన్ని మతాలూ నాకు ఆమోదమే. శ్రోత యొక్క పరిపక్వాన్ని బట్టి ఉన్న వాస్తవాన్ని వివిధరీతులలో చెప్పవలసి వసుతంది. "సత్యం తప్ప వేరేమీ లేదు. పుట్టుకలేదు, చావు లేదు. సంకల్పితమైనదేదీ లేదు. ఉప సంహరింపబడేదీ ఏమీ లేదు. అన్వేషకుడు లేడు, బంధం లేదు, ముక్తిలేదు, ఉండేదల్లా ఒక్కడే, ఏకతే". ఇదే అజతవాదం. ఈ సత్యాన్ని అర్థం చేసుకోలేని వాళ్ళు, మనచుట్టూ కనబడే ప్రపంచాన్ని ఎట్లా లేదనగలమని అడుగుతారు. అటువంటి వారికి కలల అనుభవం గురించి చెప్పి, "చూచేవాడి బట్టే ఉంటుంది, చూడబడేది కూడా. దృష్టికి వేరుగా దృశ్యమంటూ ఏమీ లేద'ని చెప్తాం. దీనిని దృష్టి - సృష్టి వాదమంటారు. అంటే, మనస్సులో దేనినో సృష్టించుకొని, తరువాత మనస్సు సృష్టించిన దానినే చూస్తామని అర్థం. దీనిని కూడా కొందరు గ్రహించలేక, ఇట్లా వాదిస్తారు "కల చాలా తక్కువ సేపే ఉంటుంది, ప్రపంచం మాత్రం ఎప్పుడూ ఉంటుంది. కలనాకొక్కడికే సంబంధించిన అనుభవం. కాని ప్రపంచాన్ని నేనొక్కడినే గాక అందరూ చూస్తారు, అనుభవిస్తారు. అటువంటి ప్రపంచం లేదని అనలేం" దీనికి సమాధానం సృష్టి - దృష్టి వాదం. ఉదాహరణకి, "భగవంతుడు ఫలానా దానిని ఫలానా ధాతువులతో సృష్టించాడు. ఆ తరువాత మరొక దానిని. అదే విధంగా, మిగిలిన వాటినీ". ఆ తరహా మనుష్యులకు ఇదే సంతృప్తి నిస్తుంది. వేరే విధంగా వారికి సంతృప్తి కలగదు. "ఈ భూగోళశాస్త్రం, మ్యాపులు, శాస్త్రాలూ, నక్షత్రాలు, గ్రహాలు, వాటికి సంబంధించిన నియమాలు, పరిజ్ఞానము - ఇదంతా అవాస్తవమెట్లా అవుతుంది?" అని అడుగుతారు. అటువంటి వారితో, "దీనినంతా భగవంతుడు సృష్టించాడు నీవు చూస్తున్నావు" అనటమే శ్రేష్ఠం.

ప్ర: వీటిలో ఏదో ఒక సిద్ధాంతమే నిజం కావాలి. అన్నీ కాలేవుకదా.

జ: విద్యార్థి యొక్క సామర్థ్యాన్ని బట్టే ఈ సిద్ధాంతాలన్నీను. సత్యమొక్కటే. విశ్వమంతా ద్రష్టతో బాటే దృశ్యమానమవుతుంది. దీనినే యుగవత్ సృష్టి (ఆకస్మిక సృష్టి) అంటారు. కలలో సృష్టించబడిన వాటి వంటిదే యిదీను. అనుభవించేవాడు, అనుభవింపబడే పదార్థాలూ అన్నీ ఒకే సారి ఉత్పన్నమవుతాయి కలలో. బాహ్యవస్తు జ్ఞానం పేరుకుపోయి ఉండటం వల్ల కొందరు దీనిని అంగీకరించరు. హఠాత్తుగా సృష్టి ఎట్లా సాధ్యమని కనుగొనబోతారు. దేనికైనా ఒక కారణముండాలి అంటారు. అంటే, వారి చుట్టూ ఉన్న ప్రపంచానికి ఒక వ్యాఖ్యానం కావాలని కోరుతారు. అప్పుడు మళ్ళీ జిజ్ఞాసను సంతృప్తి పరచటానికి శ్రుతులు సృష్టికి సంబంధించిన సిద్ధాంతాలను చెప్తాయి. సృష్టిగురించి ఈ విధంగా వివరించటాన్ని క్రమసృష్టి అంటారు. కాని నిజమైన సాధకుడు యుగవత్ సృష్టి (ఆకస్మిక సృష్టి)తో సంతృప్తిపడాలి.

ప్ర: సృష్టి యొక్క ఉద్దేశమేమిటి?

జ: ఇటువంటి ప్రశ్నను అడిగించటమే! ఈ ప్రశ్నకి సమాధానాన్ని పరిశీలించు. చివరికి, అన్నిటికీ మూలమైన ఆత్మని గ్రహించి అందులో ఉండు. ఆ పరిశీలన చివరికి ఆత్మాన్వేషణై, అనాత్మమైనదంతా తిరస్కరింపబడి, స్వచ్ఛమైన, ఉజ్జ్వల మైన ఆత్మసాక్షాత్కారంతో ముగుస్తుంది. సృష్టి గురించి ఎన్ని సిద్ధాంతాలైనా ఉండవచ్చు. అవన్నీ బయటకి వెళ్లేవే. దేశకాలాలు అనంతం కాబట్టి, వాటికీ అంతు అంటూ ఏమీ లేదు. ఏమయినా, అవన్నీ మనస్సులోనివే. మనస్సుని గమనిస్తే దేశకాలాలని అధిగమిస్తావు, ఆత్మసాక్షాత్కార మవుతుంది.

ఎవరికి సంతృప్తి కలిగేట్టు ఆ విధంగా సృష్టి గురించి సశాస్త్రీయంగా, హేతుబద్ధంగా వివరాలుండవచ్చు. వాటికి అంతంటూ ఏమైనా ఉందా? అటువంటి వివరణలను క్రమసృష్టి అంటారు. కాని దృష్టి - సృష్టి అంటే యుగపత్ - సృష్టి. ద్రష్ట లేకపోతే దృశ్య మంటూ ఏమీ లేదు. ద్రష్ట ఎవరో కనుక్కో. సృష్టి అతనిలోనే ఉంది. బయటకి దృష్టిని సారించి, అసంఖ్యాకమైన దృశ్యాలను గురించి ఊరికే వివరిస్తూండట మెందుకు?

ప్ర: జగత్సృష్టి గురించి వేదాలలో పరస్పర విరుద్ధాలైన వర్ణనలెన్నో ఉన్నాయి. ఆకాశమొక చోట, ప్రాణమింకొక చోట జలం మరొక చోట అట్లాగే మిగిలినవి వేరువేరు ప్రదేశాలలో సృష్టింప బడ్డాయంటారు. వీటన్నిటికీ సమన్వయమెట్లా కుదిరింది? ఈ సిద్ధాంతాల వల్ల వేదాలపట్ల నమ్మకం దెబ్బతినదా?

జ: ఒక్కొక్క ఋషి సత్యం యొక్క ఒక్కొక్క పార్శ్వాన్ని చూచి వాటినే నొక్కి చెప్పాడు. పరస్పర వైరుధ్యమున్న వాళ్ల మాటలతో నీకేం పని? వేదాల ముఖ్యోద్దేశం - అనశ్వరమైన ఆత్మ యొక్క స్వరూపాన్ని మనకి చెప్పి, మనం ఆత్మేనని తెల్పటం.

ప్ర: ఇది బాగానే ఉంది - అంటే ఈ భాగం సంతృప్తిగానే ఉంది.

జ: అయితే, మిగిలినవన్నీ అర్థవాదంగా సరిపెట్టుకో. అంటే, అన్నిటికీ మూలాన్ని వెతకాలనుకొనే అజ్ఞానులకోసమే ఆ వివరణలన్నీ అని విడిచిపెట్టు.

ప్ర: నేను సృష్టిలో భాగాన్ని. అందువల్ల దానిపై ఆధారపడి ఉంటాను. ఈ సృష్టి రహస్యాన్ని తెలుసుకోవాలంటే నేను దాని నుండి వేరవాలి. అయినా, శ్రీ భగవాన్ని అడుగుతూంటాను. ఆయన నాకు సమాధానమీయ వద్దా?

జ: నిజమే. అందువల్లే భగవాన్ ఇట్లా అంటారు. "నీవు స్వేచ్ఛగా ఉండి, ఆ చిక్కుముడిని విప్పుకో. ఆ పని చేయవలసింది నీవు". అసలు నువ్వాప్రశ్న నడుగుతున్నావు కదా, ఇప్పుడు నీవెక్కడ ఉన్నట్టు? నీవు నిద్రలో ఉన్నప్పుడు ప్రపంచం కనబడదు- ఆ సమయంలో నీవు లేకపోలేదు. కదా? నీవు మేల్కొనగానే ప్రపంచం కనబడుతుంది. అందువల్ల ఎక్కడుంది అది? ప్రపంచం నీ భావనే కదా? భావాలన్నీ నీవు కల్పించుకున్నవే. మొదట సృష్టింపబడేది, “నేను”. ఆ "నేను' ఉదయించేది ఆత్మ నుంచి. ఈ 'నేను' యొక్క సృష్టి రహస్యాన్ని కనుగొంటే జగత్సృష్టి రహస్యం కూడా విడిపోతుంది. అందువల్ల నీ ఆత్మాన్వేషణ చేసుకొమ్మని చెప్తూంటాను. అంతేకాదు, ప్రపంచం వచ్చి "నా ఉనికికి కారణమేమిటి" అనిగాని, "నేనెట్లా సృష్టింపబడ్డాను" అని గాని అడుగుతుందా? ఈ ప్రశ్నలనడిగేది నీవు. ప్రపంచానికీ, తనకీ గల సంబంధాన్ని గ్రహించాలి పృచ్ఛకుడు. ప్రపంచం తన కల్పనేనని ఒప్పుకోవాలి. కల్పించుకొనేది ఎవరు? "నేను" ఎవరో కనుక్కోమను. ఆత్మని కనుక్కోమను. పైగా శాస్త్రపరమైన సిద్ధాంతాలకూ, మతపరమైన సిద్ధాంతాలకూ పొత్తు కుదరదు. వ్యక్తి యొక్క దృక్పథాన్ని బట్టి అన్నీ సత్యాలే. ఆత్మసాక్షాత్కారమయిన స్థితిలో సృష్టిలేదు. ప్రపంచాన్ని చూసేప్పుడు, తనని తాను చూసుకోడు. ఆత్మని చూసేప్పుడు, ప్రపంచం కనబడదు. అందువల్ల, ఆత్మని కనుక్కో - సృష్టి లేదని గ్రహించు.

ప్ర: "బ్రహ్మమే సత్యం, జగత్ మిథ్య" అని శంకరాచార్యుల వారనేవారు. అయినా కొందరు జగమే సత్యమంటారు. వీటిలో ఏది నిజం.

జ: రెండూ నిజమే. ఆ రెండూ వేర్వేరు మనోవికాసదశలని సూచిస్తాయి. వేర్వేరు దృక్కోణాల నుంచి చెప్పబడ్డాయి. "సత్య మెప్పుడూ సంస్థితమయే ఉంది" అన్న నిర్వచనంతో సాధకుడు ప్రారంభిస్తాడు. ఆ తరువాత ఎప్పుడూ పరివర్తనం చెందుతూంటుంది కాబట్టి ప్రపంచం అసత్యమని నిరాకరిస్తాడు. అంతిమదశలో సాధకుడు ఆత్మజ్ఞానాన్ని పొంది, అంతా ఏకమే నని గ్రహిస్తాడు. అంతకు ముందు అసత్యమంటూ దేనిని నిరాకరించాడో అదికూడా ఆ ఏకంలో ఒక భాగమేనని తెలుసుకుంటాడు. సత్యంలో విలీనమై ఉండటం వల్ల జగత్తుకూడా సత్యమే. ఆత్మసాక్షాత్కారంలో ఉండటమే తప్ప వేరే ఇంకేమీ లేదు.

ప్ర: మాయా, సత్యమూ ఒకటేనని శ్రీభగవాన్ తరచూ అంటూంటారు. ఇదెట్లా సాధ్యం?

జ: శంకరుని మాయావాదాన్ని అర్థం చేసుకోకుండా ఆయనని విమర్శించారు. ఆయన చెప్పినదిది:

1. బ్రహ్మం సత్యం

2. జగత్తు మిథ్య

3. జగత్తు బ్రహ్మం

ఆయన రెండవ దానితో ఆగలేదు. మూడవది, పై రెంటినీ వివరిస్తుంది. ఆత్మలో ఒక భాగంగా చూస్తే జగత్తు సత్యం, ఆత్మకి భిన్నంగా చూస్తే జగత్తు మిథ్య - ఇదీ ఆయన చెప్పినది. అందువల్ల మాయా, సత్యమూ కూడా ఒకటే.

ప్ర: అంటే జగత్తు నిజంగానే మిథ్య కాదనమాట.

జ: ఆధ్యాత్మిక సాధకునిగా, జగత్తు మిథ్య అనే అనాలి. వేరే మార్గం లేదు. సత్యము, నిత్యము, సర్వశక్తి సమన్వితమూ అయిన బ్రహ్మమే తానని మనిషి మరచి, జగత్తులో వస్తూపోతూండే అనేక పదార్థాల వలె తానుకూడా కేవలం ఒక దేహాన్నే అన్న భ్రమ ఉంటే, జగత్తు మిథ్యేననీ, ఒక భ్రమేననీ అతనికి గుర్తు చేయవలసిన అవసరముంది. ఎందుచేత? అతను ఆత్మను మరచాడు, అతని దృష్టి ఎంత సేపూ బాహ్యమైన, భౌతికమైన ప్రపంచంలోనే ఉంది కాబట్టి. అతను అంతర్ముఖుడై, విచారణ కొనసాగించాలంటే బయటి భౌతికమైన ప్రపంచమంతా మిథ్యే అని చెప్పాల్సి వస్తుంది. అతనికి ఆత్మసాక్షాత్కారమయితే, ఆత్మ తప్ప వేరే ఇంకేమీ లేదని తెలుస్తుంది. అప్పుడు విశ్వాన్నంతా బ్రహ్మంగానే పరిగణిస్తాడు. ఆత్మ లేకుండా విశ్వంలేదు. అన్నిటికీ మూలమైన ఆత్మని గమనించక, బయటి ప్రపంచమే వాస్తవము, శాశ్వతము అనుకుంటున్నంత కాలము అతనికి బయటి ప్రపంచం కేవలం భ్రమేనని గుర్తు చేస్తూనే ఉండాలి. ఇది అనివార్యం. ఒక కాగితాన్ని తీసుకో, దానిమీద ఉన్న అక్షరాలనే గమనిస్తాం. ఆ అక్షరాలు వ్రాయబడిన కాగితాన్ని ఎవ్వరూ గమనించరు. అక్షరాలను వ్రాసినా వ్రాయకపోయినా, కాగితముంటుంది. అక్షరాలే వాస్తవమనుకొనే వారికి, "కాదు అది వట్టి భ్రమే"నని చెప్పాలి - ఆ అక్షరాలు కాగితం మీద ఆధారపడిన కారణం వల్ల. జ్ఞాని, కాగితాన్నీ దానిపైన లిఖింపబడిన దానినీ కలిపి ఒకటిగానే భావిస్తాడు. బ్రహ్మము, జగత్తు కూడా అంతే.

ప్ర: ఆత్మగా చూస్తే ప్రపంచం వాస్తవం, విడిగా నామరూపాలుగా చూసే మిథ్య అనమాట.

జ: నిప్పుని పొగ మరుగుపరుస్తుంది. అట్లాగే, చైతన్యకాంతిని నామరూపాల సమ్మేళనమైన ప్రపంచం మరుగుపరుస్తుంది. కరుణామయమైన భగవదనుగ్రహం లభిస్తే మనస్సు పరిశుద్ధ మవుతుంది - అప్పుడు, ప్రపంచపు నైజం, భ్రమకొల్పే రూపాలే కాదు, సత్యమేనని విశదమవుతుంది.

"జగత్తు సత్యమ"నే వాక్యాన్ని ఎవరు అర్థం చేసుకోగలరు? మాయ అనే దుష్ట శక్తికి అతీతమైన మనస్సు కలిగి, ప్రపంచపు ధ్యాస విడచి, దాని పట్ల అనురక్తి లేకుండా ఉండి, తద్వారా పరమసత్యాన్ని గ్రహించిన వారే అర్థం చేసుకోగలరు. అసలైన జ్ఞానం వల్ల దృక్పథం పరివర్తన చెందితే, ఆకాశాది పంచభూతములు కల విశ్వం, వాస్తవంగా, పరమసత్యంగా గోచరిస్తుంది. అనేక నామరూపాలతో క్రిక్కిరిసిపోయి, ఇప్పుడు విభ్రమం కొల్పే ప్రపంచం యొక్క స్వరూపం ఆనందమే, ఏకమే. పంచరంగుల నెమలి యొక్క గుడ్డులోని సొన ఒకటే. ఆత్మనిష్ఠతో, ఈ సత్యాన్ని గుర్తుంచుకో.

ప్ర: నా కిదేమీ స్పష్టంగా లేదు. మనం ఈ ప్రపంచాన్ని చూస్తున్నాం. తాకుతున్నాం, అనుభవిస్తున్నాం. ఇదంతా ఒక కలేనా? ఒక భ్రమేనా?

జ: నీవు సత్యాన్ని మాత్రమే అన్వేషిస్తూంటే ఈ ప్రపంచం మిథ్య అని అంగీకరింపక తప్పదు.

ప్ర: ఎందువల్ల?

జ: దీనికొకే ఒక కారణముంది: ఈ ప్రపంచం వాస్తవం కాదు అని నువ్వు అనుకోక పోతే నీ మనస్సు ప్రపంచం వెంట పడుతూనే ఉంటుంది. ఉన్నది ఒకే ఒక సత్యమే అయినా, పైకి కనబడేదే వాస్తవమనుకుంటే యదార్థమెప్పుడూ నాకు తెలియదు. ఈ విషయానికి ఉపమానం త్రాడూ, సర్పమూను. ఒక త్రాడుని చూచి సర్పమని నీవు మోసపోవచ్చు ఆ త్రాడు సర్పమేనని నీవూహించుకున్నంత సేపూ త్రాడుని త్రాడుగా గమనించలేవు. లేని సర్పమే నీకు వాస్తవమవుతుంది. వాస్తవమైన త్రాడు మాత్రం లేనట్టే అనిపిస్తుంది.

ప్ర: అంతిమంగా ప్రపంచం వాస్తవం కాదని తాత్కాలికంగా ఒప్పుకున్నా, నిజానికి ప్రపంచం మిథ్యేనన్న నమ్మకం కుదరటం కష్టం.

జ: నీవు కలగన్నప్పుడు కలలోని ప్రపంచం కూడా వాస్తవమే. కల ఉన్నంత సేపూ అందులో కనబడేవన్నీ నిజమే ననిపిస్తాయి, నీకు.

ప్ర: అంటే, ప్రపంచం కలకంటే ఏమీ గొప్పది కాదా?

జ: కలకంటున్నంతసేపూ అది నిజమేననుకోవటంలో తప్పేమిటి? అసంభవమైన దాని గురించి కలరావచ్చు. అంటే, చనిపోయిన వానితో కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నట్లు అనుకో. కలలో కూడ ఒక్కక్షణం పాటు "అతను పోయాడు కదా" అని నీకనిపించవచ్చు. కాని కలలోని దృశ్యంతో మనస్సు ఎట్లాగో సమాధానపడుతుంది. కలకి అవాస్తవంకాదని కలే ఒప్పిస్తుంది నిన్ను. మేల్కొని ఉన్నప్పుడూ ఇదే పరిస్థితి. మేల్కొని ఉండగా నీకు కనబడే ప్రపంచం వాస్తవంకాదని నీవు ఎప్పుడూ సందేహించవు. ప్రపంచాన్నే - కల్పించిన మనస్సు. ప్రపంచం మిథ్య అని ఎట్లా ఒప్పుకుంటుంది? జాగ్రదావస్థలోని ప్రపంచాన్నీ స్వప్నావస్థలోని ప్రపంచాన్నీ పోల్చటంలో అంతరార్థమిదే. రెండూ మనస్సుచేత కల్పింపబడినవే, వాటిలో నిమగ్నమైనంత కాలమూ, మనస్సు వాటిని అసత్యంగా ఒప్పుకోదు. కలగంటున్నప్పుడు కలలోని ప్రపంచాన్ని అసత్యమని అంగీకరించలేదు, అట్లాగే మేల్కొని ఉన్నప్పుడు కనబడే ప్రపంచాన్ని కూడ ఒప్పుకోలేదు. ఇట్లా కాక, మనస్సుని ప్రపంచం నుంచి ఉపసంహరించి, అంతర్దృష్టితో అన్ని అనుభూతులకూ ఆధారమైన ఆత్మ గురించిన ఎరుకతో ఉంటే, కలలోని ప్రపంచం వలె ఇప్పుడు నీకు తెలిసిన ప్రపంచం కూడ మిథ్యే అని గ్రహిస్తావు.

ప్ర: ఈ ప్రపంచాన్ని- చూస్తాం, ఎన్నో విధాల అనుభవిస్తాం. ఈ అనుభవాలకి కారణం, మనం చూసే పదార్థాలకి మన ప్రతిస్పందనే. అవి కలలో వలె మనస్సుతో కల్పింపబడినవి కావు. కలలు కూడా మనిషికీ మనిషికీ వేరువేరుగా ఉంటాయి. ఒకే మనిషికి కూడా వేరువేరుగా ఉంటాయి. ప్రపంచం నిజమేనని ఋజువు చెయ్యటానికిది చాలదా?

జ: మేల్కొని ఉన్నవేళల్లోనే కలలలోని అవకతవకలు తెలుస్తాయి. కాని కలగనేప్పుడు అంతా సబబే ననిపిస్తుంది. అంటే, కలలో నీకు దాహం వేసిందనుకో - కేవలం మిథ్యే అయిన ఆ దాహం, మిథ్యాత్మకమైన నీరు త్రాగటంతో, మిథ్యాత్మకంగానే తీరుతుంది. కలే మిథ్య అని తెలియనంత సేపూ అదంతా వాస్తవంగానే అనిపించింది నీకు. మేల్కొని ఉన్నప్పటి ప్రపంచమూ అంతే, ఇప్పుడు నీకు అనుభూతులన్నీ సమన్వయింపబడి, అంతా వాస్తవమనే అనిపిస్తుంది. ప్రపంచం తనంతటతానే సత్యమే అయితే గాఢ నిద్రలో నీకెందుకు ప్రత్యక్షం కాదు? నిద్రలో "నేను లేను" అని నీవనలేవు కదా!

ప్ర: అట్లాగే, నేను నిద్రలో ఉన్నప్పుడు ప్రపంచం లేదనీ అనలేను - అది ఎప్పుడూ ఉంటూనే ఉంది. నిద్రలో నేను దానిని గమనించక పోయినా, నిద్రపోని వాళ్లు చూస్తూనే ఉంటారు కదా.

జ: నిద్రపోయినప్పుడు నీవున్నావని చెప్పటానికి, సాక్ష్యంగా ఇతరులని పిలిచి ఋజువు చెయ్యమని అడగవలసి వచ్చిందా? ఇప్పుడు మాత్రం వారి సాక్ష్యమెందుకు కావాలంటున్నావు? నీవు మేల్కొని ఉన్నప్పుడే వాళ్లు, నీవు నిద్రపోయినప్పుడు ప్రపంచముందని చెప్పగలరు, నీ ఉనికి విషయం వేరు. నిద్ర లేవగానే హాయిగా పడుక్కొన్నానంటావు - అంటే ఎంత గాఢ నిద్రలోనైనా నీ గురించి నీకు ఎరుక ఉండేదన మాట. కాని ప్రపంచముందో లేదో నని ఏమాత్రం ఎరుకలేదు. ఇప్పుడైనా, నీవు మేల్కొని ఉన్నప్పుడు ప్రపంచం వచ్చి, "నేను నిజంగానే ఉన్నా" నంటోందా? లేక, నీవంటున్నావా?

ప్ర: నేనే అంటున్నాను నిజమే - కాని నేను ప్రపంచం గురించే అంటున్నాను.

జ: నీ వాస్తవికత గురించి నీకు తెలియక పోయినా ప్రపంచం వాస్తవమని ఋజువు చేయటానికి ప్రయత్నిస్తున్నావు. దీనిని చూచి ప్రపంచం నవ్వుతోంది! ప్రపంచం వాస్తవమేనని ఎట్లాగైనా అందామని ప్రయత్నిస్తున్నావు. వాస్తవికతకి

ప్రమాణమేమిటి? తనంతట తానే సంస్థితమై, తనంతట తానే అభివ్యక్తమై, నిత్యమై, ఏ పరివర్తనమూ చెందనిదే వాస్తవం కాగలదు. ప్రపంచం తనంతట తానే సంస్థిత మయిందా? మనస్సు సహాయం లేకుండా ఎప్పుడైనా గోచరించిందా? నిద్రలో మనస్సూ లేదు, ప్రపంచమూ లేదు. రెండూ ఒకేసారి ఈ విధంగా సంభవించటానికి అర్థమేమిటి? శాస్త్రీయ పరిశోధనకి "అనుమానం" యొక్క సూత్రాలే ప్రాతిపదిక అని నీకు తెలుసుకదా. ప్రపంచం వాస్తవమేనా అనే విషయాన్ని ఈ అనుమాన సూత్రాల ననుసరించి తేల్చుకోవచ్చు కదా.

నీ గురించి "నేనున్నాను" అనగలవు. అంటే నీ ఉనికి కేవల ఉనికి మాత్రమే కాదు. దాని గురించి నీకు జ్ఞానముందన మాట. నిజానికి, ఆ ఉనికీ, చైతన్యమూ ఒకటే.

ప్ర: ప్రపంచానికి తన గురించి ఎరుక లేకపోవచ్చు కాని ప్రపంచముంది కదా?

జ: ఎరుక అన్నదెప్పుడూ ఆత్మ చేతనత్వమే. దేని గురించైనా నీకు ఎరుక ఉంటే, ప్రధానంగా నీ గురించి ఎరుక ఉన్నట్టే. ఆత్మ చైతన్యం లేని ఉనికి అంటూ ఏమీ లేదు. అది ఉనికి కానేరదు. అది ఆపాదింపబడిన ఉనికి. సత్ అసలైన ఉనికి - ఒక లక్షణం కాదు. అదే అసలు పదార్థం. అదే వస్తువు (సత్యం) అందువల్లే దానిని సత్ - చిత్ అంటారు. ఒకటి కాకుండా, రెండోది మాత్రమే కాదు. ప్రపంచం తనంతటతాను ఉండదు. తన ఉనికి గురించి దానికి తెలియదు. అటువంటి ప్రపంచం సత్యమని ఎట్లా అనగలవు? ప్రపంచం లక్షణమేమిటి? ఎప్పుడూ మారుతూండటం, అంతులేని సందిగ్ధం. పరాధీనమై, ఆత్మచైతన్యంలేని, నిరంతర పరివర్తన చెందే ప్రపంచం సత్యం కాజాలదు.

ప్ర: ప్రపంచంలోని నామ రూపాలు వాస్తవమేనా?

జ: అధిష్ఠానానికి అవి భిన్నంకావు. నామ రూపాలని పరిశీలింప బోతే నీవు అందేది సత్యమే. అందువల్ల నిత్యమైన సత్యజ్ఞానాన్ని సంపాదించు.

ప్ర: జాగ్రదవస్థ ఇంత వాస్తవంగా ఎందుకు తోస్తుంది?

జ: సినిమాలో, తెరమీద ఎన్నో చూస్తాం. కాని అవేవీ వాస్తవం కావు. తెరతప్ప ఇంకేదీ వాస్తవం కాదక్కడ. అట్లాగే, మేల్కొని ఉన్న స్థితిలో, అధిష్ఠానం తప్ప వేరే ఇంకేదీ వాస్తవం కాదు. జగత్తు గురించిన జ్ఞానమంటే, ఆ జగత్తుని ఎరిగిన వాని గురించి జ్ఞానమేననమాట (జాగృత్ - ప్రమ, అంటే, జాగృత్ - ప్రమత్ గురించిన ప్రమ అనమాట)

ప్ర: ప్రపంచంలో ఇంత శాశ్వతత్వాన్ని, నిలకడనీ ఎందుకు చూస్తాం?

జ: తప్పు భావాల వల్ల అట్లాగనిపిస్తుంది. నేను ఒకే నదిలో రెండు సార్లు స్నానం చేశానని ఎవరైనా అంటే, అది తప్పు. అతను రెండవసారి స్నానం చేసిన నది వేరు, మొదటి సారి స్నానం చేసిన నది వేరు. రెండుసార్లు మంటయొక్క కాంతిని చూసినప్పుడు ఒకే మంటని చూశానంటాడు. అదీ తప్పే. జ్వాల క్షణక్షణం మారుతూనే ఉంటుంది. మెలకువగా ఉన్న స్థితి ఇటువంటిది, నిల కడగా ఉన్నదన్న అనుభూతి, గ్రహణశక్తిలోని పొరపాటు.

ప్ర: అయితే, తప్పు ఎక్కడుంది?

జ: ఎరిగేవాడిలో (ప్రమత)

ప్ర: ఎరిగేవాడెట్లా వచ్చాడు?

జ: తప్పు గ్రహణ శక్తి వల్లే. ఎరిగేవాడూ, అతని తప్పు గ్రహింపూ ఒకే సారి ఆవిర్భవిస్తాయి. ఆత్మజ్ఞానం కలుగగానే రెండూ ఒకేసారి మాయమవుతాయి.

ప్ర: ఎరిగేవాడూ, అతని తప్పు అవగాహనా ఎక్కుడ్నుంచి వచ్చాయి?

జ: ఈ ప్రశ్నని వేసేదెవరు?

ప్ర: నేను.

జ: ఆ 'నేను' ఎవరో తెలుసుకో. అన్ని సందేహాలూ తీరుతాయి. కలలో అసత్యమైన ఎరుకా ఎరుగబడింది, ఎరిగేవాడూ, ఉదయించినట్టే మేల్కొని ఉన్న స్థితిలో కూడ అదే జరుగుతుంది. 'నేను' అన్నదేమిటో తెలిస్తే ఇంక తెలుసుకోవలసిందేమీ ఉండదు. గాఢ నిద్రలో జ్ఞానాదులేమీ ఉండవు. అట్లాగే ఆత్మానుభవమైన దశలో అవి ఉండవు. మేల్కొని ఉన్న స్థితిలో ఏదో జరుగుతోందని తెలిసేది తెలుసుకునే వాడికే. కాని, ఆ తెలుసుకునే వాడే మిథ్య అవటం వల్ల ఏదీ సంభవించటం లేదు నిజానికి.

ప్ర: "నేను" అనే భావాన్నీ, ప్రపంచం గురించిన ఎరుకనీ కలిగించే వెలుగు అజ్ఞానమా, చైతన్యమా?

జ: చైతన్యం నుండి పరివర్తనం చెందిన వెలుగే తాను ఇతరుల కంటే భిన్నమని, “నేను”కి అనిపించేట్టు చేస్తుంది. చిత్నుండి పరివర్తనం చెందిన కాంతే ఇతర పదార్థాలని "నేను" సృష్టించేట్టు చేస్తుంది. కాని పరివర్తనం జరగటానికి ఒక ఉపరి తలమంటూ ఉండాలి.

ప్ర: ఆ ఉపరితలమేమిటి?

జ: ఆత్మసాక్షాత్కారమైన తరువాత ఆ పరివర్తనంగాని, ఉపరితలంగాని అసలు లేనేలేవనీ, రెండూ చైతన్యమేననీ తెలుస్తుంది. ప్రపంచపు ఉనికికి ఒక స్థానముండాలి. అది చూడబడటానికి ఒక కాంతి కావాలి. రెండూ ఒక సారే ఉదయిస్తాయి. కాబట్టి భౌతికమైన ఉనికీ, దాని గురించిన ఎరుకా మనస్సనే కాంతి మీద ఆధారపడి ఉన్నాయి. మనస్సు ఆత్మకి పరివర్తనమే! సినిమాలో బొమ్మలు పరివర్తనం చెందిన కాంతి వల్ల. చీకట్లోనే ఎట్లా కనబడుతాయో ప్రపంచపు దృశ్యాలు ఆత్మ యొక్క పరివర్తనమైన కాంతిలో అవిద్య అనే అంధకారంలో కనబడుతాయి. అవిద్య అనే కటిక చీకటిలో, గాఢ నిద్రలో వలె, ప్రపంచం కనబడదు. అట్లాగే ఆత్మ అనే నిష్కళంక కాంతిలో, సమాధిలో వలె, సాక్షాత్కారంలో వలె, ప్రపంచం గోచరించదు.

# 18.పునర్జన్మ

దేహంచాలించిన తర్వాత ఆ వ్యక్తి యొక్క ఆత్మ ఏమౌతుందో తెల్పే సిద్ధాంతాలు ఇంచుమించు అన్ని మతాల్లోనూ ఉన్నాయి. ఆత్మ స్వర్గానికో, నరకానికి వెళ్తుందని కొందరంటే, మరికొందరు, ఆత్మ వేరొక దేహంలో ప్రవేశించి మళ్లీ జన్మ నెత్తుతుందంటారు.

వ్యక్తిగతమైన ఆత్మ ఒకటి ఉందనే తప్పు అవగాహన మీదే ఈ సిద్ధాంతాలన్నీ ఆధారపడి ఉన్నాయనీ, ఆ భ్రమతొలిగితే ఆ సిద్ధాంతాలూ కూలిపోతాయన్ శ్రీరమణులు అనేవారు. ఆత్మ దృక్పథం నుంచి జననమరణాలు గాని, స్వర్గనరకాలు గాని, పునర్జన్మగాని లేవు.

ఈ సత్యం యొక్క అంతరార్థాన్ని గ్రహింపలేని వారి కోసం, అప్పుడప్పుడు శ్రీరమణులు పునర్జన్మ ఉన్నదనే వారు. వ్యక్తిగతమైన ఆత్మ నిజమేననుకుంటే ఆ ఊహాజనితమైన ఆత్మ మరణం తరువాత కూడా ఉంటుందనీ, వేరొక దేహంతో, జీవితంతో ఏకమవుతుందనీ అనేవారు. అసలు ఈ ప్రక్రియనంతా బలపరచేది దేహంతో తాదాత్మ్యం చెందే మనస్సే ఈ విధంగా పరిమితం చేస్తుంది మనస్సు.

మనస్సు కల్పించే భ్రమని దాటితే, దేహంతో తాదాత్మ్యం పోతుంది. అప్పుడు చావుకీ, పునర్జన్మకీ సంబంధించిన సిద్ధాంతాలన్నీ వర్తించవని తెలిసివస్తుంది.

ప్ర: పునర్జన్మ ఉందా?

జ: అజ్ఞానమున్నప్పుడే పునర్జన్మ ఉంటుంది. అసలు పునర్జన్మ అంటూ ఇప్పుడూలేదు, పూర్వమూ లేదు, ముందూ ఉండదు. ఇది యదార్థం.

ప్ర: తన పూర్వజన్మల గురించి యోగికి తెలుస్తుందా?

జ: ఈ జన్మ సంగతి తెలుసా, గత జన్మ సంగతి తెలుసుకోవటానికి? వర్తమాన స్థితిని కనుక్కో, మిగిలినవన్నీ అవే తెలుస్తాయి. ఇప్పుడున్న పరిమిత జ్ఞానంతోనే అంత బాధ పడుతున్నావు కదా ఇంకా మరికొంత సమాచార భారం ఎందుకు? ఇంకా బాధపడటానికా?

ఆత్మ అనే పరమోత్కృష్టమైన స్థితినుంచి చూస్తే, ఎండమావి వంటి ఈ లోకంలో జన్మనెత్తామనే భ్రమకి కారణం అజ్ఞానమయమైన దేహాత్మబుద్ధే. ఆత్మని విస్మరించిన మనస్సుల దృష్టిలో పుట్టినవారు చనిపోతారు, చనిపోయిన వారు మళ్ళీ పుట్టుతారు. కాని పరమసత్యాన్ని గ్రహించి, మనస్సే ధ్వంసమైన వారు చావు పుట్టుకలు లేని ఉన్నతమైన తలంలోనే ఉంటారు. ఆత్మని మరచి దేహమే ఆత్మ అనుకొని, ఎన్నో జన్మలనెత్తి చివరికి ఆత్మని ఎరిగి, ఆత్మలోనే సంస్థితమవటం, తాను దేశద్రిమ్మరి యైనట్టు వచ్చే కలనుంచి మేల్కొనటం వంటిదే.

ప్ర: మనిషి చనిపోయిన తరువాత మళ్లీ ఎంత కాలానికి జన్మిస్తాడు - వెంటనేనా, లేక కొంత వ్యవధి తరువాతనా?

జ: పుట్టక ముందు నీవెవరవో నీకు తెలియదు, అయినా చనిపోయిన తర్వాత ఏమవుతావోనని తెలుసుకోవాలనుకుంటున్నావు! అసలు ఇప్పుడు నీ వెవరివో నీకు తెలుసా? జననమూ, పునర్జననమూ దేహానికి సంబంధించినవి. నీవు ఆత్మని దేహంతో ఏకం చేస్తున్నావు. దేహం పుట్టిందనీ, అది చనిపోతుందనీ నీ నమ్మకం. దేహానికి సంబంధించిన వీటినే ఆత్మకి కూడ ఆపాదిస్తున్నావు. నీ నిజస్వరూపమేమిటో తెలుసుకుంటే, ఈ ప్రశ్నలుదయించవు.

చావు పుట్టుకల గురించి చెప్పటానికి కారణమేమంటే, అసలు విషయాన్ని పరిశీలించి - చావుగాని, పుట్టుకగాని లేవు అని నీవు గ్రహించటానికే. అవి దేహానికి సంబంధించినవి, ఆత్మకి కాదు. ఆత్మని గ్రహించు, సందేహాలతో కలవరపడకు.

ప్ర: ఈ జన్మలో చేసిన పనుల ఫలితం ఉత్తర జన్మలలో ఉండదా?

జ: ఇప్పుడు జన్మించావా? అసలు యదార్థమేమంటే - చావూ లేదు, పుట్టుకా లేదు. జన్మించిన వాడినే, చావు గురించీ దానికి విరుగుడు గురించీ ఆలోచించుకోనీ.

ప్ర: చనిపోయిన తరువాత మనిషికేమవుతుంది?

జ: ప్రస్తుతం గురించి పట్టించుకో. భవిష్యత్తుని దానికే వదిలిపెట్టు. భవిష్యత్తు గురించి ఏమీ చింతించకు. వర్తమానం గురించి నీవు తెలుసుకోవాలన్న ఉద్దేశ్యంతోనే శాస్త్రాలు సృష్టికి పూర్వస్థితి గురించీ, సృష్టి కార్యం గురించీ చెప్తాయి. "నేను జన్మించాను" అని నీవు అనటంవల్లనే అవి కూడ "అవును నిజమే" నంటూ "నిన్ను సృష్టించింది భగవంతుడే" నని కూడ అంటాయి. కాని గాఢ నిద్రలో భగవంతుడుగాని, మరేదైనా గాని నీకు కనబడుతాయా? భగవంతుడే వాస్తవమైతే గాఢనిద్రలో నీకు దేదీప్యమానంగా ఎందుకు కనబడడు? నీవు కూడ గాఢ నిద్రలో వలె ఇప్పుడూ ఉన్నావు. నీ వెప్పుడూ ఉన్నావు. నిద్రపోయిన వాడికి భిన్నంకావు. కాని రెండు అవస్థలలోని భావాలకూ, అనుభూతులకూ భేదాలెందుకున్నాయి?

నిద్రలో నీ జన్మకి సంబంధించిన ప్రశ్నలని అడిగావా? "చనిపోయిన తరువాత నేనెక్కడికి పోతాను" అని అడిగావా? మేల్కొని ఉన్నప్పుడే వీటి గురించి ఎందుకాలోచిస్తున్నావు? ఏది పుట్టిందో దానినే పుట్టుక గురించీ, దానికి విరుగుడు గురించీ, కారణాల గురించీ, అంతిమ ఫలితం గురించీ ఆలోచించుకోనీ.

ప్ర: చనిపోయిన తరువాత జీవుడేమవుతాడు?

జ: ఇప్పుడు బ్రతికి ఉన్న జీవుడు ఆ ప్రశ్నని అడగటం అప్రస్తుతం. కావాలంటే చనిపోయిన జీవుడినే అడగనీ. ఈ లోగా దేహధారి అయిన జీవుడు ప్రస్తుత సమస్యని పరిశీలించి తానెవరో తెలుసుకోనీ. అప్పుడీ సందేహాలూ అంతమవుతాయి.

ప్ర: ఎల్లప్పుడూ ఉండే వ్యక్తిగత ఆత్మ అంటూ ఏమీ లేదని బౌద్ధుల అభిప్రాయం. ఇది సరియైన దేనా? పునర్జన్మ నెత్తుతూండే అహంకార మొకటుందన్న హిందువుల దృక్పథంతో దీనికి పొత్తుకుదురుతుందా? హిందువుల దృష్టిలో వలె ఆత్మ పునర్జన్మ నెత్తుతూంటుందా. లేక అది కేవలం సంస్కారాల సమ్మేళనమేనా?

జ: ఆత్మ అవిచ్ఛిన్నంగా ఉంటుంది, దేని వల్లా ప్రభావితం కాదది. పునర్జన్మల నెత్తు తూండే అహంకారం అంతకన్నా క్రింది తలమైన ఆలోచనకి చెందినది. ఆత్మసాక్షాత్కారం వల్ల దానిని అధిగమించవచ్చు.

పునర్జన్మలు ఒక కృత్రిమ కొమ్మలకి చెందివి. అందువల్ల బౌద్ధులు వాటిని నిరాకరిస్తారు. ప్రస్తుతపు అజ్ఞానావస్థకి కారణం చైతన్యాన్ని, జడమైన దేహంతో ఏకం చేయటం.

ప్ర: మనం చేసే పనులవల్ల స్వర్గానికి వెళ్లమా?

జ: మన ప్రస్తుతపు ఉనికి ఎంత వాస్తవమో అదీ అంతే. అయినా మనం ఆత్మవిచారం చేసి ఆత్మ ఏమిటో గ్రహిస్తే స్వర్గం గురించి ఆలోచించ వలసిన పని ఏమిటి?

ప్ర: పునర్జన్మ లేకుండా నేను చేసుకోవద్దా?

జ: తప్పకుండాను, పుట్టే దెవరు? ఇప్పుడు జీవించాల్సిన అవస్థ ఎవరికుంది. ఇది తెల సుకో. నీవు గాఢ నిద్రలో ఉన్నప్పుడు ఇప్పటి జన్మ గురించిగాని, పునర్జన్మ గురించి గాని చింతిస్తావా? అందువల్ల ఈ సమస్య ఎక్కడ్నుంచి ఉదయిస్తోందో కనుక్కో - పరిష్కారం కూడ అక్కడే దొరుకుతుంది. జన్మే లేదు. ప్రస్తుత దురవస్థ లేదు, అసంతుష్టీ లేదు - అని గ్రహిస్తావు. ఉన్నదల్లా ఆత్మే ఆనందమే. ఇప్పుడు కూడా మనకి పునర్జన్మ లేదు. ఇంక దాని గురించి వ్యాకులత ఎందుకు?

ప్ర: పునర్జన్మ లేదా?

జ: అసలు, జన్మ అంటే ఏమిటో తెలుసానీకు?

ప్ర: తెలియకేం? ఇప్పుడున్నట్టు తెలుసు, భవిష్యత్తులో కూడా ఉంటానా అని తెలుసుకోగోరుతున్నాను.

జ: గతం! వర్తమానం! భవిష్యత్తు!

ప్ర: గతించిన నిన్నటి ఫలితం నేడు, నేటికి భావి రేపు, అంటే వర్తమానికి ఫలితమనమాటే కదా?

జ: గతమూ లేదు భవిష్యత్తూ లేదు. ఉన్నదల్లా వర్తమానమే. అనుభవిస్తున్నప్పుడు నిన్న నీకు వర్తమానం, అట్లాగే అనుభవిస్తున్నప్పుడు రేపు నీకు వర్తమానమవుతుంది. అంటే అనుభవమెప్పుడూ వర్తమానంలోనే జరుగుతుంది. అనుభవానికి వెలుపల ఏమీ లేదు.

ప్ర: అంటే, భూతభవిష్యత్తులు కేవలం కల్పితమేనా?

జ: అవును, వర్తమానం కూడా కల్పనే. కాలాన్ని మనస్సు కల్పిస్తుంది. అంతరిక్షం కూడా మానసిక కల్పనే. అందువల్ల కాలంలో, అంతరిక్షంలో సంభవించే జన్మ పునర్జన్మ కేవలం కల్పనే.

ప్ర: జీవించాలనే తృష్ణకీ, పునర్జన్మ తృష్ణకీ కారణమేమిటి?

జ: అసలైన పునర్జన్మ అంటే అహంకారాన్ని దాటి ఆత్మలోకి వెళ్లటం. క్రీస్తుని శిలువ నెక్కించటం యొక్క అంతరార్థం ఇదే. దేహం గురించిన ధ్యాస పోవాలంటే, తన మూలమైన ఆత్మలో విలీనమవాలి. అప్పటి వరకూ దేహంతో తాదాత్మ్యముంటూనే ఉంటుంది. ఈ దేహం కాకపోతే, మరొక దేహం దొరుకుతుంది. పైకి విసరిన రాయి నేలపై, తన మూలస్థానంపై, పడి విశ్రమించే వరకూ కదులుతూనే ఉంటుంది. తలనొప్పికి పూర్వమున్న స్థితి వచ్చేవరకూ తల నొప్పి ఉంటూనే ఉంటుంది. జీవితమంటే తృష్ణ, జీవిత లక్షణం- అదే సత్. చైతన్యానికి విధ్వంసమంటూ లేదు. కాని నశించిపోయే సాధనమైన దేహంతో తాదాత్మ్యం తప్పుగా చెందటం వల్ల తనకి కూడ విధ్వంసముందని తప్పుగా భయపడుతుంది, చైతన్యం. దాని వల్లనే జన్మ తరువాత జన్మ సంభవిస్తాయి. ఈ దేహాలు ఎంత కాలమున్నా చివరికి ఆత్మకి వశమై అంతమవుతాయి. నిత్యంగా ఉండేది ఆత్మ ఒక్కటే.

ప్ర: అంతే! "వాయిస్ ఆఫ్ సైలెన్స్" అన్న తన పుస్తకంలో హెచ్.పి.బ్లావాట్స్కి, “నీవు జీవించాలంటే జీవితాన్ని త్యజించు" అన్నారు.

జ: నువ్వు త్యజించాల్సింది తప్పు తాదాత్మ్యాన్ని - ఆత్మలేకుండా దేహం ఉండలేదు. కాని దేహం లేకుండా ఆత్మ ఉండ గలదు. నిజానికి ఎప్పుడూ దేహం లేకుండానే ఉంటుంది.

ప్ర: మనిషి జంతువుగా కూడ మళ్ళీ పుట్టువచ్చని నా స్నేహితురాలొకామె విన్నది. ఇది థియోసఫీ సిద్ధాంతాలకి పూర్తిగా విరుద్ధం. ఈ సందేహం తీరుస్తారా?

జ: ఆ జన్మనెత్తిన దానినే ఆ ప్రశ్నని అడగమను. అసలు పుట్టిన దెవరు? పుట్టటం, చావటం ఉన్నాయా. ఇది కనుక్కో. పుట్టుక అహంకారానికి సంబంధించినది - అహంకారం మనస్సు యొక్క భ్రమ.

ప్ర: మనిషి నీచజంతువుగా మళ్ళీ పుట్టటం సంభవమేనా?

జ: సంభవమే. జడభరతుడే దానికి నిదర్శనం. ఒక రాజయోగి జింకగా జన్మించిన ౧౮ ౮.

ప్ర: జంతుదేహాన్ని దాల్చినా మనిషికి ఆధ్యాత్మిక ప్రగతి సాధ్యమేనా?

జ: అసాధ్యం కాదు కాని చాలా అరుదు. మానవ జన్మమే పరమోత్కృష్టం కానక్కర్లేదు. మానవుడయితేనే గాని సాక్షాత్కారం లభించదనీ లేదు. జంతువుకి కూడా సాక్షాత్కారం కలుగవచ్చు.

ప్ర: థియోసఫీ ప్రకారం, మనిషిచనిపోయిన తరువాత మళ్లీ పుట్టటానికి ఏభై నుంచి పదివేల సంవత్సరాల వరకూ పట్ట వచ్చు. ఎందుచేత?

జ: కొలమానంలో ఒక తలంలోని చైతన్యానికీ, మరొక తలంలోని చైతన్యానికీ సంబంధమేమీ లేదు. అటువంటి కొలతలన్నీ కేవలం ఊహలే - కొందరు ఎక్కువకాలం తరువాతనే మళ్ళీ పుట్టుతారు నిజమే. కాని ఒకటి గుర్తుంచుకోవాలి ఈ రాకపోకలు చేసేది వ్యక్తి, ఆత్మకాదు. వ్యక్తి యొక్క ఆలోచనాపరమైన మనస్సే. అట్లా అనిపించేట్టు చేస్తుంది.

ఏ తలంలో పనిచేస్తూంటే ఆ తలంలోనే మనస్సు తనకొక దేహాన్ని కల్పించుకుంటుంది. భౌతిక ప్రపంచంలో భౌతిక దేహాన్ని, స్వప్నలోకంలో స్వాప్నికమైన దేహాన్ని. ఈ దేహం కలలో వర్షం కురిస్తే తడుస్తుంది, కలలో రోగం వస్తే మంచాన పడుతుంది. భౌతిక దేహం చనిపోగానే మనస్సు కాస్సేపు ఏమీ చేయదు - కలలేని గాఢ నిద్రలో దానికి లోకమూ ఉండదు, దేహమూ ఉండదు-అట్లాగే ననమాట. కాని కొంతసేపు ఇంకొక తలంలో, ఇంకొక దేహంలో వ్యవహరిస్తుంది. దీనినే సూక్ష్మ శరీర మంటారు. ఆ తరువాత మరొక దేహాన్ని దాలుస్తుంది. అదే పునర్జన్మ అంటే. ఆత్మ సాక్షత్కారం పొందిన జ్ఞాని యొక్క మనస్సు అప్పటికే ధ్వంసమైపోయి ఉండటం వల్ల, చనిపోవటం వల్ల ఏమీ కాదు. జ్ఞాని యొక్క మనస్సు లేదు, అది రాలిపోయింది. మళ్లీ పుట్టటం, చనిపోవటం అంటూ ఏమీ కల్పించలేదు అతని మనస్సు. ఈ భ్రమల గొలుసు అతనికి తెగిపోయింది.

నిజమైన పుట్టుకగాని, నిజమైన చావుగాని లేదని ఇప్పటికైనా స్పష్టమై యుండాలి. ఈ విధమైన నకిలీవాస్తవాన్ని కల్పించి, నిలిపేది మనస్సే - ఆత్మసాక్షాత్కారం వల్ల అది ధ్వంసమయే వరకూ అట్లాగే చేస్తుంది.

ప్ర: నదులు సముద్రంలో కలిసిపోయిన తరువాత తమ అస్తిత్వాన్ని పోగొట్టుకున్నట్టు, మృత్యువు వల్ల పునర్జన్మ అంటూ లేకుండా మనిషి వ్యక్తిత్వం పోదా?

జ: ఆ నీళ్లే ఆవిరై, కొండల మీద వర్షంగా పడి తిరిగి వచ్చిన తరువాత, నదులుగా ఏర్పడి సముద్రంలో పడుతాయి కదా? అట్లాగే, గాఢ నిద్రలో వ్యక్తులు కూడ తమ అస్తిత్వాన్ని పోగొట్టుకున్నా. తమ తమ సంస్కారాల వల్ల వ్యక్తులుగా తిరిగి వస్తారు. చావు విషయంలోనూ అంటే, సంస్కారయుతమైన వ్యక్తిత్వం పోదు.

ప్ర: అదెట్లా?

జ: చెట్టు యొక్క కొమ్మలని కొట్టివేసినా, మళ్లీ ఎట్లా ఎదుగుతుందో గమనించు. చెట్టు యొక్క వేళ్లు పాడవనంత కాలం చెట్టు ఎదుగుతూనే ఉంటుంది. అట్లాగే, అప్పటికే హృదయంలో ఇంకి ఇంకా చావని సంస్కారాలు, సమయం వచ్చినప్పుడు పునర్జన్మని కలిగిస్తాయి. జీవులు పుట్టేది ఇట్లాగే.

ప్ర: హృదయంలో ఇంకిపోయిన ఆ సూక్ష్మమైన సంస్కారాలనుండి అసంఖ్యాకమైన జీవులూ, అవి సృష్టించే లోకమూ, ఎట్లా చిగురిస్తాయి?

జ: ఒక చిన్న విత్తునుండి మణ్ణి చెట్టు పుట్టినట్టే. నామ రూపాలు కల విశ్వం, జీవులూ కూడ ఆ సూక్ష్మమైన సంస్కారాల నుంచే చిగురిస్తాయి.

ప్ర: జీవుడు ఒక శరీరం నుంచి మరొక శరీరానికి ఎట్లా మారుతాడు?

జ: మనిషి చనిపోవనున్నప్పుడు ఎగశ్వాస మొదలవుతుంది. అంటే, చనిపోవనున్న శరీరమంటే మనిషికి స్మారకముండదన మాట. వెంటనే మనస్సు ఇంకొక దేహాన్ని పట్టుకుంటుంది. రెంటి మధ్యా ఊగిసలాడుతుంది, రెండవ దేహాన్ని గట్టిగా పట్టుకొనే వరకూ ఇది సాగుతుంది. ఈలోగా శ్వాస గట్టిగా పీలవటం జరుగుతూంటుంది. అంటే చనిపోవనున్న శరీరం వైపు మనస్సు మళ్ళుతుందనమాట. ఈ మార్పిడి జరుగుతున్న మానసిక అవస్థ కల వంటిది.

ప్ర: చావుకీ, మళ్లీ పుట్టటానికీ నడుమ ఎంత కాలం గడుస్తుంది?

జ: ఎక్కువా కావచ్చు, తక్కువా కావచ్చు. జ్ఞానికి అటువంటి మార్పులేమీ కావు. అతను విశ్వచైతన్యంలో విలీనమై పోతాడు. చనిపోయిన తరువాత కాంతి పథంలోకి వెళ్లినవారు మళ్లీ పుట్టరనీ, అంధకారంలోకి వెళ్ళిన వాళ్లు సూక్ష్మశరీరంలో కర్మఫలాన్ని అనుభవించి మళ్లీ పుట్టుతారనీ కొందరంటారు. పాపం, పుణ్యం పరిసమానంగా ఉన్నవాళ్లు మళ్ళీ ఇక్కడే పుట్టుతారని కొందరంటారు. పాపంకంటే పుణ్యమే ఎక్కువుంటే సూక్ష్మశరీరం స్వర్గానికి వెళ్ళి ఆ తరువాత భూమి మీద మళ్ళీ పుట్టుతారంటారు. పుణ్యం కన్నా పాపమెక్కువ కలవాళ్లు నరకానికి వెళ్ళి ఆ తరువాత ఇక్కడ మళ్ళీ పుట్టుతారంటారు. యోగభ్రష్టుని గతీ ఇంతే. వీటినన్నిటినీ శాస్త్రాలలో వివరించారు. కాని నిజానికి, చావూ లేదు పుట్టుకాలేదు. నిజస్వరూపంలోనే ఎప్పుడూ ఉంటాము. అదొక్కటే సత్యం.

ప్ర: ఇదంతా గందరగోళంగా ఉంది నాకు. అయితే పుట్టుకా, పునర్జన్మకూడా చివరికి మిథ్యయేనా?

జ: జన్మ అంటూ ఉంటేనే పునర్జన్మ, పునర్జన్మలూ కూడా ఉండాలి. నీకీ జన్మ ఎట్లా కలిగింది,ఎందుకు కలిగింది? ఈ కారణాల చేతనే నీకు మళ్ళీ జన్మలూ ఉండాలి. కాని పుట్టిన దెవరు? ఈ పుట్టుకా, చావూ నీకేనా లేక నీకుభిన్నమైన మరొకరికా అని కనుగొంటే సత్యాన్ని గ్రహిస్తావు. ఆ సత్యము అన్ని కర్మలనూ దగ్ధం చేస్తుంది. జన్మల నుంచి విముక్తుడ్ని చేస్తుంది. కొన్ని జన్మలకిగాని పోని సంచితకర్మ అంతా ఒక్క తృటిలో, జ్ఞానకణం వల్ల ఎట్లా మాయమవుతుందో శాస్త్రాలు వివరిస్తాయి. అంటే కొండంత మందుగుండు ఒక్క నిప్పు కణంతో పేలి పోయినట్టన మాట. ఈ ప్రపంచానికీ, అసంఖ్యాకమైన శాస్త్ర పరిశోధనలకీ కారణం, అహంకారమే. ఆత్మవిచారం వల్ల అహంకారం పోతే, ఇదంతా కూలిపోతుంది. మిగిలేదల్లా, ఆత్మ యొక్క సత్యమే.

ప్ర: అంటే, నేను పుట్టనే లేదంటారా?

జ: అవును. ఇప్పుడు నీవు దేహానివనే అనుకొని, దానికి కలిగే చావు పుట్టుకలు నీవేనని భ్రమపడుతున్నావు. కాని నీవు దేహానివి కావు. నీకు జననమరణాలు 3.

ప్ర: అంటే పునర్జన్మ సిద్ధాంతాన్ని మీరు బలపరచరా?

జ: బలపరచను. పైగా నువ్వు మళ్ళీ పుట్టుతాననుకునే భావాన్ని తొలగించాలనే నా ఉద్దేశ్యం. మళ్ళీ పుట్టుతానని అనుకొనేది నీవే. ఈ ప్రశ్న ఎవరికి ఉదయిస్తోందో గమనించు. ఆ పృచ్ఛకుడిని కనుగొంటేనే తప్ప ఇటువంటి ప్రశ్నలకి అంతిమ సమాధానం దొరకదు.

# 19 భగవంతుడు

శ్రీ రమణులు భగవంతుని గురించి చెప్పే మాటలు పైకి పరస్పర విరుద్ధంగా కనబడుతాయి. ఒకసారి, "భగవంతుడేమీ చేయడం"టారు, మరొకసారి, "ఈశ్వరుని సంకల్పం లేనిదే ఏమీ జరుగదం" టారు. "భగవంతుడు మనస్సు కల్పించిన భావమే"నని ఒకసారి అంటే, "ఉన్న సత్యమల్లా భగవంతుడే"ని మరొకసారి అంటారు.

ఈ పరస్పర వైరుద్ధ్యాలు కల వాక్యాలకి కారణం తమ పృచ్ఛకుల అవగాహనా శక్తి ననుసరించి వారు మాట్లాడవలసి రావటమే. సాకారుడైన భగవంతుడ్ని ఆరాధించే వారికి, భగవంతుడు మానవాకారం ధరించిన వాడేనని చెప్పవలసి వచ్చేది. భగవంతుడే విశ్వాన్ని సృష్టించి, తన దివ్య శక్తితో దానిని నిలుపుతాడనీ, లోకస్థుల అవసరాల నన్నిటినీ ఆయన గమనిస్తాడనీ, ఆయన సంకల్పం లేకుండా ఏదీ జరుగదనీ వాళ్ళకి చెప్పేవారు. ఈ సిద్ధాంతానికి ఆకర్షితులు కాని వారికి మాత్రం భగవంతుని గురించీ, ఆయన శక్తి గురించీ ఉన్న భావాలన్నీ మనస్సు కల్పించినవేననీ, దీనికి పర్యవసానం, అందరిలోనూ ఉన్న భగవంతుడ్ని అనుభవసిద్ధం చేసికోవటం మరుగపడిపోతుందనీ చెప్పేవారు.

పరమోన్నతమైన స్థాయిలో బోధించేటప్పుడు వారు "భగవంతుడు", “ఆత్మ” అనేవి, ఆత్మసాక్షాత్కారం వల్ల గ్రహింపబడే అంతరసత్యానికి కేవలం పర్యాయపదాలే అని చెప్పేవారు. ఆత్మసాక్షాత్కారమంటే, భగవత్సాక్షాత్కారమే. అది భగవంతుని గురించిన అనుభవం కాదు, తానే భగవంతుడన్న అనే అవగాహన కల్గటం. ఈ పరమోన్నత స్థాయి నుంచి చూస్తే, భగవంతుని గురించి శ్రీరమణులు చెప్పిన వాటి సారాంశమిది:

1. భగవంతుడు సర్వాంతర్యామి, నిరాకారుడు, కేవలుడు, శుద్ధ చైతన్యం.

2. ఆయనలోనే, ఆయన శక్తితోనే (విశ్వం) అభివ్యక్తమవుతుంది. కాని ఆయన సృష్టికర్తకాడు. భగవంతుడేమీ చేయడు, ఉంటాడంతే. సంకల్పంగాని, వాంఛ గాని ఆయనకు లేవు.

3. పృథక్ భావమంటే మనం భగవంతుని కన్నా వేరన్న భ్రమ, ఆ భ్రమపోతే మిగిలేదల్లా, భగవంతుడే.

ఇంకొంచెం దిగు స్థాయిలో శ్రీరమణులు ఈశ్వరుని గురించి చెప్పేవారు - అంటే, హైదవ సంప్రదాయంలో సాకారుడైన భగవంతుని గురించి, తనకొక వ్యక్తిత్వముందని భావించినంత సేపే ఈశ్వరునికి అస్తిత్వముంటుంది. ఆ భావమున్నంత సేపూ, విశ్వంలోని వ్యాపకాలనన్నింటినీ పర్యవేక్షించే భగవంతుడూ ఉంటాడు. ఆ భావం పోతే, ఈశ్వరుడూ పోతాడు..

ఈశ్వరునికి తోడు హిందూ సాంప్రదాయంలో ఎందరో దేవతలున్నారు - గ్రీక్ పురాణ కథలలోని దేవతలూ, రాక్షసులూ వంటివారు. హిందూ సమాజంలో ఒక ప్రధానమైన అంశం, ఎంతో జనాదరణ కల దేవతలు. వాళ్లు నిజంగానే ఉన్నారని ప్రజలు నమ్ముతారు. ఆ నమ్మకస్థులు ఎంత వాస్తవమో, ఆ దేవతలూ అంతే వాస్తవమంటూ శ్రీరమణులు అందరినీ ఆశ్చర్యచకితులను చేసేవారు. ఆత్మసాక్షాత్కారమైన తరువాత ఈశ్వరుని గతే, ఇతర దేవతలకీ పడుతుందనే వారు. కాని అంతకు పూర్వం, దేవతలు ప్రపంచ వ్యవహారాలను పర్యవేక్షించే ఉన్నతాధికారులు వంటి వారనే వారు.

ప్ర: భగవంతుడు అభివ్యక్తమూ, అనభివ్యక్తమూ అంటారు. మొదటిదే నిజమైతే, ఆయనలో విశ్వముందంటారు. అట్లాగయితే, ఆ ప్రపంచంలో ఒక భాగమైన మనకి ఆయన అభివ్యక్తమైన రూపం తేలికగా తెలియాలి కదా?

జ: భగవంతుని తత్వమేమిటో తెలుసుకోవటానికి ప్రయత్నించే ముందు, నీవెవరివో తెలుసుకో.

ప్ర: నన్ను నేను తెలుసుకుంటే, భగవంతుడ్ని కూడా తెలుసుకున్నట్లేనా?

జ: అవును. భగవంతుడు నీలోనే ఉన్నాడు.

ప్ర: అయితే నన్ను నేను తెలుసుకోవటానికి గాని, భగవంతుడ్ని తెలుసుకోవటానికి గాని అడ్డు ఏమిటి?

జ: చంచలమైన నీ మనస్సూ, విపరీత ధోరణులూ.

ప్ర: భగవంతుడు సాకారుడా?

జ: అవును. ఆయనెప్పుడూ ఉత్తమ పురుషే! "నేను"గా నీ ఎదుటనే నిలబడి ఉంటాడు, ప్రాపంచక విషయాలకే ప్రాధాన్యత నివ్వటం వల్ల భగవంతుడు వెనక్కి వెళ్లి పోయినట్లనిపిస్తుంది. అన్నిటినీ విడిచి, ఆయననే అన్వేషిస్తే “అహం”గా, ఆత్మగా ఆయనొక్కడే మిగులుతాడు.

ప్ర: భగవంతుడు ఆత్మకి భిన్నమా?

జ: ఆత్మే భగవంతుడు. "అహం" అంటేనే భగవంతుడు. నీవు అహంకారాన్ని పట్టుకొని ఉండటం వల్లనే ఈ ప్రశ్న ఉదయిస్తుంది. నీవు ఆత్మనే పట్టుకొని ఉంటే, ఉదయించదు. ఆ ఆత్మ దేనినీ అడుగదు, అడుగలేదు. ఆత్మకి భిన్నంగా భగవంతుడుంటే, ఆయనని అనాత్మమైన భగవంతుడనాలి. అది అసందర్భం కదా. వాస్తవంగా ఉన్నదల్లా, ఉన్నట్టు తెలియని, భగవంతుడే. ఉన్నట్లు అనిపించే వ్యక్తే ఎప్పుడూ ఉండని వాడు. తాను లేననీ, శూన్యమనీ గ్రహించిన స్థితే ఉత్తమమైనదని ఋషులు చెప్తారు.

నీవొక వ్యక్తివనీ, విశ్వమంటూ ఒకటున్నదనీ, దానికి అవతల భగవంతుడున్నాడనీ అనుకుంటావు. ఇందులో భేదభావముంది. ఈ భావం పోవాలి. నీకు గాని, విశ్వానికి గాని భగవంతుడు వేరుగా లేడు. గీతలో ఇట్లా ఉంది:

అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః అహమాదిశ్చ మధ్యంచ భూతానా మంత ఏవచ॥ (10:20)భ. గీ

(గూడాకేశా! నేను అన్ని ప్రాణాల హృదయాలలోనూ ఉంటాను. ప్రాణుల ఆదిమధ్యాంతాలు నేను) భగవంతుడు అందరి హృదయాలలోను ఉండటమే కాదు. అన్నిటికీ ఆధారమాయనే. అన్నిటికీ మూలమాయనే, అన్నీ చివరికి విశ్రమించేది ఆయనలోనే. అన్నీ ఆయననుండే ఉదయిస్తాయి, ఆయనలోనే వసిస్తాయి, ఆయనలోనే లీనమవుతాయి. అందువల్ల ఆయన వేరు కాదు.

ప్ర: “ఈ విశ్వమంతా నాలో ఒక్క రేణువు" అని భగవద్గీత అంటుంది. దీనిని అర్థం చేసుకోవటమెట్లా?

జ: భగవంతుని నుండి ఒక రేణువు విడిపోయి విశ్వమవుతుందని, అర్థం కాదు. ఆయన శక్తి పనిచేస్తోంది. దాని వల్ల ఆ శక్తిలోని ఒక పార్శ్వం విశ్వంగా అభివ్యక్తమయింది. అట్లాగే, పురుషసూక్తంలో అన్నిజీవులూ ఆయన ఒక పాదమన్నప్పుడు బ్రహ్మానికి ఎన్నో భాగాలున్నట్టు అర్థం కాదు.

ప్ర: నాకిది అర్థమయింది - బ్రహ్మం అవిభాజ్యమని.

జ: అంటే, బ్రహ్మమే సర్వమూ, అవిభాజ్యం, సదాప్రత్యక్షమే - కాని మనిషికి ఆ ఎరుకలేదు. దీనిని అతను గ్రహించాలి. ఆత్మే బ్రహ్మమన్న పరమసత్యాన్ని గ్రహించటానికి గల అవరోధాలను అధిగమించటమే జ్ఞానం. ఆ అవరోధాల కలయిక వల్లనే నీవొక వ్యక్తి వన్న వ్యష్టి భావం కలుగుతుంది.

ప్ర: భగవంతుడూ, ఆత్మ ఒకటేనా?

జ: ఆత్మ అందరికీ తెలిసినదే - కాని స్పష్టంగా మాత్రం కాదు. నీ వెప్పుడూ ఉన్నావు! ఆ ఉండటమే, ఆత్మ. "అహం" అన్నది భగవంతుని నామం. భగవంతునికి గల అన్ని నిర్వచనాలలో, బైబిల్ లోని "నేను నేనైన నేను” (ఎక్సోడస్-3) ఉత్తమమైనది. ఇదికాక, బ్రహ్మైవహం (బ్రహ్మమునేనే), అహంబ్రహ్మాస్మి (నేను బ్రహ్మం) సోహం (నేను అతడే) వంటివీ ఉన్నాయి. జెహోవా - అంటే అహం - అనే పేరు కంటె సూటి అయిన దేదీ లేదు. ఉన్నదల్లా కేవల ఉనికే. అదే ఆత్మ. అదే భగవంతడు. ఆత్మ తెలిస్తే భగవంతుడు తెలిసినట్టే. భగవంతడు ఆత్మకాక మరేమీ కాడు.

ప్ర: భగవంతుడికి ఎన్నో పేర్లున్నాయి. అవేవైనా సార్థకమేనా?

జ: భగవంతుడు హృదయంలో, ఏ భావమూ లేకుండా ఉంటాడు. ఆయనని సొగసుగా, సరిగ్గా సూచించేది, "అహం" అనే పదం. ఏ ఇతర నామమూ అట్లా కాదు. అహంకారమంత మయిన తరువాత, ఆత్మపైనే దృష్టి కలవారి హృదయకుహరంలో మౌన పరావాక్కుగా ప్రతిధ్వనించే నామం, 'అహం' ఇంకేదీ కాదు. 'నేను' అనే భావంపై మనస్సు లగ్నం చేసి “అహం” అని ఎల్లప్పుడూ ధ్యానం చేస్తే చాలు. అది ఆలోచనల యొక్క మూలస్థానానికి తీసుకుపోయి, దేహసంబంధియైన అహంకారబీజాన్ని దగ్ధం చేస్తుంది.

ప్ర: భగవంతునికీ, ప్రపంచానికీ గల సంబంధమేమిటి? ఆయనే సృష్టి కర్తా లేక సృష్టిభక్తా?

జ: చేతనా చేతనా లైనవన్నీ సూర్యకాంతిలో తమతమ పనులను చేసుకుంటూంటాయి. కాని ఏ సంబంధమూ లేకుండా సూర్యుడుదయిస్తూనే ఉంటాడు ఆకాశంలో. ఆ విధంగానే ఏ ప్రమేయమూ, వాంఛా లేకుండా భగవంతుడే అన్నిటినీ నిర్వహిస్తాడు. సూర్యుని ఉనికి వల్లనే భూతద్దం వేడిని వెదజల్లుతుంది, పద్మం వికసిస్తుంది, కలువ ముడుచుకుంటుంది. అసంఖ్యాకమైన జీవరాశులు శ్రమించి విశ్రమిస్తాయి.

అసంఖ్యాకమైన గోళాల మధ్య పొందిక కేవలం భగవంతుని ఉనికి వల్లనే నిలుస్తుంది - అయస్కాంతం ఎదుట సూది కదలినట్లు, చంద్రకాంత శిల నీటిని విరజిమ్మినట్లు, చంద్రుని ఎదుట కలువ విచ్చుకున్నట్లు, పద్మం ముడుచుకున్నట్లు!

ఏమాత్రమూ సంకల్పమే లేని భగవంతుని సమక్షంలో ఎందరో తమ తమ కర్మానుసారం ఏవేవో వ్యాపకాలలో నిమగ్నమై, అవన్నీ వృథా అని గ్రహించి, ఆత్మవైపు మళ్లి ముక్తి నొందుతారు. ప్రపంచంలో జరిగేవి ఏవీ సూర్యుని ప్రభావితం చేయవు. భూమి, నీరు, అగ్ని, వాయువుల లక్షణాలు అనంతమైన ఆకాశాన్ని ఏ విధంగానూ ప్రభావితం చేయవు. అట్లాగే, జీవులు చేసే పనుల ప్రభావం, మనస్సుకి అతీతుడైన భగవంతునిపై ఏ మాత్రమూ ఉండదు.

ప్ర: సంసారం ఎందుకింత దుఃఖభరితం, ఎందుకింత దుష్టం?

జ: భగవదేచ్ఛ!

ప్ర: ఆ విధంగా భగవంతుడెందుకు సంకల్పిస్తాడు?

జ: అది అనూహ్యం. ఆ శక్తికి ఏ ప్రయోజనాన్నీ ఆపాదించలేం, దానికి వాంఛ లేదు లక్ష్యం లేదు. అది అనంతం, వివేకవంతం, సర్వశక్తి సమన్వితం. తన సమక్షంలో, ప్రపంచంలో జరిగే వాటి వల్ల భగవంతుడు ప్రభావితుడు కాడు. ప్రపంచంలో జరిగే వాటినీ, సూర్యుణీ పోల్చి చూడు. భాధ్యతని గాని, ప్రయోజనాన్ని గాని ఆ ఏకతకి ఆపాదించాలనుకోవటంలో అర్థం లేదు.

ప్ర: అన్నీ భగవంతుని సంకల్పం వల్లనే జరుగుతాయా?

జ: అన్నిటినీ చేయగల సామర్థ్యం కల భగవంతుని ఆజ్ఞకు భిన్నంగా ఎవ్వరూ. ఏ మీ చేయలేరు.అందువల్ల కుటిలమూ, అసంపూర్ణమూ, విభ్రాంతమూ అయిన మనస్సు కల్పించే వ్యాకులపాటునంతా విడిచి భగవంతుని పాదాల చెంత మౌనంగా ఉండు.

ప్ర: పుణ్యాన్ని మెచ్చుకొని, పాపాన్ని శిక్షించే ఈశ్వరుడొకడు ఉన్నాడా?

జ: ఉన్నాడు.

ప్ర: ఎట్లా ఉంటాడాయన?

జ: అశాశ్వతాలైన దేహంలో, మనస్సులో ఈశ్వరుడున్నాడు - అంతేకాక ఆయన సర్వానికీ అతీతమైన చేతనత్వం, స్వేచ్ఛగా లోపలే ఉన్నాడు..

సాకారుడైన ఈశ్వరుడు, సృష్టికర్త ఉన్నాడు నిజంగానే! సత్యాన్ని గ్రహింపని వారి దృష్టికే పరిమితమైంది ఈ సాపేక్ష యదార్థం. అంటే, వ్యక్తిగత ఆత్మలున్నాయనినమ్మే వారికే ననమాట. కేవలస్థితిలో రూపరహితమైన ఆత్మని తప్ప వేరే దేని ఉనికినీ ఒప్పుకోడు, ఋషి

భౌతికమైన దేహంవలె స్థూల రూపంలో కాకపోయినా, ఈశ్వరునికి నామరూపాలున్నాయి. భక్తుడు కల్పించుకున్న రీతిలో దర్శనమిస్తుందది. ప్రతి మతానుసారమూ, భగవంతుని నామరూపాలు మారుతూంటాయి. అవి అసంఖ్యాకం. భగవంతుని అంతరం కూడ మన ఆత్మ వలెనే - ఒకటే, రూపరహితమైనదే. అందువల్ల భగవంతుడు దాల్చే రూపాలన్నీ కేవలం కల్పితాలే. విశ్వంలో, అందరిలో, అన్నిటా అంతర్లీనమై ఉన్నాడు ఈశ్వరుడు. అన్నిటి సమూహమే భగవంతుడు. ఈ విశ్వమంతా ఒక మహత్తర శక్తిలోని ఒక అంశనుండి ఉద్భవించినదే, మిగిలినదంతా అట్లాగే ఉంది. భౌతికంగా అభివ్యక్తమైన శక్తీ ఆ మిగిలినదీ కలిపితే ఈశ్వరుడవుతాడు.

ప్ర: అంటే, చివరికి ఈశ్వరుడు వాస్తవం కాదనమాట!

జ: ఈశ్వరుడంటే మనకి కల భావాన్ని బట్టే, ఈశ్వరుని ఉనికి కూడాను! అసలు ఆ భావమెవరిదో గమనిద్దాం. భావమెప్పుడూ భావించేవాని బట్టే ఉంటుంది. నీవెవరివో తెలుసుకో, ఇతర సమస్యలన్నీ తీరిపోతాయి. ఈశ్వరుడు, భగవంతుడు, సృష్టికర్త, సాకారుడైన భగవంతుడు ఈ మిథ్యారూపాలన్నీ పోతాయి. కేవల ఉనికే, సత్యం. అందువల్ల ప్రపంచం, అహంకారం, సాకారుడైన భగవంతుడూ అన్నీ అసత్తే. ఆ సత్ పదార్థాన్ని కనుగొనాలి. అంతకంటే తక్కువదేమీ కాదు.

ప్ర: పరమేశ్వరుడు కూడ ఒక భావమే నంటున్నారు మీరు - అంటే, భగవంతుడు లేనట్టా?

జ: కాదు, ఈశ్వరుడున్నాడు.

ప్ర: ఆయన ఏదో ఒక ప్రదేశంలోగాని, రూపంతో గాని ఉంటాడా?

జ: వ్యక్తికి రూపముంటే, అప్పుడు ఆత్మకీ దానికి మూలమైన ఈశ్వరునికీ - రూపముంటుంది. కాని వ్యక్తి రూపం లేకపోతే, మిగిలిన వాటి గురించి ఎరుక ఉండదు కనుక, భగవంతునికి రూపముందని అనలేము కదా. దీర్ఘమైన ధ్యానంలో భక్తుడు ఏ రూపంలో ఊహించుకుంటే, భగవంతుడా రూపంలో కనబడుతాడు. ఎన్ని నామాలు కలిగినా, ఈశ్వరుడు, నిరాకారుడైన చైతన్యం మాత్రమే! ఇక ఆయన నివాసమంటావా - హృదయంలో తప్ప ఇంకెక్కడా ఉండడు. "నేను ఈ దేహాన్ని" అనే భ్రమ అహంకారం వల్ల కలుగుతుంది. అప్పుడే, భగవంతుని నివాసం ఇంకెక్కడో ఉన్నదన్న భావం కూడ కలుగుతుంది. భగవంతుని నిలయం, హృదయమే. ఈ మాటని నమ్ము. దానిని గ్రహించటమే జ్ఞానం.

నీవే సంపూర్ణమైన జ్యోతివి. ఆ కాంతే భగవంతుని ఉనికినీ, అది స్వర్గ ధామంగా దర్శించటాన్ని కల్పిస్తుంది. అది గ్రహించటమే, జ్ఞానం. భగవంతుని నిలయం నీలో ఉంది. పరిపక్వం చెందిన సాధకుని హృదయంలో మనస్సు పూర్తిగా నిమజ్జనమైనప్పుడు, అనంతమైన వ్యాప్తి గల తుర్యాతీతస్థితి (అంటే, నాలుగు అవస్థలకూ అతీతమైన ఆత్మ) అకస్మాత్తుగా ప్రకాశిస్తుంది, ఒక స్వచ్ఛమైన నూతనానుభూతి వలె - అదే అపురూపమైన శివలోక ప్రాప్తి. అది ఆత్మతేజంలో భాసిల్లుతుంది.

ప్ర: జీవుడి భ్రమవల్ల పరిమితమైన దృష్టి జ్ఞానమూ ఉంటాయంటారు. ఈశ్వరునికి మాత్రం అంతటా వ్యాపించే దృష్టి. జ్ఞానమూ ఉంటాయంటారు. అంతేకాక, వ్యక్తి తన పరిమితమైన దృష్టినీ, జ్ఞానాన్ని విడనాడితే జీవుడూ, ఈశ్వరుడూ ఒకటేనని కూడ అంటారు. అటువంటప్పుడు ఈశ్వరుడు కూడ తన లక్షణాలని విడవాలి కదా? (అంటే, సర్వత్రా వ్యాపించిన దృష్టి. జ్ఞానమూ అనమాట) అవి కూడ భ్రమలే కదా మరి?

జ: ఇదా నీ సందేహం? ముందు నీ పరిమితమైన దృష్టిని విడుచుకో. ఆ తరువాత ఈశ్వరుని దృష్టి గురించీ, జ్ఞానం గురించీ తెలుసుకోవచ్చు. ఈశ్వరుని గురించి నీకెందుకు చింత? తన సంగతి ఆయన చూచుకోగలడు. మనకున్నంత సామర్థ్యం ఆయనకి లేదా? ఆయనకి సర్వత్రా వ్యాపించిన దృష్టి జ్ఞానమూ ఉన్నాయా, లేవా అని మన మెందుకు చింతించవలె? మనసంగతి మనం చూచుకుంటే చాలు; అదే పదివేలు.

ప్ర: భగవంతునికి అన్నీ తెలుస్తాయా?

జ: అవిద్యతో తాము అజ్ఞానులమని భావించే వారికే ఈశ్వరుడు సర్వజ్ఞుడని అనిపిస్తాడు, అని వేదాలు చెప్పుతాయి. కాని మనిషి ఆయనని గ్రహించి, ఆయనెవరో తెలుసుకుంటే, సమస్తమూ ఈశ్వరుడే కావటం వల్ల, ఆయనకింకేమీ తెలియదనీ, తెలియటానికేమీ లేదనీ గ్రహిస్తాడు.

ప్ర: మతాలన్నీ భగవంతుడూ, స్వర్గమూ, నరకమూ అంటూ చెప్తాయెందుకు?

జ: మానవులు ప్రపంచంతో సమానులేననీ, ఆత్మ ఒక్కటే సత్యమనీ గ్రహించేట్టు చేయటానికి, సాధకుని బట్టే మతం కూడాను.

ప్ర: విష్ణువు, శివుడు ఉన్నారా?

జ: ఒక్క మానవాత్మలే కావు ఉండేవి...

ప్ర: కైలాసం, వైకుంఠం వాస్తవమేనా

జ: ఈ దేహంలో నీవెంత సత్యమో అంతేను.

ప్ర: నా దేహంవలె వాళ్లకి కూడ దృశ్యమానమైన ఉనికి ఉందా? లేక వాళ్లు కూడ కల్పితాలేనా?

జ: వాళ్లున్నారు.

ప్ర: అయితే, వాళ్లెక్కడో ఉండాలి కదా- ఎక్కడున్నట్టు?

జ: వారిని దర్శించిన వారు, వాళ్లెక్కడో ఉన్నారని అంటారు. కాబట్టి వాళ్ల మాటలని మనం నమ్మాలి.

ప్ర: వాళ్లెక్కడుంటారు.

జ: నీలోనే.

ప్ర: అంటే, నేను కల్పించుకొని, నియంత్రించ గల భావమే ననమాట అది కూడ.

జ: అన్నీ అంతే.

ప్ర: నేను దేనినైనా ఊహించి కల్పించుకోవచ్చు - కొమ్ములున్న కుందేలుని, ఎండ మావులవంటి అర్ధ సత్యాలనీ, నా కల్పనతో సంబంధం లేని సత్యాలుకొన్ని ఉన్నాయి. ఈశ్వరుడు, విష్ణువు అటువంటి వారా?

జ: అవును.

ప్ర: ఎందువల్ల? ఆత్మసాక్షాత్కారమైన తరువాత ప్రళయానికే అతీతుడై మనిషే విముక్తుడవుతాడు. మనిషి కన్నా ఎంతో విజ్ఞుడు, సమర్థుడూ అయిన ఈశ్వరుడెందుకు కాలేడు?

ప్ర: దేవతలూ, పిశాచాలూ కూడా ఉన్నాయా?

జ: ఉన్నాయి.

ప్ర: ఆత్మకి సంబంధించినంత వరకూ, ఈ దేవతల స్థానమేమిటి?

జ: శివుడు, వినాయకుడు, బ్రహ్మాదిదేవతలు మనిషి దృక్పథం నుంచి ఉన్నారు. అంటే, నీ వ్యక్తిగత ఆత్మే సత్యమనుకుంటే వాళ్లూ ఉన్నారు. ప్రభుత్వంలో పాలన కొనసాగించటానికి ఉన్నతాధికారులు ఉన్నట్లే, సృష్టికర్తకీ ఉన్నారు. కాని ఆత్మదృక్పథం నుంచి వీరంతా భ్రమే. అందరూ ఆ పరమసత్యంలో విలీనమవవలసిన వారే.

ప్ర: నామరూపాలుకల భగవంతుడ్ని ఆరాధించేప్పుడు, అపరిమితమైన వానిని పరిమితం చేస్తున్నామనీ, రూపంలేని వానికి రూపం కల్పిస్తున్నామనీ, ఆ విధంగా అపరాధం చేస్తున్నామనీ అనిపిస్తుంది నాకు. అదే సమయానికి రూపంలేని ఈశ్వరుడ్ని ఎల్లప్పుడూ ఆరాధించలేక పోతున్నాను.

జ: రూపాలున్న భగవంతుడిని నీవు ఆరాధిస్తే తప్పేమిటి? నీవెవరివో గ్రహించేదాకా భగవంతుడ్ని సాకారుడుగానైనా నిరాకారుడుగానైనా సరే ఆరాధించు.

ప్ర: భగవంతుడు మానవాకారం కలవాడని నాకు నమ్మకం కుదరటం లేదు. కాని ఈ లోకాన్ని నడిపించే ఒక దివ్యశక్తిగా భగవంతుడ్ని నమ్మగలను. ఈ నమ్మకం దృఢపడితే నా వైద్య వృత్తిలో నాకెంతో మంచిది. దీనినెలా దృఢ పరచుకోవటం?

జ: నమ్మకమనేది తెలియని వాటిలోనే ఉంటుంది. కాని ఆత్మ స్వయంవిదితం. ఎంతటి అహంకారైనా, తన ఉనికిని కాదనలేడు. అంటే, తన ఆత్మని కాదనలేడు. పరమసత్యానికి ఏ పేరైనా పెట్టవచ్చు, దాని యందు నమ్మకముందనో, ప్రేమ ఉందనో అనవచ్చు. కాని తన ఉనికిలో తనకి నమ్మకం లేనివాడు, తానంటే తనకి ప్రేమ లేనివాడు ఎవడు? నమ్మకమూ, ప్రేమా మన సహజలక్షణాలు.

ప్ర: భగవంతుని గురించి నాకే భావమూ ఉండకూడదా?

జ: మనస్సు కల్పించే భగవంతుడనే భావం, హృదయంలో ఇతర భావాలున్నంత సేపే నిలవగలదు. మిగిలిన భావాలన్నీ ధ్వంసమవటం వల్ల భగవంతుని గురించిన ఆ భావం కూడ ధ్వంసమవటమే భావనాతీత సద్భావ స్థితి. అదే భగవంతుని గురించిన అసలైన భావం!

# 20 బాధ - నీతి

ఆస్తికత్వ సిద్ధాంతాలలో ఉన్న కొన్ని వైరుధ్యాలను పాశ్చాత్య ధర్మశాస్త్రజ్ఞులు, తాత్త్వికులూ అర్థం చేసుకోవాలని ప్రయత్నిస్తూనే ఉన్నారు. ఉదాహరణకి - భగవంతుడు పరిపూర్ణుడే అయితే, లోకంలో ఇంత దుర్మార్గముండటానికి కారణమేమిటి? సర్వ శక్తి సమన్వితుడైన భగవంతుడు లోకంలో ఇంత వేదనని ఎందుకు చూస్తూ ఊరుకుంటాడు - ఆయన ఒక్క క్షణంలో వేదననే మాయం చేయగలడే!

శ్రీరమణులు ఇటువంటి చిక్కుముడులను ప్రక్కకు పెట్టేసి, లోకం, భగవంతుడు, వేదనపడే వ్యక్తీ - అన్నీ మనస్సుచే కల్పింపబడినవే అంటారు.

అన్ని మతాలూ మూడు సూత్రాలను ప్రధానంగా పేర్కొంటాయి - ప్రపంచం, ఆత్మ, భగవంతుడు. ఒకే సూత్రం మూడుగా కనబడుతుందనో, మూడు సూత్రాలూ ఎప్పుడూ మూడు సూత్రాలుగానే ఉన్నాయనో అహంకారమున్నంత సేపే అనగలగుతాం.

దుఃఖం దుష్టకార్యాలకు ఫలితమని గాని, భగవదేచ్ఛ అని గాని శ్రీ రమణులు అనరు. ఎవరికి వారే ప్రత్యేకమైన వ్యక్తులుగా భావించుకొని, ఇతరులతోనో, లోకంతోనో సంబంధాలు పెట్టుకోవటం వల్లనే దుఃఖముదయిస్తుందంటారు. చెడ్డపనులు దుఃఖాన్ని ఇంకా ఎక్కువ చేస్తాయి కాబట్టి వాటిని విడనాడాలి. కాని, అవే మూలంకావు. "నేను వేరు" అని భ్రమ కలిగించేది కూడా మనస్సే. కాబట్టి, వేదన అనేది విచక్షణ చూపే మనస్సు యొక్క ఫలితం. మనస్సుని లేకుండా చేస్తే, వేదన అంటూ ఏమీ లేదని తెలుతుంది.

వ్యక్తిస్థాయిలో ఈ భావాన్ని పృచ్ఛకులు అర్థం చేసుకోగలిగినా, లోకంలోని దుఃఖమంతా వీక్షించేవాని మనస్సులోనే ఉన్న దన్నభావాన్ని మాత్రం తేలికగా ఒప్పుకోలేక పోయేవారు. కాని శ్రీరమణులు తమ వాదాన్ని విడువక, ఆత్మసాక్షాత్కారమైతే వ్యక్తిగత వేదనేగాక లోకంలోని వేదన కూడా మిథ్యే అని తెలుస్తుందనేవారు. ఈ వాదననే ఇంకొంచెం పొడిగించి, ఇతరుల దుఃఖాన్ని పోగొట్టటానికి ఎంతో బలమైన సాధనం, ఆత్మసాక్షాత్కారం పొందటమే ననేవారు.

ఇట్లా అన్నంతమాత్రాన, ఇతరుల దుఃఖాన్ని తన అనుచరులు ఉపేక్షించాలని శ్రీరమణుల ఉద్దేశం కాదు. ఆత్మసాక్షాత్కారానికి పూర్వమే, ఇతరులకి దుఃఖమున్నదన్న సంగతిని గ్రహించి, దానిని ఉపశమింప చేయటానికి కృషి చేయాల నేవారు. అయితే, "నాకన్నా దురదృష్టవంతులకు నేను సహాయం చేస్తున్నా"ననో, "ఈ పనులు నేను చేస్తున్నా"ననో అనుకోకుండా చెయ్యాలి. లేకపోతే, ఆ పరోపకారం వ్యక్తికి ఆధ్యాత్మికంగా ఏ విధంగానూ ఉపయోగించదు.

మొత్తానికి, ఈ లోకంలో ఏమి చెయ్యాలి. ఏమి చేయకూడదు అనేది శ్రీరమణులకు అంత పట్టేది కాదు. లోకవ్యవహారంలో కొన్ని మంచి పనులు, మరి కొన్ని చెడ్డవీ అంటూ విలువలని ఆపాదించేది మనస్సేననీ, మనస్సు ధ్వంసమైన తరువాత తప్పొప్పుల భావాలు పోతాయనీ అనేవారు. ఈ కారణంగా, వారు లోకం దృష్టిలో నైతికంగా పరిగణింపబడే దాని గురించి అరుదుగా మాట్లాడేవారు. మరీ బలవంత పెట్టితే "ఒకే ఒక సరియైన పని ఆత్మని తెలుసుకోవటమే" నంటూ తప్పించుకొనేవారు!

ప్ర: ఈ లోకంలోని దుఃఖానికి కారణమేమిటనుకుంటారు మీరు? వ్యక్తులుగా, సమిష్టిగా దీనిని మార్చటానికేం చెయ్యాలి?

జ: ఆత్మసాక్షాత్కారం పొందటమొక్కటే చేయాల్సింది.

ప్ర: ఇన్ని పరిమితులున్న ఈ జీవితంలో ఆత్మానందాన్ని అనుభవించ గలుగుతానా అసలు?

జ: ఆ ఆత్మానందమనేది నీలోనే ఉంది ఎప్పుడూ - చిత్తశుద్ధితో ప్రయత్నిస్తే నీకే తెలుస్తుంది. నీ దుఃఖానికి కారణం నీ బయటి జీవితం కాదు అది నీలోనే, అహంకారంగా ఉంది. నీవే నీపై పరిమితులను కల్పించుకొని, వాటిని దాటాలంటూ విఫల ప్రయత్నాలు చేస్తూంటావు. వేదన అంతటికీ కారణం నీ అహంకారమే - అన్ని సమస్యలూ దానితోనే వస్తాయి. దుఃఖానికి కారణం నీలోనే ఉన్నప్పుడు జీవితపరిస్థితులకు ఆ దుఃఖాన్ని ఆపాదించి లాభమేమిటి? నీకు బాహ్యమైన వాటినుండి ఏ విధమైన ఆనందాన్ని పొందగలవు? ఒక వేళ పొందినా అది ఎంతసేపుంటుంది? అహంకారాన్ని విస్మరించి, తిరస్కరిస్తే నీవు విముక్తుడవవుతావు. దానిని అంగీకరిస్తే నీపై ఆంక్షలు విధించి, వాటిని అధిగమించ మంటూ నీకు వృథా ప్రయాసని కలిగిస్తుంది. నీవే అయిన ఆత్మగా ఉండటమంటే, ఎప్పుడూ నీ స్వంతమే అయిన ఆనందానుభూతిని పొందటమనమాట.

ప్ర: నిజంగానే బంధంగాని, విముక్తిగాని లేకపోతే, సుఖదుఃఖాల ప్రత్యక్షానుభావమెట్లా సంభవిస్తుంది?

జ: అవి నిజమైనట్టు అనిపించటానికి కారణం నిజతత్త్వం నుండి నీవు పైదొలగటమే. అవి నిజం కావు.

ప్ర: ఈ ప్రపంచం సృష్టింపబడింది సుఖంకోసమా, దుఃఖం కోసమా?

జ: సృష్టి మంచీకాదు, చెడూకాదు. అది అంతే. మనిషి మనస్సే అన్ని రకాల కల్పనలనూ చేసుకుంటుంది. తన దృక్పథం నుంచి చూస్తుంది. తన ఇష్టానుసారం వ్యాఖ్యానించు కుంటుంది. స్త్రీ, స్త్రీయే. కాని ఒక మనస్సు ఆమెను తల్లి అంటుంది. వేరొకటి సోదరి అంటుంది. ఇంకొకటి అత్త అంటుంది. అట్లాగే మిగిలినవీను. పురుషులకి స్త్రీలంటే మక్కువ, పాములంటే ద్వేషం, రోడ్డుమీద ఉండే గడ్డీ, రాళ్లూ అంటే నిర్లక్ష్యం. విలువలనాపాదించే ఈ లక్షణమే లోకంలోని దుఃఖమంతటికీ మూలం.

సృష్టి రావి చెట్టు వంటిది దాని పళ్లను తినటానికో, కొమ్మలమాటున తలదాచుకోవటానికో పక్షులు వస్తాయి, ఆ చెట్టు నీడనిచ్చే చల్లదనం కోసం మనుష్యులు వస్తారు, కాని కొందరు ఆ చెట్టుకే ఉరిపోసుకోవచ్చు కూడా! చెట్టు మాత్రం నిశ్చింతగా, తనని ఎవరు ఏ విధంగా ఉపయోగించుకున్నా. ఏమీ పట్టించుకోకుండా తన మానాన తానుంటుంది. అన్ని కష్టాలనూ కల్పించుకొనేది మనిషి మనస్సే - తరువాత సహాయం కోసం ఏడిచేదీ అదే. ఒకరికి శాంతిని, ఇంకొకరికి శోకాన్నీ ఇచ్చేటంతటి పక్షపాత బుద్ధి కలవాడా భగవంతుడు? సృష్టిలో పుష్టిని, సౌందర్యాన్ని మనిషి గమనించడు. ఎప్పుడూ ఏడుస్తూనే ఉంటాడు. ఆకలిగా ఉన్నప్పుడు తన ఎదురుగా రుచ్యమైన భోజనముండగా దానిని అందుకోవటానికి చేయి చాచకుండా, ఏమీ లేదని ఏడిచే వాని వలెనే! ఇది ఎవరి తప్పు - మనిషిదా, భగవంతునిదా?

ప్ర: అన్నీ భగవంతుడే అయితే, తాను చేసిన పనులకు మనిషి ఎందుకు ప్రతిఫల మనుభవించి దుఃఖిస్తాడు? ఆ పనులు కూడా భగవంతుని ప్రేరణలే కదా?

జ: తానే కర్తనని భావించే వాడే, దుఃఖించేవాడు!

ప్ర: కాని పనులన్నీ ప్రేరేపించేది భగవంతుడే. మనిషి నిమిత్తమాత్రుడే కదా?

జ: దుఃఖంగా ఉన్నప్పుడే ఈ మాటలు చెప్తారుగాని, సుఖంగా ఉన్నప్పుడు కాదు! ఈ నమ్మకమే ఎల్లవేళలా ఉంటే, దుఃఖించటమంటూ ఉండనే ఉండదు!

ప్ర: బాధ ఎప్పుడూ తీరుతుంది?

జ: తానొక వ్యక్తిననే భావం పోయేదాకా తీరదు. మంచి పనులూ, చెడ్డపనులూ భగవంతునివే అనుకుంటే సంతోషం, దుఃఖం మాత్రమే నీవని ఎందుకనుకోవాలి? మంచినిగాని, చెడునిగాని చేసినవాడే సుఖాన్నిగాని, దుఃఖాన్నిగాని అనుభవిస్తాడు. దాని నట్లాగే విడిచిపెట్టు కావాలని దుఃఖాన్ని పైన వేసుకొక.

ప్ర: బాధలేదని ఎట్లా అనగలరు? నాకెటు చూచినా, కనబడుతూనే ఉందే?

జ: అందరిలో హృదయంగా ప్రకాశించే ఆత్మ, నిష్కళంకమైన అనందసాగరం. ఆకాశానికి లేని నీలిరంగువలె బాధకూడ ఊహలో తప్ప ఇంకెక్కడా లేదు. నీ అసలు స్వరూపం. అజ్ఞానాంధకారం ద్వారా సమీపింపలేని, జ్ఞానభాస్కరుడు. అది ఆనందంగా వెలిగిపోతుంది.

కాని, దుఃఖం అవాస్తవమైన పృథక్ భావం వల్ల ఏర్పడే భ్రమ మాత్రమే. అసత్యమైన భ్రమే దానిని అనుభవిస్తుంది, ఇంకెవరూ కారు. ఆత్మే ఆనందం. దానిని గమనిస్తే జీవితంలో బాధ అంటూ ఏమీ ఉండదు. "ఈ దేహమే నేను" అనే భ్రమే వేదనకి కారణం.

ప్ర: నేను శారీరకంగానూ, మానసికంగానూ బాధపడుతూనే ఉన్నాను. నేను పుట్టినప్పటినుంచీ సంతోషాన్నెరుగను. నేను పుట్టినప్పటినుంచీ మా అమ్మ కూడ బాధ పడిందట. నాకెందుకింత బాధ ఉంది? నేనే పాపమూ చేసి ఎరుగను. నేను పూర్వ జన్మలో చేసిన పాపానికి ఫలితమా ఇది?

జ: శరీరమూ, మనస్సూ బాధపడుతున్నాయంటావు - కాని ఈ ప్రశ్నలని అవి అడుగుతూన్నయా? ప్రశ్నలు వేసేదెవరు? ఈ శరీరానికీ, మనస్సుకీ ఆవల ఉన్నవాడు కాదూ? ఈ శరీరమీ జన్మలో బాధ పడుతోంది, దీనికి పూర్వజన్మ కారణమా అని అడుగుతున్నావు. అదే అయితే, ఆ జన్మకి కారణం అంతకు పూర్వపు జన్మ - అట్లా ఇంకా వెనక్కి వెళ్లాలి. విత్తుముందా, మొక్కముందా అన్నట్టు దీనికి అంతు లేదు. అన్ని జన్మలకీ ప్రథమ కారణం, అజ్ఞానమనాలి. ఆ అజ్ఞానమే ఇప్పుడూ ఉంది - ఈ ప్రశ్నని అడిగిస్తోంది. ఆ అజ్ఞానాన్ని జ్ఞానంతో రూపుమాపాలి. "ఈ బాధ ఎవరికి, ఎందువల్ల కలిగింది" అని అడిగితే "నేను" అనేది శరీరానికీ మనస్సుకీ అతీతమైనదనీ ఆ ఆత్మే నిత్యమనీ, నిత్యానందమనీ గ్రహిస్తావు. అదే జ్ఞానం.

ప్ర: నాకేలోటూ లేకపోయినా, నాకెన్నో చింతలు, వాటి వల్ల ఎప్పుడూ బాధే, శాంతి అనేదే లేదు.

జ: ఈ చింతలన్నీ నిద్రలో తెలుస్తాయా నీకు?

ప్ర: తెలియవు.

జ: ఏ చింతాలేని నిద్రపోయే ఆ మనిషీ, ఇప్పటినీవూ ఒకటేనా - లేక వేరు వేరా?

ప్ర: ఆ మనిషి నేనే.

జ: అంటే ఆ చింతలు నీవి కావనమాటే కదా - అవన్నీ నీవే అని అనుకోవటం నీ తప్పు.

ప్ర: మేము దుఃఖితులమై నీకు ఉత్తరం ద్వారానో, మానసిక ప్రార్థన ద్వారానో విన్నవించుకుంటే "అయ్యో! నా బిడ్డ బాధ పడుతున్నాడే" నన్న జాలి మీకు కలగదా?

జ: అట్లా స్పందించేవాడు జ్ఞాని కాజాలడు.

ప్ర: ఈ లోకంలో ఎంతో బాధని చూస్తాం. తిండి లేని వారిని చూస్తాం. ఇది యదార్థమే. వాని ఆకలి యదార్థమే. ఆ బాధ కూడా మిథ్యే అని ఊరికే ఉండాలా?

జ: జ్ఞాని దృష్టినుంచి చూస్తే లోకమూ, అందులో అణుమాత్రమైన బాధా కలే. కలలో నీకు కూడ ఆకలి తెలుస్తుంది. ఇతరులకీ ఆకలి వేస్తూండటం చూస్తావు. నీవు తిని, ఇతరుల పట్ల జాలిపడి, వారికి తిండి పెట్టావు. ఇప్పుడు నీవు చూసే బాధా, ప్రపంచమూ ఎంత వాస్తవమో కల ఉన్నంత సేపూ ఆ ఆకలిబాధ వాస్తవమే. నిద్ర మేల్కొనగానే నీకు తెలుస్తుంది కలలోని బాధ వాస్తవం కాదని. కడుపునిండా భోజనం చేసి పడుకుంటావు. కాని కలలో, రోజంతా కష్టపడి పనిచేసినట్టు, అలసిపోయినట్టు, ఆకలిగా ఉన్నట్టూ బాగా భోజనం చేయాల న్నట్టూ కనబడుతుంది. అప్పుడు మేల్కొంటావు. నీ కడుపు నిండి ఉన్నదనీ, నీవు పక్కమీద నుంచి కదలనైనా కదలలేదనీ గ్రహిస్తావు. అయినా, కలలో నీకు అనిపించే బాధ నిజంకాదని ప్రవర్తించ లేవుకదా. కలలోని ఆకలిని, కలలోని భోజనంతోనే తగ్గించుకోవాలి. కలలో, ఆకలితో ఉన్న తోటి మానవులకు కలలోనే భోజనం పెట్టాలి. కలనీ, మేల్కొని ఉన్న అవస్థనీ కలగాపులగం చేయలేవు. జ్ఞానోదయమై, ఈ మాయని గ్రహించనంత వరకూ, ఎక్కడ బాధ కనబడినా దానిని నివారించటానికి సమాజసేవ చేయాలి. అప్పుడైనా, "నేను చేస్తున్నా"ననే అహంకారం లేకుండా, చేయాలి. "నేను ఈశ్వరుని పనిముట్టుని మాత్రమే" అనుకోవాలి. అట్లాగే స్వాతిశయంతో, "నాకంటె తక్కువవానికి సహాయపడు తున్నాను. వానికి నా సహాయ మవసరముంది. వానికి సహాయపడగల స్థితిలో నేనున్నాను. నేను గొప్ప, వాడు తక్కువ" అనుకోకూడదు. ఆ మనిషిలోని భగవంతుడ్ని ఆరాధిస్తున్నట్టుగా సహాయపడాలి. ఆ సేవ నీ ఆత్మకొరకే. ఇంకెవరి కొరకో కాదు, నీకు తప్ప నీవెవ్వరికీ సహాయపడటం లేదు.

ప్ర: ఎక్కువగా ధ్యానం చేయలేని వారు, పరోపకారం చేస్తూంటే చాలదా?

జ: చాలు. వాళ్లకి సద్భావముంటుంది. అది చాలు. మంచితనం, భగవంతుడు, ప్రేమ - అన్నీ ఒకటే. వీటిలో దేనిగురించైనా మనిషి ఎప్పుడూ చింతిస్తూంటే చాలు. ఇతర ఆలోచనలను రానీయకుండా చేయటమే ధ్యానం యొక్క ప్రయోజనం.

ప్ర: అంతిమంగా, అంతా మిథ్యే అని తెలిసినా, ఇతరుల బాధను నివారించటానికి ప్రయత్నం చేయాలనమాట.

జ: అందరూ సంతుష్టులుగా, సంపన్నులుగా, వివేకవంతులుగా, ఆరోగ్య వంతులుగా, సమానంగా ఉన్న కాలమంటూ ఎప్పుడూ ఉండదు. ఈ మాటలకి వ్యతిరేకమైనవి ఉండటం వల్లే వీటికి అర్థముంది. కానీ, నీకంటె తక్కువగా సంతుష్టుడైన వాడినో, ఎక్కువగా బాధ పడుతున్నవాడినో చూచి నీవు కరుణతో స్పందించి, నీ చేతనయినంత మేరకు అతనికి ఉపశమనం కలిగించాలి. నీవు అందరినీ ప్రేమించాలి, అందరికీ సహాయపడాలి. అనాసక్తత, నేను చేస్తున్నానే అహంకారభావం లేకుండా, ఈ పని భగవంతుడు నాతో చేయిస్తున్నాడు, నేను ఆయన పనిముట్టునే అనే భావంతో ఇతరుల కష్టాన్ని తగ్గించటానికి నీవు ప్రయత్నిస్తే నీవు కృతార్థుడవైనా కాకపోయినా, ఆధ్యాత్మికంగా పురోగమిస్తున్నట్టే. ఇతరులకిచ్చేదంతా తమకే ఇచ్చుకుంటున్నామని తెలిసి ఉన్న వారందరూ సచ్చీలురే - అటువంటి వాళ్లు ఇతరులకు సహాయపడకుండా ఉండగలరా? అందరూ ఆత్మే - ఎవరు ఎవరికి ఏమి చేసినా తమకి చేసుకున్నట్టే.

ప్ర: లోకంలో ఎంతో క్షోభని కలిగించే విపత్తులు, దుర్భిక్షం, మహమ్మారి వంటివి తరచూ సంభవిస్తూంటాయి. ఈ పరిస్థితికి కారణమేమిటి?

జ: ఇదంతా కనబడేది ఎవరికి?

ప్ర: ఆ సమాధానం కుదరదు. ఎటుచూచినా బాధే కనబడుతుంది నాకు.

జ: నీవు నిద్రలో ఉండగా ఈ లోకంగాని అందులోని క్షోభగాని నీకు తెలియలేదు. ఇప్పుడు మేల్కొని ఉన్న స్థితిలోనే ఆ ఎరుక ఉంది. అవి పట్టని స్థితిలోనే ఉండు. అంటే ప్రపంచం గురించి ఎరుక లేనప్పుడు, ప్రపంచపు బాధలు పట్టవునీకు. నీవు నిద్రలో వలె ఆత్మలో సంస్థితమైతే ప్రపంచము, దాని బాధలు నిన్నే విధంగానూ ప్రభావితం చెయ్యవు. అందువల్ల లోపల చూసుకో. ఆత్మని గ్రహించు. అప్పుడు ప్రపంచము, దాని దుఃఖమూ అంతమవుతాయి.

ప్ర: కాని అది స్వార్థపరత్వమవుతుంది...

జ: ప్రపంచం బయట లేదు. నీవు తప్పుగా నీ దేహంతో తాదాత్మ్యం చెంది ఉండటం వల్ల ప్రపంచం నీకు బయట ఉన్నట్టు కనబడుతుంది - అందులోని దుఃఖం కూడ నీకు కనబడుతుంది. కాని అవి వాస్తవం కావు. సత్యమేదో అన్వేషించు. ఈ అసత్యాన్ని వదిలించుకో.

ప్ర: లోకోపకార పరాయణులున్నారు చాలా గొప్పవారు. లోకంలోని దుఃఖాన్ని వారు వారింపలేక పోతున్నారు -

జ: వాళ్లంతా అహంకారయుతులు. అందువల్లనే సమస్యని పరిష్కరింప లేక ం పోతున్నారు. వారే ఆత్మనిష్ఠులైతే వారు ఇంకొక విధంగా ఉండేవారు.

ప్ర: మహాత్ములెందుకు సహాయం చేయరు?

జ: వారు చేయటం లేదని నీకెట్లా తెలుసు? బహిరంగ ఉపన్యాసాలు, భౌతిక కలాపాలు, ధనసహాయం - వీటన్నిటినీ మించినది మహాత్ముల మౌనం. వారు ఇతరుల కంటె ఎక్కువే సాధిస్తారు.

ప్ర: ప్రపంచ దుఃస్థితిని ఉపశమింప చేయటానికి మేమేమి చేయాలి?

జ: నీవు బాధనుంచి విముక్తుడవైతే, ఎక్కడా బాధ ఉండదు. ప్రపంచం బయట ఎక్కడో ఉందనీ, అందులో బాధ ఉందనీ నీవునుకోవటంలోనే సమస్యంతా ఉంది. కాని, ప్రపంచమూ, బాధా నీలోనే ఉన్నాయి. నువ్వు లోపలికి చూసుకుంటే, బాధ ఉండదు.

ప్ర: భగవంతుడు పరిపూర్ణుడు. కాని లోపభూయిష్టమైన ప్రపంచాన్ని ఎందుకు సృష్టించాడు? కర్త యొక్క ప్రవృత్తి బట్టే ఏ కార్యమైనా ఉంటుంది - కాని ఇక్కడ మాత్రం అట్లా కాదు.

జ: ఈ ప్రశ్నని లేవనెత్తేది ఎవరు?

ప్ర: నేను, వ్యక్తిని.

జ: నీవీ ప్రశ్నని వేస్తున్నావు బాగానే ఉంది, కాని నీవు భగవంతుని కన్నా వేరా? నీవు దేహంతో తాదాత్మ్యం చెందినంత సేపూ నీకు ప్రపంచం బయట ఉన్నట్టే అనిపిస్తుంది, అందులోని అసంపూర్తి కనబడుతుంది. భగవంతుడు పరిపూర్ణుడు. ఆయన సృష్టి కూడ పరిపూర్ణమే. కాని అది నీకు అసంపూర్ణంగా కనబడటానికి కారణం, నీకున్న తప్పు తాదాత్మ్యం.

ప్ర: శోకమయమైన ప్రపంచంగా ఆత్మ ఎందుకు రూపం దాల్చింది?

జ: దానిని నీవు అన్వేషించాలి. నీకళ్లు తమని చూచుకోలేవు. అద్దాన్ని ముందుపెట్టితే మాత్రం చూచుకోగలుగుతాయి. సృష్టి విషయం కూడ అంతే, "ముందు నిన్ను నీవు చూచుకో, ఆ తరువాత ప్రపంచమంతా ఆత్మగానే చూడు."

ప్ర: అంటే, నేనెప్పుడూ అంతర్దృష్టి కలిగే ఉండాలనమాట.

జ: అవును.

ప్ర: నేను ప్రపంచాన్ని చూడకూడదా అసలు?

జ: ప్రపంచాన్ని చూడకుండా కళ్లు మూసుకోవాలని నీ కెవ్వరూ చెప్పలేదే! "మొదట నిన్ను నీవు చూచుకొని, ఆ తరువాత ప్రపంచాన్నంతా ఆత్మగా చూడమ"నే చెప్తున్నాం. నీవు దేహానివే అనుకుంటే ప్రపంచం బయట ఉన్నట్లనిపిస్తుంది. నీవే ఆత్మవైతే ప్రపంచం బ్రహ్మంగా కనబడుతుంది.

ప్ర: ప్రపంచ శాంతికై ఎట్లా కృషి చెయ్యాలి?

జ: ప్రపంచమంటే ఏమిటి? శాంతి అంటే ఏమిటి? పనిచేసే వాడెవడు? నీవు నిద్రలో ఉన్నప్పుడు ప్రపంచం లేదు, మెలకువగా ఉన్నప్పుడు మాత్రం మనస్సుచే కల్పింపబడుతుంది. కాబట్టి అది ఒక భావమేగాని ఇంకేమీ కాదు. అలజడి లేకపోవటమే శాంతి అంటే. అలజడికి కారణం మనిషిలో ఆలోచనలు చెల రేగటం అది, శుద్ధ చైతన్యం నుండి అహంకార ముద్భవించటమే. అంటే, శాంతంగా ఉండటమంటే ఆలోచనలు లేకుండా ఉండటమన మాట. శుద్ధ చైతన్యంలో సంస్థితమవటమన మాట. నీలో నీకు శాంతముంటే, అంతటా శాంతే ఉంటుంది.

ప్ర: ఒక పని చేయటం వల్ల ఇంకెవరికో ఒక అన్యాయం తప్పుతుంది. ఆ పని తప్పుదైనా చేయాలా? లేక ఊరుకోవాలా?

జ: ఏది తప్పు? ఏది ఒప్పు? వీటిని నిర్ణయించటానికి ప్రమాణాలమీ లేవు. మనిషిని బట్టీ, పరిస్థితులను బట్టీ అభిప్రాయాలు మారుతూంటాయి, అవి కూడ భావాలే తప్ప ఇంకేమీ కావు. వాటి గురించి చింతింపక, ఆలోచనలనే వదిలించుకోవటానికి ప్రయత్నించు. నీవెప్పుడూ సరియైన మార్గానే ఉంటే ప్రపంచంలో కూడ మంచే నిలుస్తుంది.

ప్ర: ముక్తి నొందటానికి సద్వర్తనం చాలదా?

జ: ముక్తి ఎవరికి? ముక్తి ఎవరికి కావాలి? సద్వర్తనమంటే ఏమిటి? అసలు వర్తనమంటే ఏమిటి? ఏది తప్పో ఏది ఒప్పో నిర్ణయించేదెవరు? పూర్వ సంస్కారాలను బట్టి ఒక్కొక్కరు ఒక్కొక్క దాన్ని తప్పుగానో, ఒప్పుగానో భావిస్తారు. సత్యం తెలిసినప్పుడే ఈ తప్పొప్పుల యదార్థం తెలుస్తుంది. ముక్తి ఎవరికి కావాలో తెలుసుకోవటం అన్నిటి కంటే మంచి పద్ధతి. ఈ అహంకారానికి మూలాన్ని అన్వేషించటమే అందరికీ సద్వర్తనం.

ప్ర: నిత్యకర్మలను చేయటం మోక్షానికి దారి తీస్తుందని శాస్త్రాలంటాయి. దాని మాటేమిటి?

జ: పుస్తకాలలో అట్లా చెప్పబడింది. సద్వర్తన మంచిదనీ, గమ్యాన్ని చేరుస్తుందనీ ఎవరు కాదన్నారు? సత్కర్మ మనస్సుని క్షాళనం చేసి, చిత్తశుద్ధిని ఇస్తుంది.

అటువంటి మనస్సుకి జ్ఞానం లభిస్తుంది. అదే మోక్షమంటే. చివరికి, జ్ఞానాన్నందు కోవాలి. అంటే, అహంకారం యొక్క మూలాన్ని కనుక్కోవాలి. ఇది నచ్చని వాళ్లకి, ఇట్లా చెప్తారు. సత్కర్మలు చిత్తశుద్ధికి దారితీస్తాయి. చిత్తశుద్ధి జ్ఞానానికి దారి తీస్తుంది. అది మోక్షాన్నిస్తుంది.

ప్ర: పనుల వెనుక నున్న ఉద్దేశాలు ముఖ్యం కావా?

జ: ప్రేమతో, ధార్మికమైన నిర్మలత్వంతో, శాంతచిత్తంతో, చేసినదంతా మంచిపనే. వాంఛతో, అశాంత చిత్తంతో, చేసిన దంతా చెడ్డపనే. "ఫలం వస్తే చాలులే" అనుకుంటూ ఏ మంచి పనినీ చెడ్డ సాధనాలతో చేయవద్దు. సాధనాలు చెడ్డవయితే, మంచిపని కూడ చెడ్డగానే పరిణమిస్తుంది. కాబట్టి సాధనాలు నిర్మలంగా ఉండాలి.

ప్ర: "మనమంతా విముక్తులమే, మనకే బంధమూ లేదు, మనం భగవంతుని నుండి నిప్పుకణాల వలెవచ్చాం, తిరిగి ఆయననే చేరుతా"మంటారు శ్రీశంకరాచార్య. అట్లా అయితే, అన్నిరకాల పాపాలనూ ఎందుకు చేయకూడదు?

జ: మనకీ, ఆత్మకీ బంధంలేని మాటనిజమే. ఈలోగా నీవనే పాపకార్యాలు చేస్తే వాటి ఫలలితాన్ని అనుభవించాల్సిందే. దానిని తప్పించుకోలేవు. ఎవరైనా వచ్చి నిన్ను బాదుతూంటే, “నేను విముక్తుడ్ని, ఈ దెబ్బల వల్ల నాకే బంధమూ లేదు, నాకే బాధా లేదు, వాడు కొట్టితే కట్టనీ" అనగలవా? అట్లా నిజంగానే నీకనిపిస్తే నీ ఇష్టం వచ్చినట్టు నీవు చేయవచ్చు "నేను విముక్తుడ్ని" అని పెదవులతో అనటంలో అర్థమేమిటి?

ప్ర: ప్రపంచమంతా ఈశ్వరుని లీల అనీ, అంతా బ్రహ్మమయమనీ అంటారు. అటువంటప్పుడు దురభ్యాసాలని విడనాడాలని ఎందుకంటారు?

జ: మనిషి శరీరంలో ఒక పుండుందనుకో శరీరంలో కొంచెం భాగమే నంటూ నిర్లక్ష్యం చేస్తే అది శరీరానికంతా నొప్పిని కలిగిస్తుంది. మామూలు వైద్యంతో నయం కాకపోతే, డాక్టరు వచ్చి కత్తితో దానిని కోసివేసి ఆ మాలిన్యాన్ని తీసివేయ వలసి వస్తుంది. ఆ భాగాన్ని తీసివేయకపోతే, కుళ్లుతుంది. దీసివేసిన తరువాత సరిగ్గా కట్టుకట్టక పోతే, చీము పడుతుంది. ప్రవర్తన విషయమూ అంతే. దురభ్యాసాలూ, దురలవాట్లూ దేహంలో కురపువంటివే. ప్రతిరోగానికీ తగిన వైద్యాన్నివ్వాలి.

ప్ర: అంటే, సంప్రదాయ సిద్ద నడవడికే కట్టుబడి ఉండాలనమాట. పాపం

జ: ఈ నియమాలు చాలా ఉపయోగిస్తాయి. వాటి ననుసరించటం ఉచితం. కాని, నిజమైన జ్ఞాన సంపాదనకి అవి ఆటంకాలయితే, అడ్డుతగిలితే, వాటిని వర్జించవచ్చు.

# 21 కర్మ, విధి, మానవసంకల్పము

తూర్పు దేశాలలో కర్మ సిద్ధాంతం సర్వసామాన్యం. బాగా ప్రాచుర్యంలో ఉన్న సిద్ధాంతం ప్రకారం విశ్వవ్యాప్తమైన ఖాతాల పద్ధతి ఒకటుంది. దాని ప్రకారం, ప్రతివారూ తమ చేష్టల (కర్మల) యొక్క ఫలితాన్ని అనుభవించాలి. సత్కార్యం సత్ఫలితాన్నీ, దుష్కార్యం వేదననీ ఇవ్వటం అనివార్యం. కర్మల ఫలితాలు ఈ జన్మలోనే అనుభవించవలసిన అవసరం లేదు, వాటిని ఉత్తర జన్మలోనైనా అనుభింప రావలసివచ్చు. దీని వల్ల కర్మను మూడు విధాలుగా విభజిస్తారు. హిందూ సిద్ధాంతాలు

చాలా మట్టుకు క్రింద వివరింప బడిన విభజనని చేస్తాయి. శ్రీరమణులు కూడ దీనిని వాడేవారు.

1. సంచిత కర్మ - పూర్వజన్మలలో సమకూడిన కర్మ.

2. ప్రారబ్ధ కర్మ - ఈ జన్మలో అనుభవించవలసిన సంచితకర్మలోని భాగం. కర్మసిద్ధాంత్తాన్ననుసరించి మనిషి వ్యాపకాలు ముందే నిర్ణయింపబడి ఉండటం వల్ల, ప్రారబ్ధాన్నే 'విధి' అని కూడ అంటారు.

3. ఆగామి కర్మ - ఈ జన్మలో అదనంగా చేసే కర్మ - ఉత్తర జన్మలో అనుభవింప వలసి వచ్చేది.

కర్మ సిద్ధాంతాల నిజాన్ని శ్రీరమణులు అంగీకరించినా, మనిషికి వృథక్ భావమున్నంత సేపే ఆ సిద్ధాంతం వర్తిస్తుందనే వారు. మనిషి అజ్ఞానిగా ఉన్నప్పుడు పూర్వ చేష్టలకీ, భావాలకీ ఫలితాలైన కొన్ని నిర్ణీతమైన వ్యాపకాలకూ, అనుభవాలకూ వశుడవుతాడు. మనిషికి సంబంధించిన ప్రతి పనీ, అనుభవమూ పుట్టినప్పుడే నిర్ణయమై పోతాయనీ మనిషికి ఉన్న స్వేచ్ఛ అంతా పని చేసే వాడుగాని, అనుభవించే వాడుగాని ఎవ్వరూ లేరని గ్రహించటమేని కూడ అప్పుడప్పుడనేవారు. ఆత్మ సాక్షాత్కారమైన తరువాత కర్మ ఫలితాలను అనుభవించే వారెవ్వరూ ఉండరు. అందువల్ల, కర్మ సిద్ధాంతం అప్రస్తుతమవుతుంది.

శ్రీ రమణులు, భగవంతుని సంకల్పానికి రూపం. కర్మ అనేవారు. ఆత్మ సాక్షాత్కారానికి పూర్వం వ్యక్తిగత ఈశ్వరుడున్నాడనీ, ఆయనే మనిషి యొక్క అదృష్టాన్ని నియంత్రిస్తాడనీ అనేవారు. ప్రతి మనిషీ తన చేతలఫలితాలని అనుభవించ వలసిందేని నిర్ణయించేదీ, ఆ ఫలితాలని ఏ క్రమంలో అనుభవించాలో నిర్ణయించేదీ కూడ ఈశ్వరుడే. దేహాత్మబుద్ధి ఉన్నంత వరకూ, ఈశ్వరుని పరిధినుండి ఎవ్వరూ తప్పించుకోలేరు. కర్మకి పూర్తిగా అతీతమవటానికి ఒకే ఒక మార్గం - ఆత్మసాక్షాత్కారం పొందటం.

ప్ర: చనిపోయే వరకూ ప్రారబ్ధకర్మ ఉంటుందంటారు. దేహముండగానే దానిని తప్పించుకో గలమా?

జ: అది సాధ్యమే. కర్మ అహంకారం మీద ఆధారపడుతుంది. ఇది దేహానికీ, ఆత్మకీ నడుమ వస్తుంది. అహంకారం తన మూలంలో విలీనమైపోయి, రూపాన్ని పోగొట్టుకుంటే, ఇంక కర్మ ఎట్లా నిలుస్తుంది? 'నేను' (అహంకారం) లేనప్పుడు కర్మ కూడ లేదు.

ప్ర: పూర్వ జన్మలలో సమకూడిన కర్మలో, ప్రారబ్ధ కర్మ స్వల్పమైన భాగమంటారు. నిజమేనా?

జ: పూర్వ జన్మలలో మనిషి ఎన్నో కర్మలను చేసి యుండవచ్చు. వాటిలో కొన్నింటి ఫలితాలనే ఈ జన్మలో అనుభవించాల్సి వస్తుంది. ఇది కూడ బైస్కోపు స్లైడ్లలో చేసే ప్రదర్శనవంటిదే. మొత్తం స్లైడ్లలో కొన్నింటినే ఆపరేటర్

ప్రదర్శిస్తాడు - మిగిలిన వాటిని మరొక ప్రదర్శనకి ప్రక్కన పెడ్తాడు. ఆత్మజ్ఞానం సంప్రాప్తించటం వల్ల ఈ కర్మని ధ్వంసం చేసేయవచ్చు. కర్మలు పూర్వపు అనుభవాలకి ఫలితాలు, రకరకాల కర్మలన్నీ స్లైడ్లు, మనస్సు, ప్రొజెక్టర్! ఈ ప్రొజక్టర్ని ధ్వంసం చేయాలి. ఇక అప్పుడు ప్రతిబింబం సాధ్యం కాదు; జనన మరణాలూ సంభవం కావు డారెడ్డిడి

ప్ర: ప్రదర్శనని చేసేదెవరు? సంచితకర్మలో కొంత భాగాన్నే ఎంపిక చేసి ప్రారబ్ధకర్మగా అనుభవించాలని ఎవరు నిర్ణయిస్తారు?

జ: కర్మలని అనుభవించాల్సింది ఆయా వ్యక్తులే అయినా, ఆ కర్మలఫలితాలని ఎప్పుడు అనుభవించాలో నిర్ణయించేది ఈశ్వరుడే. ఇది తన ప్రయోజనం బట్టే నిర్ణయిస్తాడు. భగవంతుడు కర్మ ఫలితాలనే అటూ ఇటూ నడిపిస్తాడు, వాటికేమీ చేర్చడు, ఏమీ తీసివేయడు. మనిషి యొక్క అవ్యక్త చేతనం (సబ్ కాన్షస్) మంచి, చెడు కర్మల గిడ్డంగి. ఆ వ్యక్తి యొక్క ఆధ్యాత్మిక వికాసానికి ఏది మంచిదో దానిని ఆ గిడ్డంగిలో నుంచి ఈశ్వరుడే ఎంచుతాడు. అది సుఖప్రదమైనా కావచ్చు, బాధాకరమైనా కావచ్చు. ఇందులో నిర్హేతుకత ఏమీ లేదు.

ప్ర: "ఉపదేశసారం"లో భగవంతుని (కర్త) ఆజ్ఞ ప్రకారమే కర్మ ఫలాన్నిస్తుందని మీరు సెలవిచ్చారు. అంటే, కేవలం భగవంతుని సంకల్పం వల్లనేనా కర్మ ఫలితాలని అనుభవించటం జరుగుతుందా?

జ: ఆ శ్లోకంలో కర్త (భగవంతుడు) అంటే ఈశ్వరుడు. ఎవరి కర్మానుసారం వాళ్లకి ఆయా ఫలితాలని పంచిపెట్టేవాడు. అంటే, ఆయన బ్రహ్మానికి అభివ్యక్త రూపమనమాట. అసలైన బ్రహ్మం రూపరహితం, చలనరహితం, రూపం దాల్చిన బ్రహ్మాన్నే ఈశ్వరుడంటాం. ఎవరి కర్మ (చేష్ట) ననుసరించి వారికి ఫలితాన్నిస్తాడు. అంటే, ఈశ్వరుడు ఒక ప్రతినిధి వంటి వాడు మాత్రమే - శ్రమని బట్టి బత్తెమిస్తాడనమాట. అంతే. ఈశ్వరుని ఈ శక్తే లేకపోతే, కర్మ సంభవం కాదు. తానుగా, కర్మ జడం. చలనం లేనిది.

ప్ర: ఇప్పటి అనుభవాలన్నీ పూర్వపు కర్మల ఫలమే అయితే, పూర్వం చేసిన తప్పులు తెలిస్తే వాటిని సరిదిద్దుకోవటం వీలుపడుతుందా?

జ: ఒక తప్పుని దిద్దుకున్నా, సంచిత కర్మలో ఇంకా ఎన్నో మిగిలి ఉన్నాయి, అవన్నీ ముందు ముందు ఎన్నో జన్మలనిస్తాయి. కాబట్టి ఆ పద్ధతి కాదు. అవలంబించాల్సింది. కొమ్మలని తీసివేసేకొద్దీ చెట్టు బాగా ఎదుగుతుంది. నీవు కర్మని సరిదిద్దుకున్న కొద్దీ, అది ఎక్కువవుతూంటుంది. కర్మకి మూలమేమిటో కనుక్కో దానిని నిర్మూలించు.

ప్ర: ప్రపంచమంతా కార్యానికీ, ప్రతిస్పందనకీ ఫలితమనే కదా కర్మ సిద్ధాంతం చెప్పేది? అయితే ఈ రెండూ దేనికి సంబంధించినవి?

జ: ఆత్మసాక్షాత్కారమయ్యే వరకూ కర్మ ఉంటుంది - అదే కార్యమూ, ప్రతిస్పందనాను. సాక్షాత్కారమయిన తరువాత కార్యమూ ఉండదు, ప్రపంచమూ ఉండదు.

ప్ర: నేను దేహాన్నే కాకపోతే మంచి, చెడు కార్యాల ఫలితాలకి నేనెట్లా బాధ్యుణ్ణి?

జ: నీవు దేహానివి కాకపోయినా, "నేను కర్తని" అనే భావం లేకపోయినా, నీవు చేసిన మంచి, చెడు కార్యాల ఫలితాలకు నీపై ప్రభావముండదు. దేహం చేసే పనులను "నేను చేశా"నని ఎందుకు చెప్పుకుంటావు? నీవు నీ దేహంతో తాదాత్మ్యముంచుకున్నంత కాలం, చేసే పనుల ఫలితాల ప్రభావముంటుంది. అంటే ఈ దేహాత్మబుద్ధి ఉన్నంత కాలం, నీకు మంచి కర్మా, చెడు కర్మా సమకూడుతూనే ఉంటాయి.

ప్ర: నేను శరీరాన్ని కాకపోవటం వల్ల మంచిపనులకూ, చెడుపనులకూ వచ్చే ఫలితాలకు నేను బాధ్యుణ్ణికాను -

జ: అట్లా అయితే, ఈ ప్రశ్న నిన్నెందుకు వేధిస్తోంది?

ప్ర: మానవ ప్రయత్నమే బలానికి మూలమనీ, దాని వల్ల కర్మని కూడ దాటవచ్చనీ కొన్ని చోట్ల ఉంది. కాని మరికొన్ని చోట్ల, అంతా దైవానుగ్రహమే అని ఉంది. ఈ రెంటిలో ఏది సరిఅయినదో తెలియటం లేదు.

జ: అవును. కొన్ని సిద్ధాంతాల ప్రకారం పూర్వజన్మలలోని కర్మలు తప్ప భగవంతుడంటూ ఎవరూ లేరు. శాస్త్రాలనునుసరించి, ఈ జన్మలో చేసినకర్మని పురుష కార్యమంటారు (మానవ ప్రయత్నం), పూర్వజన్మలోని కర్మలూ, ప్రస్తుత కర్మలూ పొట్టేళ్ల వలె ఢీకొంటాయనీ, వాటిలో బలహీనమైనది మాసిపోతుందనీ అంటారు. అందువల్లే. ఈ సిద్ధాంతాన్ని నమ్మేవారు పురుషకార్యాన్ని బలపరచాలంటారు. వాళ్లని అసలు కర్మకి మూల మేమిటని అడిగితే, "చెట్టుముందా, విత్తుముందా" అని అడగటం వంటిదే అదీను. నిష్ప్రయోజనమని అంటారు.

ఇట్లాంటి వాదనలేవీ అంతిమ సత్యాన్ని కనుగొనలేవు. అందువల్లనే, ఆరంభంలోనే, నీవెవరివో తెలుసుకొమ్మని చెప్పాను. "ఎవరిని నేను. ఈ జన్మదోషం నాకెట్లా కలిగింది" అని ప్రశ్నించుకుంటే అహంకారం సమసిపోతుంది. ఆత్మసాక్షాత్కారమవుతుంది. ఈ విచారణని సరిగ్గా చేస్తే "దోష" మనే భావం పోతుంది. శాంతం కలుగుతుంది. కలగటమేమిటి? తానుగా ఆత్మ ఉంటుంది.

"కర్తగా, కర్మలనాచరించే నేనెవరిని" అని విచారణ చేసికొని, తన గురించిన యదార్థాన్ని తెలుసుకోవాలి. కర్మ యొక్క సారాంశమదే. విచారణ వల్ల కర్మలని ఆచరించే అహంకారాన్ని ధ్వంసం చేయకపోతే, కర్మ యోగానికి ఫలితమైన పరమానందం లభించదు.

ప్ర: దుష్కార్యాల ఫలితాలను తుడిచి వేయటానికి, మంత్రాలూ, జపాలూ చాలవా? లేక వాటి ఫలితాన్ని అనుభవించాల్సిందేనా?

జ: "నేను జపాన్ని చేస్తున్నా"నన్న భావముంటే, దుష్కార్యాల ఫలితాలు నిలుస్తాయి. ఆ భావం లేకపోతే, నిలువవు.

ప్ర: పుణ్యం, పాపాన్ని తుడిచి పెట్టి వేయలేదా?

జ: "నేను చేస్తున్నా"ను అనే భావమున్నంత వరకూ మంచి పనులకైనా చెడు పనులకైనా ఫలితాలని అనుభవించాల్సిందే. ఒక పనితో మరొక పనిని ఎట్లా ముడిపెట్టటం? "నేను చేస్తున్నా"ననే భావం లేకపోతే మనిషిపై ఏ ప్రభావమూ ఉండదు. ఆత్మసాక్షాత్కారమయితేనే గాని "నేను చేస్తున్నా"ననే భావంపోదు. ఆత్మసాక్షాత్కారమయిన వానికి జపమవసరమేమిటి? తపస్సు అవసరమేమిటి? ప్రారబ్దబలం వల్ల జీవితం కొనసాగిపోతుంది. కాని ఆత్మసాక్షాత్కారం పొందిన వాడు దేనినీ కోరడు. ప్రారబ్ధకర్మ మూడు రకాలు - ఇచ్ఛ, అనిచ్ఛ, పరేచ్ఛ అని అంటే స్వయంగా కోరుకున్నది, కోరికలేనిది, ఇతరుల కోరిక వల్లనయేది.

ఆత్మసాక్షాత్కారమయిన వానికి ఇచ్చా ప్రారబ్ధముండదు. కాని మిగిలిన రెండూ ఉంటాయి. జ్ఞాని ఏమి చేసినా, ఇతరుల కోసమే. ఇతరుల కోసమేదైనా చేయవల సివస్తే చేస్తాడు, కాని ఫలితాలు అతనినేమీ ప్రభావితం చేయవు. జ్ఞాని చేసిన పనులకు పుణ్యముగాని, పాపంగాని అంటవు. జ్ఞాని ఏమి చేసినా లోకందృష్టిలో ప్రామాణికము, ఉచితమూ అయినదే చేస్తాడు.

ఈ జన్మలో తమ ప్రారబ్ధం ప్రకారం కొన్ని అనుభవించి తీరాలి అని తెలిసిన వాళ్లు - ఆ అనుభవాల వల్ల ఏ వ్యాకులపాటునూ చెందరు. నీ సంకల్పమున్నా లేకపోయినా, నీవనుభవించాల్సింది నీ మీద తప్పకుండా పడుతుంది. దీనిని గ్రహించు.

ప్ర: ఆత్మసాక్షాత్కారమయిన వానికి ఇక కర్మలేదు. తన కర్మ అతనిని బాధించదు. అయినా ఈ దేహంతో ఎందుకుండాలి?

జ: ఈ ప్రశ్నని వేసేదెవరు? జ్ఞానా లేక అజ్ఞానా? జ్ఞాని ఏమి చేస్తాడనే విషయమై నీవు గొడవ పడటమెందుకు? నీ సంగతేమిటో నీవు చూచుకో. నీకు 'నేను దేహాన్ని' అనే భావముంది, అందువల్ల జ్ఞానికి కూడ దేహముందనే అనుకుంటున్నావు. తనకి దేహముందని జ్ఞాని అన్నాడా? అతనికి దేహమున్నట్లు నీకు కనబడవచ్చు.

దేహంతో ఏవేవో పనులు చేస్తున్నట్టూ కనబడవచ్చు. కాని తనకు దేహమే లేదని జ్ఞానికి తెలుసు. మాడినుసి అయిపోయిన త్రాడు. త్రాడులాగ కనబడినా దానితో దేనినీ కట్టలేము. జ్ఞానీ అంతే. అందరివలెనే కనబడవచ్చు కాని అది బయటి ఆకారం మాత్రమే దేహంతో తాదాత్మ్యం ఉన్నంత కాలం దీనిని అర్థం చేసుకోవటం కష్టం. అటువంటి ప్రశ్నలకు "ప్రారబ్ధము పూర్తిగా క్షయమయే వరకూ జ్ఞాని యొక్క దేహం నిలుస్తుంది. ఆ తరువాత రాలిపోతుంది" అని ఒకోసారి సమాధానం చెప్పుతాం. దీనికి ఉపమానంగా, విల్లునుండి విడువబడిన బాణాన్ని చెప్తారు. దాని లక్ష్యాన్ని తాకేదాకా బాణం వెళ్తూనే ఉంటుంది. వాస్తవమేమిటంటే, జ్ఞాని ప్రారబ్ధకర్మతో సహా అన్ని కర్మలకూ అతీతుడు - దేహంగాని, దాని కర్మలుగాని, అతనిని బంధించవు.

అహంగా నిత్యం భాసిస్తూ ఏ పరిమితులూ లేక అనంతంగా వ్యాపించిన శుద్ధ చైతన్యంలో నిమగ్నమయే వారికి, ప్రారబ్ధ కర్మ లవలేశమైనా ఉండదు "స్వర్గ ధామాన్ని చేరుకొని అనుభవించిన వారికి విధి అంటూ ఏమీ లేద"న్న మాటలకి అర్థమిదే.

ప్ర: నా ప్రమేయం ఏమీ లేకుండా నాకేదైనా వచ్చిందనుకోండి, దానిని నేననుభవిస్తే దాని వల్ల చెడు ఫలితాలుంటాయా?

జ: అది కాదు విషయం. ప్రతిపనికీ ఫలితముంటుంది. ప్రారబ్ధ వశాన నీకేదైనా వస్తే నీవేమీ చేయలేవు దానికి. వచ్చినదానిని ఏ మమకారమూ లేకుండా, అదే ఇంకా ఎక్కువ కావాలనే కోరిక లేకుండా, తీసుకుంటే నీకే కీడూ వాటిల్లదు. దాని వల్ల మళ్లీ జన్మనెత్త వలసి రాదు. అట్లాకాక, ఎంతో ఆసక్తితో దానిని ఆస్వాదించి, ఇంకా ఎక్కువ కావాలని కోరుకుంటే, మళ్లీ జన్మనెత్తాల్సి వస్తుంది.

ప్ర: జ్యోతిషశాస్త్రంలో గ్రహాల సంచారాన్ననుసరించి భవిష్యత్తుని చెప్తారు - అది నిజమేనా?

జ:నీకు అహంభావమున్నంత కాలమూ అది నిజమే. ఆ అహంకారం ధ్వంసమైతే, అది నిజం కాదు.

ప్ర: అంటే, అహంకారం నశించిన వాని విషయంలో జ్యోతిషశాస్త్రం పనిచేయదనమాటా?

జ: పని చేయదని చెప్పటానికి ఎవరు మిగిలి ఉన్నారు? చూచేవాడంటూ ఎవరైనా ఉంటేనే కదా, చూడటం. అహంకారం నశించిన వాళ్లు చూస్తున్నట్టు, కనబడినా నిజంగా చూడరు.

పూర్వకార్యాలకి ఫలితం, అదృష్టం. అది దేహానికి సంబంధించినది. తన ఇష్టం వచ్చినట్టు దేహాన్ని పని చేయనీ, దానితో నీకేం పని? దాని పట్ల అంత శ్రద్ధ ఎందుకు? ఏదైనా జరిగితే అది పూర్వ కార్యాల వల్లా, దైవ సంకల్పంవల్లా ఇతర కారణాల వల్లా సంభవిస్తుంది.

ప్ర: వర్తమానం, పూర్వకర్మ ఫలమంటారు. ఆ పూర్వ కర్మని సంకల్పం వల్ల అధిగమించగలమా?

జ: వర్తమాన మేమిటో గమనించు- అది చేస్తే భూతభవిష్యత్తుల వల్ల ప్రభావిత మయేది ఏదో - ఏది నిత్యమో, విముక్తమో, దేనికి భూతభవిత్వాలుండవో, దేనికి కర్మ అంటూ ఏమీ ఉండదో అర్థమవుతుంది.

ప్ర: సంకల్పమంటూ ఏమైనా ఉందా అసలు?

జ: ఎవరి సంకల్పం? కర్తృత్వ భావమున్నంత కాలం అనుభవముంటుంది, వ్యక్తి సంకల్పమూ ఉంటుంది.

ఆత్మ విచారం వల్ల ఆ భావం పోతే, దైవసంకల్పమే పనిచేసి అన్నిటినీ నడిపిస్తుంది. విధిని జ్ఞానం, ఆత్మజ్ఞానం అతిక్రమిస్తుంది. ఆత్మజ్ఞానం సంకల్పానికీ, విధికీ అతీతం.

ప్ర: మనిషి జీవితంలో కొన్ని ముఖ్యమైన అంశాలు అంటే, అతని దేశం, జననం, వంశం, వృత్తి, వివాహం, చావు - వంటివి అన్నీ కర్మ వలె ముందే నిర్ణయింపబడ్డాయంటే అర్థం చేసుకోగలను. కాని ప్రతి చిన్న విషయమూ అంతేనా? ఉదాహరణకి, నేనీ విసనికఱ్ఱని నేల మీద పెట్టానంటే- నేను ఫలానా రోజున, ఫలానా ఘడియకి విసనికఱ్ఱని నేల మీద పెట్టానని కూడ ముందే నిర్ణయింపబడిందా?

జ: తప్పకుండాను. ఈ దేహమేమి చేయాలో, ఏమేమి అనుభవించాలో, పుట్టినప్పుడే నిర్ణయమై పోయాయి.

ప్ర: అయినా, దేనినైనా చేయటానికి మనిషికి గల స్వేచ్ఛా, బాధ్యతల మాట ఏమిటి?

జ: మనిషికి గల స్వేచ్ఛ ఒక్కటే - ప్రయత్నించి, దేహాత్మ బుద్ధిని తొలగించే జ్ఞానాన్ని సంపాదించటమే. ప్రారబ్ధం వల్ల అనివార్యమైన కలాపాలను శరీరం చేస్తుంది. దేహంతో తాదాత్మ్యం చెంది దాని ఫలితాలని అనుభవించటానికి గాని, ఆ తాదాత్మ్యం లేకుండా కేవలం సాక్షీభూతుడుగా ఉండటంగాని మనిషి చేతల్లో ఉంది.

ప్ర: అంటే సంకల్పం మిథ్యేనా?

జ: పృథక్ భావంతో కలిసి ఉంటుంది. సంకల్పమనేది. తానొక వ్యక్తిని అనే భావమున్నంత కాలమూ సంకల్ప బలమూ ఉంటుంది. అన్ని శాస్త్రాలూ ఈ విషయమ్మీదే ఆధారపడి ఉన్నాయి. అందువల్లే. ఆ సంకల్పాన్ని సన్మార్గంలోకి పంపమని చెప్తాయి. ఈ సంకల్పంగాని, అదృష్టంగాని ఎవరికో పరిశీలించు. అవి ఎక్కడనుంచి ఉద్భవిస్తాయో కనుగొని, అక్కడ సంస్థితుడవై ఉండు. ఆ పని చేస్తే ఆ రెంటినీ అధిగమిస్తావు. ఈ ప్రశ్నలని ఇంతగా చర్చించటానికి అదే ప్రయోజనం. ఈ ప్రశ్నలన్నీ ఎవరికి ఉదయిస్తున్నాయి? అది కనుగొని, శాంతుడవై ఉండు.

ప్ర: జరుగనున్న దేదో జరుగక మానదన్నప్పుడు ప్రార్థనలు చేయటంగాని, ప్రయత్నం చేయటంగాని ఎందుకు? ఊరికే ఉంటే సరిపోదా?

జ: విధిని దాటటానికి రెండే మార్గాలున్నాయి- ఆ అదృష్టమెవరికి అని విచారించి, ఆ అదృష్టానికి వశమైనది అహంకారమే గాని ఆత్మకాదనీ, అసలు అహంకారానికి అస్తిత్వమే లేదని తెలుసుకోవటం. రెండవది, పరిపూర్ణంగా సర్వేశ్వరునికి అర్పితమై అహంకారాన్ని ధ్వంసం చేయటం. అంటే, నీ నిస్సహాయతని గ్రహించి "ప్రభూ నేను కాదు, నీవే"నని ఎప్పుడూ అనుకోవటం. “నేను, నాది” అనే భావాన్ని విడిచి, అంతా సర్వేశ్వరునికే అంకితం చేసి, నీ జీవిత గమనాన్ని ఆయన అధీనం చేయటం. “భగవంతుడు ఇది చెయ్యాలి, అది చెయ్యాలి" అని కోరిక ఉన్నంత కాలం శరణాగతి పరిపూర్ణం కాదు. ప్రపత్తి అంటే సర్వేశ్వరుని పట్ల అచంచల మైన, నిర్హేతుకమైన ప్రేమ, ఆఖరికి మోక్షం కొరకు కూడ కాదు. దీనినే మరొక విధంగా చెప్పాలంటే, విధిని గెలవాలంటే, ఆత్మ విచారమార్గం ద్వారాగాని, భక్తి మార్గం ద్వారా గాని, అహంకారాన్ని తుడిచి పెట్టెయ్యాలి!

సర్వం శ్రీ రమణార్పణమస్తు 🌹🙏

# Bibliography

1 Abhishiktananda. (1979), The Secret of Arunachala, New Delhi, ISPCK.

2 Aiyer, C.S. (1982), 'Quotations from the Maharshi', The Mountain Path, vol. 19, p. 23.

3 Brunton, P. (1980), A Search in Secret India, Bombay, BI Publications.

4 Brunton, P. (1984), Conscious Immortality, Tiruvannamalai, Sri Ramanasramam.

5 Cohen, S. (1980), Guru Ramana, Tiruvannamalai, Sri Ramanasramam.

6 Madhavatirtha, S. (1980), 'Conversations with the Maharshi', The Mountain Path, vol. 17, p. 211.

7 Madhavatirtha, S. (1981), 'Conversations with Bhagavan', The Mountain Path, vol. 18, pp. 153-5.

8 Mudaliar, D. (1970), My Reminiscences, Tiruvannamalai, Sri Ramanasramam.

9 Mudaliar, D. (1977), Day by Day with Bhagavan, Tiruvannamalai,
Sri Ramanasramam.

10 Muni, G. (1977), Sri Ramana Gita, Tiruvannamalai, Sri Ramanasramam.

11 Muruganar, Guru Vachaka Kovai, unpublished translation by Sadhu Om, Tiruvannamalai.

12 Nagamma, S. (1973), Letters from Sri Ramanasramam, Tiruvannamalai, Sri Ramanasramam.

13 Natanananda, S. (1974) Spiritual Instruction of Bhagavan Sri Ramana Maharshi, Tiruvannamalai, Sri Ramanasramam.

14 Om, S. (1980), Guru Vachaka Kovai (Urai), New Delhi, Sri Ramana Kendra.

15 Om, S. (1981a), The Path of Sri Ramana, Part one, Varkala, Kerala, Sri Ramana Kshetra.

16 Om, S. (1981b), 'Ulladu Narpadu - Kalivenba', The Mountain Path, vol. 18, pp. 101-1 217-2

17 Om, S. (tr.), "The Original Writings of Sri Ramana', unpublished translation.

18 Osborne, A. (ed.) (1972). The Collected Works of Ramana Maharshi, London Rider and Company.

19 Osborne, A. (1979), Ramana Maharshi and the Path of Self Knowledge, Bombay, BI Publications.

20 Sastri, K. (1975), Sat-Darshana Bhashya, Tiruvannamalai, Sri Ramanasramam.

21 Spenser, M. (1982), 'Sri Bhagavan's letter to Ganapati Muni', The Mountain Path, vol. 19, pp. 95-101.

22 Swarangiri, R. (1981), Crumbs from His Table, Tiruvannamalai, Sri Ramanasramam.

23 Venkataraman, T.N. (pub.) (1979), Maharshi's Gospel, Tiruvannamalai, Sri Ramanasramam.

24 Venkataramiah, M. (comp.) (1978), Talks with Sri Ramana Maharshi, Tiruvannamalai, Sri Ramanasramam.

25 'Who' (1973), Maha Yoga, Tiruvannamalai, Sri Ramanasramam.

All books published by Sri Ramanasramam are available from Sri Ramanasramam, Tiruvannamalai,
606 603, S. India.

David Godmen May you fill with Bhagavan’s grace🌹🙏.

# నీ సహజస్థితిలో ఉండు

## భగవాన్ శ్రీ రమణమహర్షి బోధనలు

భగవాన్ శ్రీ రమణ మహర్షి మౌనస్వాములుగా, దక్షిణామూర్తి అవతారంగా ప్రసిద్ధులు. అంటే, వారి బోధన అధికభాగం మౌనం ద్వారానే జరిగేదన్న మాట. అయినా, సాధకుల సందేహాలను వారు వాక్కు ద్వారా కూడ నివృత్తి చేసేవారు. వారు అరుణాచలంలో గడపిన అర్ధశతాబ్ది కాలంలో ఎందరో సాధకులు వారిని సందర్శించి వివిధ విషయాల గురించి తమ సందేహాలను నివృత్తి చేసుకునే వారు. ఆత్మవిచారం, శరణాగతి, యోగం, సత్సంగం, గురువు, సమాధి, భగవంతుడు, పునర్జన్మ, సృష్టి – ఇటువంటివే మరెన్నో విషయాల గురించి శ్రీ మహర్షి చెప్పిన సమాధానాలు విషయక్రమంలో ఈ పుస్తకంలో దొరుకుతాయి.



www.sriramanamaharshi.org


ISBN 81-88225-97-5
9 788188 225972

శ్రీరమణాశ్రమము
తిరువణ్ణామలై